వ్యాయామ కళాపారంగతులే కాక రచనా కళా పారంగతులూ అయిన శ్రీ కె. వి. అయ్యరుగారి చారిత్రక నవల యిది.

హొయిసళప్రభువైన శ్రీ విష్ణువర్ధనుల పట్టమహిషి శాంతలాదేవి జీవితగాథ ఇందులో అందాలుదిద్దుకొన్నది. బేలూరులో చెన్న కేశవస్వామివారి ఆలయాన్ని నిర్మించి, భక్తి పరవశురాలై ఆ దేవదేవుని ముందు నర్తించిన భావుకళా జీవి మహారాజ్ఞి శాంతల. ప్రధాన కథతోపాటు, ఆనాటిశైవ వైష్ణవ జైన మతానుయాయుల ప్రశాంత జీవనవిధానంకూడా మనోజ్ఞంగా చిత్రించబడింది. కన్నడ మూలం నుంచి శ్రీ తిరుమల రామచంద్ర చేసిన యీ తెలుగుసేతను పాఠక లోకం ఆదరిస్తుందని ఆశిస్తున్నాం.



# శాంతల



మూలం : కన్నడం

కె. వి. అయ్యరు

తెనుగుసేత :

తిరుమల రామచంద్ర




సాహిత్య అకాడెమీ పక్షమున

సాహితీ కేంద్రం

తెనాలి

*Santala* (Kannada Historical Novel) by K. V. Iyer. Translated into Telugu by T. Ramachandra. Published by Sahiti Kendram, Tenali on behalf of Sahitya Akademi, New Delhi, 1965. Price : Rs. 8/-




ప్రథమ ముద్రణ, 1965

ప్రకాశకులు :

సాహితీ కేంద్రం

తెనాలి

*Also available at :*

**SAHITYA AKADEMI**

Rabindra Bhavan, New-Delhi.

38/B, Mount Rd, Madras-6

ముద్రణ :

పాండురంగా ప్రెస్, తెనాలి.

మూల్యము :

ఎనిమిది రూపాయలు

# అనువాదకుని మనవి

శ్రీ కె. వి. అయ్యరుగారు వ్యాయామ కళాపారంగతులేకాక రచనా కళాపారంగతులు కూడా. వారి రచనలెన్నో ప్రజల మనస్సును చూరగొన్నాయి; కన్నడ శిల్ప గానకళలపై ప్రజల హృదయాలు మరలుకొనేట్టు చేశాయి. అలాంటివాటిలో శాంతల ఒక్కటి.

దీనిలో శ్రీ అయ్యరుగారు ఆనాటి కన్నడనానుడిని వాడి సహృదయులను సన్నిహితులయారు. దీనిని గ్రాంథికంగా తెనిగిస్తే నేటి పాఠకులను నచ్చదనే నమ్మకంతో శిష్టవ్యావహారికం అనుసరించాను. తమిళ కన్నడాలు తెనుగు తోబుట్టువులు గనుక అయ్యరుగారి కన్నడానికి సన్నిహితమైన తెనుగు పదాలు వాడాను. సహృదయులు చిత్తగింతురుగాక !

తిరుమల రామచంద్ర

# విజ్ఞప్తి

బేలూరు హళేబీడు దేవాలయ శిల్పాలయాలను పెక్కేండ్ల క్రితం చూచాను. బొంబాయి ప్రాంతపు ఒక మిత్రునికి ఆ దేవాలయాలను చూపడం కోసం సుమారు రెండున్నర సంవత్సరాల క్రితం మరొకసారి వెళ్ళాను.

మేము హళేబీడు చేరినప్పుడు పొద్దుపోయి సాయంకాలమయింది. హొయిసళేశ్వర దేవాలయ దక్షిణద్వారానికి కొంచెం దూరంలో దేవాలయాన్ని పూర్తిగా ఆకళించుకోడానికి నిలబడ్డాను. ఎంతసేపు చూస్తూ నిలబడ్డానో! సాయంకాలపు నీరెండ పసుపురంగు దేవాలయానికి కనకాభిషేకం చేసినట్లు కనిపించింది. ఏదో అపూర్వమైన శిల్ప కళానిధి పైలోకం నుంచి భూమికి దిగివచ్చినట్లు ఉండినది. ఆ దృశ్యం నా మనస్సును ముగ్ధం చేసింది. తర్వాత దేవాలయం ప్రవేశించినాను.

గర్భగుడిలో ఒక వటువు మహాదేవుని సన్నిధిలో చిన్న దివ్వె వెలిగిస్తున్నాడు. మహాదేవునికి పుష్ప ఫలాలు సమర్పించి కర్పూరహారతి చేయించి దర్శనభాగ్యం పొందాను. నా మనస్సు విభ్రమభావోద్రేకం పొందింది. మహాదేవుని ముందున్న వర్తులాకారమైన శిలాపీఠం ఎక్కి కూర్చుని కళ్ళు మూసుకొన్నాను. భావుకతాజీవి, రసాత్మిక అయిన మహారాజ్ఞి శాంతలాదేవి భక్తి పరవశురాలై దేవదేవునిముందు నర్తించిన శిలాపీఠం ఇదేనని నా హృదయం చెప్పింది. అప్పుడు నన్ను ఆవేశించిన భావావేశం ఇప్పుడీ కృతిరూపం దాల్చింది. దీనిలో ఒకచోట కుమారవిష్ణువు తాను కన్నకలను అక్కయ్య శాంతలకు వర్ణిస్తాడు; ఆ కల ఆరాత్రి నేను కన్నదే.

ఈ కథ వ్రాయడానికిముందు బేలూరు హళేబీడు నన్ను మరొకసారి తమవద్దకు లాక్కొనివెళ్ళాయి. ఈసారి నా కుటుంబంతోపాటు శ్రీ రాజరత్నంగారూ వచ్చారు. శ్రవణ బెళుగొళ, బేలూరు, హళేబీడుల చరిత్ర ఈ మిత్రులకు చాల ఇష్టం. ఈసారి ప్రయాణం సార్థకమయింది. శాంతల కథ వ్రాయాలనే ఇచ్ఛ ఉత్కటమయింది. నా అన్ని కన్నడ రచనలకూ కారణభూతులయిన వీరే దీనికి కారణ భూతులయినారు.

శాంతలను సంబంధించిన శాసనాధారాలతో పాటు తంజావూరు సరస్వతి భండారంలోని చరిత్ర గ్రంథాలనుంచి హొయిసళ విష్ణువర్ధనుల సమకాలీన విషయాలను సంగ్రహించి ఈకథను వ్రాశాను. వ్రాత సాగిన కొద్దీ సహృదయులయిన శ్రీ రాజరత్నంగారు చదివించుకొని విన్నారు. ఈ "శాంతలాకృతి" ప్రకటనరావడం ఈ మిత్రకార్య ఫలమయ్యే.

హొయిసళరాజ్య మహాసంపత్తును మల్లిక్ కాఫూర్, గంగూసాలార్ ఆ కాలంలో దోచుకొనడం ఉండనీ, దేవాలయ విగ్రహాలను భిన్నం చేయడమూ ఉండనీ, అనుపమమయిన హళేబీడు సుందర విగ్రహాలను కాళ్లుచేతులు విరిచి, కళ్లు పీకి, ముఖాలను, తలలను పిండిచేసినవాళ్లం మనమూ, మనవారూను. కోతిచేతి మాణిక్యమయినది ఈ బృహత్కళాసృష్టి. కన్నడనాడు ప్రజల ఈ యాత్మకృత్యాలకు శాంతలా విష్ణువర్ధనుల ఆత్మలు ఎంత నొప్పిపడుతాయో! ఈ కథ దానికోసం నా హృదయం అర్పించిన కన్నీరయినా, అంతర్యంలో ఇదొక ప్రేమమయమయిన సంసార చిత్రం.

17-5-1954
వ్యాయామశాల
బెంగుళూరు

కె. వి. అయ్యర్.

# ఈ నవలలోని పాత్రల, ప్రాంతాల పరిచయం

## 1. దే వ త లు

వాసంతికాదేవి : హొయిసళ రాజుల కులదేవత.

ధర్మేశ్వరుడు : ఈ దేవుని వరప్రసాదంతోనే శాంతల జననం (ఈశ్వరుడు).

విజయనారాయణుడు : బేలూరు (వేలాపురం) లో విష్ణువర్ధనులు ప్రతిష్ఠ చేయించిన విష్ణుమూర్తి. చెన్నకేశవుడని సామాన్య ప్రచారం.

సౌమ్యకేశవుడు : బేలూరులో శాంతలాదేవి ప్రతిష్ఠ చేయించిన విష్ణుమూర్తి. కప్పెచెన్నిగరాయ అని సామాన్య ప్రచారం.

హొయిసళేశ్వరుడు : శాంతలేశ్వరుడు : } హళెబీడు (ద్వారవతి) లోని జోడు దేవాలయాల శివమూర్తులు.

గంగాధరేశ్వరుడు : హొన్నాదేవి : } శివగంగ కొండమీది శివశక్తులు.

శ్రీనరసింహుడు : చిన్నదేవేరి లక్ష్మీదేవి ఇష్టదైవం.

శాంతినాథుడు : పదహారవ తీర్థంకరుడు. మాచికబ్బె ఇష్టదైవం.

ఆదినాథుడు : ప్రథమ తీర్థంకరుడు. గంగరాజులుంగారి ఇష్టదైవం.

బాహుబలి : శ్రవణబెళుగొళలోని గోమటేశ్వర స్వామి.

పార్శ్వనాథుడు : ఇరవై మూడవ తీర్థంకరుడు. ద్వారవతిలో ఈ తీర్థంకరుని విగ్రహాన్ని బొప్పణనాయకుడు ప్రతిష్ఠించినాడు.

బ్రాహ్మి : శాంతల ఉపాస్యదేవత. శారద.

## 2. ప్రధాన పాత్రలు

శ్రీ విష్ణువర్ధనులు : హొయిసళవంశ రాజు, దిగ్విజయి.

మహారాజ్ఞి మహాదేవి : రాజేంద్రచోళ పృథ్వీ కొంగాళ్వల తమ్ముడైన ఇరుక్కపాలుల కుమార్తె; శ్రీ విష్ణువర్ధనుల తల్లి. ఈమె హొయిసళ ప్రభువు ఎరెయంగ మహారాజులను వివాహమాడి బల్లాళ బిట్టిగ ఉదయాదిత్యులనే ముగ్గురు కుమారులను కన్నారు. వీరిలో బిట్టిదేవుడే శ్రీ విష్ణువర్ధనులు.

శాంతల : శ్రీ విష్ణువర్ధనుల పట్టమహిషి. మారసింగమయ్య దండనాయకుల, మాచికబ్బె దండనాయకిగారి ఏకైక పుత్రిక.

లక్ష్మి : శాంతల జీవితసఖి. పెరుమలపండితుల కుమార్తె. మాచికబ్బెకు పెంపుడు కుమార్తె. శ్రీ విష్ణువర్ధనుల చిన్నదేవేరి.

కుమారవిష్ణువు : ఎరెయంగ మహారాజుల సేనాపతి చెన్నమదండాధీశ్వరుని కుమారుడు. తల్లి మహాసతి చందల. మహారాజ్ఞి మహాదేవి ఇతని పెంపుడుతల్లి. విష్ణువర్ధనులకు కుమారునివలె, శాంతలకు, లక్ష్మికి తమ్మునివలె ఉన్నవాడు.

సోవల : హొయిసళుల అమాత్యుడు వీరదేవుని కుమార్తె. కుమారవిష్ణువు పత్ని. పతితో సహగమనం చేసి సతి అయినది.

# 3 ఆనుషంగిక పురుషపాత్రలు

గంగరాజులుంగారు : భీష్ములని వీరి మారుపేరు. ఎరెయంగ ప్రభు, కాలంలో సర్వసేనాపతిగా ఉన్నారు. విష్ణువర్ధనుల కాలంలో మహాప్రధాన పదవిలో ఉన్నారు.

| | |
|---|---|
| తంత్రపాల హేమాద్రి<br>వీరదేవులు<br>అచ్చుతు (అచ్యుతు) లు<br>గోవిందపండితులు | హొయిసళ రాజ్యం పంచప్రధానులలో తక్కిన నలుగురు. |

మారసింగమయ్యగారు : హొయిసళ రాజ్య దణ్ణాయకుడు (దండనాయకుడు). శాంతలాదేవి తండ్రి.

శ్రీపాల త్రైవిద్య దేవులు : శ్రీ విష్ణువర్ధనుల ఆస్థాన ముఖ్య పండితులు, కుమారవిష్ణువు గురువులు.

ప్రభాచంద్ర సిద్ధాంతదేవులు : శాంతల విద్యాగురువులు.

శ్రీరామానుజాచార్యులు : శ్రీరంగంనుంచి హొయిసళ రాజ్యానికి వచ్చి అనుగ్రహించిన ఆచార్యవర్యులు, విశిష్టాద్వైత ప్రవర్తకులు.

పెరుమాళ పండితులు : విష్ణువర్ధనుల తండ్రి ఎరెయంగ మహారాజు కంచి నుంచి పిలుచుకొని వచ్చిన పండితులు, లక్ష్మి జనకులు.

| | |
|---|---|
| పునీసనాయకుడు, బొక్కణనాయకుడు,<br>గరుడి బోకిమయ్య, చామదేవుడు,<br>గరుడిబాగిప్పయ్య, చిక్కమరియానె : | హొయిసళ దండనాయకులు. |

బొప్పణనాయకుడు (ఏచణ్ణ) : గంగరాజులుంగారి కుమారుడు, ఇమ్మడి దండనాయకుడు.

కేతమల్లనాయకులు : మారసింగమయ్యగారి మేనల్లుడు. వ్యాపారి, తలవనపురంనుంచి హొయిసళ రాజ్యానికి వచ్చి స్థిరపడినవాడు. హళె బీడు (ద్వారవతి) లో హొయిసళేశ్వర శాంతలేశ్వర దేవాలయాలను కట్టించినవాడు.

కల్యాణరాహుతుడు : ద్వారవతికి వచ్చి స్థిరపడిన ఒక శ్రీమంతుడయిన భక్తుడు. ఇతడూ, ఇతని పత్ని అయిన సహజదేవి దొడ్డగద్దుంబల్లి అనే గ్రామంలో మహాలక్ష్మీ దేవాలయం నిర్మించినవారు.

వెంకరాయుడు : హానుగల్లు దుర్గంలో ''భైరవు''డయిన హొయిసళ వీరుడు.

బోకిమయ్య : 'రణబలి' అయిన ఒక హొయిసళ వీరుడు.

దేచయ్య : మారసింగమయ్యగారి ఇంటి సేవకుడు. శాంతలను ఎత్తి ఆడించిన వృద్ధు.

లక్కణుడు : కుమారవిష్ణువును చిన్నతనంనుంచి ఎత్తి ఆడించి పెంచిన వృద్ధు.

## 4. ఆనుషంగిక స్త్రీ పాత్రలు

మాచికబ్బె : మారసింగమయ్యగారి ధర్మపత్ని. శాంతల తల్లి. లక్ష్మికి పెంపుడుతల్లి.

లక్ష్మీమతి : మహాప్రధాన గంగరాజ పత్ని. దండనాయకి.

జక్కియబ్బె : కేతమల్ల నాయకుని పత్ని. చందల తల్లి.

చందల : కేతమల్లనాయక జక్కియబ్బెగార్ల కుమార్తె. శాంతల మరణానంతరం విష్ణువర్ధనులను వివాహమాడి 'శాంతల' అయినది.

బమ్మల, రాజల, చవ్వల, బిజ్జల, దేవకి : విష్ణువర్ధనుని దేవేరులు. వీరిలో బమ్మల అశ్వహృదయ ప్రవీణురాలు. దేవకీదేవి ముస్సూరు విషయం పాలించినది.

## 5. శత్రుపక్షంవారు

గంగవంశంవారు, కొంగులు, చెంగాళ్వులు, కొంగాళ్వులు, సిందులు, సంతారులు, కదంబులు, చోళులు, చాళుక్యులు, పాండ్యులు, చేరదేశంవారు, మలపలు : హొయిసళ రాజ్యబద్ధ శత్రువులు - వీరిలో

మాసణ ప్రభువు : హొయిసళ రాజ్య శత్రువు, పాంబురుచ యుద్ధంలో ఓడినవాడు.

దామోదరుడు : తలవనపుర (తలకాడు) పాలకుడయిన గంగవంశరాజు, రాష్ట్రకూటుల సామంతుడు.

ఆదియమాన్ : చోళ సేనాపతి, దామోదరుని సహాయకుడు.

నరసింహవర్మ : చోళుల సామంతుడు.

ఇరుంగోలుడు : మరొక చోళ సామంతుడు.

జగద్దేవుడు : మాళవదేశపు సంతార రాజు, చాళుక్య సామంతుడు.

విక్రమాదిత్యుడు (ఆరవ) : చాళుక్యరాజు.

జయకేశి : కదంబరాజు, గోవా, బెళవల, హలసిగె ప్రాంతాల రాజు.

జయసింహుడు : నోళంబవాడి పాలకుడు, పాండ్యరాజుల సామంతుడు.

మల్లికార్జునుడు : హానుగల్లు దుర్గం అధిపతి.

కుంజుశెట్టి : మల్లికార్జునుని చమూపతి.

## 6. ప్రాంతాలు

వేలాపురం (వేలాపురి) : యగచి నదీతీరంలో ఎరెయంగ ప్రభువు కాలపు హొయిసళ రాజధాని. విజయనారాయణ, సౌమ్యకేశవ దేవాలయాలున్న నేటి బేలూరు.

ద్వారవతి : హొయిసళుల కొత్తరాజధాని. హొయిసళేశ్వర, శాంతలేశ్వర విజయపార్శ్వనాథ దేవాలయాల నేటి హళెబీడు.

తిరునారాయణపురం : చెలువనారాయణదేవ దివ్యక్షేత్రం. దీని కిప్పుడు 'మేలుకోట' అని జనసామాన్య వ్యవహారం.

శివగంగ : శాంతల దేహవిసర్జనం చేసిన శివ క్షేత్రం. (బెంగుళూరికి సుమారు 40 మైళ్ల దూరంలో ఉన్నది.)

తలవనపురం లేక తలెయూరు : విష్ణువర్ధనుల ప్రథమ దిగ్విజయస్థానం. ఇప్పుడు దీనిని తలకాడు అంటారు.

పాంబురుచ, హాంజేరు, తలెయూరు, చక్రగొట్టు, కోళాల, చంగేరి, నంగలి, నోళంబవాడి, గంగవాడి, రాయరాయపుర, బంకాపుర, ఉచ్ఛంగి, హానుగల్లు, బనవసె, బెళవల, సంతలిగె, హాలసిగె, హులికెరె, సవిములె, లొక్కిగుండి...ఇత్యాది : విష్ణువర్ధనులు, హొయిసళ సేన యుద్ధం చేసి గెలిచిన కొన్ని ప్రాంతాలు.

# 1

స్వస్తి          శ్రీః          స్వస్తి

నమస్తుంగ శిరశ్చుంబి చంద్ర చామర చారవే,
త్రైలోక్య నగరారంభ మూల స్తంభాయ శంభవే.

మహారాజ్ఞీ మహాదేవి వారి సన్నిధానం నుంచి కమ్మ. శకవరుషంబు ౧౦౪౪ లకు సరి అయిన శుభకృతు సంవత్సర శ్రావణ శుద్ధ చతుర్దశి గురువారం సూర్యోదయానంతరం చెల్లే శుభ వృషభ లగ్నమందు పరమపదవాసు లయిన శ్రీ చెన్నమ దండాధీశ్వరులవారి, వారి మహాసతి చందలదేవివారి ద్వితీయ పుత్రులు, నా పెంపుడు కుమారులు అయిన కుమార విష్ణువుకు బ్రహ్మోపదేశం నడిపింప పూజ్యులయిన కులగురువులూ, మా ద్వితీయ కుమారు లయిన శ్రీశ్రీశ్రీ త్రిభువనమల్ల వీరగంగ పొయిసళ విష్ణువర్ధన మండలేశ్వరులవారు దైవప్రేరితులయి నిశ్చయించినందున మీరు పుత్ర మిత్ర కళత్రాది సమేతులై రాచనగరులోని విజయ సింహాసనపు టోలగపుసాలకు విచ్చేసి ఉత్సవం తిలకించి, వటువును ఆశీర్వదించి మమ్ములను సంతోష పెట్టవలసినది.

ద్వారవతి, రాజప్రాసాదం. } శ్రీ మారసింగమయ్య దండనాయకుల వారికి, శ్రీ మాచికబ్బె దండనాయకి వారికి.

రాచనగరు అవసరిక రాహుత్తు డొకడు ఈకమ్మను మారసింగమయ్య దండనాయకులవారికి అందజేయడానికి వచ్చినాడు. దండుతో పొంబురుచ విషయానికి వెళ్ళిన మారసింగమయ్యగారు, అక్కడ హొయిసళ రాజ్యాన్ని చాల చిక్కులు పెడుతున్న మాసణ ప్రభువును రాజ్యపు ఎల్లల నుంచి ఆవలికి నెట్టి, అప్పుడే ద్వారవతికి తిరిగి వచ్చి, భవనం చేరి, స్నానాదులు ముగించి, శివపూజ పూర్తిచేసినారు. రాజమాత మహారాణి మహాదేవి అక్కగారు గోప్యంగా చేసిన ఏర్పాట్లవల్లనే మారసింగమయ్యగారు ద్వారవతికి తిరిగి రావడం సాధ్యమైంది.

పొంబురుచ విషయంపై దండెత్తిపోయిన మారసింగమయ్యగారు ముందున్న హంజేరిపైగూడ దాడి జరుపవలసి ఉండినది. అంతలో రాజమాత మంత్రివర్యులు, తంత్రపాలకులు అయిన హేమాద్రి పండితుల ద్వారా మారసింగమయ్యగారికి "రాజకార్య నిమిత్తం దండును అక్కడే నిలిపి, దాని రక్షణకు తగినవారిని నియమించి, మీరుమాత్రం ద్వారవతికి తొందరగా రావలసినది." అని కమ్మ వ్రాయించి పంపినారు. అందువల్ల మారసింగమయ్యగారు తమ అంగరక్షకులతో తొందరగా ద్వారవతికి మరలినారు. స్నానం చేసి మార్గాయాసం పోగొట్టుకొన్న తర్వాత హేమాద్రి పండితులను దర్శించడమే లెస్స అని నిశ్చయించుకొని, స్నానం చేసి, మనశ్శాంతికై మహాదేవుని పూజను ముగించినారు.

మారసింగమయ్యగారు నగరానికి తిరిగి వచ్చినారని తెలిసిన తత్క్షణమే రాజమాత ఒక ఆశ్వికునితో ఉపనయన ముహూర్తాహ్వాన పత్రిక పంపినారు. రాజమాత చాల ప్రాజ్ఞులు. 'తమను అంత తొందరగా రప్పించుకొన్న కారణం ఏదో అకస్మాత్తుగా ఉద్భవించిన యుద్ధకారణమే అయి ఉండవచ్చునని మారసింగమయ్యగారు ఆలోచించినారు. అందువల్ల వారి మనస్సులో ఇలాంటి భయానుమానాలు నివారించడం తమ ప్రథమ కర్తవ్యం.' అని రాజమాత ఆలోచించి శుభవార్తనే ముందుగా పంపినారు.



మహాదేవుని పూజ పూర్తిచేసి లేస్తున్న మారసింగమయ్యగారికి "రాచనగరు రాహుత్తు డొకడు కమ్మ తెచ్చినాడు. భవన మహాద్వారంలో నిలబడి వేచి ఉన్నాడు." అని మారసింగమయ్యగారి గృహ సేవకుడు దేచయ్య వచ్చి తెలిపినాడు. రాజమాత మహాదేవిగారివద్ద నుంచో హొయిసళేశ్వరుల వద్దనుంచో పిలుపు వచ్చి ఉంటుందనుకొని మారసింగమయ్యగారు కట్టుకున్న మడిబట్టలలోనే తలవాకిలికి వచ్చినారు.

రాహుత్తుడు దండనాయకులకు సాగిలంపడి వినయంతో కమ్మను అందించి వెనుకకు జరిగి నిలబడినాడు. మారసింగమయ్యగారు తలవాకిలి లోగిలిలోనే ఆ కమ్మను చదువుతూ నిలబడినారు.

శాంతినాథ తీర్థంకరుల దర్శనానికి వెళ్ళిన మారసింగమయ్యగారి సతీమణి మాచికబ్బె అప్పుడే జైన బసదినుంచి తిరిగివచ్చి భవనపు తలవాకిలి గడపవద్ద నిలబడిన పతిని చూచి నిశ్చేష్టులై నిలబడిపోయినారు. ఆనాడు ప్రాతఃకాలమే స్నానంచేసి నుడుగులుకట్టి సేవకునితో పూజాసామగ్రిని మోయించుకొని మాచికబ్బె శాంతినాథ తీర్థంకరుల మస్తకాభిషేకం కోసం చైత్యాలయానికి వెళ్లినారు. ఎండలో నడిచిరావడంవల్ల ఆయాసంతో ఆమె నుదుటిపై చెమట ముత్యాలు కట్టింది. ఆమె ఆ చెమటను చేతనున్న కరవస్త్రంతో తుడుచుకుంటూ కమ్మను చదువుతూ నిలుచున్న భర్తను చూచి "చైత్యాలయానికి దేచయ్యతో చెప్పిపంపి ఉండకూడదూ? బేగ వచ్చిచేరేదానిని కదా!" అనినారు.

మారసింగమయ్యగారు ఒకమారు మెడయెత్తి పత్నిని చూచి చిరునవ్వు నవ్వి మళ్ళీ కమ్మను చదువసాగినారు. మాచికబ్బె మాటలు కొనసాగిస్తూ, "ఇంకా మీరు ఇంటిముంగిట్లో అడుగుపెట్టినారో లేదో, అప్పుడే రాచనగరు నుంచి పిలుపా? మీకు విరామం లేకపోతే పోనీండి. పాపం! నెలలకొద్దీ రణరంగంలో ఉండి పోరాడి పోరాడి ప్రాణాలతో, చేతులూకాళ్ళలో - ఇంటిని చూస్తామా, ఇల్లాలిని చూస్తామా, పిల్లలను చూస్తామా - అనుకుంటూ ఇప్పు డిప్పుడే మరలివచ్చిన జనం ఊరుచేరి

నాలుగునాళ్లయినా నెమ్మదిగా తిని కూచుని పెళ్ళాం పిల్లలతో గడపవద్దా? మళ్ళీ ఈ అత్యవసరపు ఆపద ఇంకెక్కడిదో! తలెయూరు బుంటరులు కొందరు ఇరుగు పొరుగు గ్రామాలను విచ్చలవిడిగా దోచుకొని, ఆవులను తోలుకొని పోయినారని వర్తమానం. ఇంకేమిటి? ఈ కమ్మ అదే అయి ఉంటుంది! మీరే వెళ్ళిరండి. ఆ దుర్మార్గులు ఇక తలయెత్తకుండా చేసి, ఆవులను వారివారికి అప్పజెప్పి, ఆ దుర్మార్గులనుంచి మన ప్రభువువారికి నూరు పొన్నుగద్యాణాలు దండుగ కానుక తెచ్చి అప్పగించండి,'' అని అంటూ ఉండగా, అక్కడే నిలుచున్న రాజగృహపు అశ్వికుడు గుర్రం వీపుమీది ఒక సంచినుంచి మరొక కమ్మను తీసి ముందుకువచ్చి మారసింగ మయ్యగారికి అందించి, ''దీనిని గంగరాజ మహామాత్యులవారు తమకు అప్పగించి రమ్మని సెలవిచ్చినారు. తమరు చదివి చూచి ఏమైనా సెలవిస్తే, దానిని తత్క్షణం వచ్చి మనవి చేయవలసిందని కూడా సెలవిచ్చినారు,'' అని మనవిచేసి నాల్గడుగులు వెనక్కుజరిగి చేతులు కట్టుకొని నిలబడినాడు.

మారసింగమయ్యగారు ఆ కమ్మను చదువుకొన్నారు. దానిలోని వక్కణ యిది :

> పరమ మిత్రుడు మారసింగమయ్యకు. రేపు కుమార విష్ణువు బ్రహ్మోపదేశమహోత్సవానికి నీ సతీమణి మాచికబ్బెను, కుమార్తె కాంతలను తప్పక పిలుచుకొని రావాలని రాజమాత మహాదేవిగారు అపేక్షపడుతున్నారు.
>
> ద్వారవతి,<br>శ్రావణ శుద్ధ త్రయోదశి. } గంగరాజు.

కమ్మ చదివిన మీదట మారసింగమయ్యగారు రాహుత్తునితో ''ఉత్సవానికి అందరినీ పిలుచుకొని వస్తానని గంగరాజు మహామాత్యుల వారితో మనవిచేయి.'' అని చెప్పి వానిని పంపివేసి, తర్వాత తన పత్ని



వైపు తిరిగి చూచినారు. ఈ అత్యవసరపు కమ్మలు ఏమై ఉంటాయి అనే కుతూహలం వ్యక్తంచేస్తూ మాచికబ్బె అట్లే నిలబడి ఉన్నారు.

''మేనాలో వెళ్ళి రాగూడదా? కొసన రాళ్లకు పావుకోళ్ళయినా తొడుగుకొని పోయిరావచ్చును గదా?'' అనినారు మారసింగమయ్యగారు.

మాచికబ్బె మందహాసంచేసి, ''మీ అర్ధాంగి ఎండకు వాడి పోయిందా? ఎందరు ఎండలో తిరుగాడడంలేదు? ఎందరు ఎండలో కూలి నాలి చేసుకొనడంలేదు? పెద్దల దర్శనానికి, గురువుల దర్శనానికి, రాజ దర్శనానికి, దేవతాదర్శనానికి వాహనాలపై వెళ్ళరాదు. పాదరక్షలు తొడుగుకొని వెళ్ళరాదు. అది శ్రద్ధకాదు; భక్తికాదు. జినధర్మానికి అది చెల్లదు; శివధర్మానికీ అది చెల్లదని తెలుసుకున్నాను. మీ శివభక్త పండితులనుగాని, నాగరుద్రులనుగాని అడిగి తెలుసుకోండి. నాకు తెలిసినది - ఏ మతస్థులయినా దేవతాదర్శనానికి వెళ్ళేటప్పుడు సామాన్యుల వలెనే వెళ్ళవలె అని. అంతేకదూ?'' అనినారు.

''ఒప్పినాను. మాచీ ఒప్పినాను. ఎంతయినా నీవు ప్రాజ్ఞురాలివి. శ్రద్ధ అంటే ఇలాగే ఉండవలె. ఇదిగో, ఈ కమ్మలు రెండూ దండు దాడులకు సంబంధించినవి కావు. రేపు నగరులో కుమారవిష్ణువుకు బ్రహ్మోపదేశమట. ఈ కమ్మ ఆ ఉత్సవానికి ఆహ్వానం. రెండవది, మహాదేవి అక్కగారు తామే గంగరాజుగారికి చెప్పి వ్రాయించి పంపినారు. దాని వక్కణ మేమిటంటే - ఈ ఉత్సవానికి నిన్నూ, కాంతలను ఖండితంగా పిలుచుకొని రావాలని.''

''అలాగా! చాల సంతోషం. మేమూ వస్తాము. అదిసరే కానిండి, మీరు ఊరికి తిరిగివచ్చే వర్తమానమే లేదే!''

''మహాదేవి అక్కగారో, ప్రభువులవారో పిలిపించుకొని ఉంటారు. తొందరగా రాజధానికి తిరిగిరావాలని మహాదేవి అక్కగారే హేమాద్రి

పండితుల మూలంగా కమ్మ వ్రాయించి పంపినారు. సంగతి సందర్భాలేమో, ఏమిటో ముందు తెలిసీని."

"అక్కగారికి చాల వాత్సల్యం. నెలక్రిందట - అప్పుడు మీరు దండులో కూడ పాంబురుచ నగరంలో ఉన్నారు - వాసంతికాదేవి ఆలయంలో సాయంసంధ్యాపూజ ముగించుకొని రాచనగరుకు తిరిగి వెళ్లుతున్న అక్కగారు, ఆ దారిలోనే ఇంటికి కాలినడకన వస్తున్న మన ముద్దుబిడ్డ శాంతలను చూచినారట. కొంతసేపు అలాగే చూచినమీదట మేనాను అక్కడే నిలిపి, శాంతలను దగ్గిరికి పిలిచి, 'నీవు ఎవరి కూతురివమ్మా లక్ష్మీ?' అని అడిగినారట. మన శాంతల తలవంచి సిగ్గుతో 'నా పేరు శాంతల.' అనినదట."

"శాంతల ఆమె మహాదేవి అక్కగారని తెలుసుకొనలేకపోయిందా?"

"నగరు బోయీలు మోస్తున్న రాజచిహ్నాలంకృతమైన మేనాను చూడగానే శాంతల తెలుసుకొన్నదట - తనను దగ్గిరికి పిలిచినవారు రాజమాత అని."

"తర్వాత ?"

"దూరంగా చేతులు జోడించి తలవంచి నిలుచున్న మన బిడ్డను 'దగ్గిరికి రా శాంతలా!' అని దగ్గిరికి పిలిపించుకొని, తల నిమిరి, బుగ్గలు పట్టుకొని ఎత్తి, అమ్మాయి మెడలోని ముత్యాలదండను ముట్టిచూచి, 'లేత తామరవలె విరిసిన నీ ముఖానికి ఈ అందమైన ముత్యాలు చక్కగా ఒప్పినవి. శాంతలా! ఎంత సొగసైన, ఎంత గంభీరమైన పేరమ్మా నీది . . . !"

మారసింగయ్యగారు మాచికబ్బె మాటలకు అడ్డువచ్చి "ఈ విషయంలో జాణతనం స్త్రీజాతికి సహజమైందే. ఆ మీదట?" అనినారు.

"అదేమిటి మీరన్న 'జాణతనం?' స్త్రీలకు ఉన్నదేమిటి ? పురుషులకు లేనిదేమిటి ?"



"చెబుతాను, తర్వాత ఏమి జరిగినది ?"

" 'నీవు ఎవరి కూతురివమ్మా ?' అని అడిగినారట. దానికి శాంతల 'మాచికబ్బెగారి కూతురినండీ.' అనినదట. అక్కగారు 'ఏ మాచికబ్బెనమ్మా ?' అని మరల అడిగినారట. దానికి శాంతల 'మాఅయ్య మారసింగమయ్య దండనాయకులవారు.' అనినదట. శాంతల అలా అనగానే అక్కగారు 'మాచక్క బిడ్డవామ్మా నీవు! నా బంగారు తల్లీ!' అని శాంతల తలనిమిరి, 'మీ అమ్మకు మమ్ముల్ను జ్ఞాపకం చేయవమ్మా. మమ్ముల్ను చూడడానికి రమ్మను. లేకపోతే మేమే నగరుకు పిలిపించుకుంటాము. శాంతలా, నీ ముఖం సొంపులు విరజిమ్ముతున్నదమ్మా. పద్మ, ఉమ, వాణి - ఈ ముగ్గురికళలూ నీముఖంలో ఉట్టిపడుతున్నవి. సొబగుల సోనా! నీవు మెట్టిన ఇంట్లో బంగారుగుట్టలు కురిసీని. మేము అడిగినామని మీ అమ్మకు తెలుపు.' అని ఒక చేటి బుట్టనిండ పండ్లు, పూలు నింపి అమ్మాయి చేతికిచ్చి పంపినారు. శాంతల అక్కగారికి భక్తి వినయాలతో నమస్కరించి, ఇల్లుచేరి జరిగిందంతా నాతో చెప్పింది. తెచ్చిన పూవులు పండ్లు నాకు అప్పగించింది. మరుసటిదినం ఇంకా తెల్లవారనేలేదు; అప్పుడే నగరు మేనా మన యింటిముందు వచ్చి వాలింది. 'రాజమాత చెప్పి పంపినారు. శాంతలను పిలుచుకొని తమరు నగరుకు దయచేయాలి.' అని బంగారుబెత్తం పట్టుకొన్న కంచుకి నాకు చెప్పి వెళ్ళినాడు. ఇప్పుడు చెప్పండి. అదేమిటో 'స్త్రీల జాణతనం' అనినారే!"

"చెబుతాను, చెబుతాను. అటుతర్వాత మీరు అంతఃపురానికి వెళ్ళినారు. అక్కగారు ఏమనినారు? ఏమి సంగతి సందర్భాలు జరిగినవి ?"

"చూడండి! మీకు ఎంత ఆత్రమో, మాకూ అలాగే అని తెలుసుకోలేరా ? ఆ 'జాణతన' మేమిటో మొదట చెప్పండి."

"ఇంకా తెలుసుకోలేదా ? మెడలోని ముత్యాలదండను ముట్టిచూచిన మొదటి సూక్ష్మమేమిటంటే 'ఈమె భాగ్యవంతుల బిడ్డా !

లేక అది బీదలూ ధరించే తెల్లపూసల దండా?' అని. రెండవసూత్రం 'ఈమె కన్యా లేక వివాహితా? మెడలో మంగళసూత్రం ఉందా?' అని తెలుసుకోవడం. ఈ చోళదేవి చాల బుద్ధిమంతురాలు. తర్వాత అంతఃపురంలో ఏమి జరిగింది? అక్కగారు ఏమేమి అడిగినారు? ఏమేమి చెప్పినారు?"

"అక్కడ మాటలాడినదంతా మీ ముందు చెప్పడానికి సాధ్యమా? పూర్వకాలపు ఎన్నో సంగతులు, ఎన్నో జ్ఞాపకాలు, సుఖాలు, కష్టాలు అన్నీ జ్ఞాపకానికి వచ్చినవి. ఎరెయంగ ప్రభువుల కాలపు జ్ఞాపకాలు... అప్పుడప్పుడే మహాదేవి అక్కగారు ఎరెయంగ ప్రభువుల చేపట్టి పట్టమహిషి అయిన కాలం. ఎరెయంగ ప్రభువులు కొత్తలో అక్కగారిని 'హే చోళదేవి!' అని పిలిచేవారట. అటు తర్వాత 'మహాదేవి' అని పిలిచినారు. ఆ మీదట కుమార విష్ణువుతండ్రి చెన్నమ దండాధీశుల, వారి మహాసతి చందలదేవిగారి విషయాలు జ్ఞాపకానికి వచ్చినవి. అనంతరం అక్కగారు మరణించిన తమ పెద్దకుమారులు బల్లాళ ప్రభువులను తలచుకొని కన్నుల నీరు పెట్టినారు. మన శాంతల విద్య, వినయం, గుణం, నడవడి, మాట మంతి - అక్కగారు చాల మెచ్చుకొనినారు. శాంతల వీణ వాయించినది, పాడింది. అక్కగారు దుఃఖమంతా మరచిపోయినారు, ఆనందపడినారు. కడకు అక్కగారు అమ్మాయిలో నృత్యంకూడా చేయించి తృప్తిపడినారు. అటుపిదప నన్నుచూచి 'మాచీ, నీ ఎన్ని తపస్సుల ఫలమే ఇది! ఏ నోము ఫలమే?' అని అడిగినారు. 'శాంతల ధర్మేశ్వరుని ప్రసాదం, మా ఆరు సంవత్సరాల నియమ నిష్ఠల ఫలం. బ్రాహ్మీదేవియే శాంతల ఉపాస్యదేవత; ఈ విద్య, ఈ కుశలత అంతా ఆ మహాతల్లి కరుణ.' అని అనినాను నేను."

"భలే! చక్కగా అన్నావు. ఇంకేమి అడిగినారు?"

"అక్కగారు శాంతలతో రామాయణం చదివించి వినినారు."

"ఉం! విద్వత్పరీక్ష జరిగిందన్నమాట!"



"శాంతల రసపుష్టి కలిగేట్టుగా చదివినది. అప్పుడు శ్రీపాలత్రైవిద్యదేవ పండితులవారు అక్కడికి విచ్చేసినారు. శాంతల చదివిన కొన్ని భాగాల అర్థవివరణ అడిగినారు. శాంతల తృప్తికరంగా సమాధాన మిచ్చినది. త్రైపాలవిద్య దేవులవారు సంతోషపడి 'అమ్మాయీ! ఎవరివద్ద నేర్చుకొన్నావమ్మా?' అని ప్రశ్నించినారు."

" 'ప్రభాచంద్ర సిద్ధాంత దేవదేశికుల పాదపద్మోపజీవిని.' అనినది శాంతల."

"ఆహా! ఆహా! తర్వాత?"

" 'అటువంటి గురువుల కృప పూర్వపుణ్య విశేషమమ్మా. నీ భాష నీ ఉచ్చారణ, సాహిత్యజ్ఞానం చక్కగా ఉన్నవి. వ్యాకరణం శుద్ధం. మాకు చాల సంతోషమయింది.' అని శాంతలను ఆశీర్వదించినారు."

"మన వంశానికే ఉద్ధారమయినది."

"ఆ మీదట అక్కగారు శాంతలకు, నాకు ఉడుగరలు, ఫల పుష్పాలు దయచేసినారు."

"ఇంకేమీ చెప్పలేదా?"

"మేము బయలు దేరడానికి లేచినప్పుడు నన్ను దగ్గిరికి పిలిచి, నా చెవిలో 'మాచీ, ఎవరికి నిశ్చయమయింది?' అని ప్రశ్నించినారు. దానికి నేను, 'ఆ యోచనే ఇంకా మేము చేయలేదు. శాంతలను అడిగితే, తనకు పెండ్లివద్దనే అంటుంది. మాకు ఉండే సౌభాగ్యమంతా ఇదే. దీనిని వదలి మేము జీవించడం ఎలాగు?' - అని మాకు అనిపిస్తుంది.' అన్నాను. దానికి అక్కగారు నవ్వి 'ఇలాకద్దేమే మాచీ! నీకు తెలియని దేమున్నది? ఆడది మెట్టిన యింటికి పెద్ద, పుట్టిన యింటికి పేరు,' అని అంటూ మమ్మల్ని సాగనంపినారు."

"మాచీ, ముందు జరుగబోయే శుభానికి ఇది పీఠికలాగ ఉన్నది. మనస్సులో పెద్ద ఆశలను పుట్టిస్తున్నది. అమ్మాయి ఏదీ? వచ్చినప్పటి నుంచీ కనిపించనే లేదు!"

"మీరు ఊరికి తిరిగిరావడం దానికి తెలియదు. చెలికత్తెలతో ఉదయం శారదాలయానికి వెళ్ళినది. దేచయ్యతో అక్కడికే వీణను తెప్పించుకొన్నది. ఇప్పుడూ అక్కడే ఉండవచ్చు. దేచయ్యను పిలిపించి అడుగుతాను."

మాచికబ్బె దేచయ్యను కేకవేసి పిలిచినారు. "వచ్చాను అమ్మగారూ" అంటూ దేచయ్య పూలతోట తలుపువైపునుంచి వచ్చి, యజమాని, యజమానురాలు మాటలాడుతూ నిలబడి ఉండడంచూచి చేతులు జోడించుకొని దూరంలోనే నిలబడి 'దొరవారు దయచేయడం చూచి శివపూజకు బిల్వపత్రి, తుమ్మిపూలు తెచ్చిపెట్టి, దివ్వెకు నెయ్యి వత్తులుపెట్టి, మడిబట్టలు పెట్టించి, శాంతలమ్మగారికి వీణ తీసుకొనివెళ్ళి ఇచ్చి వచ్చాను." అనినాడు.

"శాంతలమ్మగారు ఇప్పుడు ఎక్కడ ఉన్నారు?" అని ప్రశ్నించినారు మారసింగమయ్యగారు.

"వాణీపూజలో ఉందేరయ్యా. వెళ్ళి అయ్యగారు వచ్చారని తెలుపనా అయ్యా?" అని ప్రశ్నించినాడు దేచయ్య.

"వద్దు. మేమే అక్కడికి పోతున్నాను." అంటూ మారసింగమయ్య తమ సతితోపాటు ఇంటివెనుక ఉన్న శారదాలయంవైపు నడువసాగినారు. దేచయ్యవారి భోజనానికి ఏర్పాట్లు చేయను ఇంటిలోకి వెళ్ళినాడు.

## 2

శారదాదేవి ఆలయం ఉన్నది ఇంటి వెనుకభాగంలోని దేవుని మూలలో. కూతురు విద్యాభ్యాసానికి, నర్తన గాయనాభ్యాసానికి, శారదా పూజకూ మారసింగమయ్య భవ్యమైన పూజాగృహం, దానికి చేరినట్లే ఒకపెద్ద పంచ కట్టించినారు. శిల్పి మలితమ్మ శారదాంబ విగ్రహాన్ని మెత్తని శిలలో సర్వాంగసుందరంగా చెక్కినాడు. శాంతల



ఎనిమిదవ పుట్టినపండుగనాడు శారదామూర్తి ప్రతిష్ఠ జరిగింది. తన పన్నెండవ యేట శాంతల శారదోపాసన మొదలుపెట్టింది. తండ్రి మారసింగయ్య ప్రభాచంద్ర సిద్ధాంతదేవ దేశికులను పిలిపించి కూతురికి విద్యా గురువులుగా చేసినారు. వారు శాంతల నడవడి, మాటమంతి, గుణగుణాలు, నిష్ఠ చూచి శిష్యురాలుగా స్వీకరించి, విద్యావతిని చేసినారు. శాంతల గాయననర్తనకళలలో అభ్యాసంతోను, కఠిన దేహపరిశ్రమంతోను నైపుణ్యం సాధించింది. శారద ఆశీర్వాదంతోనే శాంతలకు ఈ విద్యలు లభించినవి. తన సంతోషం కోసమే ఆమె పాడినది, నర్తించినది. భక్తియోగాభ్యాసంతో కాలక్రమాన ఆమె ముఖంలో దైవతేజస్సు విలసిల్లినది. వయోనుగుణమైన మైకట్టు నర్తనాభ్యాసబలంతో దీర్ఘమై, దృఢమై, సర్వాంగ సుందరంగా పరిణతి చెందినది. శాంతలకు ఇప్పుడు పదహారు వసంతాలు నిండినవి.

కూతురికి పదహైదు ఏండ్లప్రాయం రాగానే మాచికబ్బె భర్తతో ఆమె పెండ్లిప్రస్తావన చేసినారు. "ఇప్పుడే తొందర ఎందుకూ!" అనినారు మారసింగమయ్య. మాచికబ్బె శాంతల విద్యాగురువుల వద్దకూడా ఒకనాడు ఈ ప్రస్తావనే తెచ్చినారు. "అమ్మాయి విద్యాభ్యాసం పూర్తి అయ్యేవరకు దయచేసి ఈ ప్రస్తావన తేకండి." అనినారు ప్రభాచంద్ర దేవదేశికులు. కన్నకడుపు "అది పూర్తికావడంకూడా ఉందా?" అని ప్రశ్నించింది. "నేర్చుకొనే ఆశ ముగిసినప్పుడు విద్యకూడ ముగిసినట్లే," అని సమాధానం వచ్చింది. ఇంతయినా తల్లి చాపల్యం తీరలేదు. ఒకనాడు కూతురితో సంతోషంతో సల్లాపిస్తూ, "నీవు ఎవరిని పెండ్లాడుతావు నా తల్లీ?" అని ప్రశ్నించినారు. శాంతల నవ్వుతూ "శివున్నే - అమ్మా, శివున్నే పెండ్లాడుతాను." అని సరసమాడింది. సూక్ష్మం తెలిసిన తల్లి మళ్ళీ కూతురి మనస్సును కదపలేదు. "జినేసుడే దారి చూపనీ!" అని ఊరికే ఉండిపోయినారు.

శాంతల చెలికత్తెలలో చాలమంది పెండ్లాడి తమతమ అత్తవారిండ్లకు వెళ్ళి కాపురంచేస్తున్నారు. నెచ్చెలి లక్ష్మీమాత్రం ఇంకా పెండ్లి కాక శాంతలకు నీడలా వెన్నంటే ఉండినది.

లక్ష్మి శాంతలను ‘అక్కా’ అని పిలిచేది. రూపంలోను, గుణంలోను లక్ష్మి మహాలక్ష్మి. శాంతల, లక్ష్మి ఇద్దరూ చిన్ననాటినుంచి ఒక్కటిగా, ఒకేచోట ఆడుతూపాడుతూ పెరిగినవారు. దైవభక్తి, మాతపితృభక్తి, గురుభక్తి, గుణగణాలు, సౌశీల్యం, ధర్మం, హృదయవైశాల్యం—వీటిలోను సమానంగానే పెరిగినవారు. ఒకరి శరీరానికి అలసటగాని, ఆయాసంగాని కలిగితే, మరొకరికి అలసట, ఆయాసం అయ్యేవి. ఇంత అన్యోన్యంగా, ఏకదేహన్యాయంగా, ఏకాత్మగానే పెరిగింది ఈ బాలికల సఖ్యం.

ఒకనాడు ఇద్దరూ ఒక మిత్రురాలి వివాహానికి వెళ్ళినారు. ఇంటికి తిరిగి వచ్చినప్పుడు లక్ష్మి చాల యోచనలో ఉన్నట్టు శాంతలకు తోచింది. “ఎందుకే లక్ష్మి! ఎందుకమ్మా వేసట?” అని ప్రశ్నించింది శాంతల. లక్ష్మికంట తడిపెట్టుకుంటూ “అక్కా, నీవు పెళ్లాడి వేరే ఊరికి వెళ్ళిపోతే నా ప్రాణాలు ఉండవు!” అని దుఃఖంతో అన్నది.

అంతఃకరణ జీవి, సహృదయా అయిన శాంతలకు లక్ష్మి అప్పుడనిన మాట శాశ్వతంగా ఎదలో నాటింది. కన్నీరు తొణికిసలాడింది. అయినా ఆమె చిరునవ్వు నవ్వి “పిచ్చిదానా! పిచ్చిదానా!” అని మాత్రమే అని తనూ గాఢాలోచనలో మునిగింది. అంతరంగానికి తెలిసినది లక్ష్మి అప్పుడన్నమాట.

లక్ష్మి పెరుమల పండితుల ఏకైక పుత్రిక. చిన్ననాడే తల్లి పరమపదించినది. అందువల్ల లక్ష్మి తండ్రి సర్వస్వమయి పెరిగినది.

రాజమాత మహాదేవిగారి భర్త ఎరెయంగ ప్రభువులవారు ఒకమారు కంచికి వెళ్ళినారు. చిన్నవారయిన బల్లాళ, బిట్టిదేవ, ఉదయాదిత్యులు ముగ్గురూ అప్పుడు తండ్రి వెంటనే ఉన్నారు. ప్రభువులవారు కుమారులతోసహా వరదరాజస్వామి దర్శనానికి వెళ్ళినారు. అక్కడి ప్రజలూ, భట్టాచార్యులూ శైవులయినచోళరాజుల నుంచి దేవాలయానికి కలుగుతున్న చిక్కులను ప్రభులతో మనవి చేసుకొన్నారు. శైవులయిన



చోళరాజుల సామంతు డొకడు వరదరాజస్వామి దేవాలయ ధర్మస్వాన్ని అపహరించి ఉండడం చూచి, ప్రభువులు ఆ సామంతునిపై దండెత్తి, వాడు తనది తప్పయినదని ఒప్పుకొన్నప్పుడు, ధర్మదానాలను దేవాలయానికి ఇప్పించి, తాము కూడా వరదరాజుల అఖండదీపారాధనకు శాశ్వత మాన్యాలను ఇచ్చి, దేవదేవికి వస్త్రాలంకారభూషణాలను అర్పించిన మీదట, తమ రాజ్యంలోని విష్ణుభక్తుల ధర్మోద్దీపనంకోసం కంచినుంచి పండితశ్రేష్ఠులొకరిని పిలుచుకొని వెళ్ళడానికి నిశ్చయించి, అలాటి పండితోత్తములు అక్కడ ఎవరని విచారణ చేసినారు. శ్రీరంగనగరపు యామునాచార్యుల శిష్యులయిన పెరుమల పండితులు తగినవారని ఎన్నుకొని, వారిని తమతోపాటు విచ్చేయాలని కోరుకొని, బహుప్రయాసతో ఆయనను ఒప్పించినారు; శ్రీమన్నారాయణుని కోసమే తమ రాజధాని అయిన వేలాపురిలో ఒక అసదృశమైన మందిరం నిర్మిస్తామని మాటయిచ్చి, పండితులను తమవెంట పిలుచుకొని వచ్చినారు. తల్లిలేనిపిల్ల అయిన లక్ష్మికూడా అప్పుడు తండ్రివెంట వచ్చినది.

రెండు సంవత్సరాల తర్వాత ఎరెయంగ ప్రభువులు కాలధర్మం చెందినారు. పెరుమల పండితులు ఇక కంచికి మరలి పోదామనుకొన్నారు. అప్పుడు ఎరెయంగ ప్రభువుల ముగ్గురు కుమారులూ తమ తండ్రిగారు అన్నమాటను తాము నిలబెట్టుకుంటామని నమ్మకం కలిగించి పండితులను తమ రాజ్యంలోనే నిలుపుకొన్నారు.

తండ్రి అనంతరం సింహాసనం అధిష్ఠించిన బల్లాళ మహారాజులుంగారు రాజ్యమేలినది నాల్గే వరుషాలు. జన్మాంతర పీడవలె ఉన్న ఒక వ్యాధి వీరిని తీసుకొని వెళ్ళింది. అనంతరం పట్టానికి వచ్చిన బిట్టిదేవ ప్రభువులు పెరుమల పండితుల వైష్ణవధర్మం స్వీకరించి, ‘విష్ణువర్ధనుడు’ అనే సార్థక నామధేయంతో హొయిసళ రాజ్య రమాకీర్తులను పెంచి పరిఢవిల్ల చేసినారు. విష్ణువర్ధన ప్రభువులు సింహాసనం అధిష్ఠించిన సంవత్సరమే తమ జనకులకాలపు రాజధాని అయిన వేలాపురంలో విజయనారాయణస్వామి దేవాలయానికి శంకుస్థాపన చేయించినారు. విష్ణువర్ధన

ప్రభువుల హృదయవైశాల్యం, సర్వమత సమానానురాగం, దైవభక్తి ధర్మదృష్టి - వీటిని చూచి పెరుమల పండితులు హొయిసళ రాజ్య నూతన రాజధాని అయిన ద్వారవతిలోనే నివాసం ఏర్పరచుకొనినారు.

ద్వారవతిలో రాజవీధిలోనే పెరుమల పండితుల నివాసగృహం. ఆ వరుసలోనే మారసింగమయ్యగారి భవనం. అందువల్ల శాంతల, లక్ష్మి ఒకే వీధివారయినారు; ఒకే వయసువారు, కలిసి మెలసి ఆడుకొనేవారూ అయినారు.

# 3

మారసింగమయ్య, మాచికబ్బె ఇద్దరూ పూలతోటదాటి శారదా దేవాలయం పంచ చేరినారు. శాంతల అప్పుడు దేవాలయ గర్భగృహంలో పద్మాసనాసీనురాలై ధ్యానాసక్తురాలై ఉన్నది. తన తలిదండ్రులు దేవాలయంలో ప్రవేశించడం చిత్తవృత్తి నిరోధంలో ఉన్న శాంతలకు తెలియలేదు. కుమార్తె ఏకాగ్రతకు సంతోషిస్తూ వారిద్దరూ సద్దుచేయక దేవాలయం పంచలో కూర్చున్నారు.

దేవీ మందిరం గర్భగృహంలో వెలుపలినుంచి వెలుతురు రావడానికి ఎక్కువ అవకాశంలేదు. ఏకాగ్ర ధ్యానానికి అడ్డుతగులుతుందని శిల్పి మల్లితమ్మ గర్భాలయంచుట్టూ ఎక్కడా గవాక్షాలుగాని, సోరణగండ్లు గాని పెట్టక, దేవి ముఖభావం మాత్రం చక్కగా కనిపించేటట్టు, మధ్యాహ్నపు ఎండ దేవి ముఖకమలాన్ని వికసింపజేసేటట్టు మందిరోపరితలంలో రెండు చిన్న ద్వారాలను మలచినాడు. ఒకదానినుంచి ఉత్తరాయణంలోను, మరొకదానినుంచి దక్షిణాయనంలోను మధ్యాహ్నకాలంలో సూర్యకాంతి దేవిముఖపద్మాన్ని వికసింపజేసేది. శాంతల ధ్యానానికి ఆసీనురాలయే సమయంకూడా అదే.

చీకటిగాఉన్న ఆ గర్భగృహంలో పై ద్వారంనుంచి పడిన సూర్యకాంతి నేడు దేవిముఖపద్మం మీద ప్రసరించి కన్నులను, మనసును



ముగ్ధపరచే అపూర్వశోభ కల్పించింది. చందనాగరు కర్పూర పవన సుమసౌరభం మనస్సుకు ఆహ్లాదం కలిగించింది.

ఇలాటి సుందరమూర్తి ఉపాసనలో శాంతల దేవిలాగే సుందర గాత్రం, సుందర మనోభావాలు కలదిగా మారింది. శాంతల సహజ సౌందర్యానికి ఆభరణాల బెడగు అవసరం లేకపోయింది. ధవళవసన ధారిణిఅయి దేవిముందు ఆసీనురాలయిన శాంతల, అప్పుడు...పుండరీకుడు శాపంవల్ల కలిగిన జన్మాలన్నీ గడచి, మరల పుండరీకుడుగా స్వస్వరూపంతో తన వద్దకు వచ్చేవరకూ, కాలగతిని తపోనుష్ఠానాలతో జయించి, పరమేశ్వరుని ముందు నిశ్చల ధ్యానంలో కూర్చున్న...'మహాశ్వేత'వలె కనిపించింది. తండ్రి దక్షబ్రహ్మ చేసిన పతినిందను విని సహించలేని దుఃఖంతో, అతడు జ్వలింపజేస్తున్న వైష్ణవయాగాగ్నికి తన దేహాన్ని అర్పించిన దాక్షాయణి మరల తనువుపొంది, పెరిగి, పరశివ అయి హిమగిరి శ్వేతశిఖరంపై కూర్చుని తపమాచరిస్తున్నట్టు కనిపించింది.

అప్పుడు దేచయ్య 'దొరగారూ, అమ్మగారూ, భోజనానికి దయచేయాలి' అని గట్టిగా పిలుస్తూ అక్కడికి రాకపోతే, శాంతల ఇంకా ఎంతసేపు ధ్యానంలో ఉండేదో ఏమో! ఆ పిలుపు శాంతల ధ్యానానికి భంగం కలిగించింది. ఈ విధంగా కేకలువేసిన వాడెవరని శాంతల బెదరిన మృగశాబకివలె కళ్లుతెరచి చుట్టూ పరికించినపుడు వలభికింద మౌనంలో కూర్చునిఉన్న తల్లిదండ్రులు కనిపించినారు.

తనసుంచి అపచారమయింది అనే తీరున శాంతల తటాలున లేచి వచ్చి తల్లిదండ్రులకు నమస్కరించి, "అయ్యా, ఎప్పుడురాక! అయ్య సుఖంగా తిరిగిరానీ, తొందరగా తిరిగిరానీ అని ప్రార్థిస్తున్నాను." అని అంటూ దేవికి సమర్పించిన పుష్పాలను వారికి అందజేసి, వారి పక్కనే కూర్చున్నది. మారసింగమయ్య ఉప్పొంగివస్తున్న ప్రేమతో కూతురు తల నిమిరి "ఇప్పుడే ఇక్కడికివచ్చి కూర్చున్నామమ్మా. ఊరుచేరి జలకమాడి శివపూజ చేస్తుండగా, నగరు అవసరపు రౌతు ఇదిగో, ఈ రెండు కమ్మలను అందజేసినాడు. నీ తల్లి అప్పుడే జైనబసదినుంచి వచ్చినారు." అంటూ, రెండు లేఖలను కూతురుచేతికి ఇచ్చినారు.

శాంతల ఆ రెండు కమ్మలనూ చదువుకున్నది. ఆశ్చర్యంతో, తృప్తితో ఆమె ముఖం ప్రఫుల్లమయింది. "రాజమాత మహాదేవిగారికి మనపై చాల వాత్సల్యం...కాదేమే అమ్మా!... రాచనగరులో రేపు జరిగే ఈ ఉపనయనోత్సవం అద్భుతంగా ఉంటుందికదండీ అయ్యా!" అనినది.

"ఉండదూ మరి? అద్భుతంగానే ఉంటుంది. నగరులో దేనికి కొరత? నగరులో మంగళోత్సవాలు జరిగే చాలకాల మయింది. కుమార విష్ణువుపై ప్రభువులకు పుత్రవాత్సల్యం. పరమపదవాసులయిన చెన్నమ దండాధీసులు ఈ ప్రభుల తండ్రిగారయిన ఎరెయంగప్రభువులకు చెల్లించిన సేవ అంతా ఇంతా? విష్ణువర్ధన ప్రభువులు దానిని ఎన్నటికీ మరచిపోరు. చెన్నమ దండాధీశుల సతి చందలదేవి పతితోపాటు సహగమించినప్పుడు కుమార విష్ణువుకు రెండేఏళ్ళు. ఇతనికి ఏణ్ణర్థం పెద్ద అయిన అన్న ఒక్కడుండేవాడు. వీరిద్దరినీ మహాసతి చందలదేవి రాజమాత ఒడిలో పెట్టి, 'అక్కగారు ఆనతి ఇవ్వాలి. ఇక సంతోషంతో తరలి వెళ్లుతాను.' అని చెప్పి, ముత్తైదువల అలంకారంతో చితాగ్నికి ప్రదక్షిణంచేసి, దానిలో దూకి మహాసతి అయినారు. అందువల్ల కుమార విష్ణువు ఉపనయనం నగరులో జరుగవలసిందే, మహావిజృంభణగా జరగవలసిందే! ఈ సమయానికి నేనుగూడా వచ్చి చేరాను. బహుశా ఈ సంతోషంలో పాల్గొననీ అనే రాజమాత నన్ను పిలిపించినారు కాబోలు!" అంటూ మారసింగమయ్య లేచి అందరితోపాటు భోజనశాల వైపు నడిచారు.

మాచికబ్బె నడుస్తూనే పతిని సంబోధించి, "కుమార విష్ణువును నేనూ రెండుమూడు మార్లు చూచినాను. వర్చస్వి అయిన సుందరరూపం, చాల మంచినడవడిగల బాలకుడు" అనినారు. మారసింగమయ్య అన్నారు: "గంగరాజ మహాప్రధానులవారూ నాతో ఒకటి రెండు పర్యాయాలు సెలవిచ్చినారు. ఆ బాలకునిలో ఉదాత్తమైన గుణాలున్నవని."

ఆ వేళకు అందరూ భోజనశాల చేరినారు.

# 4

రాచనగరులో ఉపనయన మహోత్సవకార్యాలు మహావేగంతో జరిగినవి. విశాలమయిన విజయ సింహాసనపు ఓలగపుసాల అత్యద్భుతంగా అలంకృతమయింది. చుట్టాలకూ పక్కాలకూ, సామంతులకు, గురుశ్రేణి వారికి, విప్రులకు, పౌరులకు, అంతఃపురపు దేశ కోశాధికారులకు, ఆహూతులకు, స్త్రీలకు, పిల్లలకు, వారివారి అంతస్తుకు అధికార గౌరవాలకు తగినట్టు సుఖాసనాలు ఏర్పాటయినవి. ఎత్తయిన ప్రదేశంలో యజ్ఞవేదికను నిర్మించి, కుల పురోహితులకు, ఆచార్య వర్గంవారికి, విప్రులకు, కుమారవిష్ణువుకు, అతనికి పితృసమానులయిన విష్ణువర్ధన ప్రభువులకు పీఠాలు, సుఖాసనాలు ఏర్పరచినారు. పూజకు, హవనహోమాదులకు కావలసిన సమస్త వస్తువులు సిద్ధపరచినారు. పుష్ప ఫల సుగంధ ద్రవ్యాలు యథేచ్ఛగా సేకరించినారు.

ఓలగసాలలో ఈ ఏర్పాట్లన్నీ, వాటికోసం నియమితులయిన అధికారుల నాయంకరంలో సమన్వకంగా జరుగుతుండగా, కొత్తడిలో (రాణివాసంలో) రాజమాత మంత్రాలోచనసభకు అమాత్య శ్రేష్ఠులయిన తంత్రపాల హేమాద్రిపండితులను, అమాత్యులు వీరదేవ, అచ్యుత దేవ, గోవింద పండితులను ఒక గోప్యమైన ఆలోచనకోసం పిలిపించుకొనినారు. ప్రంచ ప్రధానులలో ముఖ్యులైన గంగరాజ మహాప్రధానులవారు ఇంకా రానందున అందరూ వారి రాకకై వేచి ఉన్నారు.

గంగరాజ మహాప్రధానులవారు వీరందరికన్నా వయోవృద్ధులు, జ్ఞానవృద్ధులు. ఎరెయంగ ప్రభువుల కాలంలో సర్వసేనాపతిత్వం నిర్వహించినవారు; పలువురు దుష్టులైన పాళెగార్లను, దైవభక్తిలేని, ప్రజానురాగులు కాని, దేశహితంకోరని స్వార్థులను, ద్రోహులను నుగ్గునూచంగా అణచివేసి, దేశాన్ని సుభిక్షంచేసి, హొయిసళ రాజ్యాన్ని విస్తరింపజేసినవారు. ఎరెయంగ ప్రభువుల పిదప ఇప్పటి విష్ణువర్ధనుల వారికీ వీరు సర్వసేనాపతులుగా మాత్రమేకాక మహాప్రధానులూ అయారు. ఎరెయంగ ప్రభువుల అవసానకాలంలో గంగరాజులుంగారు ప్రభువుల సన్నిధానంలో

ఉన్నారు. మృత్యువు సమీపించడం ఎరెయంగ ప్రభువులు గ్రహించి, అప్పుడు ఇంకా పసికందులైన బల్లాళ, బిట్టిదేవ, ఉదయాదిత్యులను దగ్గరికి రప్పించుకొని తమ మహారాజ్ఞిని, గంగరాజులుంగారినీ చూచి, "ఇక మేము వెళ్లుతున్నాము. మీరిద్దరూ ఈ పసికందులను, రాజ్యాన్ని ముందుకు తీసుకురండి" అంటుండగా, మహారాజ్ఞి మహాదేవి అక్కగారు కన్నీరు ధారగట్టగా, గద్గదకంఠంతో "నేను సహగమించే దానినే. ఇక నాకిక్కడ ఏమిటి పని ?" అని విలపించినారు. ప్రభువులు డగ్గుత్తికతో "దేవీ! మాకంటె మాపిల్లల ముందు జీవితం దొడ్డది. అన్నింటికన్నా రాజ్యక్షేమం దొడ్డది. అందువల్ల నీ ..." అని అంటుండగానే మాట సగంలోనే ఆగిపోయింది. మరుక్షణమే దీర్ఘనిశ్వాసంతో ఎరెయంగ ప్రభువుల ప్రాణాలు అనంతాకాశంలో లీనమయినవి.

పతితోపాటు సహగమించాలని మరల యోచించిన మహాదేవి అక్కగారిని గంగరాజులుంగారు పెక్కురీతుల సమాధానపెట్టి, "ఈపిల్లలను, ఈ మహారాజ్యాన్ని కాపాడేభారం ప్రభువులవారు మన ఇద్దరికీ పంచి పోయినారు. ఆ మాటలన్న మీదటనే సమాధానంతో ప్రాణాలు వదలినారు. మీరిప్పుడు సహగమనం చేస్తే, ఈ పసిపాపలను చూచుకొనేవారెవరు ? ఎవరిని నమ్మడం ? రాజ్యంలో అల్లకల్లోలాలు చెలరేగవచ్చు. ద్రోహులున్నారు. అందువల్ల మీ సహగమనంతో వారి ఆత్మకు అర్పిస్తే కావచ్చు." అని మనవిచేసి అక్కగారి సహగమనాన్ని ఆపినారు.

మహాదేవి అక్కగారు రాజేంద్రచోళ పృథ్వీకొంగాళ్వని తమ్ముడైన ఇరక్కపాలుని సంతానం. పుట్టినింటి పేరు అమ్మాంగదేవి. ఎరెయంగ ప్రభువులు ఒక్కమారు ఒరెయూరిపై దండెత్తిపోయి, హొయిసళ భూమిని దురాక్రమణ చేసిన తమిళ చోళ సామంతుని వెనుక్కు వెనుక్కు నెట్టుతూ, తిరుచిరాపల్లి వరకు వెళ్ళినారు. రాజతంత్రజ్ఞులయిన గంగరాజులుంగారు ఇలాటి ఉపద్రవాలు ఇకముందు రాకుండా చేయడానికి ఈ చోళ రాజకుమారిని తెచ్చి ఎరెయంగ ప్రభువులకు పెండ్లి చేసినారు. దీనివల్ల తమిళ చోళరాజ్యానికి, హొయిసళ రాజ్యానికీ కొంతకాలం సమాధానం ఏర్పడింది. ప్రభువులు మొదట్లో "హే చోళ



దేవీ!" అనే పిలిచేవారు; అమ్మాంగదేవిని. ఈ చోళదేవి పట్టమహిషి అయినప్పుడు "మహాదేవి" అనే నూతన నామధేయంతో పట్టంకట్టుకొన్నారు.

వివాహమయిన కొత్తలో మహాదేవి అక్కగారు ఒకమారు గంగరాజ మహా ప్రధానులవారితో "భీష్ములవారు అంబికను మాత్రం తీసుకొని వచ్చినారే! ఇక అంబ, అంబాలిక ?" అని పరిహసించినారట. వాక్చతురులయిన గంగరాజులుంగారు నవ్వి, నమ్రతతో "అంబాలిక దొరికితే తెచ్చి మీకు సవతిగా చేస్తాను. అంబ మాత్రం కుదరదు... కుదరదు." అనినారు.

పతి పరమపదం పొందిన తర్వాత మహాదేవి అక్కగారు గంగరాజులుంగారిని మహా ప్రధానస్థానంలో నియమించుకొన్నారు. అప్పుడు పంచ ప్రధానులలో గంగరాజులుంగారే మహాప్రధానులయినారు. సర్వసైన్యాధిపత్యమూ వారిదే.

ఇలాటి గంగరాజ మహాప్రధానులవారి రాక కోసమే రాజమాత, ఇతర ప్రధానులు నిరీక్షిస్తూ ఉన్నది. గంగరాజులుంగారు కొంత తడవై వచ్చినారు. కాలం అతిక్రమించి వచ్చినందుకు అందరి క్షమాపణకోరి సుఖాసనం అలంకరించినారు. తంత్రపాల హేమాద్రి పండితులు గంగరాజులుంగారి పక్కన కూర్చుని, రాజమాత ఆంతర్యం వివరించి, "ఉపనయన మహోత్సవానికి, రాజబంధువుల, సామంతుల, ఉన్నతోద్యోగుల, పేరెన్నికగన్న వణిజుల, నగరప్రముఖుల రాక కోరడం దీనికోసమే." అనినారు.

గంగరాజులుంగారు క్షణకాలం యోచించి పిదప తలఊపి, "కావచ్చు. అక్కగారిది సరైన యోచనే" అన్నారు. పెక్కు ముఖ్య విషయాలచర్చ తర్వాత గంగరాజులుంగారు రాజమాత సమీపానికివచ్చి "అక్కగారి ఆశ ఫలించనీ. తమ ద్రావిడబుద్ధిసూక్ష్మాన్ని మెచ్చుకొన్నాను. ఈ విషయం విష్ణువర్ధన ప్రభువులకు తెలియగూడదు కదూ !" అనినారు.

“అది ఎలాగు ? అలాఉంటే మిమ్మల్నందరినీ ఇక్కడికి రప్పించుకొనే ప్రమేయమేమిటి ? రాజవంశవృద్ధికి ఒక్క పూవన్నా పూచవలెను కదా ! ఇంత దొడ్డరాజ్యాన్ని నిరుపాధికంగా నడుపుతున్న మీరు, మీరు ఈ విషయం యోచించవద్దా ? అకాలమృత్యువు వాతబడిన మా పెద్ద కుమారులు బల్లాళ ప్రభువులకు ఒక్క మగబిడ్డ పుట్టిఉంటే మాకు ఏచింతా ఉండేదికాదు ! ఆ ముగ్గురు కోడండ్ర ఒడీ వట్టిదయింది. అదంతా తలచుకొన్నకొద్దీ దుఃఖం పెచ్చు పెరుగుతుంది. ‘ద్వారవతిని కాల్చి బుగ్గిచేసి కానీ వెనుదిరగను’ అని మన రాజ్యంపై దండెత్తివచ్చి, బీరాలు ప్రేలినాడు ఆ పంతారరాజు మాళవ జగద్దేవుడు ... ఆ చాళుక్య సామంత రాజు. వాని పౌరుషవాక్యాలకు ఎదబెదరక, మా కుమారులు, ‘అమ్మా, మీ పాదాల ఆన. ఆ దుష్టుణ్ని మేము తుంటలు తుంటలుచేసే వస్తాము’ అని ప్రతినచేసి, ధైర్యముడిగిన మా మనస్సుకు ధైర్యం తెచ్చి, రణరంగం ప్రవేశించి, మదగజాలు తుంగను పెరికి వెదజల్లినట్టు శత్రుసైన్యాలను చంపి చెల్లాచెదరుచేసి, చెరచిక్కిన ఆ జగద్దేవునినోట ‘దేహి’ అని అనిపించి, వాని జంపైన ఎదపైఉన్న అనర్ఘమైన పచ్చను ఒలుచుకొనివచ్చి, విజయోత్సాహంతో ద్వారవతి ప్రవేశించి, మాకు సాగిలంపడి, ‘అమ్మా ! ఇదిగో ఆ ఖలుని రొమ్ముమీద మెరుస్తున్న పచ్చ’ అని మాకు అప్పగించిన దినాన్ని ఎలాగు మరుస్తాను ? ...... మా యజమానుల అంతంకోసం ఎదురుచూస్తున్న చక్రగొట్ట, తలెయూరు, కోళాల, చంగేరి, హంజేరు విషయాల సామంతులూ నాయకులూ ద్రోహులై ఎదురుతిరిగినప్పుడు, మా కుమారులూ అప్పుడు అధైర్యపడగా, అన్నగారయిన మీరు ఆ ద్రోహుల నందరినీ అణచివేసి, ఇక ఎప్పటికీ వారు తలయెత్తనట్టు చేయలేదూ ? ఈ మీ అందరి స్వామిభక్తి, దేశసేవ, మా తలపునుంచి తుడుచుకొనిపోలేదు. ఇంతయినా మా దుర్దినాలు తొలగినవా ? పట్టాభిషేకమయిన నాల్గవ సంవత్సరమే మా పెద్దకుమారులు బల్లాళ ప్రభువులు దుష్టగ్రహోల్బణానికి చిక్కి మరణించినారు గదా. అప్పుడూ మీ సమాశ్వాసనమే మా దుఃఖాన్ని మింగుకొనేట్టు చేసింది. ఒకే తల్లి బిడ్డలయిన ఆయన ముగ్గురు పత్నులకు ఏకకాలంలో కలిగిన దుర్గతి, ఘోరదుఃఖం చూచి మా రెండవకుమారులు ఈ బిట్టిదేవ విష్ణువర్ధనులు అడప్రతుకే



దుఃఖసాగరమనుకొని, తాను పెండ్లాడబోమని అంటున్నారు. ఎన్ని విధాలుగా చెప్పుకున్నా ఆడుక్కున్నా ఆతని నిశ్చయం ఇంకా ఆ దుఃఖం మీద నాటుకుంది. ‘అమ్మా, ఇతరజీవులు మనవల్ల దుఃఖానికి పాలుపడరాదు. వదినెగార్ల దుఃఖం మేము చూడలేకపోతున్నాము. సింధగెరె నగరంలో వారు తమ పుట్టింటనే ఉన్నప్పటికీ, మా రొమ్ముమీదే కూర్చొని నిట్టూరుస్తున్నట్టు ఉంది. సింహాసనంపై కూర్చున్న మాకు సింహంపై కూర్చున్నట్టుంది. మనసుకు నెమ్మదిలేదు. లేస్తే, కూర్చుంటే, పోతే, వస్తే, అన్నంలో, నీటిలో, పాలలో, పడకలో, రణంలో, ఆప్తులని, హితమతులని నమ్మినవారి చేతుల్లో ఎప్పుడు, ఎలాగు ఆహుతి తీసుకుందాము -అని మృత్యువు సిద్ధంగా ఉంటుంది. మాకు వివాహం వద్దు. తమ్ములు ఉదయాదిత్యులకు కావలిస్తే చేయండి. వారికి పురుషసంతానం కలిగితే నాకు కలిగినట్టే’ అనేవారు. అది విని విని మాకు చాలు చాలయింది. చిన్నకొమారులు ఉదయాదిత్యులకు పెండ్లిచేస్తే మేలు అనుకున్నాము. అప్పుడు మృత్యువు మరొక్కమారు మాకు చిచ్చుఒడ్డినది. అన్నగార్లూ ! మీకు తెలియదా ... కెలవత్తి పట్టణంలో మామూడవ కుమారులు విషజ్వరానికి బలికావడం ? ఈ విధంగా దుఃఖపరంపరలు వచ్చిపడి కొసకు మా కన్నీరు కూడా వట్టిపోయింది. చావుమీద చావు, భయంమీద భయం; అన్నమూ వద్దు, నిద్రా వద్దు. ‘వీధిలోని బిచ్చగాళ్ళు మాకంటె చింతలేనివారు, సంతోషచిత్తులు.’ అనిపించింది మాకు. మా కుమారులు విష్ణువర్ధనులు చెప్పినమాట : ‘అమ్మా, సింహాసనంపై కూర్చున్నవారి తల ఏ క్షణంలో మొండెంనుంచి తెగి దొర్లిపడుతుందో చెప్పడం సాధ్యమా ?’ అన్నది ఎంతనిజం ! ఎంతనిజం! ఇటీవల మా మనస్సుకూ నెమ్మదిలేదు. ఈ దుఃఖంలోనే ఉంటే మాకు మతిభ్రమం కూడా కలుగవచ్చు. ఒకేఒక్క ఆశమీద ఈ జీవి బిగబట్టుకొనిఉంది. విష్ణువర్ధనులకు వివాహమయి, వంశాభ్యుదయానికి దైవం ఒకే ఒక మగ సంతునైనా కరుణిస్తే చాలు. ‘ఈదుఃఖమంతా మింగి, ఇదంతా సహించి బదికినది ఈ ఒక్కదానికోసం.’ అని సమాధాన పడుతాను. వారిమనసుకు ఒప్పిన ఆడది, వారికి పత్నికావడానికి పుట్టిన ఆడదిఉన్నదో, లేదో? ఒకవేళ ఈ మన రాజధానిలోనే ఉంటే, వారి కంటికి కనిపించనీ అని తపస్సు

చేస్తున్నాము, దైవాన్ని వేడుకొంటున్నాము. దైవం సతిని, సంతతిని వారి నొసట వ్రాయకపోతే, దానికి ఎవరేమి చేయగలరు? మంచి బాలికలు మా కుమారుల కళ్ళకు కనిపించాలనే ఈ ఉపనయన సమయంలో ఈ ఏర్పాటు చేయించినాము. మా రాజ్యం పంచప్రాణాలు మీరు, అధిక కర్తవ్యభారం వహించిన వారు మీరు. మేమిప్పుడు అన్నగారికి చెప్పడం ఇంతే: రేపు యజ్ఞోపవీత ధారణం అయినతర్వాత వటువుకు ఆశీర్వాదం ఇప్పించే నెపంతో విష్ణువర్ధనులు వటువుజతలో ఉండేటట్లు చేయండి. ఆ అధికారుల, వారి కుటుంబాల పరిచయం వారికి కలిగించండి. ఆ సందర్భంలో ఏ ఒక్క కన్యఅయినా వారి మనసుకు నచ్చుతుందేమో చూదాము. ఆ సమయంలో మీ కన్నులు, మనస్సు సూక్ష్మాతిసూక్ష్మంగా ప్రభువుల కన్నుల సన్నలు, మనసుసూక్ష్మం గ్రహించే లక్ష్యంతో ఉండనీ. మీరందరూ మాపై అపార ప్రీతి విశ్వాసాలున్నవారు. 'అక్క' అని నన్ను సంబోధిస్తున్నారు. మీ ప్రీతి విశ్వాసాలే మాకు విశేష గౌరవం. ఒక్క సంగతిమాత్రం చెప్పదలచినాము. జగన్నియామకుడు ఏ పురుషునికి ఏ స్త్రీని విధించినాడో, ప్రాప్తసమయంలో ఆ జగన్నియామకుడే ఆ స్త్రీకీ, పురుషునికీ, పరస్పరం కన్నులతో మనస్సులతో ఆకర్షించేశక్తిని, ఆపేక్షించేశక్తిని, తమ సహధర్మచారులమని తెలుసుకొనేశక్తిని అనుగ్రహిస్తాడు. దీనిని మీరు సూక్ష్మంగా, నిర్లిప్తంగా ఉంటూ గమనించవలె. భగవంతుడు మా అభీష్టం సిద్ధింపజేయనీ!" అనినారు రాజమాత.

'మారాజ్యం పంచప్రాణాలూ మీరు' అని రాజమాత పొగడ్త పొందిన, వాస్తవంగా అలాగే ఉన్న, ఆ పంచప్రధానుల హృదయాలు మహాదేవి అక్కగారి మాటలకు కరగి, అనుకంపాతరంగితాలయినవి. గంగరాజ మహాప్రధానులవారూ, ఇతరప్రధానులూ మంత్రాలోచన సభనుంచి వెళ్ళిపోయేటప్పుడు ఆమెకు నమస్కరించి "అక్కగారి మనసు చాల నొప్పిపడినది. సెలవివ్వవలసినదంతా సెలవిచ్చినారు. ఇక తమరు విశ్రమించండి. రేపటి పనులు చాల ఉన్నవి. తమరు ఇంత నొప్పిలో సెలవివ్వవలసి వచ్చినది కదా అని మాకు దుఃఖమయినది,



మా కర్తవ్యమనే దీనిని మేము నిర్వర్తిస్తాము. ఇక మాకు ముదల దయచేయించండి." అని అభ్యర్థించినారు.

రాజమాత "సంతోషం. ఇప్పుడు మా హృదయం తేలికపడింది. ఇదే మొదటి శుభసూచన అని మేము నమ్మిక చెందుతాము." అని గంగరాజులవారిని, ప్రధానులను వీడ్కొల్పినారు.

## 5

పిదప రాజమాత వాసంతికాదేవి దర్శనానికి వెళ్ళినారు. దేవి ఆలయానికి ఇంతపొద్దుకు వస్తామని మొదలే ఇంద్రులవారికి చెప్పి పంపినారు.

వాసంతికాదేవి ఆలయపు ఇంద్రులవారు నాగపండితులు. ఎరెయంగ ప్రభువుల కాలంనుంచి వారు ఆ స్థానంలో ఉంటున్నారు. వాసంతికాదేవి హొయిసళరాజుల కులదేవత. హొయిసళ వంశం మూలపురుషుడు సళనృపతి. అతడు సుదత్తుడనే ఒక జైనముని శిష్యుడు. ఆ ముని వాసంతికాదేవి అనుగ్రహాన్ని వ్రతనియమ నిష్ఠలతో సంపాదించదలచి, తన గ్రామమయిన శశకపురంలోని దేవి ఆలయంముందు ఘోరతపస్సు ఆచరించేటప్పుడు, దేవత ఆ సిద్ధుని మనఃస్థైర్యాన్ని పరీక్షించడానికి ఒక బెబ్బులిరూపం దాల్చి ఈ గురుశిష్యులమీద దూకడానికి సిద్ధమయింది. ముని ఆ సమయంలోనే శిష్యుని ధైర్యం పరీక్షించదలచి, "పొయ్సళ!" (కొట్టు! సళా!) అని ఆజ్ఞాపిస్తూ, అతని చేతికి తనవద్ద ఉన్న లోహపు చామరదండం అందించినారట. "గురువుల ఆజ్ఞ" అంటూ ఆ శిష్యుడు ఆ బెబ్బులిని ధైర్యంతో ఎదిరించి, ఆ లోహదండంతోనే దాని తల పగులగొట్టినాడు. గురువూ, శిష్యుడూ శౌర్యపరీక్షలో ఉత్తీర్ణులయినారు, దేవి ఇద్దరినీ అనుగ్రహించినది,

శిష్యుని ధైర్యసాహసాలను, శక్తిశౌర్యాలను కండ్లారకనిన సుదత్తముని "ఇలాటి పౌరుషగుణాలు రాజుకు తగినవి. ఇతనిచేత ధర్మ రాజ్యస్థాపన చేయిస్తాను." అని నిర్ధరించి, అతనికి "నృపకాముడు" అనే కొత్త పేరుపెట్టి బెబ్బులినికొట్టి చంపినదానినే లాంఛనంగాచేసి, శశకపురాన్నే రాజధానిగా చేసినారు. ధనకనకవస్తువాహనాలను దేవి అనుగ్రహంతో సంపాదించి, సేకరించి, చుట్టుపట్టు జనాన్ని భక్తిశ్రద్ధలతో కొలిచేవారినిగాచేసి, సైన్యాలు కూడగట్టుకొని, నృపకామునికి 'మలపరోళ్‌గండ' (మలపలలో శ్రేష్ఠుడు) అనే బిరుదమిచ్చి హొయిసళ రాజ్యస్థాపన చేయించినారు.

ఈలాగు కులక్రమాగతంగా వచ్చిన వాసంతికాదేవి పూజను రాజమాత భక్తిశ్రద్ధలతో ఆచరించేవారు. వారు నేడు ఆచరించే పూజ ప్రార్థనలపూజ. నాగపండితులు ఆ నాడు అతిశయ దీపాలంకారాలు చేసి, పూజాసామగ్రిని సిద్ధపరిచినారు.

రాజమాత మేనా దేవిఆలయంముందు నిలిచింది. నాగపండితులు రాజమాతను భక్తిమర్యాదలతో గర్భగుడిలోపలికి పిలుచుకొనివెళ్ళి ఆ నాటి విశేషపూజలను వారిచేత చేయించినారు. మహామంగళహారతి జరుగుతున్నప్పుడు రాజమాత చేతులు మొగిచి, కన్నులుమూసి, మనస్సులోనే, "తల్లీ! రాజరాజేశ్వరీ! నీ బిడ్డ విఘ్నవర్ధనుని చేయిపట్టుకొని నడిపించు; వంశాభ్యుదయం అయ్యేటట్టు కరుణించు. ఈ కులరక్షణ నీది; ఈ రాజ్యం నీది. నీ సంకల్పానికి సూచన అన్నట్టు గడచిన శుక్రవారం నిన్ను దర్శించి, ప్రార్థనచేసి, అదేయోచనలో నగరుకు వెళ్ళుతున్న నాకు 'ఇదిగో, ఈమె నీ కోడలు' అన్నరీతిగా శాంతలను నా కట్టెదుటికి తెచ్చి చూపించినావు. ఆ కన్యనే మా యింటికి ఈ, తల్లీ! సంతోషంతో నా హృదయం నింపుకొంటాను; తాపంతో వేడెక్కిన నా ఒడలికి ఈ చలవనన్నా అనుగ్రహించు తల్లీ!" అని దీనాతిదీనంగా ప్రార్థిస్తుండగా, ఆమె కనుకొలకుల్లో నీరు నిండింది. నాగపండితులకు ఇది తెలియక పోలేదు. మంగళారతి అయినపిదప వారికి శేషం (ప్రసాదం) అర్పిస్తూ నాగపండితులు "రాజమాత మనోభీష్టాలు పూర్తి అవుతాయి. దేవి



వరదహస్తంలో ఉన్న ఈ పుష్పం తనంతటతాను శేషపుష్పాల పళ్లెరంలో దొర్లింది. దేవి వరమనే దీనిని గ్రహించదగినది." అనినారు.

రాజమాత దానిని అంజలిలో స్వీకరించి కన్నులకు అద్దుకొని, మనస్సులోనే "తల్లీ! నీ కరుణ అపారం. నీవు వరమిచ్చినావనే సంతోషంతో ఇంటికి వెళ్లుతున్నాను." అంటూ దేవికి పంచాంగ ప్రణామం చేసి, సంతోషస్వాంతులై నగరుకు మరలినారు.

నగరుకు తిరిగివచ్చిన వెంటనే తమ కుమారులను పిలిపించుకొని "అప్పాజీ, ఇప్పుడే వాసంతికాదేవి ఆలయంనుంచి వచ్చినాము. శేష ప్రసాదం తెచ్చినాము." అని దేవి వరదహస్తంలో అనుగ్రహించిన పుష్పప్రసాదాన్ని వారికి ఎంతో సంతోషంతో అందించినారు. ప్రభువులు సమ్మానగౌరవాలతో స్వీకరించి, కన్నులకు అద్దుకొని, "అమ్మా, ఇన్ని పనుల మధ్యనూ వ్యవధి చేసుకొని దేవిని దర్శించి వచ్చినారా? చాల సంతోషం. నాకు వెళ్లడానికి కాలేదని మనస్సు కరకరలాడేది. పెద్దలు వెళ్ళిరావడం నేనే వెళ్ళి రావడంకంటే మేలయింది. రేపు ఉపనయన మహోత్సవానికి ముందు వాసంతికాదేవి ఉత్సవమూర్తిని పూర్ణకుంభం, మంగళ ద్రవ్యాలు వహించిన సుమంగలీబృందంతో, బ్రాహ్మణబృందంతో కళ్యాణమంటపానికి సకల మర్యాదలతో, మంగళవాద్యాలతో విజయం చేయించాలని నాగపండితులకు తెలియచేయడం అయింది. అమ్మా, నేడు మీ ముఖంలో సంతోషం కానవస్తున్నది. నగరులో అందరూ చాల సంరంభంలో ఉన్నారు. మన నగరులో మంగళోత్సవాలు జరిగే చాల కాలమయింది కదూ! అన్నగారి పెళ్ళినాటి సంరంభం జ్ఞాపకానికి వస్తున్నది. అటు తర్వాత దుఃఖాలే మీదమీద మనపాలపడినవి కదూ! అమ్మా! మీ ముఖంలో సంతోషం చూచి ఎన్నో ఏళ్ళయింది. మీరు సంతృప్తి పడితే, మీరు నవ్వితే, మన బొక్కసం, భండారాలు పొంగుతాయి. ఇకమీదయినా వచ్చేనాళ్లు మనకు శుభాలు కలిగించని. అమ్మా, అర్ధరాత్రి అవుతున్నది. ఉదయం జరుగవలసిన పనులు వేయి ఉన్నవి. ఇక మీరు శయనించండి." అనినారు.

రాజమాత : "ఇలాంటి సంతోషదినాలలోను నాకు నిద్రపట్టదు. దుఃఖదినాలలో మొదలే నిద్రపట్టదు. కుమార విష్ణువును పెంచి పెద్ద చేయడం చూచి, మనరాజ్య ప్రజలేకాదు, పరరాజ్యవాసులూ మెచ్చేటట్లే అయినది. మంచి గురువుల సన్నిధికి విద్యకు విడువవలె. కుమారవిష్ణువు విద్యా వినయ సంపన్నుడయితే, శౌర్యవంతుడయితే, నీకు మహాకభుజం అప్పాజీ. మీ పూజ్య జనకుల కాలంలో చెన్నమదండాధీశులు ఈ రాజ్యానికి అమోఘమైన సేవచేసి, రాజ్యశ్రీని బహుముఖాలుగా పెంపొందించినారు. అలాటివారి పుత్రునికి మనం ఏమి చేసినా, ఎంత చేసినా కొంచెమే. పసి వానిని చూచి మాట్లాడించిన ప్రతివారికీ అతనిమీద ప్రీతి విశ్వాసాలు ఉబ్బివస్తాయి. అప్పాజీ, రేపు నీవే వటువుకు తండ్రివలె బ్రహ్మోపదేశం చేయవలసి ఉంటుంది. గురువులవారు ఆ విధంగానే సెలవిచ్చినారు. దీనిని తెలుపడానికే నిన్ను పిలిపించినాము. నగరులో మంగళోత్సవాలు జరిగి చాలకాలమయింది. అందువల్ల పట్టణంలోని నాగరకులను, అధికారులను ఉత్సవానికి ఆహ్వానించినాము. అందరూ వస్తారు. అందరికీ వారివారి అంతస్తుగౌరవాలకు తగినట్లు మర్యాదలు నడిపించవలె. అమాత్యులందరికీ అప్పుడే తెలియజేసినాము. ఈ విషయంలో నీవూ వారివెంట ఉండి లోపాలు, దోషాలు, అపచారాలూ కలుగకుండా చూచుకోవలె. 'వీడెంతో పోయిన గౌరవం వేయి పొన్నులిచ్చినా రాదు.' అనేది జ్ఞాపకం ఉంచేచాలు. వటువుకు యజ్ఞోపవీత ధారణం అయినమీదట వటువును పెద్దల, విప్రుల, అధికారులవద్దకు నీవే పిలుచుకొని వెళ్ళి నమస్కారం చేయించి, వారి ఆశీర్వాదాలు ఇప్పించవలసింది. అప్పాజీ, రేపటి సంతోషం కంటే లక్షపాళ్లు హెచ్చు సంతోషం త్వరలో మాకు కలిగించవలె. పతి దేవుని కోల్పోయి, ఒకరితర్వాత మరొకరన్నట్లు ఇద్దరు చెట్టంత కొడుకులను పోగొట్టుకొని, కడుపు తోబుట్టువులనూ పోగొట్టుకొనిన మాకు, ... అప్పాజీ ... ఒకే సంతోషం కలిగించేవాడవు కావలె. అన్ని కన్నకడుపుల ఆశ ఇంతే. నీకు వివాహమై ఒక్క కొడుకు కలుగనీ. ఇది లేకపోతే, నా మనస్సుకు నెమ్మది ఎక్కడిది?"

విష్ణువర్ధనులు : "అమ్మా, ఇంతటి సంతోషసమయంలో దుఃఖాలను ఎందుకు జ్ఞాపకం చేసుకుంటారు. మీ సంతోషానికే నేను పట్టం కట్టు



కొన్నాను; ప్రజల సుఖశాంతులకోసం కంకణం కట్టుకున్నాను. అన్న గారు ఉండిఉంటే .... అమ్మా .... వారి ఒక్కొక్క పసిపాపనూ మీరు ఒడిలో వేసుకొని ఆనందించి ఉండేవారు. నాకూ ఈ మీ నిర్బంధాలు, బలవంతాలు తప్పిపోయేవి. ముందు పలుమారు అన్నమాటలే మరల అననా? నరపతులని అనిపించుకొన్నవారికంతా అడుగడుగునా ప్రాణభయం ఉండనే ఉంటుంది. ఎవరి యుద్ధమో? ఎవరి ఖడ్గమో? ఎవరి బాణమో? ఏ విషయమో? ఎవరి ద్రోహమో? ... ... మీరు పదివేగారల దుఃఖం తెలియనివారా?"

"అప్పాజీ, ఇలాటి పిరికిమాటలు నీకు తగవు. వీరులు చావనే మాటను వాడరు; వాడరాదు. పైపై ముసురుకొనే సంకటాలు అనుభవించి, అనుభవించి, మా గుండె రాయయింది. 'ఇంతకంటే పెద్ద కష్టమేమిటి?' అన్నంతవరకు మనసు నొప్పిపడి, విసిగింది. సుఖానికి పొంగడం, దుఃఖానికి కుంగడం ప్రపంచ ధర్మం. సుఖాన్ని దుఃఖాన్ని సమభావంతోనే చూచే స్థితప్రజ్ఞులస్థితి మాకు సాధ్యంకాదు. పెద్దలు కట్టినడిపిన రాజ్యం నీ అనంతరం సమర్థులయిన నీ రక్తం వారికే చేరవలె. ఇతరులచేత ఓడడంవల్ల ప్రజాక్షోభ కలుగవచ్చు; ధర్మక్షోభ కలుగవచ్చు. ప్రజలను న్యాయ ధర్మమార్గంలో నడిపించి లోకక్షేమంకోసం సామ్రాజ్యాలను కట్టుకొని ఏలిన శిబి, యయాతి, పురు, మాంధాతృ చక్రవర్తులు ఇప్పుడు లేరు. ఉన్నవి పొతరించిన దున్నపోతులు; లేక బెబ్బులులు. మన బిడ్డలవలె ఉన్న ప్రజలు వాటి వాత పడగూడదు."

"అమ్మా, మీ మనస్సు చాల నొచ్చింది. తట్టుకోలేనన్ని దుఃఖపరంపరలు అనుభవించి, ఒకే ఒక్క ఆశతో ఇంతవరకు ప్రాణాలు బిగబట్టుకొని నిలుపుకొని ఉన్నారు. ఇవన్నీ తెలియనివాణ్ణి కాను. కన్నవారందరికీ తమ బిడ్డలు సుఖసంతోషాలలో, కీర్తితో, దీర్ఘాయుస్సుతో జీవించాలనే ఆశ ఉండనే ఉంటుంది. కన్నతండ్రికి తాను విత్తిన నేల, కట్టిన ఇల్లు, పెంచిన పశువులు, సంపాదించిన ఐశ్వర్యం పాల్లుకాగూడదు; వృద్ధికావలె; పిల్లలు సమర్థులుకావలె. ఇంటిపేరు నిలవవలె. అనే ఆశ ఉండనే ఉంటుంది. పూజ్యులయిన నా జనకులు ఇహలోకం త్యజించి

పోయేటప్పుడు సహగమించడం మీ ధర్మమే అయినప్పటికీ, మమ్ములనందరినీ పెంచి పెద్దచేయడం మించిన కర్తవ్యమని జీవాన్ని మా కోసం మీరు కట్టినారు. పట్టంకట్టుకొన్న అన్నగారు పరలోకానికి వెళ్ళినమీదట ఈ రాజ్యరక్షణకు నేను పట్టం కట్టుకోవలసి వచ్చింది. దేహసుఖాదులకు నా మనస్సు ఎడమీయలేదు. ఇది మీకు తెలియనిది కాదు. ఇంత అగాధమైన రాజ్య సంసారాన్ని నేను కట్టుకొన్నది చాలదా? రాజ్యం ఉత్తరోత్తర రక్షణాభివృద్ధులకు సమర్థులయినవారు కావాలనడం నాకు తెలియదా? అమ్మా, కుమారవిష్ణువు మన కుమారుడు కాదా? రూపగుణధైర్యసాహసాలలో వాడు తక్కువా? కుమారవిష్ణువుకు యౌవరాజ్యాభిషేకం చేస్తే సరి.”

“అప్పాజీ, నీ హృదయౌదార్యం మేరలేనిది. కుమారవిష్ణువు మన బుడుతడే, నిజమే. అయితే ఆరీతిగా యౌవరాజ్యపట్టంకట్టే నీతిని రూఢికి తేవడం మన వంశోద్భవులు లేకపోయినప్పుడు మాత్రమే. అలాటి సందర్భమేమీ ఇప్పుడు సంభవించలేదు. హొయిసళ రక్తమే అడుగంటిపోయినప్పుడు వేరేమాట ... అప్పాజీ, కటువుగా మాట్లాడి పూవువంటి నీ హృదయాన్ని నొప్పిస్తున్నానని భావించరాదు. నీకు పెండ్లిచేసి, సంతతిని కలిగించుకొనడం తల్లి అయిన మా కర్తవ్యం. ఇన్నాళ్ళూ నీ వంటున్న ‘వద్దు’ అన్నమాట ఇక వద్దు. నీకు సతిఅయి, ఇంటికి కోడలయి సింహాసనానికి తల్లి అయ్యే సౌభాగ్యవతి ఎవరయినా నీ మనస్సులో ఉంటే తల్లికి సంకోచం లేక తెలుపు. పరదేశాల పిల్లలను తెస్తే చాల ఇడుమలు పడవలసి వస్తుంది. దానికి నేనే సాక్షి. గంగరాజులుంగారు నన్ను తెచ్చి నీ తండ్రిగారికి వివాహం చేసిన పిదప, దానివల్ల కలిగిన చిక్కు చీదరలను గంగరాజులుంగారే పరిష్కరించవలసి వచ్చింది. ఇంకెవరికీ సాధ్యమయ్యేదికాదు. దైవవశాత్తు నాకు పుట్టినింటికంటె మెట్టిన యింటిమీదే ప్రీతి పెరిగింది. మొత్తంమీద చెప్పవలసివస్తే మన సీమ బాలికే మనకు మేలు. ఇది అనుభవైకవేద్యం. హెచ్చు చెప్పవలసిందేమున్నది? ఇక కాలంగడిపి, సమాధానంచెప్పే మాటే వద్దు. నీకూ పెండ్లివయస్సు మీరరాదు గదా! ‘కన్నతల్లే కనుక్కోలేదు; పిల్లలకు



తెలియజెప్పలేదు.’ అనే దోషానికి నన్ను గురిచేయవద్దు. గంగరాజులవారు నీ వివాహ విషయమై పలుమారు నాతో ప్రస్తావించినారు. మేము నీకు హితవు చెప్పడంలేదనే వారి ఆరోపణం. ‘కడుపున బుట్టిన కొడుకులు తల్లిమాట వినరా? ఇంత దొడ్డరాజ్యం ఎవరిపాలు చేసి వెళ్ళడం?’ అని గంగరాజులవారు అంటున్నారు. మన ప్రజలను మనం కాపాడకపోతే కటికవారి చేతికి అప్పగించినట్లే. దుష్టులయిన పాళెయగాళ్లు, ద్రోహులయిన సామంతులు పెచ్చుపెరిగి పోతున్నారు. ఈ రాజశ్రీని దోచుకొనడానికి పొంచి ఉన్నారు. మారసింగమయ్య దండనాయకుల నేతృత్వంలో మన సుసన్నద్ధమయిన సైన్యాలు సమర్థతలో దేశాన్ని రక్షిస్తున్నవి. దేవతలందరూ మనల్ని రక్షిస్తున్నారు. సకాలానికి వానలు పడి, పంటలు పండి, ప్రజలూ దైవభక్తి గలవారయి, ధర్మిష్ఠులై సంతోషంలో ఓలలాడుతున్నారు. ‘హొయిసళ రాజ్యం, రామరాజ్య’మని జనులు అనుకోడం నేను చెవులార విన్నాను. అప్పాజీ, నీ యశస్సు, ధర్మగుణం, ఉదారత, రాజనీతి, న్యాయాన్యాయ విచక్షణం, క్లిష్ట సన్నివేశాలలో సమయోచితమైన బుద్ధి, ఇవన్నీ నాకెంతో ముచ్చటగొలిపినవి; సంతోషం కలిగించినవి. అయినా ఇంత విశాలమయిన రాజభవనంలో ఒక్కనుత్తైరువు లేకపోవడం అన్ని సంతోషాలనూ మెట్టివేసిసట్టున్నది. అప్పాజీ, నాకోసం, ఈ రాజ్యంకోసం నీవు వివాహానికి ఒప్పుకోవాలి. . . .”

రాజమాత ఈవిధంగా మాటలాడుతున్నప్పుడు కన్నీరు ధారగట్టింది; కంఠం గద్గదమైంది. దానిని చూస్తున్న ప్రభువులకు గుండె నీరైంది. తటాలున తమ ఉత్తరీయంలో తల్లి కన్నీరు తుడిచి, “అమ్మా, కూడదు, కూడదు. కన్నీరుకూడదు. మనసును సమాధాన పరచుకోండి. మీమనస్సుకు సంతోషం కలుగనీ అని నేను వివాహంచేసుకుంటాను. మీరు ఇంతగా సెలవిచ్చినప్పుడు నేను ‘ఒల్ల’ అనలేను. అమ్మా! సంతోషదినం కన్నీరు తెచ్చుకున్నారే అని నాకు దుఃఖం కలుగుతున్నది. మీకు నచ్చిన పిల్లను కోడలుగా చేసుకొని ఇంటిని నిండుగా చేసుకోండి. మీ ఎన్నిక నాకు పూర్తిగా సమ్మతం. ఈ భారం నామీద పడవేయవద్దు. ఈ విషయాలలో పురుషులకులేని ఒకానొక విశేషవిమర్శశక్తి స్త్రీలకు ఉంటుంది. ఇక సమాధానం తెచ్చుకోండి.” అన్నారు.

ప్రభువుల అంగీకారవాక్యాలు విని రాజమాత ఆనందబాష్పాలు దుఃఖాశ్రువులలో కలిసి గంగాయమునలయినవి. ప్రభువులు "మరల ఇదేమి సంకటం!" అనుకుని, "అమ్మా, నేను ప్రార్థిస్తున్నాను; ఇక కన్నుల నీరు నించరాదు. అది నాకు శ్రేయస్సు కాదు." అన్నారు. రాజమాత "అప్పాజీ, ఇది కన్నీరుకాదు. నీ మాటలకు హృదయం పొంగివచ్చిన సంతోషం." అంటూ రెండు చేతులూ చాచి తనయులను గుండెకు అదుము కొని సంతోషపడినారు.

# 6

విజయసింహాసనపు ఓలగపుసాలలో వడుగుపనులు చేస్తున్న నగరు ఊడిగపువారికి అర్ధరాత్రి అయినా, పొద్దుగడచినట్టు అనిపించలేదు. అంత ఉత్సాహంలో వేకువజామునుంచి పనిచేస్తూనే ఉన్నారు.

శిల్పులు దేవోజు, నాగోజు, పద్మోజు, కేలోజు, బమ్మోజు,—వీరు ఒక్కొక్కరూ స్వర్గకైలాసాలను, అమరావతిని, అలకాపురిని, ఓలగపు సాలకు దింపినట్టు తోచింది. అక్కజమైన చెక్కడపు పనితనాన్ని చూపించినారు. దివ్యసుందర దేవతా విగ్రహాలను, గంధర్వవిద్యాధరాప్సరో విగ్రహాలను మనస్సును మోహింపజేసేటట్టుగా నిర్మించి సభాంగణం అలంకరించినారు.

అర్ధరాత్రి గడచి మరునాటి తెల్లవారుజాము కావస్తున్నా సభా మంటపాలంకారాలు ముగియలేదు. తుట్టతుది అలంకారాలు - పచ్చతోరణాలు కట్టడం, మధ్యమధ్య రంగురంగుల పూవుల రచన, పెద్ద ఆకులలో, వేలాడే పండ్ల గెలలతో కనులవిందుగా ఎత్తయిన అరటి కంబాలు నిలపడం-కొనసాగుతూనే ఉండినవి. అక్కడక్కడ ఎర్ర నారికేళాలు, మాతులుంగాలు, దానిమ్మలు, నారింజలు మొదలయిన పండ్లు గుత్తులు గుత్తులుగా, అతిరమ్యంగా కట్టినారు.



గంగరాజ మహాప్రధానులూ, హేమాద్రి పండితులూ కొంతసేపు కునికి లేచి, ప్రాతర్విధులను, స్నానాదులను పూర్తిచేసి, ఉత్తమ వస్త్రభూషణాలంకృతులై ఓలగసాలకు విచ్చేసినారు. అన్ని అలంకారాలు మహోదాత్తంగా జరిగి ఉండడంచూచి, మెచ్చి, "దివ్యంగావుంది. అమోఘంగా ఉంది. ఈ పొద్దు ఇక్కడ పనిచేసినవారికందరికి రెట్టింపు వేతనం బహుమానమని ప్రభువులు ఆజ్ఞాపించినారు. మీరంతా రాత్రెల్లా పనిచేసినారు. ఇప్పుడు తెల్లవారుతూ వచ్చింది. ఇక నిద్రకు అవకాశం సర్వథా లేదు. మీ యిండ్లకువెళ్ళి స్నానాదులు పూర్తిచేసి, ఉడుపులు ధరించి, ఇక నాలుగు గడియలలోగా మీమీ స్థానాలలో సిద్ధంగా ఉండవలె." అని ఆజ్ఞాపించి, ఊడిగపువారిని పంపివేసినారు.

గంగరాజులుంగారి విచక్షణలో ఆహూతులందరికీ సుఖాసనాలు ఏర్పడినవి. మొదట రాజబంధువులుకు, తర్వాత అమాత్యులుకు, సేనాధిపతులకు, దండనాయకులకు, నాయకులకు, న్యాయాధీశులకు, నగరపాలకులకు, ఉద్యోగులకు, వణిజులకు, మహాజనులకు, వారివారి కుటుంబాలకు వారివారి స్థానమానాలు గుర్తెరిగి, లోపదోషాలకు అవకాశంలేకుండా ఏర్పాట్లు జరిగినవి. బ్రాహ్మణులకు, వేదాధ్యయన సంపన్నులకు, పండితులకు, గురుపీఠమువారికి, పురోహితులకు వేదికమీద స్థానాలు ఏర్పాటయినవి.

గంగరాజులుంగారు ఇవన్నీ పరిశీలిస్తున్నప్పుడు అరుణోదయమయినది సూచించే విజయ సింహాసన సభాభవన ప్రభాత మంగళవాద్యాలు మోగినవి. తరుణారుణ కాంతులలో రంజితమయిన ఆ ఓలగపుసాల అప్పుడు పరమేశ్వరుని కనకసభవలె కనులవిందయినది.

అంతలో కుక్కుట సర్పవాహన అయిన వాసంతికాదేవి ఉత్సవమూర్తి ఆలయంనుంచి సకలమంగళ మర్యాదలతో బయలు వెడలినదని సూచించే మంగళవాద్య నినాదం వినిపించింది. ఊడిగపువారు, అవసరికులు, గణాచారులు, విచ్చుకత్తులవారు, అశ్వికులు, గజసైనికులు, పదాతిసైనికులు తమతమ స్థానాలలో వచ్చి నిలుచున్నారు.

పురంధ్రీమణులు శాంత్యుదకపూర్ణమైన సువర్ణకలశాలలో, మంగళ ద్రవ్యాలలో వివిధ మంగళవాద్యాలు మోగుతుండగా, సింహాసన సభా మందిరం ప్రవేశించి, యజ్ఞవేదికకు, విజయసింహాసనానికీ ప్రదక్షిణం చేసినారు. పురోహితులూ, వేదాధ్యయన సంపన్నులూ, కులగురువులూ స్వస్తి వాచనాలు పఠిస్తూ సభామందిరం ప్రవేశించినారు. వాసంతికాదేవి ఉత్సవ మూర్తిని సింహాసన దక్షిణపార్శ్వంలో అలంకృతమైన స్థానంలో విజయం చేయించినారు. దేవికి షోడశోపచార పూజలు సమర్పించినారు.

ఇంతలో హొయిసళేశ్వరులు విజయం చేస్తున్నారనడానికి సూచనగా రాజలాంఛనాలు పట్టుకొన్న భటుడొకడు రాజద్వారం నుంచి ఓలగ శాలలో ప్రవేశించినాడు. సభవారందరూ మర్యాదతో లేచి నిశ్శబ్దంగా రాజాగమనాన్ని ఎదురుచూస్తూ నిలుచున్నారు.

అప్పుడు వందిమాగధులు చేతనున్న స్వర్ణవేత్రాలు పైకెత్తి, "రాజ రాజమార్తాండ! నిశ్శంక ప్రతాప! సాహసగంగా విక్రమతుంగ! త్రిభువనమల్ల! శ్రీ వాసంతికా పాదసరోరుహభృంగ! శ్రీ శ్రీ శ్రీ విష్ణు వర్ధన హొయిసళేశ్వరదేవ! ఉఘే! ఉఘే!" (జయ! జయ!) అని ఘోషించినారు. గజరాజి ఘీంకరించినది; తురగపంక్తి హేషారవం చేసింది. పంచమహావాద్యాలూ మ్రోగినవి. విప్రోత్తములు ఆశీర్వదించడానికి ముందుకు వచ్చినారు.

ఆ సమయంలో స్వర్ణసింహాసనం దక్షిణ పార్శ్వంలో ఉన్న రజత ద్వారం తెరుచుకొంది. మంగళ సూచకమైన సువర్ణాక్షతలు చల్లుతూ రాజపురోహితులవారు ముందుగా వచ్చినారు. వారి వెనుక కుమారవిష్ణువును చేయిపట్టుకుని నడిపిస్తూ హొయిసళేశ్వరులు ప్రవేశించినారు.

వటువు మంగళకరమైన హొంబట్టు పీతాంబర మధుపర్కం ధరించినాడు. మేనిఛాయ రక్తవర్ణయుతగౌరం; కంఠంలో రత్నఖచితమైన సువర్ణమాలిక; ముఖంలో, మనస్సులో, 'నాకోసం ఇంతమే సంరంభం!' అనే లజ్జ; విశాలమైన, కాంతియుతమైన కన్నులకు కనపడీ కనపడనట్టు



కజ్జలరేఖ! భుజాలమీదుగా జీరాడే నొక్కునొక్కుల శిరోజాలు; వయస్సు పన్నెండు సంవత్సరాలు; వయస్సుకు మించిన పెరుగుదల; నడకలో, చూపులో గాంభీర్యం. నడుస్తూ నడుస్తూ మెడయెత్తి అప్పుడప్పుడు ముఖం పరికిస్తాడు; కనుచూపుమేర వరకు నిండిన మహాసభపై చూపు సారిస్తాడు; పరిచితమైన ముఖం కనిపిస్తే చిరునవ్వు నవ్వుతాడు.

విష్ణువర్ధన ప్రభువులు విశేష భూషణాలంకారాలు లేకనే, రత్న పాదరక్షలు ధరించకనే వేంచేస్తున్నారు. లేత పసుపురంగు పట్టువస్త్రం ధరించి, నడుముకు నీలపు పట్టువస్త్రం బిగించినారు. కంఠంలో ధగ ధగలాడే వజ్రవైడూర్య హారం, చెవులలో వెలుగులు విరజిమ్మే కుండలాలు, రెండు భుజాలకు రత్నఖచితమైన బుజబందులు, మణికట్టులకు మరకతాలు పొదిగిన కంకణాలు, భుజాలవరకు అలలవలె చుట్టుకొని ప్రవహిస్తున్నట్టున్న కుంతలాలు, మత్తవేదండశుండాల సౌష్ఠవం గెలిచే బాహుయుగం, విశాలోన్నతవక్షం, ముఖానికి మగసిరి కలిగించే నూనూగు మీసకట్టు, వీరత్వం ఉట్టిపడే ముఖం, పుష్పకోమలతను పోలే నయనాలు, దేహపుష్టిని సూచించే నిండైన కుత్తుక, దేవతాపురుషుని నిలువు, మందస్మితం చిలకరించే రంగైన మెత్తని పెదవులు, మనస్థైర్యాన్ని నిరూపించే కపోలాలు – ఈ సకల సౌభాగ్య పురుషలక్షణాలు వరించిన హొయిసళేశ్వర విష్ణువర్ధనులు ప్రద్యుమ్నునివలె ఉన్నారు.

రాజపురోహితులవారు ప్రభువులను వటువును వారికోసం ప్రత్యేకంగా ఏర్పరచిన సుఖాసనాలకు పిలుచుకొని వచ్చినారు. సభామందిరం "ఉఘే! ఉఘే! హొయిసళేశ్వర!" అనే విజయనాదంతో, కరతాళ ధ్వనితో, హర్ష నినాదాలతో ప్రతిధ్వనించింది. వారిద్దరూ ఆసీనులయినారు.

ఇద్దరు కట్టడి ముత్తైదులు ముందుకువచ్చి, యజ్ఞవేదిక చుట్టూ పుష్పాలు, హరిద్రాక్షతలూ ఉంచి, వటువు ఫాలాన్ని కుంకుమరేఖతో అలంకరించి, ప్రభువుల ఫాలాన్ని కుంకుమతో అలంకరించడానికి అడుగు

వేయగా, ప్రభువులు లజ్జతో తలవంచుకోనడం చూచి, వారిలో ఒక్క అరుంధతి, తల్లి కుమారుణ్ని ప్రీతితో సంబోధిస్తున్న రీతిగా, "అప్పాజీ వారు తలయెత్తి కుంకుమబొట్టు పెట్టించుకోవలె" అన్నది. మంత్రముగ్ధులయిన రీతిగా ప్రభువులు తలయెత్తినారు. ఆ వృద్ధ బ్రాహ్మణి మందహాసం ఒలికిస్తూ, ప్రభువుల భ్రూమధ్యం కుంకుమతో అలంకరించి "అప్పాజీవారు ఆగ్రహించరాదు. ఇది మంగళచిహ్నం. మీరు మంచి కుమారులు. నేను మీతల్లివలె" అని చెప్పి తన స్థానంలో కూర్చున్నారు.

ఆ గుంపులోని ముత్తైదులంతా ఆమె గట్టితనానికి మెచ్చి, "గౌరవ్వగారూ, మా తల్లి! మీ ధైర్యం ఎవరికుందండీ! రాజుగారినే 'తల ఎత్తండి' అని అన్నారే." అని పొగడినారు. గౌరమ్మ మృదువుగానవ్వి, "పసిపాపవంటి హృదయం వారిది. మంచి పుణ్యాత్మురాలిని చేపట్టి నూరేండ్లు రాజ్యమేలి మన లందరినీ కాపాడనీ" అని ఆశీర్వదించినారు. ఆ నాటి నుంచి ఆ మహాతల్లి గౌరమ్మను "ఏమండీ, మీకుమారులు కుశలమా ?" అని పరిచితులైన ముత్తైదువులు గేలిచేస్తూ పలుకరించేవారు.

గౌరమ్మ ఆనాడు తన యిల్లుచేరిన తర్వాత, మధ్యాహ్నత్పరం, అంతఃపురపు అవసరికుడొకడు ఒక పెద్ద వెండిపళ్ళెరంలో ఉత్తమ చీనాంబరం, వక్షోవస్త్రం, ముత్తైదు సావిత్రి అలంకారాలు, వెండి బరణెలలో కుంకుమ, పసుపు, చందనం, తాంబూలం - ఇవన్నీ తెచ్చి "అప్పగించిరా అని ముదల అయింది." అని మనవిచేసి అప్పగించి నమస్కరించి, నగరుకు మరలిపోయినాడు.

అదంతా చూచి గౌరమ్మకు ఊపిరి కట్టిపోయినట్లయింది. ఆనందంతో పళ్ళెరం లోగిలిలోకి తీసుకొనిపోయి చూచినారు. అవరోధ స్త్రీలు మాత్రం ధరించడానికి యోగ్యమయిన కుంబట్టు పుట్టం చూస్తూ, దానిని పైకి ఎత్తినప్పుడు అడుగున ఒక కమ్మ కనిపించింది. దాని వక్కణమిది: "మాతృశ్రీ వారికి కుమారుని ధన్యప్రణామాలు...విష్ణువర్ధనుడు." దానిని చదివి గౌరమ్మగుండె ఆగిపోయినట్లయింది. "అప్పాజీ, తలయెత్తండి..." అనిన ముత్యాలవంటి మాటలకు మన్ననయిది.

# 7

కల్యాణమంటపంలో హవనహోమాదులు సాంగంగా జరిగినవి. వటువుకు మౌంజీబంధనం, యజ్ఞోపవీతధారణం, బహ్మోపదేశం అయినవి.

పురోహితులవారు ప్రభువులచెవిలో గుసగుసగా చెప్పిన గాయత్రీ మహామంత్రాన్ని ప్రభువులు వటువు చెవిలో ఉపదేశించినారు. ప్రభువుల నుంచి విన్న ఆ మహామంత్రాన్ని వటువు స్వరోచ్చారణ పూర్వకంగా సిద్ధింపజేసుకొనినాడు. తర్వాత మహాశీర్వాదం, శాంతి ప్రవచనం జరిగినవి.

అనంతరం వటువు అగ్నికి ప్రదక్షిణంచేసి, నమస్కరించి, గురు పురోహితులకు, పితృసమానులయిన ప్రభువులకు, సాష్టాంగ ప్రణామం ఆచరించి, సమీపంలోనే సుఖాసనంలో ఆసీనులై సంతోషంలో ఉత్సవ కార్యక్రమం తిలకిస్తున్న రాజమాతవద్దకు వచ్చి సాష్టాంగంగా ఎరగి, భుజానికి తగిలించుకొన్న జోలెను చాపి "భవతి! భిక్షాందేహి !" అనినాడు. రాజమాత మురిసిపోతూ రజతపాత్రలో బియ్యం నింపి, నింపి వటువుజోలెలో పోసినారు. తరువాత వటువును రెండుచేతులలోను దగ్గిరికి లాగుకొని గాఢంగా కౌగిలించుకొని, శిరస్సు ఆఘ్రాణించి, పాల బుగ్గలను మృదువుగా తడుతూ "మహావిష్ణువువలె కమ్ము నాయనా!" అని ఆశీర్వదించినారు. సభవారంతా ఆనందంలో హర్షధ్వానాలు చేసినారు.

పిమ్మట వటువు గంగరాజలుంగారికి, ఇతర ప్రధానులకు, రాజ బంధువులకు నమస్కారంచేసి ఆశీస్సులు పొందినాడు.

గంగరాజ ప్రధానామాత్యులు తమ ఆసనంనుంచి యజ్ఞవేదిక సమీపానికివచ్చి, సభవారికి వందనంచేసి, సభవారిని ఉద్దేశించి, "మహాజనులు సావధానంగా నా విన్నపాన్ని ఆలకించవలె. ఈ ఉత్సవ సమయంలో ప్రభువులు వటువు పూజ్యజనకులు శ్రీ చెన్నమదండాధీశులను, పూజ్యమాత మహాసతి చందలదేవిగారిని స్మరించి, వారు పొందిన 'ఇమ్మడి

దండాధీశ' నాయకత్వాన్ని, దానికి చెల్లే సకల మర్యాదలను వటువుకు అనుగ్రహించినారు. వటువు పూజ్యజనకులు మనదేశానికి ఎంత ఉత్తమ సేవ చెల్లించినారో, దానికి ఇమ్మడిగా సేవ చెల్లించడానికి కుమార విష్ణువుకు ధైర్యసాహసాలను, ఆయురారోగ్యాలను భగవంతుడు కటాక్షించనీ - అని ప్రార్థనచేసి, మీ మా అందరి కుమారుడయిన విష్ణువుకు ప్రభువులు దయచేసిన ఈ సువర్ణదండాన్ని అప్పగిస్తున్నాను. దీనికి మహాజనుల అనుమతి కోరుతున్నాను.'' అనినారు. సభవారందరూ మహానందంతో ''ఉఘే! ఉఘే! ఉఘే! (జయ జయ జయ) విష్ణువర్ధన మహీపాల! ఉఘే కుమారవిష్ణు! ఉఘే'' అని ఎలుగెత్తి నినదించినారు. గంగరాజులవారు రెండు సింహ శిరస్సులు పిడిపై తీర్చిన సువర్ణదండాన్ని వటువుకు ప్రభువుల పక్షాన, ప్రజలపక్షాన అప్పగించినారు. వటువు దానిని ఆదరంతో, సంతోషంతో దోసిలి ఒగ్గి స్వీకరించి, కండ్లకు అద్దుకొని, సింహాసన సమీపానికి తీసుకొనివెళ్ళి, సింహాసనపు మొదటిపాద పీఠంపై పెట్టి సాగిలిపడినాడు. అలాగుచేయడంలో ''నా ప్రాణాలు, సేవ అన్నీ రాజ్యానికీ, రాజుకు అర్పణం'' అన్న అర్థం వ్యక్తమయింది.

గంభీరమూ, కులసంపన్నతకు అనుగుణమూ అయిన ఈ మహోదాత్త ప్రవర్తనకు గంగరాజులుంగారు మొదలు అక్కడ సమావిష్టులయిన వారందరి హృదయాలు ఆనందంతో ఉప్పొంగినవి. వటువును జర్రున లాగుకొని కౌగిలించుకొందామనిపించింది అందరికీ! మహా సంతోషంతో ''కుమారవిష్ణువు యోగ్యుడైన పుత్రుడు, బుద్ధిమంతుడు, సత్త్వశాలి'' అని ఘోషించినారు. ప్రభువులకు, రాజమాతకు, గంగరాజులుంగారికి కన్నుల నుంచి ఆనందబాష్పాలు ధారకట్టినవి.

వటువు అంజలిఘటించి సదస్సుకు వినయంతో నమస్కరించినాడు. సభవారికందరికీ వటువు కనిపించనీ అని ప్రభువులు అతనిని తమ రెండు చేతులతోను తేలికగా పైకి ఎత్తి పట్టుకొనినారు. వటువు సిగ్గులో తలవంచి సభకు మరొకమారు నమస్కరించినాడు.

సదస్సులో ఫలతాంబూలాలు ఇస్తున్నప్పుడు గంగరాజ మహామాత్యులవారు ఘుంఘునడవగా, రెండడుగులు వెనుకగా వటువును నడిపించు



కొంటూ ప్రభువులు, వారివెంట హేమాద్రి పండితులు, ఇతర సచివులూ, సభలోని రాజ్యాధికారుల, మహాజనుల ఆశీస్సులను వటువుకు ఇప్పిస్తూ కదలివెళ్ళినారు. ''వీరు దేవశక్తి పండితులు, మన గురువర్గంవారు. నమస్కారంచేయి....వీరు దేవశక్తి పండితుల జ్యేష్ఠపుత్రులు విద్యాభరణ పండితులు...వీరు వారిపత్ని పద్మలాదేవిగారు. నమస్కరించు ... వీరు తేజోరాశి పండితులు, వీరిపత్ని బాగణబ్బెగారు, ఆశీర్వాదం స్వీకరించు... ఈ పెద్దలు ధర్మరాశి పండితులు. వీరి తమ్ములు క్రియాశక్తి పండితులు. అభివాదనంచేయి. ఈ విప్రశ్రేష్ఠులు జనార్ధన పండితులు. త్రికాలజ్ఞులు, ప్రణామంచేయి...వీరు పెరుమల పండితులు. మహాయోగులు. మన గురువర్యులు, వీరు నిన్ను చక్కగా ఆశీర్వదించనీ ... వీరు నాగభట్ట వైయాకరణులు, వీరిపత్ని పద్మాసనీదేవిగారు. అనుగ్రహంపొందు...వీరు మీ దేవ సర్వాధికారులు, వీరిపత్ని నాగలదేవిగారు, సాగిలపడు...వీరు అచ్యుత ధర్మాధీశులు, వీరిపత్ని శ్రీమతీదేవిగారు. వందనంచేయి...వీరు మాధవ దండనాయకులు, విప్రవర్యులు. ధనుర్వేదం వీరు దానమిస్తేనే కద్దు. నమస్కారంచేయి. నిన్ను వీరు చక్కగా అనుగ్రహించనీ...''

ప్రభువులూ, గంగరాజులవారూ ఈ విధంగా వటువుకు తమ రాజ్యశ్రీలను పరిచయంచేయిస్తూ, వారినుంచి ఆశీర్వాదాలు అనుగ్రహింపజేస్తూ, ముందుకు సాగిపోతూ, మారసింగమయ్యగారున్నచోటికి వచ్చినారు.

## 8

శాంతల ముందొకసారి రాచనగరుకు వచ్చినప్పటికీ విశాలమై, వైభవోపేతమై, వస్త్రాభరణ భూషితులైన మహా జనులలో, అధికార వర్గంతో కిటకిటలాడే ఓలగసాలను చూడలేదు. పురాణాలలో చదివిన మహేంద్రుని సభాభవనానికి దీటువచ్చే ఆ హొయిసళ రాజేంద్రుని సభాభవనంచూచి దిగ్భ్రాంతురాలయింది. భావుకురాలు, రసాత్మిక అయిన

ఆమె తన తలిదండ్రులతోపాటు మహా వైభవోపేతమయిన రాజసభలో అడుగుపెట్టగానే ఆమెకు ఒళ్లు పులకించింది. ముమ్ముందు రాగల మంగళాలకు సూచనవలె, అప్పుడు మంగళవాద్యాలు మోగినవి. పురంధ్రీమణులు ఎదురు వచ్చినారు.

ఈ మంగళోత్సవానికి శాంతల తన ప్రియసఖి లక్ష్మినికూడ తనతోపాటు పిలుచుకొని వచ్చింది. లక్ష్మి తండ్రిగారు వేదికమీద విద్వద్గోష్ఠిలో ఆసీనులయి ఉన్నారు.

ఆనాటి ఉత్సవానికి ఆహ్వానం వచ్చినట్టు శాంతలకు వెనుకటినాడే తెలుసు. తల్లి మాచికబ్బె అన్నారు: "అమ్మాయీ, రేపు తెల్లవారకమునుపే లేచి మజ్జనం ముగించి, శారదను పూజించి, నీ మనమెచ్చిన పట్టుచీరలు, నగనట్ర ధరించి సిద్ధంగా ఉండు. ముహూర్తసమయానికిముందే నగరులో ఉండవలె" అని.

శాంతల ఆరాత్రి త్వరగా శయనించింది; నిద్రపట్టలేదు. జాములు గడిచినా నిద్రరానేలేదు. తెల్లవారడానికి ఇక కొంత పొద్దు ఉందనగా, చిన్న కునుకుపట్టింది. కళ్లు మూసుకోగానే, అందమైన కలకన్నది.

తను నిద్రలో ఉన్నట్టే ఆకాశంనుంచి ఇద్దరు దేవవనితలు దిగివచ్చి శయనించిన తనను మంచంతోపాటు ఒకానొక సుందర దివ్యలోకానికి ఎత్తుకొని వెళ్ళినారు. అక్కడ తనకు మెలకువవచ్చింది. తాను అక్కడికి ఎందుకు ఎలాగు వచ్చినానని ఆశ్చర్యమయింది! భయం కలుగలేదు. తాను ఒక రమణీయమైన ఉద్యానంలో ఉన్నట్టు తెలుసుకొన్నది. పక్కనే పుత్తడి బొమ్మలవంటి ఇద్దరు దేవ సుందరులు మందహాసంచేస్తూ నిలబడి ఉండడం చూచింది.

వారు తమ సుకుమార బాహువులతో శాంతలను మేల్కొలిపారు. వారి మందహాసం, వినయం, ప్రేమ పూర్ణనేత్రాలు, పరిసరాల ప్రశాంతత-వీటన్నిటివల్ల తనకు 'ఈ సురసుందరీమణులు నా శ్రేయోభిలాషిణులే' అన్న విశ్వాసం ఏర్పడింది. చుట్టూ పరికించినది, తాను ఉన్న ఉద్యానం



నందనోద్యానంవలె ఉన్నది. సమయం వసంతకాలంవలె ఉన్నది. లతలు, వృక్షాలు ఎర్రటి తలిరుటాకుల ఉడుపులతో శోభిస్తున్నవి. కొన్ని పుష్ప వృక్షాలు పుష్పభారంతో ఆయాసపడుతూ సౌరభంలో రొప్పుతున్నవి. బాల భాస్కరుడు పూర్వాకాశంలో మహాబింబంగా ఉదయిస్తున్నాడు. ఇలాటి ఉదయరవి చంద్రికను శాంతల ముందెప్పుడూ అనుభవించలేదు. బాలసూర్యుని శీతల కిరణాలు అప్పుడప్పుడే విరియబారుతూ తెల్లతామరలకు బంగారు మెరుగులు పెడుతున్నవి. మృదువుగా వీస్తున్న చల్లనిగాలి రాత్రంతా నిద్రలేక వేడెక్కిన శాంతల కోమలాంగాలను తనియింపజేసింది. ఇదేమిటి స్వర్గమా! ఇంద్రుని నందనమా!—అని శాంతలకు భ్రమ కలిగినది.

ఆ దేవభామినులు శాంతలను లేపి, సుందరస్నానాగారానికి పిలుచుకొని వెళ్ళినారు. నాత్యుష్ణమూ, నాతిశీతమూ అయిన దివ్యపరిమళభరిత నిర్మలోదకంలో శాంతలకు మంగళస్నానం చేయించినారు. హిమధవళమైన, దువ్వలువలు కట్టించినారు. దీర్ఘ నీలకుంతలాలను సుందరంగా వేణి అల్లి సొబగు ముడికట్టి ధవళసురభి పుష్పమాలలో కబరిని అలంకరించినారు. వెలుగులీనే కర్ణాభరణాలు, కంకణవలయాలు కైసేసినారు. చతుస్సముద్ర సారభూతమైన ముక్తాహారాలతో గళసీమను వక్షః ప్రదేశాన్ని సొబగుగొలిపినారు. ముత్యాలు, పచ్చలు, రత్నాలు, వజ్రాలు, వైదూర్యాలు పొదిగిన వడ్డాణాన్ని, కటిబంధాన్ని పెట్టినారు. సోగకనులకు కాటుకకప్పుతీర్చి, శుకమహర్షిని జయించే శక్తి కలిగించినారు. కొలనిలోని ఎర్రదామర తనంతటనే పైకి ఎగసివచ్చి శాంతల కపోలాలను, చుబుకాన్ని మృదువుగా ఒత్తి తన రంగును అక్కడ మిగిల్చిపోయినది. ఉత్తమవర్ణపు విద్రుమలత సముద్ర మధ్యంనుంచి లేచివచ్చి శాంతల పల్లవాధరాలకు తన రంగు ఇచ్చిపోయినది. ఫణిరాజు మకుటరత్నంవచ్చి నొసట మంగళకరమైన చుక్కగా అంకితమైంది. భూగర్భంనుంచి బంగారే తీగలు తీగలుగా చుట్టుకునివచ్చి, ముద్దుముద్దుగా రూపాలుతీర్చుకొని, కరపాదాలలో భూషలుగా నిలిచింది. నందినీధేనువు వచ్చి, ఒక సువర్ణపాత్ర నిండ పొదుగునుంచి నురుగుపాలను పిండినది. నవ్యమకరందాన్ని తెచ్చిన తుమ్మెదల పిండు ఆ నురుగుపాలలో తమ తేనెను కుమ్మ

రించి పోయినది. దేవవనితలు అమధుమిశ్రిత క్షీరాన్ని శాంతలలో ఆరగింపజేసినారు. శాంతలకు అప్పుడు అమృతం ఆస్వాదించినట్లే అనిపించింది. దేహకాంతి బంగారువలె మెరసినది. దేహమాంద్యంతం అపూర్వమైన ఉల్లాసం ఏర్పడింది.

అప్పుడు ఆ సుందరోద్యానమధ్యంలో మహాకాంతి పొడమింది. శాంతల చూస్తుండగానే ఆ తేజోరాశి భవ్యపురుషాకృతి ధరించింది. ఆ మహాపురుషుడు శ్రీమన్నారాయణునివలె తీరవర్చస్విగా కనిపించినాడు. విశాలవక్షుడు, మహాబాహువు, వృషస్కంధుడూ అయిన ఆ పురుషుడు ప్రద్యుమ్నునివలె సుందరుడుగాను కనిపించినాడు. అతడు వినయంతో మందస్మితంతో శాంతలను పరికించినాడు.

ఆ సుందర స్వప్నం అక్కడికే ఆగింది. అంతలో ఆమెకు మెలకువ వచ్చింది. ఆమె కన్నులు విప్పి చూచినది. కనినది కలే అయినా, ఆమె మనస్సుకు, దేహానికీ అప్పటి సుఖానుభవం మాత్రం మాయంకాలేదు. రాత్రంతా నిద్రలేకపోయినా, గాఢనిద్రతో సంపూర్ణ విశ్రాంతి పొంది లేచిన దానివలె ఆమె మేల్కొన్నది.

శాంతల తొందరగా శయ్యనుంచి లేచి, ప్రాతర్విధులు ముగించి, మజ్జనం చేసి, ఉత్తమదుకూలం ధరించి దివ్యాభరణాలు అలంకరించుకొని, తేనెపాలు ఆరగించి, అచ్చ మల్లెల పూలచెండును తీసుకొని శారదా మందిరానికి పరుగు పరుగున వెళ్ళినది. సఖిలక్ష్మి వైభవోపేతమైన చీనాంబరం ధరించి, నగలు పెట్టుకొని ముందే శారదాలయానికి వచ్చి శాంతలకోసం వేచి ఉంది.

శాంతల ముఖంలో ఆనాడు ఉట్టిపడే అపూర్వతేజస్సును లక్ష్మి చూచి చాల ఆనందపడింది. శాంతల తను తెచ్చిన పూలచెండును శారద పాదాలకడ పెట్టి, ధూపదీపాలు సమర్పించి, భక్తితో శారదకు నమస్కరించింది. లక్ష్మికూడ నమస్కరించింది. తర్వాత శాంతల పుష్పగుచ్ఛం తీసుకొని రెండు భాగాలుచేసి, ఒకభాగం లక్ష్మి సిగలోముడిచి, మరొక



దానిని తాను ముడుచుకొంది. నెచ్చెలి చేయి పట్టుకొని, "లక్ష్మీ, పొద్దు అయినదికదూ! రా. అమ్మ మనకోసం వేచి ఉండవచ్చు." అంటూ నడిచి వచ్చి, ఇంటి ముంగిట్లో కాచుకొనిఉన్న మేనాలో లక్ష్మితోసహా ఎక్కి కూర్చున్నది. మరొక మేనాలో శాంతల తలిదండ్రులు కూర్చున్నారు. దృఢగాత్రులయిన శిబికావాహకులు మేనాలను మోసుకొని ఓంకారాలు వేస్తూ నగరు సింహాసన సభామందిరానికి నడచినారు.

అంతలో ఓలగసాలలో జనం క్రిక్కిరిసింది. అవసరికుడొకడు అప్పుడు మేనాలలో వచ్చి దిగినవారు ఎవరైనదీచూచి పరుగునపోయి హేమాద్రి పండితులకు తెలిపినాడు. హేమాద్రి పండితులు ఆతురతతో వచ్చి, అతిథులకు ఆదరంతో స్వాగతం పలికి, మాచికబ్బె దండనాయకి వారితో "మీ రింకా విచ్చేయలేదా అని, గంగరాజులుంగారు ఇదిగో ఇప్పుడే ప్రశ్నించినారు. అమ్మాయి శాంతల ఏదీ?" అని ప్రశ్నించినారు.

మాచికబ్బె :- "తంత్రపాల హేమాద్రులవారికి ఇంత త్వరలో నేత్రపాటవం తగ్గిపోయిందా? ఇదుగో శాంతల. ఈమె పెరుమల పండితుల కుమార్తె లక్ష్మి, శాంతల నెచ్చెలి."

హేమాద్రి పండితులు (కళ్లు నులుముకొంటూ ఆశ్చర్యంతో): "కళ్లకు కనుకలేదు. అయినా, శాంతలనుచూచి సంవత్సరాలయినవి. (శాంతలవైపు తిరిగిచూచి) వయసులో ఆడపిల్లలు నానాటికీ పెరుగుతుంటారు. (శాంతలను సంబోధిస్తూ) గుర్తు మరచినావా, శాంతలా? ఈ దండలు నిన్ను ఎన్ని సాళ్లు ఎత్తుకొని ఆడించలేదు! పెరిగి సౌందర్యలహరి అయినంతమాత్రాన పెద్దయ్యను మరచిపోవాలా? (శాంతల నవ్వడంచూచి) అయ్యో! ఇది ఎలాంటి సిగ్గమ్మా, తల్లీ? మాటలాడటానికి కూడ సిగ్గుపడదగినంత కొత్తవాడిని అయినానా? నీవూ, లక్ష్మి శ్రీదేవి భూదేవివలె ఉన్నారు. నడవండి నడవండి; ఈవైపు జనసమ్మర్దం హెచ్చు. ఈదారిని రండి." అంటూ హేమాద్రి పండితులు వెండిబెత్తాలవాడిని పిలిచి, "మారసింగమయ్య దండనాయకులను, వారికుటుంబంవారినీ వారి స్థానాలకు, పీఠాలకు పిలుచుకొనివెళ్లు." అని ఆజ్ఞాపించినారు.

రాజమాత ఎన్నికకూ, కార్యకుశలతకూ హేమాద్రి పండితులు మనస్సులోనే మెచ్చుకొన్నారు.

తమకోసం ఏర్పాటయిన సుఖాసనాలతోపాటు లక్ష్మికోసం మరొక పీఠాన్నికూడా తెప్పించుకొని మారసింగమయ్య, మాచికబ్బె, శాంతల, లక్ష్మి సుఖాసీనులయినారు.

# 9

కుమారవిష్ణువు అందరికీ నమస్కారంచేసి, అలసిపోయినాడు. అయినా, నమస్కరించవలసిన అతిథులు చాలమంది ఉన్నారు.

గంగరాజలుంగారు వారివెంట కుమారవిష్ణువును నడిపించుకొంటూ ప్రభువులు, వారివెంటనే హేమాద్రి వీరదేవ గోవిందాచ్యుతామాత్యులు మారసింగమయ్య దండనాయకులు కూర్చున్నవైపు వచ్చినారు. విష్ణువర్ధన ప్రభువులను అంత దగ్గరనుంచి శాంతల ముందెన్నడూ చూడలేదు.

మారసింగమయ్యగారు, మాచికబ్బె, శాంతల, లక్ష్మి అందరూ భక్తి మర్యాదలతో లేచి నిలబడినారు. శాంతల, లక్ష్మి ఇద్దరూ ప్రభువులను చక్కగా దర్శించినారు.

శాంతలకు "నేను కలలో కనిన దివ్యపురుషుడు ఈయనే!" అనిపించింది. భావరూపాకారాలలో అంతటి సామ్యం ఉండినది. శాంతల దేహం గగుర్పొడిచింది. హృదయగతివేగం ఇనుమడించినది. లక్ష్మి కూడా ప్రభువులను చక్కగా దర్శించినది. ప్రభువులు సభలోని తక్కిన వారిని చూచినట్లే వీరినీ చూచినారు; అయినా, అగోచరమైన దైవ శక్తులు ఈ సమయ సన్నివేశాలను ఒడ్డినవి.

"వీరు మారసింగమయ్య దండనాయకులవారు. మన సైన్యం కుడి భుజమే వీరు ... వీరి సతి మాచికబ్బెగారు." అని గంగరాజగారే వారిని



వటువుకు పరిచయం చేయిస్తున్నప్పుడు ప్రభువులు మందస్మితంచేస్తూ వినయంలో చేతులు జోడించినారు. వటు వా దంపతుల కిద్దరికీ నమస్కారం చేసినాడు. ఆ దంపతులు వటువు శిరస్సుపై కుసుమాక్షతలుంచి "యశోవంతుడివి కావలె. అప్రతిమవీరుడవి కావలె. మహాత్యాగి కావలె." అని ఆశీర్వదించినారు.

శాంతల, లక్ష్మి క్షణకాలం ప్రభువుల చూపులో తమ చూపుకలిపినారు. అనంతరం సౌశీల్యంవల్ల ఉదయించిన లజ్జతో తల దించుకున్నారు. పూర్వ కర్మానుబంధమో, దైవనియామకమో, ఏదో అదృష్టమైన శక్తి వారికి తెలియకనే, వారి హృదయాలలో అనురాగాన్ని అంకురింపజేసింది.

గంగరాజలుగారు, హేమాద్రి తంత్రపాలులు రాజమాత ఉద్దేశ సాధనకోసమే ఆ సన్నివేశం కోసం కాచుకొని ఉన్నారు. ప్రభువుల మనస్సును గ్రహించినారా అన్నట్టుగా గంగరాజగారు శాంత లక్ష్ముల వైపు చూపుతూ, ప్రభువులతో "ఈ లావణ్యమయి అయిన కన్య వీరి ఏకైకపుత్రి శాంతల; ఈ కన్య శాంతల స్నేహితురాలు లక్ష్మి. పెరుమల పండితుల ఏకమాత్ర పుత్రి." అనినారు.

శాంతల, లక్ష్మి మరొకసారి మెడయెత్తి ప్రభువులకు భక్తి వినయాలతో చేతులుజోడించి నమస్కరించినారు. ప్రభువులూ మందస్మితంలో చేతులుజోడించినారు. కుమార విష్ణువూ దగ్గరే చేతులు జోడించి నిలబడినాడు. శాంతల ప్రీతితో తల్లి తన బిడ్డను తాకినట్టు వటువుతలను ఒక్కమారు మృదువుగా తడవి తృప్తిపడింది. ఆ స్పర్శకు వటువు తలెత్తి శాంతలను చూచినాడు. శాంతల మృదువుగా నవ్వినది. కుమారవిష్ణు అంతే మృదువుగా నవ్వినాడు.

తంత్రపాల హేమాద్రి పండితులు గంగరాజలుగారిని సంబోధించి, "అన్నగారు కొంచెం గమనించవలె. మధ్యాహ్నం సమీపించింది. వటువుకూ చాల శ్రమ అయివుంటుంది. మంగళకార్యాలు ఇంకా ఒకటో

రెండో మిగిలినట్టు ఉన్నది. అయినంత తొందరగా కానీండి.'' అన్నారు. ''నేనూ అదే యోచిస్తున్నాను.'' అని ప్రత్యుత్తరమిచ్చినారు గంగరాజులు.

వటువుకు అలసట కలుగడం నిజమే. ఉత్సాహంలో అది అతనికి తోచలేదు. గౌరవించవలసిన నాగరికులు, శ్రేష్ఠులు, వ్యాపారపు నంబియారులు, జైననైగములు, ఇతరులు పలువురు ఉన్నారు. గంగరాజులుగారు తమ చేయి ఎత్తి సభను చుట్టూ చూచినారు. మహామాత్యులు మాట్లాడ దలచినారని తెలుసుకొని సభ నిశ్శబ్దమయింది. గంగరాజులుగారు ప్రసన్నవదనులై సమీపంలోని ఒక పీఠం ఎక్కి నిలబడి, ఇట్లన్నారు: ''మా ప్రీతిపాత్రులయిన ప్రజలు నా ప్రార్థన దయచేసి గమనించవలె. గత్యంతరం లేక చెప్పవలసి వచ్చినది ... వటువు కుమారవిష్ణువుకు ఇంతకే అలసట కలిగింది. బాలుడు కావడంవల్ల మీ ఆశీర్వాదాలను విడివిడిగా పొందలేకపోతున్నాడు. మధ్యాహ్నమూ కావచ్చింది. కనుక వటువు మీ కందరికీ ఒక్కుమ్మడిగా నమస్కరిస్తాడు. మీరందరూ వటువుకూ ప్రభువులకూ శుభంకోరి, కల్యాణంకోరి తమ ఆశీర్వాదాలను, గౌరవాలను అర్పించాలని ప్రార్థిస్తున్నాను.'' ఇట్లని నమస్కరించి పీఠంనుంచి కిందికి దిగినారు.

అప్పుడు ప్రభువులూ, వటువూ వేదికను ఆరోహించి, అందరికీ కనిపించేటట్టు నిలబడినారు. వటువు సదస్సుకు తలవంచినాడు. ప్రభువులు హసన్ముఖులై సదస్సుకు తలఒగ్గినారు. ''ఉఘే! హొయిసళేశ్వర! ఉఘే! కుమారవిష్ణు! ఉఘే! ఉఘే!'' అని ఆనందంతో సభవారు ఘోషించినారు. ప్రజల ఉత్సాహం ప్రభువులకు సంతోషమయింది.

ప్రభువులు, వటువు వేదికనుంచి దిగి హోమమండంవైపు నడచినారు. హోమాగ్ని మరొకమారు ఆజ్యాహుతితో ప్రజ్వలించింది. ఆయుష్య హోమం, శేషహోమం సమాప్తమయినవి. వేలాది బ్రాహ్మణులు ఏక కంఠంతో శాంతి స్వస్తివాచనాలను సుశ్రావ్యంగా ఘోషించినారు.

అనంతరం గంగరాజులుగారు మహావీరజనుని వంశీయులు, షట్కర్మ షణ్ముఖవాదీభసింహ తార్కిక చక్రవర్తిత్యాద్య నేక బిరుదాలంకృతులు అయిన శ్రీ పాలత్రైవిద్య దేవ దేశికులను సగౌరవంగా ఆహ్వానించి



హోమకుండంవద్ద ఒక రజతాసనంలో ఆసీనులను చేసినారు. వీరివద్దనే కుమారవిష్ణువు ఉత్తమ విద్యలను నేర్వాలని రాజమాత అపేక్ష. వటువు దేశికుల పాదాలను వెండిపళ్ళెంలో ఉంచి, శుద్ధోదకంతో కడిగినాడు; సువర్ణ పుష్పాలతో పూజించి ప్రణమించినాడు. ప్రభువులు వటువును దేశికులవద్ద విద్యాభ్యాసానికి అప్పగించినారు.

## 10

ఆనాడు రాచనగరులో పురజనులందరికీ విందు. నాల్గైదు పాక శాలలూ, భోజనశాలలూ విడివిడిగా ఏర్పాటయినవి. జినధర్మం, శైవధర్మం, వైష్ణవధర్మం – ఈ మూడు ధర్మాలమీద సమానశ్రద్ధ ఉన్న హొయిసళ విష్ణువర్ధన ప్రభువుల రాజ్యంలో శాకాహార భోజనం అందరికీ సమర్పకంగా ఏర్పాటయింది.

సభామందిరంలో మంగళకార్యాలు సమాప్తమైన వెంటనే, గంగరాజులుగారు, హేమాద్రి పండితులు, రాజమాత ఉన్నవైపు వెళ్ళినారు. రాజమాత వీరి కోసమే వేచి ఉన్నారు. గంగరాజులుగారే మాటలు మొదలుపెట్టి ''అక్కగారి ఎన్నిక చాల మంచిది. ప్రభువులు శాంతలను తిలకించినారు. అన్ని విధాలుగా ఆ కన్య ప్రభువులను చేపట్టడానికి అర్హురాలు. ఏరితెచ్చినట్టున్నది తమ ఎన్నిక. విద్య, వినయం, రూపం అన్నీ ఉన్నవి. ఇట్లు ఉండడం అరుదు. ప్రభువులవద్ద ఒకమారు ప్రస్తావించి నిశ్చయించి వేయండి. మారసింగమయ్య, మాచికబ్బె ఆనందంతో ఒప్పుకుంటారు. అయితే వారు ఇంకెవరికైనా...?'' అన్నారు.

రాజమాత :- ''మేము ఆవిషయం విచారించి తెలుసుకొన్నాము. అలాగు ఉంటే మా మనస్సు ఈ విషయానికే ప్రవర్తించేదికాదు.

గంగరాజులుగారు :- ''అక్కగారు ఈ సూక్ష్మాన్ని ఏ విధంగా గ్రహించినారో !''

రాజమాత:- "మాచికబ్బె దండనాయకివారిని ఒకమారు ఇక్కడికి పిలిపించుకొన్నాము."

గంగరాజులుగారు:- "మంచిదే అయింది. అయితే, మాచికబ్బెగారికి తమ ఉద్దేశం అంతర్యం..."

రాజమాత:- "తోచి ఉండవచ్చు. దానివల్ల కలిగేనష్టమేమి? మాచికబ్బెతో మా పరిచయం చాలకాలంది. శాంతల గుణం, రూపం, శీలం, విద్య, వినయం-ఇవన్నీ మాకు పూర్తిగా నచ్చినవి."

గంగరాజులుగారు:- "మాచికబ్బెగారూ ఈలాగే ఆశ కల్పించుకొని ఉండవచ్చు."

రాజమాత:- కావడం కాకపోవడం మనచేతుల్లోవా ?"

మధ్య హేమాద్రిపండితులు కలుగజేసుకొని అన్నారు: "అక్కగారు గమనించినారో లేదో. శాంతలతోపాటున్న మరొకకన్య రూపగుణ గాంభీర్యాలలో శాంతలకు సమ ఉజ్జీగా ఉన్నది. ఏకజీవ న్యాయంగా పెరుగుతున్నారు ఇద్దరూను, అనినారు మాచికబ్బె."

రాజమాత:- "హేమాద్రి పండితుల మనస్సులో ఉన్నది ఏమో ?"

హేమాద్రి పండితులు:- "చిన్నరాణివారికోసం మనం ఇక వెదుక నక్కరలేదు. ఇంత స్నేహంతో పెరిగినవారు సవతులయి సౌహార్దంలో ఉండగలరు. ఇంకెక్కడినుంచైనా వెదుకకొని రావడానికి మాకు ఈక స్యే కావచ్చుగదా ?"

రాజమాత :- "మా పుత్రులను ఒక్క వివాహానికే ఒప్పించడానికి ఇంత కష్టమయినప్పుడు, ఇద్దరు భార్యల ఇబ్బందికి ఎట్లు ఒప్పుతారు హేమాద్రిగారూ ?"

హేమాద్రి పండితులు :- "అది నాకు తెలియని సంగతి. బహు భార్యా సంకటంకంటె భార్యాద్వయం చాలునని, మేలని నా అభిప్రాయం."



రాజమాత :- "మీ రన్నది ఉచితమే. ఔను నాకూ ఒప్పితమే. ఈ విషయంలో అన్నగారి అభిప్రాయం ?"

గంగరాజులుగారు :- "హేమాద్రి పండితుల సూచన యోచించ తగిందే. ఆ కన్యలిద్దరూ ప్రేమజీవులు. సవతులయినప్పటికీ అక్క చెల్లెండ్ల వలె మెలగగలవారు."

రాజమాత :- "భవిష్యత్తు మన కోరిక ప్రకారం నడిచేటట్టయితే! మీరు అనేమాట ప్రపంచానికే చోద్యంగా ఉంది. చెలులయినంత మాత్రాన సపత్నులూ కావాలా? సవతి మత్సరం ఎంతటి స్నేహాన్నయినా విరిచివేస్తుంది. స్నేహితురాండ్రే ఎందుకు, అక్క చెల్లెండ్లే ఒకని చేపట్టి సౌహార్దంతో కాపురం చేయడం అపూర్వం. మీరు చూడలేదూ, మా పెద్ద కుమారులు బల్లాళ ప్రభువులను పెండ్లాడిన ముగ్గురు అక్కచెల్లెండ్లను? ... దొడ్డమరియానె దండనాయకుల కుమార్తెలు ... పద్మల, చావల, బమ్మల. ఈ ముగ్గురు అక్కచెల్లెండ్ల ముఖాలు నేటికీ ... వైధవ్యం వచ్చినతర్వాత కూడ, మూడు మూలలే! ... ఆ సంగతి అలా ఉండనీ, ఎవరి కుమార్తె ఈ కన్య ? మేము ఆ కన్యను దూరంనుంచి మాత్రమే చూచినాము."

గంగరాజులుగారు :- "ఆ కన్య పెరుమల పండితుల ఏకైక పుత్రి; పేరు లక్ష్మి. చిన్నతనంలోనే తల్లిని పోగొట్టుకొన్న ఈ కన్యను మాచికబ్బెగారు తమ కుమార్తె అనే శాంతలతోపాటు సమాన ప్రీతి విశ్వాసాలతో పెంచినారు. ఇద్దరూ ఒకే ఇల్లు చేరితే ఆ తల్లి మనసూ ఆనంద పడీని."

రాజమాత:- "మీరూ, హేమాద్రిపండితులూ ఈ పనిని చాల చిక్కులో పెడుతున్నారు. లక్ష్మి శ్రీవైష్ణవబ్రాహ్మణకన్య, ఈ సంబంధం మనం ఆశపడినా సాధ్యమా? పెరుమల పండితులు ఒప్పుకోనేరా ?"

హేమాద్రి పండితులు:- "ఔను. ఈ విషయం తీర్పు కన్య తండ్రిది. అక్కగారు మన్నించవలె. ఈ మాటలు నాకు తెలియకనే నాలుకనుంచి వచ్చిపడినవి. ఎందుకన్నానో ఇప్పుడు నాకే తెలియడంలేదు."

రాజమాత:- "హేమాద్రులవారు నొప్పిపడరాదు. దొడ్డవారి నోటినుంచి, అకస్మాత్తుగానైనాసరే, కారణంలేక ఒక్కమాటా వెలువడదు. అదృష్టమైన దైవమే ఈ మాటను మీనుంచి అనిపించి ఉండవలెనని భావిస్తున్నాను. దైవం తాను చేయవలసినదీ, చెప్పవలసినదీ ధర్మాత్ముని సత్యవంతుని, భక్తుని నోటినుంచి పలికిస్తుంది. మానుంచో! మీనుంచో! ఎవరినుంచో! మనం కర్తలమూకాము! భోక్తలమూకాము. చేయడం, చేయించడం రెండూ వాని కర్తవ్యమే."

గంగరాజులుగారు:- ప్రభువులను ఒప్పించండి. అక్కగారు మరి కారేమో! అక్కగారిని చేపట్టిన ప్రభువులూ మొదట్లో వివాహమే వద్దనేవారు. ఆ మీదట అక్కగారికి సవతులు చాల్లు చాల్లుగా ఏర్పడ్డారుగదా!"

రాజమాత:- "అన్నగారు తాము చేసిన కృత్యాలకు తామే నొచ్చుకొనేకాలం వచ్చింది కమా!"

గంగరాజులుగారు : (చిరునవ్వు నవ్వి) "రాజానోబహువల్లభాః! ఇది తప్పుకాదు. ఇతర రాజుల, సామంతుల, ప్రబలుల పిల్లలను రాజులు పెండ్లాడడం రాజ్యానికి క్షేమంకాదా? ఆ సామంతులకూ ఒక విధమైన మర్యాద అది."

రాజమాత :- "భీష్ముల రాజ్యతంత్ర చతురతను మేము చూచినాము; మెచ్చుకున్నాము. మేము ఇక్కడికి అడుగుపెట్టిన కొత్తలో మిమ్ములను శపిద్దామన్నంత కోపం వచ్చేది."

గంగరాజులుగారు :- "అనుగ్రహం! మన రాజ్యానికీ మీ పుట్టింటి వారికీ అప్పుడు సౌహార్దం ఏర్పడకపోయి ఉంటే, రెండు దేశాలకూ వైషమ్య విపత్తులు తప్పేవికావు. పరదేశీయులు హొయిసళ రాజ్యశ్రీని చాల అసూయతో చూస్తున్నారు. ఇక్కడికి వచ్చివెళ్ళే వ్యాపారులూ, వేగులవారూ హొయిసళ రాజులు బంగారు నగరు, స్వర్ణదేవాలయాలు కట్టుకొన్నారనే కల్లవార్తలను వ్యాపింపజేస్తున్నారు. దక్షిణంలో ఇంత



సంపద ఉందన్న వర్తమానం విని ఉత్తరపు రాజవృకాలకు నోట నీరూరుతున్నది. వారికి కావలసినవి కొల్లగొట్టడం, రక్తపాతం - అంతే. వారిలో చేరి కొల్లగొట్టడంలో పాల్గొనడానికి మనదేశపు కొన్ని గాడిదపులులు (సివంగులు), రాబందులు కాచుకొని ఉన్నాయి. పూర్వంనుంచీ మనదేశ చరిత్ర ఇలాగే. ఇకేభూమీ తన కొడుకుల రక్తం ఇంతగా తాగలేదు. ఈ భూమి గుణమే ఇలాటిది. దేశరక్షణను స్థిరపరచుకొనడానికి మన ప్రభువులు తుళువ, కొంగ, తెలుంగ, పాండ్యరాజుల స్నేహసంబంధాలను కల్పించుకొనడం లెస్స. ఇది అక్కగారికి తెలియని విషయమేమీకాదు."

రాజమాత :- "గంగరాజులుగారు చెప్పవలసిందే లేదు. మా పూజ్య పతిదేవులు ఇహలోకంనుంచి నిర్గమించినప్పుడు ఈ మహారాజ్యాన్ని మీ అందరి పోషణలో వదలివెళ్ళినారు. ఆ స్థైర్యమే ఈ రాజ్యాన్ని సురక్షితంగా కాపాడుకొంటూ వచ్చింది. కుమారులకు మీరు విన్నపం చేయవలె, శ్రేయఃకాంక్షుల మాట ఉపేక్షింపదగినదికాదని ... ఇంతసేపు మీ యిద్దరినీ మాటల్తో నిలుపుకొన్నాము. మీ పనులను ఇక మీరు చూచుకోండి. మా కుమారులను మేము సావకాశంగా చూచి, అభిప్రాయం తెలుసుకొనడానికి యత్నిస్తాము. ఏదో మహాచ్ఛక్తి మనందరినీ ఈ కార్యానికి తీసుకొని వెళ్ళుతున్నది. దైవసంకల్ప మేమిటో!"

గంగరాజులుగారు, హేమాద్రి తంత్రపాలకులూ రాజమాతకు వందనంచేసి తమ పనులు చూడడానికి వెళ్ళినారు.

రాజమాత కొన్ని నిమిషాలకాలం అక్కడే ఆసీనురాలై తను చెప్పిన, విన్నమాటలన్నిటినీ జ్ఞాపకం తెచ్చుకొన్నారు. ఏదో మరచినట్టు తటాలునలేచి, రాజబంధువుల, ఉన్నతాధికారుల, పురశ్రేష్ఠుల, [illegible] పిల్లలు భోజనంచేస్తున్న భోజనశాలవైపు వెళ్ళినారు.

# 11

రాచనగరులో ఇలాంటి మంగళోత్సవాలు, పురంధ్రీమణుల భోజనాదులు జరిగినప్పుడు మహారాజ్ఞిగారే వచ్చి ముత్తైదువులకు, ఫలతాంబూలాలు, పసుపుకుంకుమలు, సుగంధద్రవ్యాలూ ఇచ్చి, కుశలప్రశ్నలు చేసి, వీడ్కొల్పడం పద్ధతి. రాజమాతవచ్చి సింహద్వారం లోగిలిలో సిద్ధపరచిన రజత పీఠంపై ఆసీనులయినారు. ఫల పుష్ప సుగంధద్రవ్యాలను, వీడెములను ఊడిగంవారు అప్పటికి సిద్ధపరచి ఉంచినారు.

గౌరమ్మగారు, మరొక రాచనగరు కట్టడి ముత్తైదువూ పసుపు, కుంకుమ, పూవులు, గంధంగల గిన్నెలను పట్టుకొని నిలబడినారు. భోజనమయినపిదప పురంధ్రీమణులు, కన్యలు లోవాకిలినుంచి ఒక్కొక్కరుగా వచ్చి పూవులు, వీడెం స్వీకరించి, రాజమాతకు నమస్కరించి తమ తమ యిళ్ళకు బయలుదేరినారు.

రాజమాత పరిచితులందరినీ "కుశలమా? పిల్లలు కుశలమా? భర్తగారు కుశలమా? పిల్లలకు పెండ్లి అయినదా? మీ తలిదండ్రులు సుఖంగా ఉన్నారా? మేము అడిగినట్లు తెలుపండి. ఎవరెవరు ఎక్కడెక్కడున్నారు? మానుంచి ఏమైనా కావలసినది ఉంటే, కాదగిఉంటే సంకోచపడక చెప్పండి." అని ఆత్మీయతతో అడుగుతూ వీడ్కొల్పసాగినారు.

రాజమాతకు అపరిచితులైన వారిని గౌరమ్మగారు "వీరు ఈ ఇంటివారు." అని పరిచయం చేసేవారు. అలాగే రాజమాత ఒక్కరొక్కరినే సౌమనస్యంతో కుశలమడిగి, కష్టసుఖాలు కనుక్కొని పంపుతున్నప్పుడు మాచికబ్బె, శాంతల, లక్ష్మి భోజనం ముగించి వీడెం తీసుకొనడానికి వచ్చినారు.

రాజమాత మాచికబ్బెను చూచి, "భోజనమయిందా మాచీ? మీ దండనాయకులు నిన్ననే ఊరికి వచ్చినారట. ముహూర్తం వేళకు రావడం చాల సంతోషం. ఆ మాసణప్రభువు చేతికి చిక్కక పేడివలె



పరుగెత్తినాడట. ఆ దుర్మార్గుణ్ణి నామరూపాలు లేకుండా చేసేవరకు మన రాజ్యం సీమా ప్రాంతాలలో క్షేమంలేదు. మరొకసారి వాణ్ణి చుట్టుముట్టి పట్టుకొనేతీరాలి. అప్పుడు ఎక్కడ దాక్కుంటాడో చూద్దాం. శాంతలా! ఎంత సిగ్గమ్మా నీకు? తలయెత్తి మాట్లాడు తల్లీ. మేము నీ తల్లివలె... ఇదెవరు మాచీ, ఈ కన్య?" అని ప్రశ్నించినారు.

మాచికబ్బె :- "ఇది లక్ష్మి. శాంతల, ఇదీ స్నేహితురాండ్రు. దేహాలు రెండు, ప్రాణం ఒక్కటే. పెరుమలె పండితుల ఏకైకపుత్రి. పాపం! రెండేండ్లకే తల్లిలేని పిల్ల అయింది. పెరుమల పండితులు తమ ఎదకు కట్టుకొని సాకినారు. తమకున్న విద్యాబుద్ధులను చక్కగా చెప్పించినారు. శాంతల కూడ ఆ పండితుల వద్దే సంస్కృత భాషా వ్యాసంగం చేసింది. శాంతలకన్నా కొంచెం చిన్నది. నా రెండో బిడ్డే."

రాజమాత :- "లక్ష్మి సరస్వతులు పేరుకైనా ఒక్కచోట చేరి ఉండడమే అపురూపం. పండితులవారి అల్లుడుగారు ఎవరో!"

మాచికబ్బె :- "ఎవరవుతారో! ఈ ఇద్దరు పిల్లల ఆలోచన ... నాకు తలనొప్పి. శాంతల తండ్రిగారూ అంతే. పండితులవారూ అంతే. ఈ సంగతిని పట్టించుకోరు. అయ్యే కాలానికి అంతా తనంతట తానే ఒదిగి వస్తుంది అంటారు. కన్నకడుపు ఆలాగు అనుకొని ఊరికే ఉండినా?"

రాజమాత :- మాచీ, మా కుమారులకూ అదే హఠం. అయితే, ఆడపిల్లలు అలాగు ఉండడం సాధ్యమయ్యేనా? ...... అదీ నిజమే. అన్నిటికీ కాలం కలిసిరావాలి. మాచీ, శాంతలా, లక్ష్మి వెళ్ళివస్తారా?"

ముగ్గురూ పసుపు కుంకుమలు, పండ్లు, తాంబూలం తీసుకొని రాజమాతకు నమస్కరించి ఇంటికి బయలుదేరినారు. శాంతల, లక్ష్మి ఒక మేనాలో కూర్చున్నారు. మాచికబ్బె మరొక మేనాలో కూర్చున్నారు. ఆమె కూర్చున్న మేనా మారసింగమయ్యగారిని ఎక్కించుకొనడానికి వారున్న వైపు వెళ్ళింది.

# 12

శాంతల, లక్ష్మి ఎక్కిన మేనావద్దకు నగరు దాసి ఒకతె పెద్ద పళ్లెరంలో రెండు లేతపసుపు, రంగు చీనాంబరాలు, ఆరంగువే రెండు వక్షోవస్త్రాలు, పూవులు, పండ్లు మొదలగునవి తెచ్చి అప్పగించి, "రాజమాత మహాదేవిగారు పంపినారు." అని మనవిచేసి పోయినది. అమూల్యమూ, సుందరమూ అయిన ఆ వస్త్రభూషణాదిని చూచి కన్యలిద్దరూ ఆశ్చర్య పడినారు; ఆనందపడినారు; రాజమాత ఆదర ప్రీతులకు ముగ్ధులయినారు.

మాచికబ్బె మేనాలోను రాజమాత మాచికబ్బెకోసం దివ్యమైన రాజావరోధోచితమైన వస్త్రభూషణాలు పెట్టించినారు. మాచికబ్బె వాటిని చూచి ఆశ్చర్యపడి, మారసింగమయ్యగారితో "ఈ వయస్సులో నేను వీటిని కట్టుకుంటే, పెట్టుకుంటే జనం నవ్వేరు. అక్కగారే నేడు సాధారణమైన వస్త్రాలు ధరించినారు, అయినా వారిగౌరవం తగ్గిందా? ఆ గాంభీర్యం, ఘనత, నడత, మాట, హృదయవైశాల్యం ఎవరి కుంటాయి?" అన్నారు.

మారసింగమయ్య "ఉడుపులు, తొడవులలో హెచ్చు ఆడంబరం అక్కగారికి ముందునుంచీలేదు. నగరులో నగానట్రకు, చీరలకు కోకలకు తక్కువా? అక్కగారు పుట్టినింట తెచ్చిన నగలు, వస్త్రాలే, ఒక బొక్కసంనిండా ఉన్నాయి. వాటిని కట్టేవారేలేరు."

మాచికబ్బె:- "అక్కగారికి శాంతలను ఇంటికి తెచ్చుకుందామనే అభిప్రాయం ఉంది; అది నేడు చక్కగా వ్యక్తమయింది."

మారసింగమయ్య (సంతోషంతో):- "అది మనబిడ్డ సౌభాగ్యం. ప్రభువులు మన అల్లుండ్లయితే మనం మహాభాగ్యవంతులం. నేను ఊరికి తిరిగి వచ్చినప్పటినుంచి శుభసూచనలు కనిపిస్తున్నవి, వినిపిస్తున్నవి. నేను ఇంత వేగిరం ఊరికి తిరిగిరావడంకూడా అక్కగారి ఏర్పాటే. కుమార విష్ణువు ఉపనయన సమయం ఈ కార్యసాధనకు తోడ్పడినది. గంగరాజులు



గారు, హేమాద్రిపండితులు ఈ విషయంలో శ్రద్ధ వహించినారు. వటువుకు ఆశీర్వాదం ఇప్పించే నెపంతో ప్రభువులు శాంతలను చూచే ఏర్పాటు చేసినవారూ అక్కగారే. తమ ఉద్దేశం సాధించవలెనంటె...అబ్బ!... స్త్రీల జాణతనానికి మరొకటి సాటిరాదు."

మాచికబ్బె:- "ఇది పొగడ్తా? తెగడ్తా?"

మారసింగమయ్య:- "ఛ! ఛ! సర్వథా తెగడ్తకాదు. మాచీ, నాకు పెక్కువేళ్లలో ఇలా అనిపిస్తుంది: ఈ బ్రహ్మాండాన్ని సృష్టించిన మహాశక్తి స్త్రీ తోనే తన పనులన్నిటినీ కొనసాగిస్తున్నది. స్త్రీ అనే రసమయి లేకపోతే పురుషుడు మోడుబారి కరుడుగట్టి పోయేవాడేమో!"

మాచికబ్బె:- "మగవారి విషయంలో మాకూ అట్లే అనిపిస్తుంది. ఒకబొట్టు రక్తం చూస్తే మూర్ఛపోయేవాళ్ళం మేము. వేలాది జనాన్ని-వారు చెడ్డవారేకానీండి-హత్యచేసి, రక్తపు కాలువలు పారించి, పట్టణాలను కాల్చి బూడిద బుగ్గిచేయడంగాని, దేశాలను కట్టుకొని కాపాడి ఉద్ధారం చేయడంగాని, దయతో, ధర్మంతో రాజ్యమేలడంగాని మగవారేకదా?".

మారసింగమయ్య:- "మాటలు ఎక్కడనుంచి ఎక్కడికో వెళ్ళినవి. అక్కగారిని దర్శించుకొన్నారా?"

మాచికబ్బె:- "ఫలతాంబూలాలు తీసుకొనివస్తున్నప్పుడు దర్శించుకొని నమస్కరించి వచ్చినాము. మాసణప్రభువును మరొకమారు ముట్టడించి బందీగా పట్టుకొనే తీరాలని సెలవిచ్చినారు."

మారసింగమయ్య:- "అంతవరకూ మాకూ సుఖంగా నిద్రపట్టదు. ఈ హొయిసళ రాజ్యానికి తలనొప్పివలె ఉన్నాడు. మాసణద్రోహి, మాళవరాజు వాని వీపు తడుతున్నాడు. ఎరెయంగ ప్రభువులు మాళవ రాజు రాజధాని ధారానగరాన్ని ఒకసారి నేలమట్టంచేసినా వారి పొగరు అణగలేదు. ఈ మాసణద్రోహి రణపిరికి; కొండలు గుట్టలులో దాగుకొని,

పాపం, ఆ పల్లెపట్టువారిని బెదిరించి దోచుకొంటాడు. వారి గొడ్డుగోదా దొంగిలిస్తాడు. పైరు పచ్చ కాల్చివేస్తాడు. ఆ దొంగతో మరికొందరు ద్రోహులు చేరారు. ఈసారి వాడిని పెడరెక్కలు విరిచికట్టి, గడ్డిమూట కట్టి తెచ్చి ప్రభువుల పాదాలకడ పడవేస్తాను. భగవంతుడు దీనిని నడిపించుకోనీ.''

మాచికబ్బె :- ''మీ ధీరత్వానికి తగినమాట అన్నారు. అక్కగారు ఈ మాటవిని సంతోషపడేరు.''

మారసింగమయ్య :- ''మాచీ, చెప్పిచేయడం పొల్లు; అది ఆత్మ ప్రశంస. ధీమంతుడు, కార్యదక్షుడు పొగడ్తకు, పెద్దరికానికి ఏదీ చేయడు. గంగరాజులుగారినుంచి ఈ విషయం నేర్చుకోవలె. ఇలాటి నాలుగు రాజ్యాలుకట్టి నడిపే సత్త్వం తేజస్సు వారికి ఉన్నవి. వారే ఈ మారు కత్తిపట్టి సీమాప్రాంతాలకు వస్తారట. వస్తే శత్రులపాల పిడుగుపడ్డట్టే. సత్య పరాక్రములైన గంగరాజులుగారు, ధర్మదేవతలవలె ఇతర మంత్రులూ మన ప్రభువులకు ఉన్నప్పుడు హొయిసళరాజ్యం గగనచుంబి కావడంలో సందేహమే లేదు. ఇట్టి మహాభాగుల కాళ్లు కడిగి కన్యను ధారపోసే పుణ్యం మనదికానీ! మాచీ, మనదికానీ!''

మాచికబ్బె :- ''కానీ, మనదికానీ. మీరు గమనించే ఉంటారు. ప్రభువులు శాంతలను ఒకమారు చూచికూడా, మరొకమారు చూచినారు.''

మారసింగమయ్య :- ''ఈ విషయంలో మా కండ్లకు అగోచరమైనది మీ కండ్లకు గోచరమవుతుంది. ఆ ధర్మనిరతుడు అంత సులభంగా కామి కాడు.''

మాచికబ్బె :- ''కామనతో కాకపోతే, కేవలం ఉత్సుకతతో చూచి ఉంటారా?''



మారసింగమయ్య :- ''ధర్మేశస్వామి ప్రభువుల హృదయాన్ని శాంతలకు అనుగ్రహించనీ. మాచీ, నీ దేహం, మనస్సు సంతోషంతో నిండి తొణికిసలాడనీ.''

మాచికబ్బె :- ''నూరుసార్లు అలాగు అనండి. తథాస్తు. తథాస్తు. మీ నోట్లో తేనె పాలు సోనలై కురవనీ.''

మారసింగమయ్య :- ''మాచీ, ఆత్మానుబంధం ఉంటే పెండ్లి అయ్యే అవుతుంది. అది లేకపోతే, సకల ప్రయత్నాలూ విఫలమవుతాయి.''

ఇంతలో మారసింగమయ్య, మాచికబ్బె ఎక్కిన మేనా ఇల్లుచేరి నిలబడింది.

# 13

ఉపనయనం జరిగి ఆరేడు నాళ్ళయినవి. ఉత్సవోత్సాహంలో చాల అలసిన దాసదాసీ జనం విశ్రాంతి పొంది తేలికపడ్డారు. ఒక శుక్రవారం సాయంకాలం రాజమాత అవరోధంలో పేరంటం ఏర్పాటుచేసి పుర ప్రముఖుల భార్యలను, అధికారుల కుటుంబాలను ఆహ్వానించినారు.

శాంతల వీణ వాయించి, పాడడం అందరూ విని ఆనందించవలెనని రాజమాత ఆ పేరంటం ఏర్పాటు చేసినారు. ''నేనొకతే వాయించి పాడడానికి సిగ్గుపడుతాను., లక్ష్మి కూడ నా జతలో వాయించి పాడేటట్టయితే...''అని తన తల్లి ద్వారా రాజమాతకు మనవి చేసుకొన్నది శాంతల. ''దాని కేమి? మరీ మంచిదే అయింది; లక్ష్మి కూడ శాంతల జతలో వీణ వాయించి పాడనీ!'' అన్నారు రాజమాత.

నిర్ణీతమైన నాడు, నిర్ణీతమైన వేళకు అంతఃపురానికి బయలుదేరడానికి ముందు శాంతల, లక్ష్మి స్నానంచేసి, మడివస్త్రాలు కట్టుకొని,

శారదను శ్రద్ధాభక్తులతో పూజించి, వీణలను శారదాదేవి పాదకమలాల సన్నిధిని ఉంచి, స్థైర్యమిమ్మని, అనుగ్రహించమని వేడి, తర్వాత ఆ వీణలను తీసుకొని, సమశ్రుతిలో పెట్టి కలిసి పాడి దేవిని స్తుతించినారు. తమ శారీరానికి వీణాధ్వనికి చక్కగా మేళవించే శ్లోకవృత్త కీర్తనలు ఇలాటివి ఇలాటివే వాయించి పాడాలని నిర్ధరించుకొన్నారు.

ఏలక్కులు, లోకమిరియాలు, తేనె కలిపి కాచిన వేడిపాలను మాచికబ్బె కుమార్తెలకు తెచ్చియిచ్చినారు. శాంతల, లక్ష్మి ఆపాలు ఆరగించినారు. నగరులో జరిగిన ఉపనయన మహోత్సవంనాడు రాజమాత తమకు ఉడుగరగా ఇచ్చిన లేత పసుపురంగు చీనాంబరాలు ధరించి, ఆ రంగు వక్షోవస్త్రాలనే ఆచ్ఛాదించుకొనినారు. ఆ నవ పట్టువస్త్రాలు, వాటిరంగూ వారి లావణ్యాన్ని ఇనుమడింపజేసింది. ఇద్దరూ వివిధాభరణాలను ధరించినా, శాంతల లక్ష్మికి, తానే, ఎక్కువ సొబగైన నగలు పెట్టింది. ఇద్దరూ కొప్పునిండా పూవులు తురుముకొని, దేవిని అర్చించిన కుంకమను నొసట దిద్దుకుని, మరొకమారు శారదాదేవికి సాష్టాంగపడినారు. తమ వీణలను తామే మెలకువతో తీసుకొనివెళ్ళి మేనాలో పెట్టి మాచికబ్బెకు నమస్కరించి ఆశీర్వాదాలుపొంది, అనంతరం మేనా ఎక్కి కూర్చున్నారు. బోయిలు మేనాను మోసుకొని అంతఃపురానికి నడిచినారు. మాచికబ్బె మరొక మేనాలో అంతఃపురానికి వచ్చినారు.

అంతఃపురంలోని లక్ష్మీవిహార సభాంగణం ఆనాడు మహోదాత్తంగా అలంకృతమయింది. ఎరెయంగ మహారాజులుంగారి కాలంలో మహాదేవి అక్కగారి కోసమే కట్టించిన భవ్య విహారమది. కొత్తగా శుద్ధాంతానికి వచ్చిన పత్నిని సంతోషపెట్టడానికి, తమ హృదయానురాగాన్ని వ్యక్తపరచడానికి ఎరెయంగ మహారాజులుంగారు అపారధనం వెచ్చించి దాన్ని కట్టించినారు. "నవవధువు, దూరదేశస్థురాలు, పుట్టింటిని తలచి తలచి అంగలార్చిపోయీని" అని, కుబేరుని వైభవస్థానంవలె ఉండవలెనని, దేశంలోని ఉత్తమ శిల్పులను, కళాకోవిదులను పిలిపించి ఆ సభాంగణాన్ని నిర్మింపజేసినారు ప్రభువులు.



నేడు ఆ సభాంగణం నూరారు, వేయారు సుగంధతైల దీపాలలో జాజ్వల్యమానంగా వెలిగింది; పరచిన చిత్రవిచిత్ర రత్నకంబళాలతో, కట్టిన రంగురంగుల పూలతోరణాలతో, స్తంభాలకు, కుడ్యాలకు అలదిన రంగురంగు చారలతో శోభాయమానమయింది.

ఆహూతులయిన మహిళలందరూ ముందుగానే వచ్చి, తమకోసం ఏర్పాటయిన స్థలాలలో కూర్చుని ఉన్నారు. సభాంగణం మధ్య ఎత్తుగా కట్టిన వేదికమీద వైణికలిద్దరికీ పీఠాలు అమర్చినారు.

పాడి వీణవాయించే పుణ్యాత్మురాలు ఎవరని సభంతా కాచుకొని చూస్తున్నప్పుడే అక్కచెల్లెళ్ళవలె ఉన్న గంధర్వ కన్యలిద్దరు, అంతఃపుర చేటికలు ముందు దారిచూపుతుండగా, మార్దవం ఒలికిస్తూ, మందగమనంలో వచ్చి, వేదిక ఎక్కి చుట్టూచూచి, ఉత్తమోన్నత రజతాసనంలో ఆసీనలయి రాజమాతకు, వారిదగ్గరే కూర్చున్న మాచికబ్బెకూ వందనం చేసి, సభకూ నమస్కరించి, కూర్చున్నారు. అనంతరం చేటికలు తెచ్చిపెట్టిన వీణలను ఇద్దరూ భక్తితో స్పృశించి కళ్ళకద్దుకుని, వీణలను చేతుల్లోకి తీసుకున్నారు.

"ఈ సొగసైన వైణికలు ఏదేశం వారో! బహుశః మహాదేవి అక్కగారి దేశంవారేమో?" అని సభలోని వారందరికీ సందేహం వ్యాపించింది. "మంగళకరం, సర్వాంగసుందరం, మనోహరం అయిన ఈ రూపం, ఈ ఎదుగు బొదుగులు, మనదేశంలో అరుదు." అనుకున్నారు. తల్లి శారద శాంతలకు, లక్ష్మికి ఆనాడు అంత వర్చస్సును దయచేసినది. రాజమాతకు ఆ కన్యల ఆనాటి వర్చస్సు కన్నులకు కట్టినట్టయింది.

చాలసేపటికి ఒకరిద్దరు శైలులు వారిని గుర్తుపట్ట గలిగినారు. 'శాంతల, లక్ష్మి' అనే సంగతి గుసగుసగా సభంతా వ్యాపించి, అందరికీ సంతోషాశ్చర్యాలు కలిగాయి.

శాంతల, లక్ష్మి మనస్సులోనే శ్రీ శారదాదేవిని ప్రార్థించి, తంతులను మీటీ-మీటగానే, ప్రతిధ్వని ఆ జోడు వీణల ఝంకారం అలలు అలలుగా సభంతా నిండింది.

"అక్కగారు శాంతల వీణను వాయించి పాడడం విన్నారు గదా! మరెందుకు ఈ దొడ్డ సంబరం ఏర్పాటు చేసినారు ? ఇంకే పరీక్షకోసం? రాజమాత మనస్సులో ఏముందో? "జినేశా, ఈ ఇద్దరూ నీ బిడ్డలు. తల్లీ శారదా, ఈ పిల్లల కిద్దరికీ ధైర్యం, కంఠపుసిరి కరుణించి కాపాడు." అని మాచికబ్బె ప్రార్థిస్తూ కూర్చున్నారు.

శాంతల, లక్ష్మి కూర్చున్న వేదిక ముందుభాగంలో ఉన్న ఉప్పరిగలో రంగుల పట్టు యవనిక వెనుక అమర్చిన మూడు ఉత్తమాసనాలలో విష్ణువర్ధన ప్రభువులూ, గంగరాజులుగారు, హేమాద్రి తంత్రపాలులూ ఆసీనులయినారు. ఆ యవనికలో ఇతరుల కంటబడని ఒక సందుగుండా ప్రభువులు సభను, వైణికలను చక్కగా చూడగలిగేవారు; చూచినారు.

వైణిక లిరువురూ విఘ్నేశ్వర శారదాస్తుతులతో మొదలుపెట్టి, శివస్తుతిని, విష్ణుస్తుతిని వీణపై పలికిస్తూ పాడినారు. వృత్తగీత నృత్య సాహిత్యాలను శ్రావ్యంగాపాడి, వీణపై పలికించినారు. అతుల రూప సంపత్తిలో గంధర్వ కన్యలవలె ఉన్న ఆ సమవయస్సు లిద్దరూ పెక్కేళ్లు సహపాఠినులై శ్రమ సాధ్యమైన విద్యను అభ్యసించి దేవదత్తమైన కోమలకంఠ శ్రీలను వీణానిక్వణంలో మేళవించి పాడినప్పుడు, అంబరంలోని దేవతలూ నిలిచి వినేరు; ఇక మానవులు నాదపరవశులు కాక పోవడం సాధ్యమా ? అన్లే, ఆ సభలోని వారందరినీ మంత్రముగ్ధులను చేసింది శాంతలాలక్ష్ముల ఆ గాంధర్వ విద్య. ఇద్దరు బిడ్డల పెక్కేళ్ళ సాధన తపస్సు ఆనాడు ఒక రూపంలో సిద్ధించింది.

ప్రభువులూ చూచినారు; విన్నారు; సంతసించినారు. గంగరాజులు గారూ, హేమాద్రి పండితులూ ప్రభువుల సంతుష్టిని గ్రహించినారు.

గాయనం సమాప్తం కాగానే, అంతఃపురపు కట్టడి ముత్తైదులిద్దరు వేదికమీదికి వచ్చి, అక్కడ వేంచేపు చేసిన శారదా విగ్రహానికి హారతి యిచ్చి, ఇద్దరు గాయనులకు ఎవరి దృష్టిదోషమూ తగులవద్దని రక్ష ఇడి



నారు. తర్వాత కన్యలిద్దరూ వేదికనుంచి దిగివచ్చి రాజమాతకు, మాచికబ్బెకూ వినయ భక్త్యాదరాలతో నమస్కరించినారు.

సహృదయలు, సరసలు అయిన రాజమాత ఆనందాతిశయంలో శాంతలను, లక్ష్మిని సమంగా, కౌగిలించుకొని, మురిసిపోయినారు. మాచికబ్బె పిల్లల తలపై చేయి ఆనించి, "మీరిద్దరూ శారద కుమార్తెలు. ఆ తల్లి నేడు తన కుమార్తెలను చక్కగా కాపాడుకొన్నది" అని ఆశీర్వదించినారు. తర్వాత సభలోని వనితలకు పూవులు, చందనం, వీడెము పంచడమైనది. వారందరూ తమతమ ఇండ్లకు తరలినారు. దారి పొడువునా శాంతల లక్ష్మి పాడి, వీణ వాయించిన ప్రశంసే; వారి రూప లావణ్యాల ప్రశంసే. తమ కూతుర్లూ ఈ విధంగా వీణ వాయించి, పాడడం నేర్చుకోవాలని ఎందరో తల్లులు ఆ క్షణమే నిర్ధరించుకొన్నారు. గాంధర్వ విద్య శ్రమసాధ్యం మాత్రమేకాక పూర్వపుణ్యం కలవారికి మాత్రమే లభిస్తుందని ఆ ముగ్ధలకు ఏమి తెలుసు ?

అక్కడ గంగరాజులుగారు, హేమాద్రి పండితులూ ప్రభువులకు నమస్కరించి సెలవు తీసుకొని తరలడానికి సిద్ధంగా ఉన్నారు. ప్రభువులు తమ ముఖంలో ఏ భావమూ వ్యక్తపరచక గంభీరవాక్కుతో "వాద్యం, గాయనం తమ మనస్సుకు వచ్చినవా ?" అని ప్రశ్నించినారు. సూక్ష్మగ్రాహులయిన భీష్ములు "అది ప్రభువులే సెలవివ్వవలె." అని సమాధానమిచ్చినారు. ప్రభువులు చిరునవ్వుతో "చక్కగా ఉందికదూ? ఇద్దరూ అన్ని విషయాలలోను సమంగానే ఉన్నారుకదూ?" అని చెబుతూ, ముందుకు అడుగులు వేసినారు. భీష్ములు ముక్కుమీద వేలువేసుకొన్నారు.

అందరూ తమతమ ఇండ్లకు పోగా, లక్ష్మి విహారంలో ఇక మిగిలిన వారిద్దరే; రజితాసనం అలంకరించిన రాజమాత, దగ్గర నిలుచున్న మాచికబ్బె. శాంతల, లక్ష్మి వీణ వాయించి పాడిన వైఖరిని రాజమాత నోరార పొగడినారు. "ఆనాడు మా ముందు పాడి వాయించిన దానికన్న నేడు నూరింతలు బాగుంది, మాచీ, సమవయస్కులై, రూపగుణ విద్యా శీలాలలో సమానలై ఒకరి హృదయం మరొకరు చక్కగా

గ్రహించుకొన్న ఈ బిడ్డలు కలిసి చదువుకొన్నవారు, కలిసి ఆడుకొన్నవారు మాత్రమే కాదు, పొందికతో ఉన్న వారి మనోధర్మాలు ఆత్మసామీప్యాన్ని సూచిస్తున్నవి.'' అంటూ రాజమాత రజతపీఠం నుంచి లేచి, మాచీ, ఇంత చక్కని నీ నగను మేము లాక్కోవాలా?'' అన్నారు. దానికి మాచికబ్బె "దానిని నేనే సంతోషంతో తమకు అర్పిస్తున్నాను, అక్కగారివద్ద ఉండవలసిన నగ అది; అది అక్కడ ఇంకా హెచ్చు శోభిస్తుంది'' అని సమాధానమిచ్చినారు.

## 14

శాంతల, లక్ష్మి కూర్చున్న మేనా ఇంటివైపు బయలుదేరింది. కొంతసేపు ఇద్దరూ మౌనంలో ఉన్నారు. శాంతల ఆనాడు వీణపై వాయించిన, పాడిన అన్ని రీతులూ పూవులు పట్టుకొని ఎత్తినట్లు తేలికగా, రాగయుతంగా, తనకే భ్రమ గొల్పేరీతిగా, ఒనగూడిరావడం, తల్లి శారద కరుణతోనే అని మనసులోనే ఆశ్చర్యపడుతున్నది. "నా వీణా వాదనానికి నడకయిచ్చి, పాటకు ధ్వనియిచ్చి మనస్సుకు ఉత్సాహోల్లాసాలు కలిగించి ముందుకు నడిపినది లక్ష్మి. శ్రీ శారదాదేవే లక్ష్మి రూపంలో నాతో ఉంది, కరుణించి కాపాడింది నా తల్లి.'' అని తలపోసినది శాంతల. ఒకసారి మెడయెత్తి "లక్ష్మి ఏమిచేస్తున్నదో'' అని చూచినది. లక్ష్మి తల వంచుకొని, ఏదో మహా యోచనలో మగ్నురాలయినట్లు కనిపించినది. "ఎందుకు లక్ష్మీ! ఏమి యోచన చేస్తున్నావే? సంతోషపడవలసిన సమయం కదా ఇది. నా తల్లి, నీవు ఈనాడు నన్ను కాపాడినావు. ఎంత పక్కబలమయ్యావు? ఎంత ధైర్యమిచ్చినావు? లక్ష్మి, నేడు పాడి వీణ వాయించిన దానివి నీవు. నేను నిన్ను వెన్నంటిన దానిని, అంతే. నీవు మాత్రం ఈనాడు ముందడుగు వేయకపోయి ఉంటే, నా చేయి, నోరు కట్టిపోయేవే.'' అని హృదయం విచ్చి మాటలాడినది శాంతల. లక్ష్మికి కూడా శాంతల విషయంలో అదే భావన కలిగింది. అయితే, లక్ష్మి మాటలాడలేదు; మాటలాడడం సాధ్యం కాలేదు. తన మనస్సు కల్పించిన



భయం పెనుభూతంవలె ఆమె మనస్సును చీకటి చేసినది. "లక్ష్మి ఎందుకు మాటలాడదు?'' అని శాంతలకు భయమయింది. లక్ష్మి చెక్కులు పట్టుకొని పైకెత్తి "లక్ష్మి!'' అనినది. అప్పుడు లక్ష్మి కన్నులనుంచి వేడి కన్నీటి చుక్కలు రెండు శాంతల చేతిమీద పడినవి. శాంతల చాల భయపడినది. "లక్ష్మి! పలుకవమ్మా! ఏమిటిది? ఏమిటి నీ బాధ? ఎవరు ఏమన్నారో చెప్పు లక్ష్మి?'' అని ఎంతో అక్కరతో, అధైర్యంతో తటపటులాడుతూ అడిగింది శాంతల. లక్ష్మి కన్నీటిబొట్లు ఇప్పుడు ప్రవాహరూపం దాల్చినవి. దుఃఖంతో బిగుసుకొనిన కంఠస్వరంతో లక్ష్మి "అక్కా!'' అన్నది. శాంతల లక్ష్మిని తన రొమ్ముకు హత్తుకొని, "చెప్పవే, నా యమ్మా, చెప్పు. నీకేమిటి బాధ? ఏమిటి బాధ?'' అని కన్నతల్లి బిడ్డ దుఃఖాన్ని అడిగినట్లు అడిగినది.

లక్ష్మి తలలో ఏమేమి యోచనలు దూరినవో? మనస్సులో ఏమేమి కల్పించుకొన్నదో? ఆమె తలయెత్తి, "అక్కా, నీవు రాజుగారిని పెండ్లాడుతావె, అంతఃపురానికి బయలుదేరిపోతావె. ఇక నీ సహవాసం నాకు దూరమవుతుంది కదా! అని దుఃఖమవుతున్నది.'' అనినది.

"అయ్యో! పిచ్చిదానా! ఇలాగని నీకు చెప్పినవారెవరే? లేనిదంతా కల్పించుకొని ఊరికే దుఃఖపడుతున్నావు.''

"అక్కా, ఇది కల్లకాదు; కల్ల కాకూడదు.''

"లక్ష్మి, ఇది నాకు సంబంధించిన ప్రశ్న కాదా? నిర్ధరించేదాన్ని నేను కాదా?''

"ప్రభువులే చేయిచాచివస్తే, ఒల్లను అంటావా?''

"ఇంకేమి చెప్పనే?''

"అలాంటి మహానుభావుని చేపట్టడానికి జన్మాంతరాల తపస్సు చాలదు. అక్కా, గుణంలో, రూపంలో, ఐశ్వర్యంలో, ధైర్యవీరోదారతలలో, దైవభక్తిలో, ధర్మశ్రద్ధలో నీకు సాటి ఉన్నారా?

అక్కా, నీవు ఈ మహానుభావులను చేపట్టి మహోన్నతురాలువా. ఆ మహాభాగ్యం నా అక్కదికాని."

"అయితే, ఆ కన్నీరెందుకే లక్ష్మీ ?"

"స్వార్థం, కేవలం స్వార్థం. నీవు ఇక నాకు దూరమైపోతావు కదా అని."

"పిచ్చిదానా, పిచ్చిదానా, లేనిసంగతులను కల్పన చేసుకొని, మనస్సును వృథాగా నొప్పితెచ్చుకుంటున్నావు."

"అక్కా, కూతురిని ధారాదత్తంచేసిన వెంటనే తల్లి హృదయం కన్నీరుపెట్టదూ ? అలాటిదే నా ఈ కన్నీరు."

"లక్ష్మీ, నీ అపేక్ష అపారం. కన్నీరుతుడుచుకో నాతల్లీ. శ్రీశారద మన ఇద్దరిని వేరు చేయదు."

"అలాగు అనకు, అక్కా. నీవు మహారాజ్ఞి కావడానికి మనస్నేహం అడ్డు రాకూడదు. అక్కకు కల్యాణమయితే నాకు సంతోషంకాదా ? పది పదిహేను సంవత్సరాలు కలిసి మెలిసి ఉన్న మాలిమి (ప్రేమ) ఈకన్నీరు. ఈనాడు కాకపోతే రేపు, మరునాడు, ఏదో ఒకనాడు నీవు పెండ్లాడవలసే వున్నదికాదా ? ఒకరి నొకరం విడిపోక తప్పదుకదా ? అక్కా, నీ వెక్కడైనా ఉండు, శారదకు నీ నిత్యపూజను నేను సమర్పిస్తాను. ఆ దేవాలయంలోనే నేనొక్కతెనే కూర్చుని తపస్సు చేస్తాను."

"లక్ష్మీ, ఏమిటా మాటలు ? నీవూ పెండ్లాడవలె కదా ?"

"అక్కా, ఏమిటి నీప్రశ్న ? నేను పెండ్లాడను. ఈఊరినుంచి, నీ సామీప్యంనుంచి, తల్లి శారద సాన్నిధ్యంనుంచి నేను దూరమై ఉండలేను. ఖండితంగా దూరమై ఉండలేను."

ఇలాగు అంటున్నప్పుడు లక్ష్మీ కన్నీరు ధారలై పారింది. శాంతల కన్నీటి కట్టయూ తెగినది.



మేనా ఇంటిముందువచ్చి ఆగింది. దుఃఖితులిద్దరూ మేనానుంచిదిగి ఇంటిలోకి వెళ్ళినారు. పెద్దబయ్య మేనాలోని వీణలను ఫలపుష్పాలను తీసుకొనివెళ్ళి శారదామందిరంలో పెట్టినారు.

లక్ష్మీ మనస్సును తొలుస్తున్న యోచనకంటె నూరింతలు కఠినమైన ప్రసంగం ఇప్పుడు శాంతల బుద్ధి తొలవడం ఆరంభించింది. "ఒకవేళ లక్ష్మీ ఊహించినట్లు ప్రభువులు తన్ను వివాహమాడడానికి వస్తే, తన కర్తవ్యమేమి ? లక్ష్మీ కర్తవ్యమేమి ? లక్ష్మీ విషయంలో తాను ఎలాగు నడుచుకోవాలి ? లక్ష్మీకూడ అవివాహిత అయితే, ఆదోషం ఎవరిది ? అది తన తప్పవుతుందా ? లేక లక్ష్మీదేనా ?" అనే కఠిన ప్రశ్నతో శాంతల మనస్సు తల్లడపడినది.

అంతకు ముందు గాయన సాహచర్యపు ఆనందాతిశయంలో సంబర పడుతున్న ఆత్మలు రెండూ ఇప్పుడు మహాయోచనమూ, భయానికి పాల్పడినవి. ఇప్పుడు వారి ఎదుట ఉన్నది మహాకఠినప్రశ్న. మనుష్యయత్నానికి మీరిన ప్రశ్న. ఈ పరిస్థితిలో లక్ష్మీని వారి యింటికి పంపించడానికి శాంతలకు మనసురాలేదు. దేవయ్యను పిలిచి, "పెరుమల పండితుల యింటికి వెళ్ళి, వారిని దర్శించి, లక్ష్మీ ఇక్కడే ఉంటుందని మనవి చేసిరా." అని చెప్పి పంపివేసినది.

శాంతల ఆకలికాలేదని చెప్పి పాలుమాత్రం తెప్పించుకొని, లక్ష్మీ చేయిపట్టుకొని, తన శయ్యాగృహానికి పిలుచుకొని వెళ్ళినది.

"లక్ష్మీ, పాలు త్రాగు. భోజనం వద్దన్నావుకదా. పాలయినా త్రాగు." అని అన్నది.

"నీవు త్రాగు అక్కా. నాకు కొంచెమైనా ఆకలిలేదు."

"నీకు వద్దంటే, నాకూ వద్దు. నాకు మాత్రం ఆకలి ఏదీ ?"

లక్ష్మీ నామమాత్రంగా కొద్ది పాలు మరొకపాత్రలో వంచుకొని, రెండు గుటకలు త్రాగి కింద పెట్టింది. అప్పుడామెకు అమృతమూ అక్కర

వుండలేదు. శాంతల కూడా పాలు తాకలేదు. లక్ష్మి నగలు తీసిపెట్టి అక్కశయ్యపై బోరగిల పడుకొని ముఖం మూసుకొన్నది. ఆమె ఉన్న రీతినిబట్టి, ఇంకా దుఃఖపడుతున్నట్టే శాంతల తెలుసుకొంది. శాంతల లేచి, తన నగలుతీసి, దీపం తగ్గించి, తానూ మంచంమీద పడుకొని, తడిసి ముద్దయిన తన చెలి ముఖాన్ని తన వక్షంమీదికి లాగుకొని, "లక్ష్మి, మళ్ళీ ప్రారంభించినావా ?" అని అన్నది.

"లేదక్కా. ఏడువరాదు, ఏడువకూడదు అని అనుకుంటాను. కాని మళ్ళీ ఏడుపు తనకుతానే పొంగివస్తున్నది. నా హృదయానికి నేనే సమాధానం చెప్పుకుంటున్నాను.- అక్క ఎక్కడికి పోయిని? ఇదే నగరంలో నగరులోకదా ఉంటుంది. కావలసినప్పుడు నేనే అక్కడికిపోయి చూచి రావచ్చు గదా? కావలసినప్పుడు అక్కకూడా పిలిపించుకోవచ్చును కదా? అని ... ... అయ్యో! ఇదేమి వెర్రే నాకు? మహా సౌభాగ్యవతి అవుతున్న, మహారాజ్ఞి అవుతున్న నిన్ను నేను అడ్డగించనా? అడ్డగించ వచ్చునా? వెర్రి హృదయం ఏడవడం ఎందుకో ?" అనినది లక్ష్మి.

అయితే, ఇప్పుడు ఎక్కువగా దుఃఖిస్తున్నది శాంతల హృదయం. ఈ యిద్దరి సహృదయ స్నేహం ఇంత నొప్పిగా పరిణమించింది. మధుర భావమయి అయిన శాంతల లక్ష్మి పరిస్థితిని చూచి భయపడింది. చూడ గూడనిది చూచింది, తలపరానిది తలచింది. చాలసేపటివరకూ శాంతల అట్లే యోచిస్తూ ఉన్నది. లక్ష్మి అక్క గుండెలపై తలపెట్టి దానిని కన్నీటిలో తడుపుతూనే ఉన్నది. ఇద్దరి అంతరంగాలూ కరిగి నీరయాయి.

శాంతల తన గుండె చల్లబడగా, లక్ష్మి ముఖాన్ని తన రెండు చేతులతోను ఎత్తి, "ఎంత పొద్దు ఏడవడమే లక్ష్మి? కుదుటబరచుకోవే. నిన్ను వదలి స్వర్గానికికూడా నేను పోనే." అన్నది.

ఆమాట లక్ష్మికి విశ్వాసం కలిగించేదయినా, ఆమె దానిని విని పిడుగు పడినట్లు ఉండిపోయినది. "తన ప్రీతి విశ్వాసాలు అక్కనోటినుంచి ఇంతటి ఘోరప్రతిజ్ఞ చేయించినవికదా ?" అని లక్ష్మి భయంతో వడకి



పోయినది. తన హృదయం తపించి, "అయ్యో! అక్కా, ఎలాటిమాటలు అన్నావే". అని లక్ష్మి తన కుడిచేతితో శాంతల నోటిని గట్టిగా మూసి, "నామీద ఒట్టు...ఆ మాటను ఉపసంహరించుకో అక్కా...ఉపసంహరించుకో. నేను నీకన్నా చిన్నదాన్ని. పసిపాపనుగాను; ప్రౌఢనుగాను. నీకున్న ఓర్పు, వివేచన నాకు ఎక్కడవస్తాయి? ఎందుకు ఏడిచానో నాకే తెలియదు. ఏడవకుండ ఉండనూ లేకపోయాను. శాంతం పాపం, శాంతం పాపం. అక్కకు అభ్యుదయం కలుగనీ. సుఖసంతోష సామ్రాజ్యం లభించనీ. నాకు అంతకన్నా హితమైనది మరొకటిలేదు. మరే సంతోషమూ నాకు వద్దు. ఇది దుఃఖంకాదు అక్కా, విచిత్రమైన సంతోషం. నేను దుఃఖపడుతున్నానని నీవు భావించి ఎలాటి భీకరమైన మాట అన్నావు! నన్ను మన్నించు. నన్ను మన్నించు. నీవన్నమాట విడిగింది, విడిగింది. శారదా, మాయిద్దరినీ కాపాడవమ్మా!" అంటూ లక్ష్మి మరల వెక్కి వెక్కి ఏడువసాగినది.

ఏడిచే పసికందును తల్లి ఓదార్చేటట్టు, శాంతల లక్ష్మి తలపై తడుతూ, "ఇక ఏడవకు, లక్ష్మి, చాలించవే. అమ్మ విని ఏమయిందోనని భయపడి వచ్చేరు. సద్యుకు ఆపు." అని సమాశ్వాసించింది.

## 15

నగరునుంచి ఇల్లుచేరిన మాచికబ్బె సరాసరి పతి ఉన్నచోటికి వచ్చినారు. మారసింగమయ్య అప్పుడే భోజనం ముగించి ఉప్పరిగమీది చంద్రశాలలో చంద్రికను అనుభవిస్తూ కూర్చున్నారు.

సేవకు డొకడు మాచికబ్బెకు సుఖాసనం తెచ్చివేసినాడు. మాచికబ్బె దానిలో కూర్చొని, "భోజనమయినదా," అనే ప్రశ్నతో సంభాషణకు ఉపక్రమించినారు.

"మీ అందరికోసం కాచుకొని కాచుకొని, విసిగి ఇప్పుడే భోజనం ముగించి ఇక్కడికి వచ్చి కూర్చున్నాను. నీవూ వచ్చి చేరావు. పిల్లలు చక్కగా పాడినారా ?"

"ఆ సంగతే చెప్పడానికి వచ్చినాను."

"చక్కగా వీణ పలికించినారా? చక్కగా పాడినారా? సభలో ధైర్యం కోల్పోలేదుగదా? రాజమాత, ఇతరులూ మెచ్చుకొన్నారా? ఇంత పొద్దెందుకు పోయింది?"

"సభ ముగిసి చాల పొద్దయింది. నేను నిదానంగా వచ్చినాను. అక్కగారు నిలుపుకొన్నారు."

"ఊ."

"ఈ దినం బిడ్డల హృదయంలో తల్లిశారదాదేవే వేంచేసింది." పిల్ల అంత చక్కగా వీణ వాయించి పాడినది మనంకూడా వినలేదు.

"ఊ ..."

"మేమంతా రిచ్చపడిపోయినాము. అక్కగారి కంతూ చెప్పలేనంత ఆనందమయినది. మన అమ్మాయి భాగ్యం; అక్కగారు బంగారంవంటి మాట అన్నారు."

"ఊఁ ..."

"మాచీ, నీ ఇంత చక్కని నగను మేము లాగుకోవచ్చా? – అన్నారు."

"ఊఁ!"

"నేనే మనసార ఆ నగను తమకు అప్పగిస్తాను. అక్కగారివద్ద అది ఇంకా హెచ్చుగా శోభిస్తుంది – అన్నాను."

"ఊఁ!"

"హేమాద్రి పండితులు నా చెవిలో అన్నారు: ప్రభువులు ఉప్పరిగలో తెర వెనుక కూర్చుని విన్నారని."

"ఊఁ!"



"ఇదేమి? నేను మీకు కాకమ్మ గువ్వమ్మ కతలు చెబుతున్నానా, మీరు ఊరికే ఊగొట్టడానికి? మీకు ఉత్సాహం లేదా?"

"ఉండకుండా ఉంటుందా? మేము యోధులం. నొప్పినీ సహించగలం, నిండు సంతోషాన్నీ సహించగలం. ఈ రెండూ మీకు సాధ్యం కావు."

"ఇదొక బింకం. బిగుమానం. సద్య రేపు ఒకవేళ అక్కగారే మిమ్మల్ని పిలిపించినప్పుడు, లేక గంగరాజులుగారే అడిగినప్పుడు మీరు ఇలాగే మోర పాడవు చేసుకొని ఊఁగొట్టకండి. మీకు మనస్సులేదేమోనని శంకించేరు. సద్య, మన అమ్మాయి భాగ్యం, పుణ్యం, ధర్మేశ్వరుని కృప; తల్లి శారద అనుగ్రహం. ఇప్పుడు మీరంటున్న 'హూఁ' ప్రభువుల నోటినుంచి కూడా వెడలివస్తే మనం ధన్యులం, శాంతల ధన్యురాలు."

"ఊఁ!"

"ఇదంతా దైవయత్నమే కాని, మరొకటికాదు. శారదే రేపు ప్రభువుల ముఖంలో నిలచి "ఊఁ" అనిపిస్తుంది నా తల్లి."

"తథాస్తు! తథాస్తు! మాచీ, నీ నోట్లో తేనే పాలు కురియనీ. పోయి భోజనంచేయి. ఎంతో పొద్దు పోయింది."

అప్పుడు దేచయ్య "అమ్మగారూ, భోంచెయ్యడానికి..." అంటూ వచ్చినాడు. మాచికబ్బె వాణ్ణి "శాంతలమ్మగారు భోజనం చేసినారా?" అని ప్రశ్నించినారు. "లేదండమ్మగారూ. భోంచెయ్యలేదు. శాంతలమ్మగారు, లక్ష్మమ్మగారు ఇద్దరూ ఆకల్లేదు, పాలే చాలు అన్నారండీ. లక్ష్మమ్మగారూ ఇక్కడే పండుకొన్నారండీ. నేను పండితులవారి మేడకి ఎళ్ళి మనవిచేసి వచ్చానండి", అనినాడు దేచయ్య.

"పిల్లలెందుకు ఇలాగు ఉపవాసంలో పడుకున్నారో! అంత సేపు పాడి, వీణ వాయించి, ఆకలితో ఉండి ఉంటారుకదా? చాల అలసిపోయినందున ఒకవేళ అలాగే పడుకున్నారో ఏమో! నిద్ర వచ్చినా?"

అని ఆ తల్లి కడుపు బాధించింది. మాచికబ్బె కిందికి దిగిపోయి, శాంతల శయ్యాగృహం తలుపు మెల్లగా తట్టి "శాంతలా! లక్ష్మీ!" అని మృదువుగా పిలిచినారు.

లక్ష్మికి నిద్రపట్టింది. యోచనతో ఉన్న శాంతల ఇంకా నిద్రపోలేదు. పిలిచినది తన తల్లి అని తెలిసి, లక్ష్మికి నిద్రాభంగం కానట్టు నెమ్మదిగా మంచం దిగివచ్చి, తలుపులు సద్దులేకుండా తెరిచి, వెలుపలికి వచ్చి, మళ్ళీ తలుపులాగి మూసి, తగ్గు గొంతుతో "అమ్మా, లక్ష్మికి ఇప్పుడే కునుకు పట్టినది." అన్నది.

"ఎందుకమ్మా, ఇద్దరూ భోజనం చేయకనే పడుకున్నారెందుకూ? అక్కగారు ఈనాడు చాల మెచ్చుకొన్నారు. జనమంతా సంతోషపడినారు. నీ శారదా అనుగ్రహం; మీ యిద్దరి నాలుకమీద వేంచేసి పలికినది ఆ మహాతల్లే. అయ్యో! లక్ష్మి ఉపవాసంతో పడుకున్నదా? కొనసు ఇద్దరూ పాలన్నా పుచ్చుకున్నారా? లేదా?"

"ఆకలేమో ఉందమ్మా, తినలేకపోయినాను."

"అంటే ఏమిటే?"

"చెబుతానమ్మా. అమ్మా, మేము వెళ్ళివచ్చినతర్వాత అక్కగారు ఏమనినారా?"

"ప్రశ్నకు ప్రశ్న సమాధానమా? నా ప్రశ్నకు సమాధానం చెప్పు."

శాంతల (దన్నత్తికతో) :- "చెబుతున్నానమ్మా. మనం గట్టిగా మాట్లాడితే, లక్ష్మికి నిద్రాభంగం కావచ్చు. ఇప్పుడు అది ఉన్నస్థితిలో దానికి నిద్ర అవశ్యకం. కష్టపడి నిద్రపుచ్చి వచ్చినాను. ఏమనినారమ్మా, అక్కగారు?"

"ఏముంది? లక్ష్మికి ఏమిటి?"

"ఏమీ లేదు. అలసి ఉంది. బాగా నిద్రపోనీ."



"అక్కగారు నిన్ను తీసుకొని వెళ్లుదామని ఆశపడినారు. ప్రభువులు భగవంతుని అనుగ్రహంతో ఒప్పితే...మీరిద్దరూ వీణవాయించి పాడినది ప్రభువులు ఉప్పరిగలో తెర వెనుక కూర్చుని వినినారట...చూచినారట..."

"ఆఁ!"

శాంతల మాట ఆగిపోయింది; నోరు తెరచుకుని నిలబడిపోయినది.

"అక్కగారే ఈ ఏర్పాటు చేసినారు; ప్రభువులు చూడనీ అని, వినసీ అని."

"అయ్యో, అమ్మా! మేము మాతి ఎన్నివంకరలు చేసినామో! వీణ వాయించే ఉత్సాహంలో మాకు ఇహలోకపు స్మరణె తప్పింది. లక్ష్మి, నాతోపాటు స్పర్ధపడి ఒకటి రెండుసార్లు నవ్వింది; నేనూ నవ్వినాను, స్పర్థతో అట్లే అవుతుంది.

"ఇది తప్పని ఎవరూ భావించరు. ప్రభువులూ మెచ్చినారనే నా నమ్మిక. అమ్మాయీ, నీ తపస్సూ, మా ఆశా, రెండూ నీ కల్యాణంలో ఒనగూడనీ."

శాంతల (దృఢమైనగొంతుతో): "అమ్మా, నేను పెండ్లాడను. దీనికి బలత్కారం వద్దు."

మాచికబ్బెకు పిడుగు పడినట్లయినది. 'నేను పెండ్లాడను' అనే మాట ఆమె సర్వేంద్రియాలను తటాలున స్తంభింపజేసింది. చైతన్యం ఉడిగి కన్నులు తేలిపోయినవి. కిందికి వాలిపోతున్న తల్లిని శాంతల తత్‌క్షణం పట్టుకొని గోడకు ఆనించి కూచోపెట్టి, చేలాంచలంతో గాలివీస్తూ, "అమ్మా, అమ్మా, నేను అన్న మాట ఇంత అపరాధమయినదా? చూడమ్మా, మాటలాడమ్మా, క్షమించమ్మా, నన్ను మన్నించమ్మా. నేను చెప్ప దలచింది నీవు పూర్తిగా వినలేదమ్మా." అంటూ కాతరకంఠ అయినది శాంతల. తల్లికి చేలాంచలంతో వీచింది చేతులమీద తట్టింది, నొసలు రుద్దింది.

మాచికబ్బె కొంచెం తెలివితెచ్చుకొని, కళ్లుతెరచి, కుమార్తెను చూచినారు. శాంతల ముఖం అప్పుడు వర్ణహీనమయిఉంది. దానిని చూచి తల్లికి కళ్ళు చెమ్మగిలినవి. మాచికబ్బె ఊపిరి చిక్కబట్టుకొని, "అయ్యో, తల్లీ, ఈ మహానందంవద్దనే జుగుప్స ఎందుకమ్మా? కారణమేమిటమ్మా?... మంచి ఇంటితనం, మంచి భర్త, మంచి అత్తమామలు చిక్కరనే భయంతో ఆడపిల్లలు పెండ్లంటే భయపడుతారు. శాంతలా, నీచేపట్టే వారు చక్రవర్తి, మహావిష్ణువు వంటివారు, అక్కగారు నాకంటె నూరుపాళ్లు హెచ్చుగా నీకు తల్లిగా ఉంటారు. నీవు గొప్ప దానధర్మాలు నడుపవచ్చు. నీవు కాదనడానికి కారణమేమి? ఇది, ఈ మంగళం, నీ పూజాఫలం, మా పూజాఫలమే తల్లీ!"

"అమ్మా, మీరు చాలభయపడినారు. నన్ను క్షమించండి." అంటూ శాంతల తల్లి పాదాలపై తన తల ఆనించింది.

మాచికబ్బె కూతురు తల నిమురుతూ గద్గద కంఠురాలయినారు. "చెప్పు తల్లీ, చెప్పు. అక్కగారు నిన్ను ఇల్లు నింపుకొంటామని కోరితే, నేను ఇవ్వనని అననా? నగరుకు నీవే ఒప్పి వచ్చినావు; ఒకసారి కాదు, రెండుసార్లు కాదు, మూడుసార్లు వచ్చినావు. ఎందుకు వచ్చినావమ్మా నీ మనస్సులో ఈ నిర్ధారం ఉన్నప్పుడు? ప్రభువులు నీ పాణిగ్రహణానికి సమ్మతిస్తే, మేము ఏమని ఉత్తరం చెప్పేము? ఇక మా జీవనమేమి? బ్రతుకేమి? మేము బ్రతికి ఉన్నది నీ కోసం, నీ భాగ్యపు దినాలను, ధర్మపు దినాలను, చూడడం కోసం. ఈ మాట విని మీ తండ్రిగారి గుండె పగిలిపోయీని. నీవు పుట్టిన తర్వాత నేడే నాకు కన్నీరు పెట్టించినావమ్మా. సుఖవార్తను, సంతోషవార్తను చెప్పడానికి వచ్చిన నాకు ఈ ఘోరసంకటం ఎందుకిచ్చినావు బిడ్డా? ధర్మేశా, నేను ఏమి అపరాధం చేసినాను తండ్రీ? తల్లీ శారదా, మా లోపాలూ, దోషాలూ ఏమిటి తల్లీ?" అని మాచికబ్బె దుఃఖించినారు.

తల్లి దుఃఖాన్ని, ఆమె సంకటపు మాటలను విని కోమల హృదయ శాంతల తెలివి తప్పింది. తల తిరిగి నిలిచినట్లే, మొదలు నరికిన మానువలె నేలపై దొర్లింది. కుమార్తె ఆ విధంగా తల పగిలి వక్కలైపోయేట్లు



నేలపై దొర్లడం చూచి, తన కఠిన వాక్కులకు ఓర్వలేక శాంతల ప్రాణాలే ఎగిరిపోయినవని మాచికబ్బె కెవ్వన కేకవేసినారు. ఆ కేకకు దాసి పరిగెత్తివచ్చినది. దేచయ్య పరిగెత్తివచ్చినాడు. శయ్యా మందిరంలో నిద్రిస్తున్న లక్ష్మి ఆ ధ్వనికి ఉలికిపడిలేచి, శాంతల ప్రక్కన లేక పోవడం చూచి, "అక్కా!, అక్కా!" అని ఇల్లు కూలిపోయేటట్లు అరుస్తూ, ఇవతలికివచ్చి, తలుపువద్ద శాంతల నిశ్చేష్టురాలై పడి ఉండడం, దగ్గర మాచికబ్బె కన్నీరు కారుస్తూ, వణుకుతూ, మాటలాడలేనిస్థితిలో ఉండడం చూచి, మాటలేక, సద్దులేక చుట్టుకొని కుప్పగా నేలపై కూలింది. మాచికబ్బె లక్ష్మికూడ మరణించినదని మరొకమారు గట్టిగా గావుకేక వేసినారు; దాసికూడ కేకవేసింది. దేచయ్య "దొరగారూ!, దొరగారూ!" అంటూ మారసింగమయ్యగారిని పిలవడానికి పరుగెత్తినాడు. ఉప్పరిగ గదిలో అప్పుడే పడుకొన్న మారసింగమయ్యగారు నూరు తేళ్లు ఒకేమారు కుట్టినట్లయి, శయ్యనుంచి దిగ్గనలేచినారు. ఈ చీత్కారాలతో ఆ మహాధీరుల గుండెకూడా దిగజారింది. ఒకచేత విచ్చుకత్తితో, మరొకచేత కరదీపికనూ పట్టుకొని బిరబిర ఉప్పరనుంచి కిందికి దిగివచ్చినారు.

రణరంగంలో శత్రువుల రక్తం తన దేహాన్ని తడుపుతున్నప్పుడు, — ప్రాణాలుపోతున్న శత్రువులు, మరణ వ్రణాలతో వేదనపడుతున్నవారి అవసానపు కూతలూ, చచ్చి దొర్లిపడి పోతున్న గుర్రాల, ఎద్దుల, ఏనుగుల భయంకరా రావాలు, రణకాహళుల తప్పెట్లు, కొమ్ముల చెవులు చిల్లులుపడే నాదాలు, యోధులు కేకలు, సింహనాదాలు వినపడినప్పుడు, మారసింగమయ్యగారిని భయపెట్టలేదు; తల్లడపడజేయలేదు; అయితే, ఆ గృహదృశ్యం వారిచేతినుంచి కత్తి జారిపోయేట్లు చేసింది. ధీరుల గొంతుకనుంచి ఏనాడూ వెలువడగూడని "అయ్యో!" అనే మాట అప్పుడు వారి నోటినుంచి తనంతటనే బయలువెడలింది. "మాచీ! ఏమిటిది? ఏమయినది? ఏమి జరిగినది?" అని వారూ గట్టి గొంతుకలో అడిగినారు.

మాచికబ్బెకు నోటమాటరాలేదు. దేచయ్య మంకు (దయ్యం) కొట్టినవాడివలె కన్నీరు కురిపిస్తూ నిలబడినాడు. దాని మాచికబ్బెగారిని

నెమ్మదిగా పట్టుకొని గోడకు ఒరిగించి కూచోబెడుతూ, దొరగారినిచూచి, "అమ్మాయిగార్లు ... మూర్ఛ ..." అనినది.

మారసింగమయ్యగారు మరింత బిగ్గరగా ప్రశ్నించినారు: "ఒరే! దేచా! ఏమయిందిరా? చెప్పరా? పామేమిరా ? కరిచిందిరా? ఎవరినిరా? ఎక్కడరా ?" అని. దేచయ్య ఒక్కగుటక వేసి, "లేదు, దొరగారూ. శాంతలమ్మగారు, లక్ష్మమ్మగారూ యిద్దరూ తెలివితప్పి పడి ఉన్నారండీ." అన్నాడు. మారసింగమయ్యగారు దాసివైపుతిరిగి, "చన్నీళ్లు నొసటిపై తట్టండి...ఒరే దేచా, ఏడవవద్దురా. విసరరాగాలి." అని చెప్పి, తమ అభ్యంతర మందిరానికి పరుగుతో వెళ్ళి, ఒక భరిణలో ఉన్న నావాసారపు పొడిని, సున్నపు భరిణను తీసుకొనివచ్చి, రెండూ రెండురెండు చిటికెలు ఎడమ అరచేతిలో వేసుకొని, చక్కగా నలిపి, దానినుంచి బయలుదేరిన వేడిగాటును పిల్లల ముక్కులకు, తర్వాత మాచికబ్బె ముక్కువద్ద పట్టినారు. ఆ గాటులో బాలికలిద్దరికీ మెలకువవచ్చింది; మాచికబ్బె మేల్కొన్నది. శాంతల తెలివి తెచ్చుకొని, కళ్ళువిచ్చి, "అమ్మా! అయ్యా!" అని గట్టిగా సంబోధిస్తూ, పోయి తల్లి కాళ్ళను గట్టిగా కౌగిలించుకొన్నది. లక్ష్మికూడ మేల్కొని కూర్చుని చుట్టూచూచి, చన్నీటితో మాచికబ్బె మొగము తడుపుతూ "అమ్మా...అమ్మా" అంటూ పలకరించినది. మారసింగమయ్యగారు దిగ్భ్రమపడి కూర్చుని ఉండిపోయినారు. సంగతి తనంతటనే బయలు పడుతుందని వారు లేచి ఉండిరి.

శాంతల కన్నీరు కురిపిస్తూ తండ్రిని చూచినది. ఆమీదట తల్లివైపు చూచి, "అమ్మా, నేనన్న ఒక్కమాటతో ఎంతటి అనాహుతమయినది! చెడ్డగడియలో మాటలాడినాను, సంయమం తప్పినడిచినాను, ఇప్పుడు అందరిని క్షమాపణ కోరుతున్నాను...అమ్మా, మీరు నన్ను పూర్తిగా మాట్లాడనివ్వలేదు. ... నా మొదటి మాటే మీకింత సంకటం కలిగించినది. చెప్పవలసిన, మాట్లాడవలసిన రీతిని, ఔచిత్యాన్ని మరిచినాను. అందువల్లనే ఇదంతా జరిగింది. భర్మేశుడే అందరినీ ఈ విషగడియలలో కాపాడినాడు; శారదాదేవి కాపాడినది." అన్నది.



మాచికబ్బె :- "ఏదో చెడ్డగడియ, తల్లీ... నాకు దుఃఖం తట్టుకోలేని దయినది. రేపు నెమ్మదిగా మాట్లాడుకుందాము. ఇప్పుడు వెళ్ళి పడుకోండి."

శాంతల :- "అమ్మా ! మీ మనస్సు చాల నొప్పిపడినది. నెమ్మది ఏర్పడేవరకు తపిస్తూ ఉంటుంది. అప్పుడు చెప్పవలసినది ఇప్పుడైనా చెబితే మీ మనస్సు సమాధాన పడుతుందేమో !"

"మాచికబ్బె :- "చెప్పదగిన విషయమైతే చెప్పు తల్లీ. మీ అయ్యగారూ ఇక్కడే ఉన్నారు. అమ్మా, శాంతలా, కోపవేగంలో, దుఃఖభారంలో నేనేమైనా అని ఉంటే, మనస్సులో పెట్టుకోవద్దు; నన్ను మన్నించమ్మా."

(శాంతల రెండు చెవులూ మూసుకొని): "శాంతం పాపం ! శాంతం పాపం ! అమ్మా, ఏమన్నారు ? ఆ మాట చెప్పవలసిన దానిని నేను. మన్నన కోరవలసిన దానిని నేను.

లక్ష్మి భయంతో మాచికబ్బెను, శాంతలను చూస్తూ నిలబడినది. మారసింగమయ్యగారు దిగ్భ్రాంతితో, జరుగుతున్నదంతా చూస్తున్నారు; వింటున్నారు.

అప్పుడు శాంతల లక్ష్మివైపు తిరిగి "లక్ష్మి, ఉప్పరిగె చంద్రశాలలో నాలుగు సుఖాసనాలు వేయించు. వెన్నెలలో మనమందరం కొంచెం విశ్రమిద్దాము", అన్నది.

జాణ అయిన లక్ష్మి 'అక్క తల్లితో చెప్పవలసిన గొప్పవిషయమేదో ఉండవలె. అది నాకు తెలియగూడదని అక్క ఈ విధంగా చెప్పినది' అని ఊహించి, దేచయ్యను పిలుచుకొని ఉప్పరిగకు వెళ్ళినది. తనుకూడ అక్కడ ఉండరాదేమో నని మారసింగమయ్యగారూ పీఠం నుంచి లేచి బయలుదేరబోయినారు. శాంతల అదిచూచి, "అయ్యా, మీరు ఉండవలె; కూర్చోండి." అని తండ్రిని అక్కడే నిలుపుకొని, "నాకు తెలియదా, నా ముందు బతుకు సుఖసంతోషాలే మీ ఏకైక వాంఛ అని,

మీ యిద్దరి సంతోషమే నేనని? కని పెంచి పెద్దజేసి, ఉత్తమ విద్యలు చెప్పించి నేర్పించినారు. మీ సంతోషం నూరు మడుగులు హెచ్చేటట్టు నేను రాజుగారిని పాణిగ్రహణం చేసుకుంటానో ఏమో! అది మహా భాగ్యమన్నమాట సరే. ఆ మహానుభావుల చేపట్టడానికి నూరు జన్మాల తపస్సు చాలదు. సాయంకాలం మేము వీణ వాయిస్తున్నప్పుడు ప్రభువులు ఎక్కడో కన్ను మరుగున కూర్చొని వింటున్నారని నా హృదయం చెప్పినది." అని తండ్రివైపు తిరిగి "అయ్యా, ఇదేమిటి కుమార్తె ఇంత లజ్జచెడి మాట్లాడుతున్నది అని అనుకోకండి. ఆడపిల్లలకు లజ్జ, శీలం, ఇవి ఉత్తమ కుల లక్షణాలు; కుల స్త్రీలందరూ కాపాడుకోవలసిన సౌభాగ్యాలు. ఈ సందర్భంలో, నేను ధైర్యంగా మాట్లాడక గత్యంతరములేదు. చాల దీర్ఘాలోచన చేసి ఈ నిర్ధారానికి వచ్చినాను. లక్ష్మికూడ నావలెనే మీకు కుమార్తె. మూడు సంవత్సరాల పసికందునుంచి అది ఇక్కడే పెరిగినది. నాకు పాలుపోసిన చేతులే దానికీ పాలు పోసినవి. నన్ను సాకి పెంచిన చేతులే దానినీ సాకి పెంచినవి. దీనిని మీరు మరువకూడదు. ప్రభువులు ఒకవేళ నన్ను పెండ్లాడడానికి ఒప్పితే నన్నొకతెనే ధారాదత్తం చేయకండి. మా యిద్దరి దేహాలు వేరైనా ఆత్మలు ఒకటే. దానికి నొప్పయితే నాకూ నొప్పవుతుంది, నేను నొప్పిపడితే, అదీ నొప్పిపడుతుంది. నన్ను వదలి లక్ష్మి ఉండజాలదు. నేనూ దానిని విడిచి ఉండలేను. జన్మాంతరాలలోను మేము ఇట్లే ఉండినాము." అని అంటూ, కన్నీరు ధారలు కట్టగా, కంఠం గద్గదంకాగా, చేలాంచలంలో ముఖం కప్పుకొని తన శయ్యా మందిరందూరి తలుపులు వేసుకొన్నది.

మారసింగమయ్యగారు యథార్థస్థితిని ఇప్పుడు తెలుసుకొనినారు; కూతురు సౌహార్దానికి కరిగిపోయినారు. మాచికబ్బె మూగవలె పతిముఖం చూడసాగినారు.

మారసింగమయ్య లేచి, మాచికబ్బె దగ్గరికివచ్చి, చేయిపట్టుకొని లేపి, ఇక్కడ ఏమీ మాట్లాడరాదని సైగ చేసి, తమతోపాటు ఆమెను ఉప్పరిగ మీది చంద్రశాలకు నడిపించుకొని వెళ్ళినారు.



భయంతో చంద్రశాలముందు ఒంటిగా కూర్చున్న లక్ష్మివద్దకు మాచికబ్బె వచ్చి మొగం తడివి, తల తడివి, "మాతల్లి, మీ మీ దివ్య స్నేహమే మీ ముందుదినాలను రూపుదీర్చనీ. మీ అక్కను ధర్మేశుడు మాకు అనుగ్రహించినాడు. శారదతల్లి నిన్నుమాకు దయచేసినది. శుభం చేకూరుతుంది పో తల్లీ! మీ అక్కను సమాధానపెట్టు." అని చెప్పి, లక్ష్మిని శాంతలవద్దకుపంపి, తాను పతితో తన అనంతరకర్తవ్యమేమని నిశ్చయించడానికి చంద్రశాలకు వెళ్ళినారు.

## 16

రాజమాత ఆ రాత్రి సంతోషచిత్తంతో భోజనం ముగించి, వెన్నెల చలువను అనుభవిస్తూ, కోడలు, మనుమలు నిండిన బంగారుకలలు కంటూ, "ఈ చీకటి జీవితం గడచి, వెలుగయితే చాలు", అనుకుంటూ, దగ్గరున్న చేటి ఒక్కతెను పిలిచి, "అప్పాజీవారు భోజనం ముగించి ఉంటే, వచ్చి, మమ్మల్ను దర్శించవలసిందని సెలవిచ్చామని వెళ్ళి తెలియజేయి", అని ముదల యిచ్చినారు.

ప్రభువులూ అప్పుడే భోజనం ముగించి, తమశయ్యా గృహం ముందున్న పంచసాలిలో కుమార విష్ణువుతో సంభాషిస్తూ కూర్చున్నారు. శాంతల, లక్ష్మి, సభలో పాడుతున్నప్పుడు కుమారవిష్ణువూ ప్రభువులవద్ద కూర్చుని వింటూ ఉన్నాడు.

శ్రీపాలత్రైవిద్య దేవదేశికులు కుమారవిష్ణువును శిష్యుడుగా స్వీకరించిన పిదప, అతనిని తమ ఆశ్రమానికి పిలుచుకొని వెళ్ళినారు. వారి చాలమంది శిష్యులలో కుమారవిష్ణువూ ఒక్కడయినాడు. అందరివలె బ్రాహ్మముహూర్తంలో లేచి, ప్రాతర్విధులు, శీతలోదకస్నానం, దేవపూజ, యజ్ఞకర్మలు సమాప్తి చెందిన తర్వాత పాలు పొంగలి ఉపాహారం. అనంతరం గురువుల సన్నిధిలో పాఠక్రమం - ధర్మనీతికర్మల నిరూపణం, న్యాయశాస్త్రజిజ్ఞాస. మధ్యాహ్న భోజనం. కొంచెం విశ్రాంతి. మధ్యా

పొన్నల్పరం కుమారవిష్ణువుకు విడిగా ఇతరాచార్యుల వద్ద క్షత్రియయోధుల సాహసాభ్యాసక్రమం - ఏనుగు సవారి, గుర్రపు సవారి, వాటిని అంకెలో పెట్టి నడపడం, అన్ని నడకలూ మప్పడం, ధనుర్విద్య, యుద్ధనీతిరీతులు, శస్త్రయుద్ధం, వ్యూహబంధా వ్యూహచ్ఛేదాలు మొదలయిన విద్యాభ్యాసక్రమం - జరిగేది.

ప్రభువులు కుమారవిష్ణువును దగ్గర కూర్చోబెట్టుకొని వాటిలో అతని శ్రద్ధాసక్తులు తెలుసుకొనడం కోసం, సూక్ష్మమైన ప్రశ్నలు వేస్తూ ఉండినారు. కుమారుడు కఠినాభ్యాసక్రమాలతో కొంచెం నలిగినట్టున్నా, క్రమంగా అంతా సరిపోతుందని భావించినారు ప్రభువులు. కుమారుని శ్రద్ధాసక్తులకు మెచ్చుకొనినారు.

రాజమాత పంపినచేటి ప్రభువుల సన్నిధానానికి వచ్చి, దూరంనుంచి వంగి నమస్కారంచేసి, 'జయము, జయము ప్రభువులకు! భోజనం ముగిసి ఉంటే, వచ్చి ఒకమారు దర్శించుకోవాలని మహాదేవిగారు ఉత్తరువు దయచేయించినారు. చంద్రశాలలో విజయంచేసి ఉన్నారు.'' అని విన్నవించి నమస్కారంచేసి వెళ్ళినది. ప్రభువులు కుమారుని నిద్రపొమ్మని పంపి తాము రాజమాత దర్శనానికి బయలుదేరి వచ్చినారు.

రాజమాత ప్రభువులను తామే మొదట పలకరించినారు. "అప్పాజీ! భోజనమయినదా? ఈ దినం కొంచెం తడవు అయినదికదూ? కుమారుడు వచ్చినాడన్న వార్త తెలిసినది. ఆశ్రమజీవితమూ, విద్యాభ్యాసక్రమాలూ కుమారునికి ఎక్కువశ్రమ కలిగిస్తున్నవా? వేకువనుంచి సందెవరకు మనస్సుకూ దేహానికీ శ్రమ సాధ్యమైన శిక్షణలున్నవట. కుమారునికి శ్రమ అయ్యేటట్టయితే ఇప్పుడు కొంచెంతగ్గించి, క్రమంగా ఎక్కువచేయవచ్చుగదా?'' అని ప్రశ్నించినారు. దానికి ప్రభువులు "అమ్మా, అలాటికష్టమేమీ తనకు తోచలేదని వాడే అంటున్నాడు. రెండువిధాల శిక్షణలూ కొంచెం హెచ్చేనని నామనస్సు కూతోస్తున్నది. ఒకనాడు శాస్త్రాధ్యయనానికి, ఒకనాడు శస్త్రాభ్యాసానికీ వేళ నిర్ణయించి యివ్వండని వార్త పంపుతాను.'' అని ప్రభువులు సమాధాన మిచ్చినారు.



రాజమాత :- "అప్పాజీ, నేటి సంగీతం బాగున్నదా? శాంతల విద్యావినయ సంపన్న, రూపవతి, మంచి యింటితనం. మాచికబ్బె మనకు దూరంవారేమీకాదు. మారసింగమయ్య మీ తండ్రిగారికి దక్షిణభుజంవలె ఉన్నవారు; ఇప్పుడూ నీకు అలాగే ఉన్నారు. ఈ సంబంధంతో మనమూ వారికి చేయవలసినగౌరవం చేసినట్టూ అవుతుంది. ఇది దేశహితానికీ మంచిది. అన్నివిధాలుగా ఈ కన్య మా మనస్సుకు వచ్చినది. అప్పాజీ, ఇక నీవు దొడ్డమనసు చేయవలె నగరుకు కోడలాకలి శుభంగా రానీ.''

"అమ్మా! పెండ్లంటే మనసులేని నన్ను 'కులాభివృద్ధికి, పితరుల పుణ్యలోకప్రాప్తికి' అని పైపైన బలవంతం చేస్తూనేఉన్నారు. ఇక మీ సంతోషానికి అడ్డురాగూడదని నేనూ మనసుపడినాను.''

రాజమాత (సంతోషంతో): "అమృతం ఆస్వాదించినాను అప్పాజీ· నీ మనసు శాంతలను ఒప్పిందా?''

"అమ్మా, అదేకదా! ఆ గుండ్రటి ముఖంగల కన్యేకదా.''

రాజమాతకు ఎదలో 'ధగ్' మన్నది. హృదయమే స్తంభించేటట్టయినది. అరనిమిషం మాటలాడలేకపోయినారు. అయినా తమ స్థితిని బయటపెట్టక, లేని నవ్వు తెచ్చిపెట్టుకొని "అయ్యో, అదికాదు; అది లక్ష్మి. సోగమోము, సోగకన్నుల చెలువ శాంతల.''

"అమ్మా! అయితే లక్ష్మి ఎవరు?''

రాజమాతకు ఇప్పుడు అంగాంగమూ చెమర్చినది. హృదయవేగం ఇనుమడించినది. అర్ధకంపిత ధ్వనితో "లక్ష్మి పెరుమల పండితుల ఏకైక పుత్రి.'' అనినారు.

ప్రభువులు తల్లివైపు చూచి, "ఏమిటి? లక్ష్మి పెరుమల పండితుల కుమార్తా? పండితులకు ఇంత చక్కని కన్య ఉన్నట్లే నాకు తెలియదే! వీణావాదనంలోను, గాయనంలోను ఇద్దరూ సరిసమానంగా ఉన్నారు. ఇది చాల అరుదు. పెక్కేండ్ల స్నేహసౌహార్దాలేమో వీరివి?''

రాజమాత :- "ఇద్దరి ఇండ్లూ ఒకే వీధిలో. ఇద్దరూ ఒక్కటిగా ఆడుకొంటూ. పాడుకొంటూ పెరిగినవారు. రెండు సంవత్సరాల వయస్సులోనే తల్లిలేని లక్ష్మిని శాంతలతోపాటే మాచికబ్బె సాకి పెంచి పెద్ద జేసినారు. ఈలాగు వారి తనువు మనమూ ఒక్కటై పెరగడంలో ఆశ్చర్యమేముంది ?"

"అమ్మా ! అట్లయితే. నేను వారిలో ఒక్క తెను వివాహమాడితే, మరొకతె మనస్సుకు సంతోషమవుతుందా ? పెండ్లయినదాని మనస్సు కన్నా సుఖం ఉండీనా ?"

"అంత గాఢస్నేహం ఉన్నచోట్ల కొంతకాలం అలాగే ఉంటుంది. మరొకరికికూడ ముందు ముందు ఒనగూడే బ్రతుకు వాతావరణంలో అది క్రమంగా ఆరిపోతుంది. శాంతలకు పెండ్లయిన తర్వాత పెరుమల పండితులూ కుమార్తెకు తగిన వరుణ్ణి వెదకి పెండ్లిచేయక ఉంటారా ?"

"అమ్మా ! నిష్కపటమైన స్నేహం అలాగు ఎన్నటికీ ఉండదు. స్నేహప్రేమలు రక్తమాంసాలకు మాత్రమే అంటుకోలేదు. అలాటి స్నేహమూకాదు. ప్రేమాకాదు. స్నేహప్రేమలకు జన్మాంతరసంబంధం ఉందనే నా నమ్మిక. అమ్మా ! మీరు మిమ్ముల్ను పాణిగ్రహణం చేసుకొన్నవారిని మరచినారా ? మరువడం సాధ్యమా ? సంవత్సరాలు గడచినవి కదా !"

కొడుకన్నమాట తల్లికి చురకత్తితో కుచ్చి నొప్పించి నట్లయినది. తల్లికి బాధ కలిగిందని ప్రభువులు తెలుసుకొనినారు. అయినా తమ మాటలు కొనసాగించినారు. "అమ్మా ! మీ మనస్సును నొప్పించాలనే ఉద్దేశం నాకులేదు. నొచ్చినని నామనస్సుకు తోచలేదు. క్షమించవలె."

తల్లితో ప్రభువులు ఇంత స్పష్టంగా, అరమరికలు లేక ఎన్నడూ మాట్లాడలేదు. ఇప్పుడు ఏదో అమానుష శక్తే ప్రభువుల నోటినుంచి ఈ మాటలను పలికిస్తున్నదని రాజమాత భయపడినారు. ముందు మాట్లాడడానికి జంకినారు. ప్రభువులు తాము చెప్పిన మాటలను రాజమాత ఒప్పి



నారనే తలపోసి, "అమ్మా, పదిపదహైరేండ్ల వీరి స్నేహం ఎంతో గాఢంగా ఉండదూ? ఒకతెను నేను పెండ్లాడితే మరొకతెకు దుఃఖం కావడం ఖండితం. తన పెక్కేళ్ల చెలిమికత్తెనుంచి దూరమయాను గదా అని పెండ్లయినది కూడా అలాగే శుష్కించీని. అందువల్ల, అమ్మా, ఈ సంబంధం వద్దనేవద్దు."

రాజమాత : "అప్పాజీ ! అప్పాజీ ! !"

"అమ్మా ! కాతరత వద్దు. మనసును కుదుటపరచుకోండి. నేను చక్కగా యోచించే చెబుతున్నాను. ఆ కన్యలను విడదీయడం దోషమనే భావిస్తున్నాను. అందువల్ల మరొకమారు చెప్పదలచినాను : మొదటిది - ఈ సంబంధం వద్దనేవద్దు; రెండవది : నేను పెండ్లాడే తీరాలనేది మీ ఆశ అయితే, ఆ కన్యలూ ఒప్పుకుంటే, ఇద్దరినీ పెండ్లాడుతాను. అప్పుడు ఇద్దరూ సంతోషంతో ఉంటారు."

రాజమాతకు అప్పుడు తటాలున గుర్తుకు వచ్చినది, శాంతల తన తల్లితో చెప్పిపంపిన మాట : "నేనొక్కతినే వీణ వాయించి పాడడానికి సిగ్గవుతుంది; నా జతలో లక్ష్మికూడా పాడి వీణ వాయించేటట్టయితే..." అని. "విధి ఎక్కడినుంచి ఎక్కడికి నడిపించుకొని వచ్చినది!" అని రాజమాత తలపోస్తూ, "అప్పాజీ, చాల చిక్కుకు తెచ్చిపెట్టినావే !" అన్నారు.

"అమ్మా, మీరు నాకు తల్లికదా ? మీ ఎదుట నేను మనసు మూత వేసుకొని మాట్లాడడమా ?"

"పెరుమల పండితులు ఒప్పుతారా, అప్పాజీ ?"

* * * *

అదే సమయంలో మాచికబ్బె పతితో సంభాషిస్తూ "పెరుమల పండితులు దీనికి ఒప్పుతారా ?" అని ప్రశ్నించినారు.

మారసింగమయ్య :- "పండితులు విశాల హృదయులు, సమదర్శులు, దైవంలో భేదభావం లేనివారు. జాతిమతాల నిర్బంధం వారికి లేదు, మాచీ. గుణాలను, నడవడిని మాత్రమే గమనించేవారు వారు. ఉన్న సంగతిని గంగరాజులుగారికీ, పండితులకూ తెలియజేయడం, వారి చెప్పినట్లు నడచుకోడం."

* * * *

ఇక్కడ ప్రభువులు తల్లితో అన్నారు: "పెరమల పండితులు విశాల హృదయులు. దైవవిషయంలోను, జాతి మతాలలోను భేదభావం లేని వారు. శుచి, రుచి, గుణ, శీల, సత్యాదులను మాత్రమే గమనించేవారు.

రాజమాత :- "మంచిది, అప్పాజీ. ఈ విషయాలు గంగరాజులు గారికి, పండితులకూ తెలిపి, వారి సమాధానమేమని తెలుసుకొందాము. మహాలక్ష్మివలె ఉన్న లక్ష్మిని పండితులు ధారపోస్తే మనం మహా సంతోషంలో ఇల్లు నింపుకొంటాము."

ప్రభువులు :- "అమ్మా, మీ సంతోషమే మాసంతోషం." అంటూ తల్లికి వందనంచేసి తమ శయ్యాగృహానికి వెళ్ళినారు.

## 17

"అక్కా, తలుపుతెరు," అంటూ లక్ష్మి శాంతల శయ్యామందిరం తలుపు మృదువుగా తట్టినది. శాంతల లక్ష్మి సవ్వడివిని తన కన్నీరు ఆమెకు కనిపించరాదని తుడుచుకొని, శాంత ముఖముద్రలో తలుపుతీసి, "రా, లక్ష్మి, అమ్మ ఇప్పుడు ఎలాగు ఉన్నారు? ఏమన్నారు?" అని ప్రశ్నించినది. లక్ష్మి అక్కముఖం తేరిపారజూచినది. తెచ్చిపెట్టుకొన్న శాంతాన్ని, నవ్వును గ్రహించుకొని, "అక్కా, నీవు ఏడుస్తున్నావు. దీనిని మొదలు పెట్టిన దానిని నేను. ఇప్పుడు ఇది అంటువ్యాధివలె యింటినిండా వ్యాపించింది. అమ్మతోను, అయ్యగారితోను నీవు ఏమనినావు? వారు ఎందుకింత భీతిపడుతున్నారు? అమ్మా, నీవూ మూర్ఛపడవలసిన ఘోర



ప్రసక్తి మీలో మీలో ఏమివచ్చిపడినది? ఇది న్యాయమా? నేను ఎందుకు ఏడిచినానో నీకు చెప్పినానుగదా? అక్కా, నేను చిన్నదాన్ని. నీవు నాకు చెప్పవలె; ఇది ధర్మం, ఇది రీతి. ఏదో భ్రమించి నా హృదయం తల్లడించినది; నీగుండెలు సోకినప్పుడు సమాధానం పొందినది. నీవు చెల్లెలిని మరువవని నాకు నమ్మకం కలిగింది. చిత్తభ్రమ వికారంలో నేను ఏదైనా నోరుజారి అని ఉంటే పెద్దదానివి నీవు నన్ను మన్నించవలె. నీవు వివాహం చేసుకొనడమే న్యాయం. అమ్మనూ, అయ్యనూ దుఃఖానికి పాల్పడజేయ వద్దు. కని పెంచి పెద్దజేసి, విద్యాబుద్ధులు చెప్పించిన వీరికన్నా ఇహంలో మరొకదైవం లేదు. దీనిని నేను నీకు చెప్పవలసినదికాదు. నాతండ్రికంటె నాకు ఇహదైవంలేదు. పుట్టిన రెండవఏడే తల్లిలేనిదాన నయాను. మా అయ్య నన్ను ఎలాగు సాకినారో? ఎంత కష్టపడినారో? నా మలజలాలు కడిగి, స్నానంచేయించి, పాలుపట్టి, రొమ్మునవెచ్చగా పడుకోనిచ్చి తల్లి కన్నా హెచ్చుగా శ్రమపడినారు. పసికందుగా ఉన్నదానిని పెద్ద చేసినారు. ఉత్తమ విద్యాబుద్ధులు నేర్పినారు. నాకళ్ళు పెద్దవయాయి; నాహృదయం విశాలమయినది. అందువల్ల నేను నిశ్చయించుకొన్నాను: ఇక నా ఎల్లసుఖాలూ, శాంతీ వారు ఇచ్చినట్లే, పెట్టినట్లే. నన్ను పెండ్లిచేసి ఇవ్వడానికి వారికే అధికారం. ఇక నా పెండ్లివిషయంలో నీవు యోచన చేయరాదు. ఇది సర్వథా న్యాయంకాదు. పాణిగ్రహణం చేయడానికి వచ్చే ప్రభువులను నిరాకరించవద్దు; ఖండితంగా నిరాకరించవద్దు. అలాటి మహాభాగుల చేపట్టడమంటే ఎన్నినోముల ఫలమో! ఈ మహామంగళాన్ని నీవు నిరాకరించినట్టయితే, నేను దుఃఖితురాలవుతాను, ఆజన్మం దుఃఖితురాలవుతాను. ఇది ఇలాగు నానుంచే అయినదని జన్మపర్యంతం నా హృదయాన్ని నేనే తినివేస్తూ వుంటాను. అక్కా, నీవు మహారాజ్ఞి అయితే ఏమి? నేను నీ ప్రజలలో ఒకరి పత్ని అయితేనేమి? నీప్రీతి ఎన్నటికీ తగ్గదు; అది నాకుతెలుసు. నేను ఎల్లప్పుడూ నీ హృదయంలోనే ఉంటాను." అని లక్ష్మి అక్కను ఓదార్చడానికి ప్రయత్నించి, తనకంట తడిపెట్టుకొన్నది.

శాంతల నెమ్మదిగా, లక్ష్మిచెక్కులుపట్టుకొని ముఖం పైకెత్తి, దాని చూపులో తన చూపు నాటి, "నా బంగారు తల్లీ, ఎంత చక్కని,

ఎంత బుద్ధిమంతనవు పలుకులు పలుకుతున్నావే?" అంటూ లక్ష్మిని మృదువుగా, కౌగిలించుకొని, "అయినా, తెలుసుకో: అక్కయినా దానికి చెల్లెలియోగక్షేమాలే ముఖ్యం; అన్నిటికన్నా ముఖ్యం," అంటూ, లక్ష్మిని శయ్యామందిరంలోకి పిలుచుకొని వెళ్ళినది.

# 18

మరుసటినాడు గంగరాజులుగారు ఉదయం శయ్యనుంచి లేస్తున్న సమయానికి సరిగ్గా వారి పుత్రుడు బొప్పణ దండనాయకుడువచ్చి తండ్రికి నమస్కరించి, "అయ్యా, నగరునుంచి మహాదేవి అక్కగారి చేటి ఒకతె వచ్చి సాధ్యమయితే, తాము ఇప్పుడే నగరుకువచ్చి రాజమాతను దర్శించవలెనని, వచ్చేటప్పుడు పెరుమల పండితులను పిలుచుకొని రావలెనని ముదల యిచ్చినారని చెప్పి పోయినది," అని తెలిపినాడు.

వెనుకటి రాత్రి గంగారాజగారు పడుకోడానికి ముందు ప్రభువుల పెండ్లి విషయమే ఆలోచిస్తూ ఆదినాథస్వామిని స్మరించి నిద్రించినారు. ఆ రాత్రి వారొక దివ్యమైన స్వప్నం కన్నారు: సౌధర్మ స్వర్గంనుంచి దేవేంద్రుడు తన ఐరావతమెక్కి ద్వారవతికి విష్ణువర్ధన ప్రభువుల ఒడ్డోలగానికి వచ్చినాడు. ప్రభువులు సభ్యులతో కిటకిటలాడే ఒడ్డోలగంలో రత్నసింహాసనాసీనులయివున్నారు. వామ దక్షిణ పార్శ్వాలలో దివ్యాభరణభూషితలయి శాంతల, లక్ష్మి ఆసీనలయి వున్నారు. దేవేంద్రుడు ఐరావతం దిగి హస్తద్వయంతో కనకకలశం ధరించి ఓలగపుసాలలో ప్రవేశించి, కనకకలశంలోని అమృతోదకంతో ప్రభువులను ఇద్దరు దేవేరులనూ అభిషేకించినాడు. దేవతలూ, యక్షులూ పుష్పవర్షం కురిపించినారు. అటు తర్వాత దేవేంద్రుడు నమస్కరించిన ప్రభువులనూ, దేవేరులను ఆశీర్వదించి ఐరావతం అధిరోహించి సౌధర్మ స్వర్గానికి మరలి వెళ్ళినాడు ...

రాజమాత మనోభిలషితాన్ని గంగరాజులుగారు చక్కగానే గ్రహించినారు. ఇప్పుడు చెప్పిపంపిన కారణమూ ఇదే అయివుంటుందని



వారికి స్పష్టమయినది. తత్క్షణమే శయ్యనుంచి లేచి, స్నానాదులు ముగించి, ఆదినాథుని పూజించి, ఉపాహారం ఆరగించి, మేనా యెక్కి పెరుమల పండితుల గృహానికి వెళ్ళినారు.

గంగరాజులుగారు పెరుమల పండితులతోసహా నగరు చేరడమేమిటి, మాచికబ్బె మారసింగమయ్యగారు అక్కడికి రావడమేమిటి రెండూ ఏకకాలంలోనే జరిగాయి! వారిని కూడా రాజమాతే ఆహ్వానించినారు. అందరూ రాజమాత పుష్పవాటిక ముందున్న విశ్రాంతి గృహంలో ఆసీనులయినారు. చేటిక ఒకతె వీరందరూ వచ్చిన వర్తమానం రాజమాతకు మనవి చేయడానికి వెళ్ళినది.

గంగరాజులుగారు మాచికబ్బెను, మారసింగమయ్యగారిని చూచి, చిరునవ్వు నవ్వి, వినబడీ వినబడని గొంతుకలో "అక్కగారు మిమ్మలూ పిలిపించుకొన్నారు. కారణం అదే అయివుంటుందికదా?" అని, పండితుల వైపు తిరిగి "పండితులవారు త్రికాలజ్ఞులు; వారికి తెలిసే ఉంటుంది." అన్నారు.

పెరుమల పండితులు :- "భీష్ములవారు తమ దివ్యదృష్టిలో ఉన్న దానిని మాకు తెలుపవచ్చుగదా? అక్కగారి మనస్సును తెలియగలవారు మీరొక్కరే. మాచికబ్బెను మారసింగమయ్య దండనాయకులను పిలిపించుకొనడం ఎందుకో?"

మాచికబ్బె పెరుమల పండితులను సంబోధించి, "అయ్యగారి సన్నిధిలో మనవిచేసుకొనడంకోసం నేడు వేకువనే తమ మందిరానికి వచ్చినాము. తమరు మందిరంలో లేకపోవడం చూచి చాల ఆశ్చర్యపడినాము. తమ శిష్యులొకరు, 'ఇదిగో ఇప్పుడే గంగరాజలవారు వచ్చినారు; గురువుగారిని పిలుచుకొని, మేనాను ఇక్కడే వదలి, నగరుకు కాలినడకన వెళ్ళినారు.' అని తెలిపినారు. అయ్యగారిని దర్శించడం కాలేదే అని మనసు వ్యథపడి మేము యింటికి మరలినాము. తమను దర్శించి మనవి చేసుకోవలసిన అత్యవసర విషయమొకటి ఉండినది. ఆ వేళకు నగరునుంచి భూఖూ పిలుపువచ్చి కాచుకొని ఉంది. ఇంటిలో అడుగు పెట్టకనే, ఇక్క

డికి బయలుదేరి వచ్చినాము. ఇక్కడైనా తమను దర్శించవచ్చునసే ఆశతోనే వచ్చినాము." అని, గంగరాజులుగారివైపు తిరిగి, "అన్నగారూ మాకు ఇక్కడే దర్శనమివ్వడం మాకు ఇంకా హెచ్చైన తృప్తి. నేడు మేము వారిని దర్శించవలసే ఉండినది. దైవమే మమ్మల్నూ, మిమ్మల్నూ, అందరినీ పిలుచుకొని వచ్చినది. కఠిన సమస్య ఒకటి మమ్మల్ని చాల ఆశ్చర్య పరచింది, దిక్కే తోచడంలేదు. అందువల్ల మీ ఆశ్రయానికి చేరినాము. మేము ఇంకెక్కడికి పోయేము? ఇంకెవరిని అడిగేము?" అనినారు.

పండితులు :- "చెల్లీ, అక్కగారు మనందరినీ పిలిపించుకొన్న కారణం గంగరాజులుగారు అన్న సూక్ష్మాన్నిబట్టి ఊహించగలను. అయితే, అది నిజంకావచ్చు, లేక కల్లకావచ్చు. మీ రిద్దరూ ఎలాగు ఒక బిడ్డ హితంకోసం శ్రమపడుతున్నారో, నేనూ అలాగే, ఒకబిడ్డ హితంకోసమే బతికున్నాను ..."

పండితులు ఇంకా మాటలు కొనసాగించడంలోనే ఉన్నారు. అంతలో చేటివచ్చి "రాజమాత మహాదేవిగారు విజయం చేస్తున్నారు" అని తెలియజేసి వెళ్ళినది. అరనిమిషంలో రాజమాత మందస్మిత వదనంతో దర్శనమిచ్చినారు.

అందరూ సగౌరవంగా లేచి నిలబడినారు. రాజమాత తామే ముందుగా చేతులు జోడించి "అందరూ ఆసీనులుకావలె. ఈ ప్రాతఃకాలమే మీ పనులకు అడ్డుతగిలి, మా పనే పెద్దదని మిమ్మల్నందరినీ ఇక్కడికి పిలిపించుకొన్న మా స్వార్థాన్ని మన్నించవలె. విషయం మన అందరికీ సంబంధించినదే. అన్నగారు, పండితులవారు పరిష్కరించేరు అనే నా నమ్మిక." అని, అనంతరం మారసింగమయ్య, మాచికబ్బెవైపు తిరిగి, "మీరు పిల్లల తల్లిదండ్రులు; మేము పిల్లల తల్లులం. ఈ సమాన పీఠికమీద మేమిప్పుడు మీతో మాట్లాడడానికి వచ్చినాము. మా స్థాన గౌరవాలను ఈ ఒక్క విషయంలో మీరంతా ఖండితంగా దూరంగా



పెట్టవలసినది. దానిని ఈ విషయానికి అన్వయించరాదు. గంగరాజులుగారూ, పండితులవారూ మాకు పూజ్యులు. మీరంతా ఈ రాజ్యానికి పరమ హితైషులు. మీరు చెప్పే ఆలోచన ప్రకారం నడవడమే మాకు శ్రేయస్సు. మా కుమారులు శాంతల, లక్ష్మి - ఇద్దరినీ పెండ్లాడడానికి ఒప్పుకున్నారు. కన్యలిద్దరి అన్యోన్యం చూచి, ప్రభువులు వారిలో ఒక్కరిని చేపట్టడానికి మనసు ఒప్పనివారయినారు. 'శాంతలను ఇవ్వండి' అని అడిగే ఈ బాంధవ్యం చనవు మాకు ఉన్నది. 'లక్ష్మిని ఇవ్వండి' అని అడిగే శక్తి మాకులేదు. ఆసక్తి ఉన్నది. ఈ బాధ్యతను పండితులవారు అనుగ్రహించవలె. మా కుమారులు ఇంతవరకు వివాహమే వద్దని చెప్పేవారు. వంశాభివృద్ధికి, రాజ్యరక్షణకు సంతతి అగత్యమని పైన పైన ఒత్తిడిచేసి సమ్మతింపజేయవలసి వచ్చినది. ఇదిగో, మా యీ జీవితపు సర్వస్వమూ ఇప్పుడు మీ అందరి ఒడిలో ఉన్నది. ఇకమీద మాకు సుఖసంతోషాలను, మనుమలను పొందే పుణ్యాన్ని మీరు ఇస్తేకద్దు. దీనిమీద మీ ఆలోచన వివేచనలను అనుసరించడానికి మేమూ, మా కుమారులూ సిద్ధంగా ఉన్నాము. ప్రభువులు సపత్నీకులు కావాలని, పుత్రవంతులు కావాలని మా కోరిక. ఇందు కోసమే మేమింకా జీవంతో ఉన్నాము." అని దీనస్వరంతో పలికి మౌనం వహించినారు; సుఖాసనంలో ఆసీనులయినారు.

గంగరాజులుగారు, మాచికబ్బె, మారసింగమయ్య, అందరూ కాతరదృష్టితో, అధైర్యంతో పండితులవైపు చూపుసారిస్తూ కూర్చున్నారు. పండితులు ఒక్కమారు అందరిముఖాలను పరికించినారు. ఒక్కరిముఖంలోను గెలివి (సంతోషోత్సాహం) కనిపించలేదు. ఆక్షణమే వారు తమ కర్తవ్యమేమన్నదీ నిర్ణయించుకొనినారు.

పండితులు గంభీరధ్వనితో ఇలాగు అనినారు: "అక్కగారు నేను చెప్పవలసినదానిని ఒకరీతిగా తామే సెలవిచ్చినారు. ప్రభువులు శాంతలను, లక్ష్మిని–ఇద్దరినీ స్వీకరించడానికి సమ్మతించడం మాకు మహానందకరమైన విషయం. లక్ష్మిని తమ కుమార్తెగా, కోడలుగా సంతోషంతో అప్పగిస్తున్నాను. అక్కగారు ఇంత సెలఇవ్వడానికి ముందే నేను చెప్పలేక

పోయాను గదా అని నా మనస్సు బాధపడుతున్నది. శాంతల నా పెద్ద కుమార్తె; లక్ష్మి చిన్నకుమార్తె. అక్కచెల్లెండ్లిద్దరూ, ఇప్పుడున్న ట్లే సర్వకాలమూ అన్యోన్యంగా ఉండదగిన బుద్ధి, జ్ఞానం, కులీనత, శిక్షణ, సౌశీల్యం వారికి ఉన్నవి. ఇద్దరూ ప్రభువుల పాణిగ్రహించి మహాసుఖవంతురాండ్రు కానీ. ఇక అక్కగారి మనస్సు సమాధానపడనీ, ఆమోదించనీ. ఇక వీరు మీ బిడ్డలు. శ్రీ కేశవుడే అనుగ్రహించినాడు, ఇల్లు నింపుకోండి. మనస్సు నింపుకోండి..."

పండితులు ఇంకా వక్తవ్యం ముగించడానికి ముందే, రాజమాత వారి అమృతవాణికి ఆనందపరవశులై, తటాలున ఆసనంనుంచి లేచివచ్చి పండితుల పాదాలకు సాష్టాంగ ప్రణామం చేసి "ధన్యులమయాము, కృతార్థులమయినాము." అనినారు. పండితులు తమ రెండు చేతులూ పైకెత్తి జోడించి, అంతరిక్షం చూచి, "కేశవా, తవార్పణం, తవార్పణం" అంటూ తమకు చేసిన నమస్కారాన్ని శ్రీ కేశవునికే అర్పించినారు. వెంటనే గంగరాజులుగారు, మారసింగమయ్యగారు, మాచికబ్బె పండితుల ,పాదాలకు ఆనందాతిశయ భక్తివిశ్వాసాలతో సాష్టాంగపడినారు. పండితులు వారి నమస్కారాలనూ శ్రీ కేశవునికే అర్పించినారు. పిదప మరొకమారు రాజమాతను సంబోధించి, తాము చెప్పదలచిన మాటలను కొనసాగించినారు: "అక్కగారు ఇంకా ఆసనం అలంకరింతురుగాక! శ్రీ కేశవుడు సుప్రీతుడయినాడు. నేను ఇక్కడికి రాకముందు "శ్రీవైష్ణవ బ్రాహ్మణుడు ప్రభువులకు తన కుమార్తెను ఇచ్చి పెండ్లిచేస్తాడా?" అనే సందేహం మిమ్మల్ని బాధించి ఉండవచ్చు. ప్రభువులు దేవాంశసంభూతులు; వేలాపుర విజయనారాయణుని అంతరంగభక్తులు. లేకపోతే, ఈ లోకానికే అసదృశమైన అతిశయ శిల్పసౌందర్యంతో ఒప్పారే, అలాటి దేవాలయాన్ని కట్టించడం అయ్యేదా? ఈ పృథ్వీనారాయణునికి నా ఆత్మజ లక్ష్మిని ఇచ్చి. ఈ లక్ష్మీనారాయణులనుచూచి ఆనందపడే భాగ్యం నేను పోగొట్టుకోనా? అన్నపానాదులలో, శుచిరుచులలో, దైవభక్తిలో, కర్మశ్రద్ధలో, శమదమాది గుణాలలో జ్ఞానమార్గంలో ఈ ప్రభువులకు సాటిఎవరు? ఇలాటి రాజన్యరికి కన్యను ధారపోయడం నా మహాపుణ్యమనే



భావిస్తాను. అక్కగారూ, ఈ వివాహం దైవప్రేరితమైనదని నా దృఢ విశ్వాసం. ఈ మంగళకార్యాన్ని మహాసంతోషంతో నడపండి." అని ముగించినారు.

రాజమాత, మాచికబ్బె, మారసింగమయ్య, పెరుమల పండితుల అమృతవాణి విని, ఆనందపరవశులయినారు. గంగరాజులుగారు అత్యానందంతో "ఘనుల ముఖంనుంచి ఘనమైన మాటలే వెలువడేని. పండితులు ఇప్పుడు హొయిసళ రాజ్యంపైనే అమృతవృష్టి కురిపించినారు." అన్నారు. పండితులు చిరునవ్వుతో "గంగరాజులుగారు ఈ రాజ్యానికి బంగారు శిఖరంవలె. తాము అలాటి గొప్పవారయినా, ఇతరులను ప్రశంసించడం మహోన్నతుల లక్షణం." అన్నారు.

రాజమాత సంతోషమంతా చెప్పతరం కానంత. వారు అందరికీ తేనె పాలు తెప్పించి యిచ్చినారు." ఇక మిగిలిన పనులన్నీ అన్నగారు, పండితులు, భీష్ములు చేయవలసినవి. శుభస్యశీఘ్రం. మహేంద్రుడే చూడడానికి ఆశపడే టంతటి వివాహం జరుపండి. మనకయినంత సంతోషం మన ప్రజలందరికీ కలుగనీ. భరత ఖండంలోని రాజులందరినీ ఆహ్వానించి, వారి అంతస్తుకు, గౌరవానికి మీరిన ఉపచారాలతో, సన్మానాలతో తృప్తి పరచండి. వారందరి సౌహార్దమూ మన దేశానికి దొరకనీ. నడవవలసిన సమస్త కార్యాలకు తగిన సమయం, అవకాశం కల్పించుకొని శుభదిన శుభముహూర్తాన్ని పండితులే నిర్ధరించని. ఆ దినం చాలినంత త్వరలో రానీ." అనినారు రాజమాత.

"నిశ్చితార్థపు గుర్తు ఇది" అన్నట్లు రాజమాత తాంబూలఫలాదులు తెప్పించినారు. వాటిని వారి వారిలోనే ఇచ్చి పుచ్చుకోడం జరిగింది. రాజమాత సమ్మానంతో అందరినీ వీడ్కొల్పి, తాము తమ తనయులకు ఈ సంతోషవార్తను తెలుపడానికి వెళ్ళినారు.

# 19

మోయలేనంత భయసంకటాలను మోసుకొని వచ్చిన మాచికబ్బె, మారసింగమయ్య నగరునుంచి స్వభవనానికి మరలినప్పుడు మోయలేనంత

సంతోషం మోసుకొని బయలుదేరినారు. నిన్నరాత్రి ఈ దంపతుల ఉన్న మానసికస్థితికీ, ఇప్పటి మానసికస్థితికీ భూమ్యాకాశాలంత అంతరం ఉంది. "అతిస్వల్ప కాలంలో ఘోరమైన సందర్భమొకటి విధి విలాసంతో అత్యానందకరం కావడం దైవకృపకాక మరేమి?" అని మాచికబ్బె పతితో అన్నారు.

"నిన్నరాత్రి నిద్దురరాక ఈ విషయాన్నే పైన పైన యోచిస్తున్నాను. యోచించినకొద్దీ పరిస్థితి అసాధ్యమనే తోచింది. మాచీ, నేను రాత్రే నిర్ణయించుకొన్నాను ... ప్రభువులకు కత్తి అప్పగించి, రాజధానిని వదలి ముఖం మరుగుజేసుకొని, ఏదో మరొకదేశానికి వెళ్ళిపోవడమని. ఇన్నినాళ్లు బదికీ కొనకు మనకు ఈ రాజ్యం ఉప్పు లేకపోయినది గదా అని చాల సంకటపడినాను. ఇప్పుడు 'ఇదొక చెడ్డకల' అన్నంతమట్టుకు నన్ను భ్రమింపజేసినవి ఇప్పుడు జరిగిన ఈ నిశ్చితార్థాలు. అంతభయాన్ని దానికి నూరుమడుగులు ఆనందంగా చేసినది దైవలీలకాక మరేమి, మాచీ?" అనినారు మారసింగమయ్య.

మాచికబ్బె, మారసింగమయ్యగారు తమ భవనం చేరేవేళకు శాంతల, లక్ష్మి పెరుమల పండితుల యింటికి వచ్చినారు. శాంతల తలిదండ్రులిద్దరూ, ఆనాడు కుమార్తెలు మేల్కొనడానికి ముందే ఇంటి నుంచి పెరుమల పండితులకోసం వెళ్ళినారు. అప్పుడు వారున్న పరిస్థితి కఠినమూ, సంకటకరమూ అయినది. అందువల్ల ఎవరికీ తెలుపకనే దంపతులిద్దరూ యింటినుంచి బయలుదేరినారు.

శాంతల మేల్కొనడానికి ముందే మాచికబ్బె ఇంటినుంచి బయలు వెడలినందున 'ఎక్కడికి వెళ్ళినారో ఏమో' అని బిడ్డలు భయపడవచ్చునని అనుకొని, ఇల్లు చేరేవరకూ ఆమెకు ప్రాణంలో ప్రాణంలేదు. ఇప్పుడు బిడ్డలిద్దరూ ఇంటిలో లేకపోవడం చూచి, తల్లిప్రాణం తల్లడించిపోయినది. దేచయ్యను పిలిపించి అడుగగా, వారు ఇద్దరూ పండితుల ఇంటికి వెళ్ళినట్లు చెప్పినాడు. తల్లిదండ్రులకు పోయిన ప్రాణాలు వచ్చినట్లయింది.



మాచికబ్బె దేచయ్యతో "అయ్య, అమ్మ ఇద్దరూ నగరుకు వెళ్ళినారు, విషయం రాజుగారు అంగీకరించినారు అని శాంతలమ్మకు, లక్ష్మమ్మకు మొదట తెలిపి రా." అని చెప్పి వాణ్ణి పంపినమీదట ఆమెకు మనస్సు కుదుటబడింది. అంతేకాక పండితులవారూ ఈ సంతోషవార్తను పిల్లలకు తెలుపుతారనే విశ్వాసం ఆ తల్లికి ఉన్నది.

లక్ష్మి తండ్రిని చూచి పూర్తిగా ఒక దినమయినది. ఆ ఒక్కదినమూ ఆమెకు దుఃఖప్రళయమే అయినది. ఇప్పుడు తండ్రిని చూచినవెంటనే లక్ష్మికి దుఃఖం పొంగివచ్చినది. పరుగునవచ్చి తండ్రి కాళ్ళను గట్టిగా కౌగిలించుకొన్నది. లక్ష్మిలాగే కాతరురాలైన శాంతలా పండితుల పాదాలను తాకి నమస్కారం చేసినది. జ్ఞానవృద్ధులు బిడ్డల మనస్సులోని భయం గ్రహించినారు. "శుభం కలుగనీ! సుఖం కలుగనీ!" అని ఆశీర్వదించి, వారిద్దరిని దగ్గిరికి పిలుచుకొని కూర్చోబెట్టుకొని, ఇద్దరి ముఖాలూ పరికించి, కళావిహీనంగా ఉండడం చూచి, చిరునవ్వు నవ్వి "పిల్లలూ, మీరు దైవాన్ని మరచినారు" అనినారు.

వారి మందహాసాన్ని, మాటల ఆంతర్యాన్ని ఇద్దరూ అర్థంచేసుకోలేకపోయినారు. శాంతల కొంచెం కలవరంతో "అయ్యా, మీరు ఇప్పుడే వచ్చినట్లు కనిపిస్తున్నదే. ఎక్కడికి వెళ్ళినారు? ఇంట్లో మా అమ్మ, అయ్య ఇద్దరూ ఉండలేదు; ఎక్కడికి వెళ్ళినారో తెలియదు. ఎవరితోనూ చెప్పనన్నా చెప్పిపోలేదు. మాకు చాల భయమై ఇక్కడికి వచ్చినాము." అనినది.

"తమ బిడ్డల రూపు, విద్య, సహజగుణాలు ప్రభువులను మెప్పించాయిగదా!" అనే అభిమానంతో పండితులు అప్పుడు నవ్వడం. ఒక్క నిమిషం పండితులు యోచించినారు. "సంగతి తెలుపడమా? మానడమా? తెలుపడంవల్ల తప్పేమి? పిల్లల మనసుకు నెమ్మది, సంతోషం కలిగించడం కంటె ఎక్కువ ఏమిటి? ఈ సమాచారం వీరినుంచి గోప్యంగా ఉంచవలసిన కారణం ఏమీ లేదుగదా!" అని నిశ్చయించి, పిల్లలతో "నేను నగరునుంచి ఇప్పుడే వచ్చినానమ్మా. శాంతలా. నీ అమ్మగారూ, అయ్యగారూ అక్కడికే వచ్చినారు." అన్నారు.

పండితులు ఆ మాటలు పలుకగానే బిడ్డలిద్దరికీ వణుకు పుట్టినది, ముఖం వర్ణహీనమయినది, నొసట చెమట పట్టినది. 'ఇకముందు మాట ఏమిటి చెబుతారో' అని అస్తిమితంగా హృదయం కొట్టుకొన్నది.

సహృదయ అయిన లక్ష్మి అక్క శాంతల అడిగిన ప్రశ్నను తాను ముందుకు సాగిస్తూ, "ఈ సంగతి చెప్పడానికి ఇంత యోచన చేయవలసి ఉందా అయ్యా" అని ప్రశ్నించింది.

పండితులు కుమార్తె ముఖం చూచి "బలే గట్టిదానివి! నీ అక్క ప్రశ్నను ముందుకుసాగించినందుకు నీకొక సొగసైన బహుమానం ఇస్తాను." అనినారు.

"నాకు ఏ బహుమానం వచ్చినా, దానిలో హెచ్చుపాలు అక్కయ్యది. అక్కయ్య అయినా నా విషయంలో అట్లె."

"దీనివల్ల నీ అక్కయ్య నిన్ను అన్నివిషయాలలోను నడిపించుకొనే వెళ్లుతుందనే విశ్వాసం నాకు కలిగింది!"

శాంతల :- "ఈ విషయంలో అనుమానమే వద్దు, అయ్యా. మేమిద్దరం అనంతకాలపు, అనంతజన్మాల సహయాత్రికులం. మాకుమాకు ఏ భేదభావమూ లేదు. ఇంతకుముందూ లేదు; ఇకమీద ఉండదు."

పండితులకు పరమానందమయినది. వారు, "అమ్మా, శాంతా, నీవు మహానుభావురాలవు. మీ యిద్దరి స్నేహసౌహార్దాలు ఈ లోకానికి ఆదర్శంగా ఉండనీ. లక్ష్మికంటె నీవే పెద్దదానివి. నీవు దానిని ఎంతటి కష్టంలోకాని, సుఖంలోకాని నీవెంట నడిపించుకొని పోవలె." అనినారు.

శాంతల :- "అయ్యా, దీనిని మీరు సెలవియ్యవలెనా? తప్పితే, మీపాదాల ఆన."

లక్ష్మి :- "అయ్యా, ఏమిటేమిటో చెబుతున్నారు. మాట మరిపించడంకోసం కాదుకదా!"

పండితులు :- "ఏమాట, అమ్మా?"



శాంతల :- "లక్ష్మి గట్టితనానికి ఏమో బహుమాన మనినారుగదా?"

పండితులు :- "ఔనౌను. మంచి బహుమానమంటే మంచి బహుమానమే. అదీ మీకు తగినట్టిదే. చాల గుట్టయినసంగతి. ఆడవారికి గుట్టు చెప్పరాదని శాస్త్రం చెబుతున్నది."

శాంతల :- "మేము ఆడవారంకాము; మీ బిడ్డలం."

పండితులు :- "నా బిడ్డలసంగతి నాకు తెలుసు. అయినా విషయం బహుగోప్యమైనది."

లక్ష్మి :- "అంత గోప్యమయితే, అది బహుమానం ఎలాగు అవుతుంది?"

పండితులు బిడ్డలిద్దరినీ చూచి, "ఈ రహస్యాన్ని గౌరవంతో చూడవలె; రక్షించుకోవలె ... ప్రభువులు మీ యిద్దరినీ పెండ్లాడడానికి ఒప్పుకొనినారు; తమంతటతామే ఒప్పుకొనినారు. ఈ విషయంలో ఎవ్వరూ వారిని నిర్బంధించ లేదు."

శాంతల ముఖంపై క్షణకాలం సహజలజ్జ పొడమినది. మనస్సులోనే "నిర్బంధించి, ఒప్పించినది శ్రీ శారదాదేవే" అనుకొని, మనస్సును స్థిరపరచుకొని, "మన ఉద్దేశం సాధువయితే, భగవంతుడే దానిని నడిపిస్తాడని మీరే పెక్కుసార్లు సెలవిచ్చినారుగదా, అయ్యా?" అన్నది.

పండితులు :- "అమ్మా, అది నిజం. మన స్థూలబుద్ధికి ఇది న్యాయమని కనిపించే విషయం పరమాత్మ తలపులో ఏ రూపంలోవచ్చి, ఏ రూపం దాల్చి, దేనిని సాధిస్తుందో, అథవా భేదిస్తుందో, అది పరమాత్మకు మాత్రమే వేద్యం. మన కంటికది న్యాయంకాదనే తోచవచ్చు. ఈ ధర్మసూక్ష్మం తెలుసుకొనడానికి మానవులలో మహాత్ములకూ సాధ్యంకాదు. సామాన్యులకు ఇక అసాధ్యమనడం చెప్పనక్కరలేదు. తత్కాల దేశ వర్తమాన ప్రమాణాలతో బహుశః ...... స్వాభిమానంతో విషయాలను తూచేవారం మనం. ఆ విషయాన్నే భవిష్య నిరూపణదృష్టితో కొలిచే శక్తి పరమాత్మునిది. శాంతలా, నిన్నరాత్రి మీ యింట్లో మీ అందరిపైన ఒక మహాపర్వతమే దొర్లిపడినదని మీ తల్లిగారు అన్నారు. దైవకృపతో

ఈ మహాపర్వతం ఇప్పుడు తనంతటనే పక్షి ఈకంత చులకనగానూ, మృదువుగానూ అయినదికదూ? అమ్మా శాంతలా, అమ్మా లక్ష్మి, ఈ సందర్భంలో నా ముఖ్యోపదేశమిది. "ఎవరు నిజంగా పరమాత్మునికి ఆత్మార్పణం చేసుకొంటారో, వారి యోగక్షేమాలన్నిటినీ పరమాత్ముడే వహిస్తాడు. ఏ పని చేయవలసివచ్చినా, ఏ మాట పలుకవలసివచ్చినా, ఎలాటి ఇక్కట్టు మీదబడినా, మీ అంతరాత్మ ఆనతి విని ప్రవర్తించండి. ఇలాను కొంతకాలం అభ్యాసమయితే, మీలోనే ఒక దివ్యమైన అంతశ్చక్షు ఉదయిస్తుంది. పరమాత్మ అనుగ్రహించిన ఆ వెలుగే మీకు మార్గదర్శి అవుతుంది. దీనిని మరువకండి."

శాంతల, లక్ష్మి :- "మరువము అయ్యా, మరువము. అలాగే నడచుకొంటాము."

అప్పుడు దేచయ్య అక్కడికి వచ్చి "దొరగారూ, అమ్మగారు - ఇద్దరూ మీకోసం కాచుకున్నారమ్మా అమ్మాయిగారూ. రాజుగారు ఒప్పినారని చెప్పమని సెలవిచ్చారండి అమ్మాయిగారూ." అని శాంతలకు తెలిపినాడు. శాంతల సంతృప్త హృదయంతో పొంగిపోయి పండితులకు ప్రీతితో నమస్కరించి, సెలవు తీసుకొని, దేచయ్య వెంటరాగా, తన భవనానికి బయలుదేరినది.

# 20

ప్రభువుల జాతకచక్రం, శాంతల జాతకచక్రం గంగరాజలుగారు పెరుమల పండితుల వారి వద్దకు పంపినారు. లక్ష్మి జాతకం పండితులవద్దే ఉన్నది. పండితులు ప్రభువుల జాతకాన్ని ముందొకమారు స్థూలంగా చూచినారు. అది మహాయోగ జాతకమని పండితులు అప్పుడే తెలుసుకున్నారు. అప్పుడు వారు ప్రభువుల దారాపుత్రాది స్థానాలను సూక్ష్మంగా గుణించి చూడలేదు. ప్రభువులకు మహాయోగ కారకాలయిన పుణ్యగ్రహాల స్థానబలం బాగా ఉన్నందున నీచగ్రహాలదృష్టి ఒకవేళ ఉన్నా, అది ఛాయామాత్రంగా పర్యవసిస్తుందని నిర్ధరించినారు. పండితులు.



ఇప్పుడు వారే, కన్యల జాతకాలను ప్రభువుల జాతకపు ద్వాదశభావాలతోను పోల్చి చూడవలసిన సందర్భం వచ్చింది.

కన్యల తండ్రి స్థానంలో ఉన్న తాము దానినంతా పరిశీలించరాదు. జాతకాలలోని దోషాలను పాపగ్రహఫలాలను వెదుకుతూ వెళ్ళడం అశ్రేయస్సు, అపరాధం అనుకొని, జాతకాలను భగవంతుని సన్నిధానంలో ఉంచి, జ్యోతులు వెలిగించి, "భగవన్, నీ సంకల్పం ప్రకారం వారివారి కర్మఫలం ప్రకారం నడుస్తుంది. దానిని పరీక్షించే ధార్ష్ట్యం నాకు వద్దు. ఆ ప్రాణులను ముందుకు నడిపించేభారం నీది." అని విన్నవించి, నమస్కరించి జాతకాలను రాజగృహం జ్యోతిష్కులయిన భట్టులవారికి పంపివేసినారు.

స్వస్తిశ్రీ శాలివాహన శ ౧౦౪౪ శుభకృతు నామసంవత్సర పుష్య బహుళ దశమి సోమవారం ప్రాతఃకాలం శుభకన్యాలగ్నం వివాహశుభ ముహూర్తమని సర్వానుమతితో నిశ్చయమయినది. పెండ్లికి ఇక కొన్ని నెలల వ్యవధి. కావలసిన పనులేమో బ్రహ్మాండమంత. రాజమాత మొదట్లోనే గంగరాజలుగారికి సెలవిచ్చినారు; ఈ పెండ్లి ఇంద్రుడు కూడ ఆశ్చర్యపడేటంత విజృంభణతో ఉండాలని. గంగరాజలుగారి అంతర్యంలోను అంతటి ఆశే ఉన్నది. మహాదేవి అక్కగారు తమ పుట్టినింట నుంచి తెచ్చిన నగకట్టు, ఆది హొయిసళ ప్రభువులు నృపకాముల కాలం నుంచి పెరిగి నిండి నిబిడీకృతమైన బొక్కసం వివాహవ్యయానికి ముడుపుకట్టి పెట్టినారు.

హొయిసళ విష్ణువర్ధన ప్రభువులు పెండ్లాడుతారన్న వార్త మెఱుపంత వేగంతో భారతదేశపు మూలమూలకూ వ్యాపించింది. రాజమాత ఆజ్ఞ మేరకు చక్రాధిపతులకూ, మహారాజులకు, రాజులకు, మహాసామంతులకూ, సామంతులకు, గ్రామాధికారులకు, ప్రెగ్గడలకు వారి వారి అంతస్తుకు, గౌరవానికీ తగినట్టు వర్ణాక్షరాలున్న శుభలేఖలను యోగ్యులయిన రాయసమువారు, భటులు తీసుకొని వెళ్ళినారు.

ఇలాంటి సమయం తారసిల్లినప్పుడు, సామంతులు, ప్రభువులతో స్నేహం అపేక్షించే రాజులు పెండ్లీడున్న తమ కన్యలను ప్రభువులకు

పత్నులుగా తెచ్చి అప్పగించడం ఆ కాలపు సంప్రదాయం. ఆ కన్యలను పాణిగ్రహణం చేసుకొనడంవల్ల మండలేశ్వరులకు అంగబలం, అర్థబలం మాత్రమే కాక, ఆ సామంతులకూ దొడ్డవారితో చుట్టరికం పెంచామనే గౌరవ మర్యాదలూ గలిగేవి.

చక్రగొట్ట, నీలపర్వతం, కొంగు, తుళువ, చెంగాళ్వ, నంగలి, కోళాల, తెరెయూరు, కోయముత్తూరు, ఉచ్చంగి, తలెయూరు, సాసపురం, ఆంధాసురచౌక, బలియపట్టణం, చంగేరి, హానుగల్లు, గంగవాడి, నొళంబవాడి, ఘట్టకవట్టం, కాంచి, బనవసి, వల్లూరు, హంజేరు, సవిమలె, రాయరాయపురం మొదలయినపట్టణ పాలకులు, దేశనాయకులు తమ పిల్లలను ఇవ్వడానికి ఆశపడి, గంగరాజులుగారికి, రాజమాతకు కమ్మలు వ్రాయించి పంపినారు.

చతుర మతులయిన గంగరాజులుగారు కొంచెం నిదానించి, వేగుల వారినుంచి ఆ కన్యకల వయస్సు, రంగు, రూపు, గుణం, విద్య, శీలం మొదలయినవి తెలుసుకొని, జల్లు పొల్లులు తోసివేసి, ఎవరిమైత్రి దేశ హితానికి అత్యావశ్యకమని, తోచినదో, అలాటి ఐదుగురు ప్రబల సామంతుల కన్యలను రాజమాత మాటతో ఏర్చి, రాజమాత పరంగానే కన్యల తండ్రులకు ప్రసన్నపత్రాలు వ్రాయించి పంపినారు.

“ఎందుకీ గోజులాటలు? ఇందుకోసమే నేను పెండ్లి వద్దన్నాను. నా మనస్సు కిది న్యాయంకాదు; ధర్మంకాదు, అమ్మా. ఇది వద్దు.” అని విష్ణువర్ధన ప్రభువులు తల్లితో చెప్పకున్నారు. రాజమాతకు ఉత్తర మివ్వడం కష్టమయింది. “ఈ ఆలోచనమాకూ మంచిదనిపించలేదు. ఇలాటివి వృథా వేసట పుట్టించే పనులు. గంగరాజగారితో చర్చించి చర్చించి విసిగినాము. దేశరహిత రక్షణకు ఇది అగత్యమనే వారి అభిప్రాయం. పూజ్యులయిన నీ తాతగారికి అరవైమంది పత్నులు ఉండేవారట. పూజ్యులయిన నీ తండ్రిగారికి నాతోపాటు పదహైదుమంది పత్నులు. వారంతా తమతమ భాగం పంచుకొని పుట్టినిండ్లు చేరుకున్నారు. వీరిని కట్టుకొని వేగడం అలాగు ఉండనీ; వీరి మత్సరాలకు, దినదినం జరిగే పోట్లాటలకు



తీర్పులు చెప్పడానికి ఘాలాతుడే రావలసి ఉంటుంది. గంగరాజులుగారు ఏరిపెట్టిన పదహైదులోను మరీమరీ ఏరి ఐదుకు దించినాను. వీరు ప్రబలులు, బలాఢ్యులు, ఇలాటివారిని చుట్టరికంతోనే లోబరచుకోవాలె. పేరుకు వీరు ఉండనీ; అప్పాజీ. వీరి భారం నేను వహించుకుంటాను.” అనినారు రాజమాత.

“అమ్మా, ఇది ఊరడింపు మాటేకాని, ధర్మబాహిరమైనది. పెండ్లాడుతానని ఒప్పుకొనడమే నా తప్పాయెనా? మనదేశంలోని ఒక సామాన్య ప్రజకున్నంత స్వాతంత్ర్యమూ నాకు లేదుగదా!”

“అప్పాజీ, అన్నగారికి నేను ఎంతో చెప్పి చూచినాము. నీవూ ఒక్కమారు పిలిపించి అడుగవచ్చుగదా!”

“బాగు బాగు. మీరిద్దరూ చేరి నన్ను ఈ యజ్ఞానికి పశువుగా చేసిన మీదట, నేనొక్కణ్ణి ఏమి చేయగలను?” అని ప్రభువులు సౌహార్దంతో తల్లికి నమస్కరించి వెళ్ళిపోయినారు.

## 21

వివాహమహోత్సవ సమారంభంలో ద్వారవతి ఒకటికి మూడింతలు పెరుగసాగినది. అనేక కళావిదుల, వృత్తికుశలుల, శిల్పుల, సున్నం, వన్నె పనివారిసంఖ్య నాలుగు వేలయినది. పురపారిశుద్ధ్యకారుల, ఊడిగపు వారిసంఖ్య దానికి రెండింతలయినది. వివాహకార్యాలు తడవు తీరిక లేక పగలనక, రాత్రనక ఒకే విధంగా నడిచినవి.

ఆహూతులు ఎవరు ఎవరన్నది నిశ్చయమయినది. మండలేశ్వరులకు, రాజులకు, మహాసామంతులకు, సామంతులకు, మహావర్తకులకు, శ్రేష్ఠులకు, పురప్రముఖులకు, రాజనగరులవంటివి మొదలు సాధారణమైనవి వరకు విడిదులు తాత్కాలికోపయోగానికి, భవ్యంగా, దృఢంగా నిర్మించినారు. కొసకు ఆహూతుల, గజతురగోష్ట్రి వృషభాదులకుకూడ కొట్టాలు, మేత నీరు నిలవచేయడానికి తగినస్థలాలు, వీటిని చూచుకొనే భృత్యులకు

వాసార్హమైన కుటీరాలు, ఈ భృత్యులకు దినదినమూ నగరునుంచి ఒదిగించవలసిన పడి బత్తేలకు అక్కడక్కడ ఉగ్రాణాలు, వాటి నిర్వహణకు తగిన ఉగ్రాణాధికారులు – అన్నిఏర్పాట్లూ చాల కట్టుదిట్టంగా జరిగినవి.

వివాహానికి ఆహూతులయిన వారందరికీ, వారివారి గౌరవానికి, అంతస్తుకు తగినట్టు ఉపచార పరిచర్యలు చేయడానికి తగిన ఊడిగంవారు, దాస దాసీజనులు, సూపకారులు, పాత్రలు, పదార్థాలు, ధాన్యాలు, వాహనాదులు ఏర్పాటయినవి. ఇదంతా చేయడమేకాక ప్రతి గృహంలోను, సౌధంలోను, రాచనగరులోను నూది మొదలు గాదెవరకు కావలసిన సమస్త సామగ్రిని నింపి వేసినారు గంగరాజగారు. ఈ వితర విచక్షణలను అంతస్తు గౌరవాలతో సరితూగించడం గంగరాజగారికి మాత్రమే సాధ్యం.

నూతన నిర్మిత సౌధాల, గృహాల వీధి క్రోశంవరకు దీర్ఘంగా పెరిగింది. ఈ వీధికి రెండువైపుల శృంగారమైన సౌధాలు, గృహాలు విలసిల్లినవి. ఒక నెలలోనే పెరిగి వ్యాపించి పూలు పూచే తరులతలతో, ప్రతి సౌధమూ, గృహమూ శోభించినది. ప్రతి గృహంముందు భాగంలోను, రాజవీధిలోను పెద్దపెద్ద నూనె దీపాలు — గృహరాజి ముందు భాగాల లోను, లోపల, వెలుగులు విరజిమ్మే రంగురంగుల నక్షత్రాలవలె వెలిగేనూరారు, వేయూరు దీపాలు-రాత్రులలో ఇదే నక్షత్రలోకమా అన్నట్టు సింగారించినారు.

వివాహ శుభముహూర్తమే పెద్దచేవేరి శాంతాలదేవి పట్టాభిషేక మహోత్సవ ముహూర్తమని నిశ్చయమయినది. గంగ, యమున, సరస్వతి, సింధు, బ్రహ్మపుత్ర, గోదావరి, కృష్ణ, కావేరి, తుంగభద్ర, తామ్రపర్ణి మొదలయిన మహానదుల తీర్థాలు అభిషేకం కోసం సేకరించినారు.

హిమాచల నేపాల ప్రాంతాల నుంచి కస్తూరి కృష్ణాగరు, కాశ్మీరం కుమంచింకుమ పూవు మను మృదుకంబళాలు, వారణాసి, హస్తినావతి క్షేత్రాలనుంచి రంగురంగుల పట్టువస్త్రాలు, పీతాంబరలు గజతురగోష్ట్రాలమీద రాసులు రాసులుగా వచ్చి చేరినవి.



పాలుబండ్ల మీద, ఒంటెల సాళ్ళమీద, గుర్రాలెక్కి, వేగంగా నడిచే రథాలలో, ఏనుగుల మీద, మేనాలలో దేశదేశాల రాజులు సమస్త వైభవాట్టహాసాలతో, పుత్రమిత్రకళత్ర బంధుబాంధవులతో, దాస దాసీజనంతో ద్వారవతికి బయలుదేరినారు.

దేశదేశాల విద్వాంసులు, ఘనపాఠులు, కవిశ్రేష్ఠులు, భూసురోత్తములు సకుటుంబంగా గుంపులు గుంపులుగా ద్వారవతికివచ్చి దిగసాగినారు.

సాహసమల్లులు, చతురధానుష్కులు, వివిధాయుధ నిపుణులు, ఇంద్రజాల మహేంద్రజాలికులు, గడలపై వివిధ చమత్కారాలు, బల ప్రదర్శనాలు జరిపే దొమ్మరులు, మృగ పక్షి వేషాలు ధరించి నటించే పగటివేషాలవారు, నటీనటులు, గాయనీగాయనులు, ఆశుకవులు, హాస్య నిపుణులయిన విదూషకులు, వన్యమృగ పక్షులను పట్టి మచ్చిక చేసి ఆడించే శాకునికులు, వివిధవృత్తుల, వివిధజాతుల జనులు ద్వారవతిలో కిక్కిరిసిపోయినారు. అంత హెచ్చు జనసమ్మర్దం దక్షిణాపథంలో అంతకు ముందెప్పుడూ కలుగలేదు.

వివాహమంటప వైశాల్య వైఖరులు చెప్పతరంగాదు. "దేవేంద్ర కుబేరుల సభాస్థానాలు వీనికంటే ఏమిటి హెచ్చు?" అనే రీతిగా కనుల విందయినది. ఆ భవ్యమంటపం గంగరాజులుగారి, రాజమాత మహాదేవిగారి, విష్ణువర్ధన ప్రభువుల హృదయవైశాల్యం సూచించేది. ఆ వితరణ, ఆ అభిరుచి, ఆ బెడగు ఇంకెక్కడా చూడడం సాధ్యంకాదు. బంగారు సోనలేపారించి నిర్మించినారు ఆ కళ్యాణమంటపం. దానిలోపల అడుగు పెడితే, గంధర్వలోకాన్నే ప్రవేశించినట్టు భ్రాంతి కలిగేది.

హోమవేదిక ఏర్పాట్లు స్వయంగా రాజమాత మహాదేవిగారివే. పెద్ద పెద్ద వెండి పళ్లెరాలలో అనేక విధాలయిన ఫలపుష్పాలు శుభ ముహూర్తానికి మునుపటిరాత్రే సేకరించి పెట్టినారు. పుష్పరాశివలె విప్పారిఉన్న సహస్ర పత్ర కమలాలు, శ్వేతపుష్పరాశిపై శ్వేతసరోరుహాలు, మరొకచోట నానావిధపీత వర్ణపుష్పాల మధ్య స్వర్ణకమలాలు,

నీలవర్ణ పుష్పాలమధ్య నీలోత్పలాలు సొబగులు కొల్పినవి. ఆ పూవులలో ఒక్కటైనా విరిగిన రేకులదిగాని, నిండుగా పెరగనిదిగాని, పూర్తిగా వికసించనిదిగాని, పురుగు గొట్టినదిగాని, తెగులు తగిలినదిగాని, రంగు తగ్గినదిగాని, వాడినదిగాని లేదు. ఏరి ఏరి తెచ్చిన పూవులవి. ఫలాలూ అంతే; పెరుగుదల, రంగు, రుచి – వీటిలో శ్రేష్ఠమయినవి.

సువర్ణపాత్రాలలో ఘృత మధుదధిక్షీరేక్షురసాలు; మరొకవైపు హరిద్రాకుంకుమ చందన మృగనాభి మొదలయిన సుమంగళ వస్తువులు, సుగంధవస్తువులు; ఇంకొకచోట వెండి పళ్లెరంలో పాలనురుగువలె ఉన్న లాజలు. వేదికకు పూర్వాభిముఖంగాను, ఉత్తరాభిముఖంగాను వేసిన వెండి పీటలు; మధ్యన పెండ్లికుమారులయిన ప్రభువులు అలంకరించడానికి రత్నాలు పొదిగిన బంగారు పీట; ఇరుపక్కలా రాజబంధువులు, కుల గురువులు, రాజ పురోహితులు ఆసీనులు కావడానికి శ్రేష్ఠాసనాలు; – ఇవన్నీ అరుణోదయానికి ముందే సిద్ధమయినవి.

రాత్రంతా ద్వారవతి పట్టణం పట్టణమే మేల్కొని ఉన్నది. పట్టణంలోని జనమంతా వీథులలోను, రాచనగరుముందూను. వీథులలో పది పది అడుగులకు పచ్చని పందిళ్ళు; దారిని వెళ్ళేవారిని పిలిచి పిలిచి మధుర ఫలాలు, ఎడనీరు, చెరకురసం, పణ్యారంపంచే చలివేంద్రలు; నాటక నృత్యగృహాలు; భజనకథాగోష్ఠులు; దేవలోత్సవాలు; దివిటీల వెలుగులో యక్షగానం, లావణి, బృందనృత్యాలు, జానపదనృత్యాలు – వీటిలో రాత్రి తెల్లవారినది. "ఇంకా తెల్లవారలేదా?" అనేంతలో వాసంతికాదేవ్యాలయంనుంచి ప్రభాతసూచకమైన మంగళవాద్యాల ధ్వని విన వచ్చినది.

ఇటు రాచనగరులో కల్యాణమంటపంలోను మంగళవాద్యాలు ఘోషన మోగినవి. వాసంతికాదేవి ఉత్సవమూర్తి దేవాలయంనుంచి బయలుదేరినది. ఆలయంనుంచి దేవి బయలుదేరగానే, దీవటీలవారు ఇరువైపుల సాలుకట్టి నడిచినారు. మంగళసూచకంగా అలంకృతమైన ఏనుగులు, గుర్రాలు, గోవులు, వృషభాలు ముందు నడిచినవి. అటుతర్వాత పూర్ణకుంభం, కాంస్యపాత్రం, దర్పణం, ఫలకలశాలు వహించిన ముత్తైదువులు,



బ్రాహ్మణులు, భక్తాదులూ నడువసాగినారు. పిదప దేవీమూర్తిని కల్యాణ మంటపంలో ఒకచోట విజయంచేయించినారు. అప్పటికి బంగారుకు మెరుగుపెట్టినట్టు అరుణోదయమయినది.

ఆహూతులు ఒక్కరొక్కరే కల్యాణమంటపానికి రాసాగినారు. జనం దొమ్మిగా లోనుకొనిపోకుండా, అల్లరి కాకుండా చూడడానికి అశ్వికులూ, ఆయుధధారులైన సైనికులు అక్కడక్కడ తగినస్థానాలలో సన్నద్ధులై నిలబడినారు. వచ్చిన వారిని వారి వారికి నిర్దిష్టమైన స్థానాలలో, ఉచితపీఠాలలో ఆసీనులను చేయడానికి ప్రధాన మహాప్రధానుల నేతృత్వంలో భటులు సిద్ధమైఉండి చురుకుగా పని నిర్వర్తించేవారు.

ఆహూతులయిన రాజేశ్వరులు రాజ్ఞీసమూహసమేతులై, పుత్రపుత్రీయుతులై, అంబారీలలో కూర్చుని, బంగారు వెండి మేనాలలోను, ఒక్కరొక్కరుగా కల్యాణ మంటపానికి విచ్చేసినారు. మరికొందరు దివ్యాశ్వారూఢులై దయచేసినారు. వీరందరూ వైభవోపేతమైన ఉడుపులు, ఆభరణాలు ధరించినారు. ప్రధానులు ఒక్కరొక్కరికి స్వాగతమిచ్చి, కుశలప్రశ్న చేసి, స్నేహసౌహార్దాలకు అంకురంగా సుఖోష్ణమైన తేనె పాలు ఆరగించేట్టుచేసి, చేతులకు చందనం, పుష్పాలు అందించి, వారికోసమే సిద్ధపరచిన సుఖాసనాలలో వారిని పిలుచుకొనిపోయి కూర్చోబెట్టి, మితిమీరిన ఉపచారాలతో వారిని తృప్తిపరచినారు. అంత వైభవోపేతమయిన కల్యాణమంటపాన్ని ఆదరసత్కారాలను చూచి ఆహూతులందరూ దిగ్భ్రమచెందినారు.

కొందరు రాజుల మనస్సులో అసూయకూడ పుట్టినది. అయితే, వింధ్యగిరివలెఉన్న హొయిసళేశ్వరుని యుద్ధగజాలను, తురగశస్త్రాస్త్రసంపత్తినీ, ప్రచండదండనాయకులను, విషమ, సంకట పరిస్థితులలోను స్వామిని రక్షించగల రాజతంత్రజ్ఞులైన ప్రధానులను చూచి, పుట్టిన అసూయ పుట్టినట్టుగనే గిట్టింది.

రాజతంత్రజ్ఞురాలయిన రాజమాత ఆహూతులయిన రాజపత్నులను, సామంతుల పత్నులను, తదితర ప్రముఖుల పత్నులను, పుత్రికలను

వెనుకటిరాత్రే రాచనగరుకు పిలిపించుకొని, రాజోచితమైన భోజనం చేయించి, కోటనిండ మాట్లాడి, విడెం ఇప్పించి, రేపటి కల్యాణానికి వేగిరం దయచేయవలెనని మనవిచేసి, "ప్రయాణంలో బడలినారా? మా ఆహ్వానాన్ని గౌరవించి దయచేసినారుగదా, చాల సంతోషం. ఇక్కడ అన్నీ అనుకూలంగా ఉన్నవా? సౌకర్యంలో లోపం లేదుగదా?" అని ఉపచార వాక్యాలతో ఒక్కొక్కరినే విచారించి పంపివేసినారు.

గంగరాజులుగారు అక్కగారి ఈ చతురతకు తల ఊపినారు. హాయిసళరాజుల భాండాగారం వీగైపారినా, చెక్కుచెదరక నిలిచినవి అక్కగారి అక్కర నిండిన ఉపచారాలు.

వాసంతికాదేవి ఉత్సవమూర్తిని వేదికకు కుడిపక్క పూర్వాభిముఖంగా ప్రతిష్ఠించినారు. పిదప ముత్తైదులు పూర్ణకుంభ కనకకలశాలను పెట్టవలసినచోట పెట్టి, వేదికకు ప్రదక్షిణం ఆచరించి "శుభాలు ఒసగు తల్లీ!" అని పాడి, హోమకుండం పూజించి, దేవికి హారతి ఎత్తుతున్నప్పుడు లోపల సుస్వరంతో, గంభీరధ్వనితో వేదఘోష వినిపించినది. రాజపురోహితులు, రాజవర్గంవారు, వేదవేదాంగ సంపన్నులయిన బ్రాహ్మణోత్తములు కల్యాణమంటపం ప్రవేశించినారు. అందరూ ప్రభువుల, కన్యకల ఆగమనాన్ని అతికుతూహలంతో నిరీక్షించినారు.

కన్యల వైపువారు, కన్యకలు వెనుకటిరాత్రే వచ్చి, నగరులో ఒక భాగంలో విడిసినారు. అరుణోదయానికి ముందే మాచికబ్బె పిల్లలను మేల్కొల్పి, బంగారు పీటలపై కూర్చోబెట్టి, ముత్తైదువులతో తలకు సుగంధతైలం అంటించి అభ్యంగం చేయించి, మంగళస్నానం చేయించి, నీలకుంతల రాశికి సాంబ్రాణి ధూపం వేసి ఆరబెట్టించి, సుగంధ ధూపాలు వేయించినారు. దీర్ఘంగా వేణికలల్లి మొల్ల, మల్లె, విరజాజి దండలను నిండుగా తురిమినారు. సింధూరం, సువర్ణం, కర్పూర కాంతులు కలపోసినట్లున్న వారి అంగాలకు కర్పూరమలయజ మృగనాభి కుంకుమాలు, జవ్వాది లేపం అలదినారు. మోహకమైన వారి విశాల నయనాలకు కాటుక తీర్చి; వాటిని సమ్మోహనాస్త్రాలుగా తీర్చినారు. పాలనురుగువలె ధవళమైన చీనాంబరాలు కట్టి, అట్టి వక్షోవస్త్రాన్నే తేలికగా బిగించినారు. మధుర



రవంతో మైమరపించే మంజీరాలను కాళ్ళకు తొడిగినారు. నవరత్న ఖచితమైన సువర్ణమేఖలను నడుముకు బిగించినారు. వ్రేలాడుతున్న ముక్తాగుచ్ఛాలతో ముద్దులొలికే మరకత పద్మరాగ శోభితమైన కటిసూత్రం ఆ మేఖలకు జోడించినారు. అనర్ఘమూ, సముద్రసారభూతమూ అయిన ముక్తాహారాలతో, వైజయంతీ మాలికలతో గళసీమను, వక్షోభాగాన్ని అలంకరించినారు. పద్మరాగ మరకత మాణిక్య ఖచితమైన కంకణాలు చేతులకు తొడిగినారు. అమృతానికి పుట్టినిల్లు, స్త్రీత్వానికి సౌభాగ్యం అయిన వారి నిండు రొమ్ముల సొబగును వక్షోభూషలతో ఇనుమడింప జేసినారు. చెవులకు ముక్తారత్న మనోహరమైన కుండలాలు, అలంకరించినారు; కర్ణావతంసాలు కల్పించినారు. ఫాలంలో సుందర తిలక సౌభాగ్యం చేకూర్చినారు.

ఈ అలంకరణమంతా ముగిసినమీదట కన్యలు శారదను పూజించినారు; గోమాతను పూజించినారు. అనంతరం తల్లికి నమస్కరించినారు. మాచికబ్బె బిడ్డలను మనసార దీవించి, తన కండ్లదృష్టే తగిలెనని గుమ్మడికాయదిష్టి తీసివేసినది. బిడ్డల సౌందర్యాన్ని మరీమరీ చూచి ఆనందించినది ఆ తల్లి హృదయం.

ఆవేళకు మారసింగమయ్యగారు, పెరుమల పండితులు "పొద్దయినది, పిల్లలు సిద్ధమయినారా?" అంటూ వచ్చినారు. కన్నతండ్రులయినప్పటికీ, "ఒకే రాత్రిలో ఇంతగా పెరిగి ఇంత సౌందర్యవతులయినారా!" అని కన్యలను చూచి ఆశ్చర్యపడినారు.

కన్యలిద్దరూ ఇద్దరికీ సాష్టాంగ నమస్కారం చేసినారు. పండితులు ఇద్దరు తలలూ నిమిరి, చేతులెత్తి అంతరిక్షంవైపు జోడించి, "కేశవుడు మిమ్ముల్ని సదా రక్షించుగాక!" అనినారు. మారసింగమయ్య పిల్లలిద్దరి తలలూ నిమురుతూ "సావిత్రి దమయంతులై యశోవతులై బదుకండి" అని ఆశీర్వదించినారు.

సౌశీల్య గాంభీర్యాలూ, విద్యావినయ సంపదలూ, మధురభావ మధురరూప లావణ్యాలూ, మధురమైన ప్రాయమూ, మహదైశ్వర్యమూ,

మహానుభావుని పాణిగ్రహణం చేసుకోగల సౌభాగ్యమూ-అన్నీ ఒక్కటిగా చేరి వచ్చినవి. శాంతలకు, లక్ష్మికి అప్పుడు.

మాచికబ్బె బిడ్డలకు మధుపర్కమిచ్చి, పిదప పాలు తాగనిచ్చి, వారిని రాజమాతవద్దకు పిలుచుకొని పోయినారు. రాజమాత మజ్జనాదులు ముగించి, కల్యాణమంటపానికి బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నారు. దూరంనుంచే మంజీరాల కలధ్వని విని తిరిగిచూచి శాంతల లక్ష్మలను చూచినారు. వారిద్దరి ఆనాటినిలువు, నడక, రూపు, ముఖవర్చస్సు, రాజమాతకు సుఖమూర్ఛ కలిగించేట్టు ఉన్నవి. ఆమె అక్కడే ఒక సుఖాసనంలో కూర్చుండిపోయినారు. కన్యలు అత్తగారి పాదాలు తాకి నమస్కరించినారు. రాజమాత సుఖపరమావధిని అనుభవిస్తూ, కోడండ్రను కౌగిలించుకున్నారు. కంపిస్తున్న చేతులలో వారితల నిమురుతూ, కంపిత స్వరంలో "మాచీ, మాయిల్లు నింపినావుగదమ్మా; మా మనస్సు నింపినావు గదమ్మా! మేము నీకు ఏమి ఇచ్చేము? ఏమి ఇస్తే దీనిలో సరితూగేని?" అని సంతోషాతిరేకంలో అన్నారు. రాజమాత ధ్వనిలిచినది; మేను కంపించినది; చెమర్చింది.

మాచికబ్బె చామరగ్రాహిణినుంచి చామరం తీసుకొని మృదువుగా వీచినారు. చేటికలు శైత్యోపచారం చేసినారు. ఒకటిరెండు క్షణాల తర్వాత రాజమాత కండ్లుతెరచి, కన్యలను పరికించి, చిరునవ్వునవ్వి, మాచికబ్బెను చూచి, "ఏమయినదిమాచీ,? మాకు ఏమైనది?" అని ప్రశ్నించినారు. మరల కన్యలవైపు తిరిగి "మేము ఇంతవరకు బదికినది ఈ ఒక్కసంతోషంకోసమే. ఇక మీధర్మం వర్ధిల్లనీ. మీ యౌవనం చిరకాలం ఉండనీ. మీ పాణిగ్రహణంచేసే ప్రభువుల భాగ్యం, యశస్సు ఆచంద్రార్కం నిలవనీ, ఈ భూమండలం ఉన్నంతవరకు మా కోడండ్ర స్మృతి మిగులనీ. రాజవంశం వృద్ధిచెందనీ. దేశంలోను, ప్రజలలోను ధర్మం వృద్ధిపొందనీ. అందరికీ మంగళంకలుగనీ...వెళ్ళండి. మీ భాగ్యదైవమునే ఆయనను చేపట్టి నడుచుకోండి. అతనియెడ గౌరవంతో ఉండండి; భక్తి విశ్వాసాలతో మెలగండి. ఇక మీ సౌశీల్య సౌభాగ్యాలే అతని యశస్సు, అతని భాగ్యం." అని సెలవిచ్చి, వారిని మాచికబ్బెతోసహా కళ్యాణ



మంటపానికి పంపివేసి, తామూ అక్కడికి బయలుదేరడానికి సిద్ధమయినారు.

కళ్యాణమండపం జనంలో క్రిక్కిరిసిపోయినది. ఒక్కసారిగా పంచ మహావాద్యాలు నినదించాయి. పదిమంది వైతాళికులు ఏక కంఠంతో హొయిసళేశ్వరుల బిరుదావళిని జయజయలు పలుపుతూ ఉద్ఘోషించినారు. ప్రకాశమానమైన పగలు దివిటీలమధ్య సూర్యోదయం లాగ హొయిసళేశ్వర విష్ణువర్ధన ప్రభువులు కల్యాణమంటపంలో దర్శనమిచ్చినారు. సభలోనివారంతా భక్తిమర్యాదలలో లేచి నిలబడినారు. శత సహస్ర కంఠాలు ఒక్కమారుగా "ఉఘే, హొయిసళేశ్వర! ఉఘే! ఉఘే!" అని గర్జించినవి. ప్రభువులు హసన్ముఖులయి సభకు వందన మాచరించినారు.

ఉన్నతదేహం, వీరశ్రీని మరులుగొలిపే ఉద్దండ దోర్దండయుగ్మం, నిండైన కుత్తుక, విశాలోన్నత వక్షస్థలం, సింహపు కటి, బలమైన ఊరువులు, కాళ్లు, గంభీరమైన నడక, పద్మంవలె విశాలమయిన ముఖం, చంచలమూ చపలమూ కాని సౌమ్య నయనాలు, తీర్చినట్టున్న చక్కని ముక్కు, మనోదార్ఢ్యం నిరూపించే పెదవులు, కపోలాలు, అంత హెచ్చు అంత. తక్కువకాని వీరశ్మశ్రువు, విశాల లలాటం, భుజాలవరకు జీరాడే కేశరాజి – "ఇంతటి అంగసౌష్ఠవానికి అలంకారాలెందుకు?" అనిపించినది చూచేవారికి.

వీరు బ్రహ్మచర్యం చక్కగా పాలించినవారు. సుఖలాలసులకు. భోగాలకు దేహాన్ని జారవిడిచినవారు కారు. దైహిక మానసిక శిక్షణాల పూర్ణఫలం పొందిన అనుభవశాలులు. క్షత్రియయోధులకు కావలసిన సకల శస్త్రాస్త్ర విద్యలను బహుకాలం సాధించి సిద్ధిపొందిన నైష్ఠికులు. నిర్మములు, ధీమంతులు, ధీరులూ అయిన ఈ మహానుభావులు జన్మజన్మకూ సహానువర్తినులు, మీదుమిక్కిలి తమ పుణ్యాంశరూపిణులు అయిన ఈ అర్ధాంగులను ఈ జన్మలోను కలియడంకోసం, మధుర భావంలో, మందస్మితంలో చేతులు జోడించుకొని కల్యాణమంటపానికి విజయం చేసినారు.

అప్పుడు రాజపురోహితులు విధిపూర్వకంగా అగ్నిహోత్రుణ్ణి ఆవాహనచేసి, అగ్నికుండలో ప్రతిష్ఠించి, దిక్పాలకులను, మహేంద్రుని ఆహ్వానించి, బ్రహ్మను ప్రతిష్ఠించి, ప్రసన్నులుకండని ప్రార్థించి, పరిస్తరణాలమీద దర్వి, సమిత్తు, ఆజ్యపాత్రం, అర్ఘ్యపాత్రం ఉంచి, ప్రభువులచేత యజ్ఞేశ్వరునికి సమిత్తులు, హవిస్సు, ఆజ్యం ఆహుతిచేయించి, వరప్రసాదం సాధించి, వినాయక బ్రహ్మ హరిహర దేవాదులను శ్రద్ధాభక్తులలో పూజింపజేసి, అర్హత పితృమూల గురుమూలాలవారిని, ఇంద్రాది అష్టదిక్పాలకులను, వసు రుద్రాదులను, గంధర్వ యక్షనాగులను ప్రార్థించవలెనని కోరినారు; ప్రభువులు వారు కోరినప్రకారమే చేసినారు.

కుమారవిష్ణువూ స్నానంచేసి ధౌతకౌశేయం ధరించి, వేదికవద్దకు వచ్చినాడు. వానిని ప్రభువులు దగ్గరికి పిలిచి చేయిపట్టుకొని, తమపక్కనే కూర్చోబెట్టుకొనినారు. తర్వాత పురోహితులు చెప్పిన ఈ అర్థం వచ్చే మంత్రాలను స్ఫుటంగా శ్రద్ధతో ఉచ్చరించినారు : "ఓయీ, హుతవహుడా; నేను ఇంతవరకు బ్రహ్మచర్యంలో ఉన్నవాణ్ని. కాయేన వాచా మనసా ఆ వ్రతాన్ని పాలించుకొని వచ్చినానని నీవు ఎరుగుదువు. ఇప్పుడు వంశాభివృద్ధికి పుత్రకాముడనై గృహస్థాశ్రమం స్వీకరించేవాణ్ణయినాను. తేజస్సు, యశస్సుగల ఆయుష్మంతుడైన పుత్రుడు నాకు కలుగనీ అని అనుగ్రహించు." తర్వాత ప్రభువులు శాంతల, లక్ష్మి, ఇతర కన్యలు మరుగుగావున్న పట్టుకాండ పటంముందు రజతఫలకంమీద నెరపిన బియ్యంమీద వచ్చి నిలబడినారు.

"సులగ్నాస్సావధాన. సుముహూర్తస్సావధాన" అని పురోహితులు, బ్రాహ్మణులు శాంతివాచనం పలుకుతుండగా, పైనుంచి పుష్పవర్షం కురుస్తుండగా, మంగళవాద్యాలు నినదిస్తుండగా, కాండపట మొకటి పక్కకు తొలగినది.

అప్పుడు ప్రభువుల కట్టెదుట కైలాసపర్వత ధవళశిఖరం నుంచి భూమికి దిగివచ్చిన గంగా గౌరీదేవులా అన్నట్టు శోభమానులయినారు నవవధువు లిద్దరూ. వెనుక నిలబడిన ఐదుగురు కన్యలూ వీరి పరిచారకన్యకలవలె ఉన్నారు. శాంతల లక్ష్ముల దివ్యసౌందర్యం కనిన జనం



ఉత్సాహ కోలాహలం చెప్పతరంకాదు. ప్రభువులు ఈ యిద్దరు మంగళగౌరులను ఇంత సమీపం నుంచి ముందెప్పుడూ చూడలేదు. ఆనాడు కుమారవిష్ణువు ఉపనయనంనాడు, తర్వాత వీరి వీణాగానం నగరులో జరిగిన దినం ప్రభువులు వీరిని చూచినప్పటి కంటె, నేడు వీరి సౌందర్యం నాలుగురెట్లు హెచ్చయినది. అప్పుడు, ఆ సుముహూర్తంలో, మాచికబ్బె ఆ ఉదయం బిడ్డలను మనసార అలంకరించిన మీదట, అనుకొన్నారు : "ఇప్పుడు ఈ కన్యలు ముక్కంటి తపసునూ భంగపరిచేరు." అని. ఇప్పుడు ఆలాటి సౌందర్యవతులను చూచి ప్రభువుల హృదయం పొంగినది; తల వంచుకున్నారు. మరొకమారు చూద్దామనిపించినది ఆ సంయమికి కూడ. జన్మాంతర ఋణానుబంధంలో ప్రకృతికూడా సహకరించినది. ప్రభువుల మనసును మాయ కప్పి వేసినది; మనసు మోహాకులమైనది.

దగ్గర నిలుచున్న మాచికబ్బె తనకుమార్తె చేతికి పుష్పమాలను అందించినది. శాంతల దానిని కండ్లకద్దుకొని, ముఖంఎత్తి, సిగ్గుముప్పిరిగొనగా, సంతోషపునవ్వులో ముఖం వేదెక్కగా, హృదయపు స్వాధీనత అంకెతప్పగా, చేతులో ఉండే పుష్పమాలికలను కొంచెమే పైకిఎత్తినది. నిటారుగా నిలబడిన తన మెడ ఆమెకు అందలేదనుకుని ఆ మహాభాగులు తమ హృదయేశ్వరికి తలవంచినారు. శాంతల పుష్పమాలలతో ప్రభువుల కంఠం అలంకరించినది. పుష్పమాల వేస్తున్నప్పుడు ప్రభువుల ఉత్తమాంగం శాంతల కరపల్లవాలకు తగిలి, ఆమె దేహమంతా గగుర్పొడిచింది. సభవారు సంతోషంతో కరతాళధ్వనులు చేసినారు.

రాజపురోహితులు నవకుసుమమాలను ప్రభువుల చేతికి అందించినారు. దానిని ప్రభువులు ప్రీతితో శాంతల కంఠంలో వేసినారు. సభవారు మరొకమారు ఉత్సాహంతో హర్షధ్వని చేసినారు.

పిదప పెరుమలపండితులు కుమార్తె చేతికి నవమల్లికాహారం అందించినారు. లక్ష్మీదేవి ఆహారం అందుకొని కండ్లకు అద్దుకొని, అక్క అయిన శాంతల ముఖం ఒకమారు పరికించి, అనుమతి అడిగి, చిరునవ్వుతూ తలవంచి నిలబడిన ప్రభువుల కంఠసీమను అలంకరించినది. సభవారు ఇంకొకమారు హర్షనినాదాలు చేసినారు. ప్రభువులు తల

యెత్తినప్పుడు లక్ష్మి కరపల్లవాలు ప్రభువుల కపోల కంఠ ప్రదేశాలను అకస్మాత్తుగా మృదువుగా పుణికి కిందికి దిగినవి. అప్పుడు లక్ష్మికి కూడా శాంతలకు అయినట్టే అవర్ణనీయమైన స్పర్శసుఖం కలిగినది. ప్రభువులకూ అలాగున నే అయినది. అప్పటినుంచి ఆ ముగ్గురి హృదయాలూ సమానానుకంపాలయినవి. ప్రభువులు నవవికసిత నీలోత్పలమాలతో లక్ష్మి కంఠ వక్షః ప్రదేశాలను అలంకరించినారు. అప్పుడు ఆ జవ్వని అమృత కలశాలు వహించిన వక్షం విప్పారినది; తనువు రోమాంచయుత మయినది.

తర్వాత తక్కిన ఐదుగురు కన్యలూ ఒక్కొక్కరుగా, ప్రభువులకు మాలలు వేసినారు. ప్రభువులూ సంతోషంలో మందస్మితులై వారికి ఒక్కొక్కరికీ దండలు వేసి, గాంధర్వ వివాహరీత్యా వారిని పాణిగ్రహణం చేసుకొని, పత్నులుగా స్వీకరించినారు. జనస్తోమం మహోత్సాహంతో నినదించినది.

ఇటువైపు శాంతల, లక్ష్మి నడచివచ్చి, ప్రభువుల ఎదుట నిలబడి వారి మస్తకంపై ముత్యాలసేసలు పెట్టినారు. ప్రభువులూ పెట్టినారు. ఇలాగు మూడుసార్లు జరిగినది. సభ ఆద్యంతం ప్రతిసారి ఉత్సాహంతో పెద్దపెట్టున ఉద్ఘోషించినది. అటుపిదప ప్రభువులూ కన్యలూ హోమ కుండం వద్దకు అడుగులువేసి, అక్కడ అమర్చిన పీఠాలపై కుడికాలు మొదట ఊని కూర్చున్నారు. ప్రభువుల కుడిపక్క శాంతల, లక్ష్మి, వారి వెనుక ఇతర కన్యలూ కూర్చున్నారు. లాజహోమానికి అన్నీ సిద్ధ మయినవి.

లాజలను తీసుకొని వధువుల దోసిళ్ళలో నింపే బాధ్యత వధువుల సోదరులకు మాత్రమే ఉన్నది. శాంతలకుగాని, లక్ష్మికిగాని, తోడ బుట్టువు లెవరూలేనందున, రాజమాత కుమార విష్ణువునే వారిద్దరికీ సోదరు కుగా చేసినారు. వధువు లిద్దరికీ చాల ఆనందమయినది. కుమార విష్ణువుకు కలిగిన ఆనందం అంతింతకాదు. ఇద్దరు అక్కలూ ఈ కొత్త తమ్ముణ్ణి లాగుకొని తమ మధ్య కూర్చోబెట్టుకొన్నారు. శాంతల హితంగా, మృదు వుగా కుమారుని చెవిలో "సహోదర" అన్నది. అతడు నవ్వి అంత మృదువుగానే "అక్క!" అనినాడు. లక్ష్మి కుమారుని చెవిలో తన



చేయిపెట్టి "తమ్ముడూ!" అనినది. కుమారుడు లక్ష్మిని చూచి నవ్వి "అక్కా!" అన్నాడు. ఆ సుముహూర్తంలో, ఆ మధుర సన్నివేశంలో, వారి స్వయంకల్పిత బాంధవ్యం రక్తబంధుత్వం కంటె హెచ్చుగా ఋణానుబంధంగానే ఏర్పడినది. వధువులకు ఆనాడు ప్రాణమంతే ప్రియ మైన భర్త, భ్రాత ఇద్దరూ లభించినారు.

కుమారుడు లాజలను ఎత్తి ఎత్తి అక్కగారల దోసిళ్ళలో నింపినాడు. పురోహితులు వధువులతో ఈ అర్థంవచ్చే మంత్రాలు పఠింపజేసి అగ్ని దేవునికి లాజాహుతులను మూడుసార్లు చేయించినారు. "నా పతి ఆయుష్మంతుడుకానీ. అతనికి అభ్యుదయంకానీ. నాపతి బంధువుల కందరికీ అభ్యుదయం కానీ. మా జాతులకు అభ్యుదయంకానీ, నాకూ, నా పతికీ చక్కని పొందిక ఏర్పడనీ. అగ్నిదేవుడూ, అతనిపత్ని స్వాహాదేవి ఈ ప్రార్థనలను నెరవేరేటట్టు చేయనీ."

హుతవహునికి యథేచ్ఛగా ఆజ్యాహుతి, హోమం జరిగాయి. నవగ్రహ జపహోమశాంతి దానాలు జరిగినవి. శాంతల, లక్ష్మి, బమ్మల, రాజల, చవ్వల, బిజ్జల, దేవకి - అందరు కన్యలు అరుంధతిని పూజించినారు. మాంగల్యాలపూజఅయినది. ముత్తైదు సావిత్రులపూజ జరిగినది. ప్రార్థనలు, ముడుపులు చెల్లించడం అయినది. ధారోదకసంగ్రహణం అయినది. ముత్తైదువులు మాంగల్యాలను స్పృశించి, పసుపు కుంకుమలుపెట్టి ఆశీర్వ దించినారు.

కన్యలందరికీ ప్రభువులు మాంగల్యాలు ధరింపజేసినారు. ముఖ్య వధువు లిద్దరూ ఇప్పుడు ప్రభువుల ఎడమవైపువచ్చి కూర్చున్నారు. మాచికబ్బె, మారసింగమయ్యగారు ప్రభువులవద్దకు వచ్చి, వెండిపళ్ళెరంలో ప్రభువుల పాదాలుకడిగి, మధుపర్కమిచ్చి సత్కరించి, శాంతల చేతుల్లో నారికేళ ఫలంఉంచి, ఆ ఫలం ధరించిన చేతులను ప్రభువుల చేతులకు అప్పగించి, కింద వెండిపళ్ళెరం పెట్టి ధారోదకంతో యథావిధిగా ధారపోసి తమ సర్వస్వమయిన శాంతలను ఆ మహాభాగులకు అర్పించినారు.

అనంతరం పండితులు తమ కుమార్తె చేతులలో పూర్ణఫలం ఉంచి, ఫలంధరించిన చేతులను ప్రభువుల చేతులకు అప్పగించి, అతధిక

సంతోషంతో, తమ హృదయమణివలె ఉన్న కుమార్తెను ప్రభువులకు ధారపోసి యిచ్చినారు. అప్పుడు మాచికబ్బె హృదయం శూన్యమయినట్లు అయినది. ఆమె కన్నులనుంచి అశ్రువులు ధారకట్టినవి.

పురోహితులు ఉచ్చరించిన మంత్రాలను ప్రభువులు నిదానంగా, అర్థమయ్యేటట్లు ఉచ్చరించినారు : "సత్సంతానం పొందడంకోసం నీ పతి అయిన నాతో నీవు శాశ్వతంగా ఉండవలెనని నేను నీ పాణి గ్రహిస్తున్నాను. భగార్యయ సవితృపురంధులనే ఈ నలుగురు దేవతలూ నిన్ను నాకు ఇచ్చినారు. వీరులూ, దేవపితృభక్తులూ అయిన కుమారులను ప్రసవించి, మాకు శుభమూ సంతోషమూ కలిగించే దానవుకా."

పిదప ప్రభువులు శాంతలను, లక్ష్మిని సానరాతిపై నిలపి, ఈ అర్థంవచ్చే మంత్రాలు ఉచ్చరించినారు : "ఈరాతిమీద ఎక్కి రాయి వలె స్థిరంగా నిలబడండి. జీవితంలో ఎన్నికష్టాలు, ఎన్నిదుఃఖాలు వచ్చినా, మీరు రాయివలె కదలక మెదలక ధైర్యంచెడక నిలబడండి." ఇది అయిన తర్వాత నడచినది సప్తపది. ప్రభువులు పడతుల చేయిపట్టుకొని ఏడు అడుగులు వేసినారు. "ఆహార సంగ్రహణం చేస్తామని మొదటి అడుగు. ఎల్లప్పుడూ శరీరారోగ్యం కాపాడుకొంటామని రెండో అడుగుకు శపథం. ఐశ్వర్యాభివృద్ధి చేసుకొంటామని మూడో అడుగుకు శపథం. పరస్పర మమతాభివృద్ధికి పాటుపడుతామని నాల్గో అడుగు. సంతతి పాలనాభివృద్ధికి ప్రమాణం ఐదో అడుగు. దీనికి అనుకూలమయిన ఋతుకాల నియమాలను అనుసరిస్తామని ఆరో అడుగు. చిరస్నేహంకోసం ఏడో అడుగు ప్రమాణం. ఈ ఏడడుగులు మీరు నాతోపాటు నడచి నాకు సఖులయినారు. ఒకే మనసులో ఉందాము; ఒక్కటిగా సంకల్పిద్దాము; ఒకరిహితం ఒకరు కోరుదాము; సుఖదుఃఖాలలో సమంగా పాలు గొందాము. మనస్సులను ఒక్కటిగాచేర్చి ఒకరినొకరు చక్కగా తెలుసుకొని జీవించుదాము." అనే అర్థంవచ్చే మంత్రాలను ఉచ్చరిస్తూ అగ్ని సాక్షిగా, సదస్సు సాక్షిగా సప్తపది ముగించినారు.

ప్రభువులు ఒక్కొక్క అడుగుకూ నిలబడి ప్రమాణమంత్రం ఉచ్చరించి, "దీనిలో మీరు నన్ను అనువర్తించండి." అంటూ ముందడుగు వేసి



నారు. "అనువర్తిస్తాము. సహకరిస్తాము." అంటూ వధువు లిద్దరూ అడుగడుగుకూ నిలబడి అగ్నిసమక్షంలో, సదస్సు ఎదుట ప్రమాణ వచనాలు పలికినారు.

సప్తపది అయినమీదట, ప్రభువులూ, శాంతలా సింహాసనానికి ప్రదక్షిణంచేసి, పూజించి నమస్కరించి సింహాసనం అధిరోహించినారు. ప్రభువులు చేయిముందుకు చాచి శాంతలను సింహాసనంమీదికి ఎక్కించి తమ వామ పార్శ్వంలో కూర్చోబెట్టుకున్నారు. పంచమహావాద్యాలు భోరున ఘోషిస్తుండగా, సభవారంతా హర్షాతిరేకంతో "జయము జయము ! మహారాజ్ఞి శాంతాలాదేవిగారికి జయము కలుగుగాక !" అని నినదిస్తుండగా, ప్రభువులు శాంతల శుభ్రకోమల లలాటానికి రత్నఖచిత సువర్ణపట్టంకట్టినారు. రాజపురోహితులు, బ్రాహ్మణోత్తములు, మహానదుల పుణ్యోదకాలను కనకకుంభాలలో నింపి నింపి శాంతలదేవికి మంత్రపూర్వకంగా అభిషేకంచేసినారు. అనంతరం ప్రభువులు, శాంతలదేవిగారు సింహాసనం దిగినారు. మాచికబ్బె, లక్ష్మి - ఇద్దరూవచ్చి శాంతలదేవి ఇరువైపులచేరి చేతులు పట్టుకొని, అభిషేకార్ద్రమైన వస్త్రాలనువిచ్చి నూతనవస్త్రధారణం చేయించడానికి అభ్యంతరమందిరానికి పిలుచుకొని వెళ్ళినారు.

శాంతలదేవి నవదుకూలాలు ధరించి వచ్చినారు. తర్వాత శేష హోమం, మహాశీర్వాదం జరిగినవి.

గౌరమ్మగారు, మరొక నగరుకట్టడి ముత్తైదు బంగారు పళ్ళెరంలో యజ్ఞేశ్వరునికి, ప్రభువులకు, రాజ్ఞీమణులందరికి ఆరతిఎత్తి, సేసలు పెట్టినారు. ప్రభువులు నేడు తలవంచలేదు. ముత్తైదుతల్లిని చూచి సమ్మానంతో చిరునవ్వునవ్వినారు. గౌరమ్మగారూ మందహాసంతో "మీరు సత్పుత్రులు. నూరేండ్లు చక్కగా జీవించండి." అని ఆశీర్వదించి సేసలుపెట్టినారు. సభవారంతా వివాహోత్సవ దంపతులపైన మంగళాక్షతల వర్షం కురిపించినారు.

సభలోవున్న మహారాజ, రాజ, సామంత, శ్రీమంతాదులు తమ పత్నులతో ఒక్కరొక్కరుగా వేదికమీదికి వచ్చి, రాజదంపతులకు

శుభంకోరి, తమ తృప్తి సంతోషాలు సూచించడానికి రాజదంపతులకు అనర్ఘ రత్నాభరణాలను, శ్రేష్ఠదుకూలాలను అర్పించినారు. దూరదూర దేశాల రాజులు అపూర్వ వస్తువులను తమ సంతోషంకోసం పంపినారు. కామరూప దేశప్రభువు వింధ్యగిరివలెవున్న పది ఏనుగులను పంపినాడు. కాంభోజరాజు ఉత్తమ లక్షణాలుగల, శ్రమసహిష్ణువులయిన పది జవనాశ్వాలను బహూకరించినాడు. సింధురాజు కామధేనువులవలె ఉంటూ, కుండలకొలదిపాలు ఇచ్చే నూరు కపిల గోవులను పంపినాడు. లంకాధిపతి అనర్ఘ రత్నహారాలు కానుక పంపినాడు.

వీటిని స్వీకరించిన హొయిసళ ప్రభువులు ఈ రాజాధిరాజులకు, వివాహానికి వచ్చినవారు స్వదేశానికి, స్వనగరానికి మరలి వెళ్ళినప్పుడు, ఒకటికి రెండంతలు మర్యాదలుచేసి ఉడుగరలు, కానుకలు ఇచ్చి పంపించినారు. దూరదేశాల రాజులకు సమయం ఒదలినప్పుడు సరిసమానమైన, అథవా హెచ్చయిన మర్యాదలు జరిపించినారు.

వివాహానికి వచ్చిన వారందరికీ ఫలాలు పుష్పాలు పంచిపెట్టినారు. రాజ్యవర్గం వారికి, అతిథులకూ, ఇతరులకు వారివారి అంతస్తుకు, తగినట్టు భోజనోపచారాలు జరిగినవి. వస్త్రదాన భూదాన గోదాన హిరణ్యదానాదులు యథేచ్ఛగా జరిగినవి. బీదబిక్కికీ, దీనులకు, వికలాంగులకు- అందరికీ అన్నదాన వస్త్రదానాలు తృప్తి అయ్యేంతగా జరిగినవి.

ఆ రాత్రి ప్రభువులు, శాంతలదేవి, లక్ష్మీదేవి పట్టపు ఏనుగుమీద వెండి అంబారిలో ఆసీనులై, సమస్తవైభవంతో రాజధానివీథులలో ఊరేగినారు. రెండు మూడునాళ్లు కల్యాణ మంటపంలో ప్రభువుల, రాజ్ఞుల సమక్షంలో విద్వద్గోష్ఠి, కవిగోష్ఠి గాయన నర్తన మల్లయుద్ధ శస్త్రాస్త్ర సామర్థ్య ప్రకాశం, వివిధ కళానైపుణ్య ప్రదర్శనాలు జరిగినవి. వారి వారి యోగ్యతకు అనుగుణంగా ప్రభువులు బహుమానాలు ఇచ్చి సంతోషపెట్టినారు.

# రెండవ భాగము

# 1

దేశదేశాలనుంచి వివాహానికి విచ్చేసిన రాజులు, మహారాజులు, సామంతులు, విద్వాంసులు, కళావిదులు, వణిక్పుంగవులు, సంతుష్టితో తమతమ దేశాలకు మరలినారు. కొందరు హొయిసళరాజుల కీర్తిని, నీతిని, సర్వమత సమాన గౌరవాన్ని, న్యాయధర్మాలను చూచి రాజధానిలోనే నెలకొనినారు. ఈ విధంగా స్థిరనివాసం ఏర్పరచుకొనిన వారిలో మారసింగమయ్యగారి మేనల్లుడు కేతమల్ల నాయకుడూ ఒకడు 'నాయకుడు' అనే బిరుదు కొంతకాలం తర్వాత వచ్చినది. ఈ కేతమల్లుడు తలవనపురనివాసి. అప్పుడు తలవనపురాన్ని రాష్ట్రకూటసామంతులయిన గంగరాజుల వంశంవాడొకడు పాలించేవాడు. రాష్ట్రకూటులు అప్పుడు చోళుల సామంతులుగా ఉండేవారు; అంటే, ఈ గంగరాజులు కూడ చోళుల అధీనంలో ఉండేవారు.

కేతమల్లుడు పెద్ద వ్యాపారి. కాంభోజదేశం నుంచి గుర్రాలు తెప్పించి, ఈ దేశాలలో అమ్మి చాల ధనం సంపాదించినాడు. సముద్రాంతర దేశాలలోను వ్యాపార సంబంధం పెట్టుకొన్నాడు. ఆకాలంలో కొందరు బ్రాహ్మణులు కూడ సముద్రాంతర దేశాలలో వ్యాపారం నడిపేవారు. కేతమల్లుని సిరిసంపదలు చూచి తలకాడు రాజుకు ఈర్ష్య కలిగినది; మితిమీరిన అడహాల మురిసాల విధించి అతని ధనంలో బహుభాగం అపహరించినాడు. అంతేకాక అతడు సముద్రాల తెప్పిస్తున్న గుర్రాలు, ఒంటెలు, ఖర్జూరాలు మొదలయిన వాటి మీద కూడా పెద్ద

సుంకాలు విధించినాడు. ఇంకా నానావిధాలుగా చిక్కులు పెట్టినాడు. వీటినంతా సహించడానికి కేతమల్లునికి సాధ్యంకాలేదు. అయితే, ఎవరికి చెప్పుకొనడం ? ఆ ఊరినే వదలిపెడుదామని కేతమల్లుడు ఒక మారు యోచించినాడు. అతడు, అతని భార్య జక్కియబ్బె, ఒక్క కుమార్తె చందల - ఈ ముగ్గురే అతని సంసారం.

మాచికబ్బె వీరి కుమార్తె చందలను చూచినవెంటనే, తన శాంతల కూడ ఆ వయస్సులో అలాగే ఉండినదని అనుకొన్నారు. అంతేకాక కేతమల్లుడూ తన పతి బంధువేకదా! మాచికబ్బె కేతమల్లునితోను, జక్కియబ్బెతోను అన్నారుకదా ! "ఆ రాజుగారు మీకు ఇంత చిక్కులు పెట్టేటప్పుడు మీరు ఇక ఆ రాజ్యంలో ఉండడం క్షేమంకాదు. చిన్నతనంలోనే బంధువులను బలగాన్ని విడిచి, దూరదేశానికి వెళ్ళి స్థిరపడినారు. చాల ప్రయాసతో సిరిని, పేరును సంపాదించినారు. మీ కున్నది ఇదొక కుమార్తె. ఇక మా దేశంలో స్థిరపడండి. మా ప్రభువులవారు మంచివారు. మా అల్లుడుగారని పొగడ్తకాదు. ఇక్కడే ఇల్లు కుదుర్చుకొని వ్యాపారం నడపండి. సాధ్యమయిన ఏ సహాయమైనా ప్రభువులు సంతోషంతో చేస్తారు. మీ విషయాలన్నీ గంగరాజులుగారికీ, రాజమాతకూ తెలుసును. మీ సొంతభవనం ఏర్పడేవరకూ మాతోనే ఉండవలసినది." అని. మాచికబ్బె ఈ విధంగా నిర్బంధపెట్టి వారిని తమవద్దే నిలుపుకొన్నారు.

శాంతల పోలికలున్న వారి కుమార్తె చందలను మాచికబ్బె ప్రీతితో "శాంతల" అనే పిలిచేవారు. "మా కుమార్తె శాంతల నగరుచేరినది; లక్ష్మికూడ చేరినది. మాయిల్లు శూన్యంగా ఉండరాదని భగవంతుడు ఈ బిడ్డను మనకు పంపినాడు." అని మాచికబ్బె తన పతితో అనినారు. చందలను చూచి మాచికబ్బె మనసుకు ఒక విధంగా సమాధానమయినది.

తలవనపురాధిపతి దుర్మార్గులకు, చెడునడతలకు కోపగించుకొని, ఆగ్రహాన్ని తన హృదయంలో నాటి మొలిపించి, దాని వృద్ధికి నీరు పోస్తున్న కేతమల్లునికి హొయిసళేశ్వరుల ఆశ్రయ రక్షణలు అవసరమయినవి. దానికితోడు ఆ నగరంలోనే స్థిరనివాసం ఏర్పరచుకొనడానికి మాచికబ్బె మారసింగమయ్యగారు బలవంతమూ ఎక్కువయినది. అంతేకాక పతి మనోభిప్రాయానికి జక్కియబ్బెకూడ సమ్మతి ముద్రవేసినారు. కేతమల్లుడు అప్పటినుంచి ద్వారవతినే నివాసంగా చేసుకొనినాడు; క్రమంలో, ఉపాయంతో తలవనపురంలోని తన ఐశ్వర్యమంతా నెమ్మదినెమ్మదిగా ద్వారవతికి చేర్చుకొనినాడు. దీనిని విని విష్ణువర్ధనులకు సంతోషం కలిగింది. కేతమల్లుని సగౌరవంగా నగరుకు పిలిపించుకొని, అతని సమగ్ర చరిత్రను, తలవనపురపాలకుని నడవడిని విచారించి తెలుసుకొనినారు.



కేతమల్లునికి హొయిసళేశ్వరులు ఆశ్రయమిచ్చినారని విని తలవనపురాధిపతికి తల వేడెక్కినది. తన సమస్తైశ్వర్యాన్ని కేతమల్లుడు ఉపాయంతో ద్వారవతికి సాగించివేసినాడన్నమాట విన్న తర్వాత వాని తల పూర్తిగా చెడిపోయినది. కేతమల్లుని సామాను సరంజామా, ఎద్లు, పశువులు, రథ గజాశ్వాలూ, ధనకనక రత్నభూషణాలు - మొదలయిన వాటిని రాజమార్గపు సుంకపు అధికారులు లంచంతినే వదలిపెట్టినారన్న ఆలోచనతో ఆ అధికారులందరినీ పట్టి చెరలో పడవేసినాడు.

హొయిసళేశ్వరుల వివాహానికి ఆహూతులయినప్పటికీ అసూయాపరులై రాకపోయినవారిలో ఈ తలవనపుర రాజూ ఒక్కడు. పసపొరుగున ఉన్న రాజ్యం పూర్వ పశ్చిమ సముద్రాల ఎల్లలకు తనచేతులు చాచడం చూచి అతనికి తట్టుకోలేనంత ఈర్ష్య కలిగింది.

హొయిసళేశ్వరులకూ తలవనపుర రాజుపై అనుమానం ఉండనే ఉండినది. కేతమల్లుని మాటలతో అది మరింత దృఢపడినది.

ద్వారవతిలో ఈ విధంగా స్థిరనివాసం ఏర్పరచుకొన్న శ్రీమంతులలో మరొకడు భక్తుడయిన కుల్హాణరాహుతుడు. కుల్హాణరాహుతుని తండ్రి చవుండశెట్టి; తల్లి కాంచియక్క. కుల్హాణరాహుతుని సతి సహజదేవి. ఈ దంపతులకు సంతులేదు. వంశవృత్తిగా వచ్చిన వ్యాపారాన్ని

స్వయంకృషితో అభివృద్ధిపరచి, అత్యధికమైన ధనం సంగ్రహించినాడు కల్హణరాహుతుడు. పిల్లలులేరని ఈ దంపతులిద్దరూ తీర్థయాత్ర ప్రారంభించి, భరతఖండంలోని అన్ని క్షేత్రాలూ దర్శించి, క్షేత్రదేవతల సేవ, మహానదుల స్నానం, వ్రతనియమాలు నిష్ఠతో ఆచరిస్తూ సంచరిస్తున్నప్పుడు కొల్హాపురానికి వచ్చి మహాలక్ష్మిని దర్శించినారు; భక్తితో సేవ, ఉత్సవాలు నడిపినారు. సహజదేవి మహాలక్ష్మిని పూజించి, "వంశాభివృద్ధికి ఒకే ఒక మగనిసునునైనా కరుణించు" అని వేడుకొన్నది. మహాలక్ష్మి ఆ రాత్రి సహజదేవికి స్వప్నంలో దర్శనమిచ్చి, "ఈ జన్మలో మీకు సంతతిభాగ్యం లేదు. ముందు జన్మంలో మా వరంతో మీ యిష్టసిద్ధి కలుగుతుంది. ఈ జన్మంలో మీకు విపులసంపత్తు అనుగ్రహించినాను. దీనితో మీ మనస్సుకు శాంతి కలిగించుకోండి." అని సెలవిచ్చినట్లు తోచినది. సహజదేవి దీనిని పతికి తెలియచేసినది. "విపులసంపత్తు అనుగ్రహించినాను. దీనితో మీ మనస్సుకు శాంతి కలిగించుకోండి" అనే మాటల అర్థమేమిటని కల్హణరాహుతుడు యోచించినాడు. "సంపత్తులో శాంతి పొందినవారు ఇదివరకూ ఎవరూ లేరు. మహాతల్లి ఇట్లెందుకు ఆనతి యిచ్చినది!" అని కల్హణరాహుతుడు చాల యోచించినాడు. యోచన తెగలేదు. "మహాలక్ష్మి దిక్కు చూపించని" అని ఊరకే ఉండిపోయినాడు. కొన్నినాళ్ళ తర్వాత పుట్టిన ఊరి ఋణం అతనిని తనవద్దకు రప్పించుకొనినది. అప్పటికి అతడు పుట్టిన ఊరువదలి ముప్పయి ఏండ్లయినది. పత్నితోపాటు తన జన్మగ్రామానికి వచ్చినాడు. ఆ గ్రామం పేరు దొడ్డగద్దువళ్ళి. బ్రదికిఉన్న బంధువులు, ఇష్టులు కొందరు వారికి సంతోషంతో, ఆదరంతో స్వాగతమిచ్చినారు. కల్హణరాహుతుడు అక్కడే కొంతకాలం నివసించి, ఆ పల్లెలో సుందరమైన పెద్ద మహాలక్ష్మి దేవాలయం కట్టించి, దేవిని ప్రతిష్ఠ చేయించినాడు. ఇది జరిగినది శాలివాహన శకవర్షాలు ౧౦౩౭ లో. అప్పుడు దొడ్డగద్దుంబళ్ళికి "అభినవ కొల్హాపురం" అనే కొత్త పేరు వచ్చింది.

ఆ సమయంలోనే అక్కడికి ఒకటిన్నర గవ్యూతిమారంలో యగచి నదీతీరంలోని వేలాపురంలో విష్ణువర్ధన ప్రభువులు, తాము పట్టానికి



వచ్చిన కొత్తలోనే, పెరుమల పండితులకు ఇచ్చినమాట మేరకు శ్రీ విజయనారాయణదేవునికి ఒక మహాదేవాలయం నిర్మిస్తున్నారు. శిల్పకళా సౌందర్యంలోగాని, వైశాల్యంలోగాని, భవ్యతలోగాని, నైపుణ్యంలోగాని ఈ భరతఖండంలోనే అలాంటి దేవాలయం మరొకటి ఉండరాదని ప్రభువులు అపార ధనం సార్థకంచేసి కట్టిస్తున్నారు. దేవాలయ నిర్మాణం దాదాపు పూర్తికావస్తూ ఉండినది. ప్రభువులు పెరుమలపండితుల దివ్యజ్ఞానాన్ని, పాండిత్యాన్ని చూచి, విష్ణుభక్తిమార్గం వారి నుంచి ఉపదేశం పొంది, తాము జన్మతః జైనులయినప్పటికీ విష్ణుభక్తిపథాన్ని అనుసరించినారు. ఇటు జైనమతంలోను వారి అభిమాన గౌరవాలు తక్కువకాలేదు. అటు శైవమతంలోను వారి అభిమాన గౌరవాలు కుందలేదు. సర్వమత సమదర్శులయినారు విష్ణువర్ధన ప్రభువులు.

ఈ విజయనారాయణ దేవాలయ నిర్మాణం జరుగుతున్నప్పుడు, అక్కడి పనులు సమున్నకంగా, చక్కగా జరుగడం చూడదానికి, అంతే చనలు చెప్పడానికి పెరుమల పండితులు తరచు ద్వారవతినుంచి వేలాపురికి వచ్చి వెళ్ళేవారు. వారివెంట అప్పుడప్పుడు ప్రభువులూవచ్చి వెళ్ళేవారు. నృపకాముల కాలంనుంచి ఎరెయంగ ప్రభువుల కాలంవరకు ఈ వేలాపురే హొయిసళ రాజధాని. ఎరయంగ ప్రభువులు వేలాపురికి దాదాపు ముప్పావు గవ్యూతిమారంలో ఒక ఊరు కొత్తగా స్థాపించి, దానికి 'ద్వారవతి' అని పేరుపెట్టి, కోట కొత్తళాలు కట్టించి, దానిని తమ నూతన రాజధానిగా చేసుకొన్నారు. ద్వారవతి కూడ యశోవంతమయిన మహాపట్టణ మయినది.

సర్వకాలాలకూ భారతశిల్పకళానైపుణ్యానికి సాక్షి అయినవేలాపురి దేవాలయం పూర్తికాగానే, పరబ్రహ్మ స్వరూపి. అతిప్రసన్నుడు, చెన్నయినవాడు అయిన శ్రీ విజయనారాయణస్వామిని హొయిసళ బిట్టిదేవ ప్రభువులు మహాభక్తితో శకవర్షాలు ౧౦౩౯ హేవిళంబి సంవత్సరం చైత్రశుద్ధపంచమి వడ్డవారంనాడు ప్రతిష్ఠించి ఆ భగవంతుని ఆశీర్వాదాన్ని అతని నామాంకితమే అయిన 'విష్ణువర్ధనులు' అనే సార్థకనామధేయాన్ని, పొందినారు.

కుల్హణరాహుతుడు, సహజదేవి విష్ణువర్ధన ప్రభువుల వివాహానికి ఆహూతులయి వచ్చినారు; ద్వారవతి శోభను, ప్రభువుల ధర్మశ్రద్ధనూ చూచి ముగ్ధులై అక్కడే ఇల్లుకట్టుకున్నారు; ప్రభువుల ఆదరవిశ్వాసాలకూ పాత్రులయినారు.

## 2

శాంతలతోను, లక్ష్మితోను నగరునింపుకొన్నతర్వాత రాజమాతకు నగరే ఆనందస్వర్గమయినది. ప్రభువులకూ మహేంద్రపదవి వచ్చినట్టయినది. జనుల జీవితమూ ఆనందమయమయినది. ప్రియసఖుల ఆదరానురాగ గౌరవాలు, గాయననర్తాన మాధుర్యం, ఉత్తమపాండిత్యం, అతిశయ జ్ఞానం, దేవపితృభక్తి, నిర్మలాంతఃకరణం– వీటితో ప్రభువుల నిత్యజీవితం ఆనందమయమయినది. మహాలక్ష్మి, సరస్వతి ఒక్కటిగా ఇంటికి వేంచేసినారు గదా!

ఎండిపోయిన రాచనగరులో ఒక్కసారిగా పూజలూ, ఉత్సవాదులూ మంగళకార్యాలూ మరల పొంగి ప్రవహించసాగినవి. మంగళలక్ష్మి, భాగ్యలక్ష్మి సంతోషనృత్యం చేయసాగినారు. పత్నుల సౌశీల్యం, శుచి, రుచి, ఆచార వ్యవహారాలు, ఆలోచనలను – వీటివల్ల ప్రభువులకు శుభాలు కలుగుతూ వచ్చినవి. అన్నికార్యాలూ, సకలోద్యమాలూ చేకూరుతూ వచ్చినవి. రాజమాత, కోడండ్రు తమకు ఎన్ని పనులున్నా మధ్యాహ్న భోజనానికి ప్రభువులు దయచేసేవరకు కాచుకొని ఉండి, వారితోపాటే ఆరగించేవారు. వారానికి ఒక్కసారి అయినా శాంతల, లక్ష్మి కుమార విష్ణువును ఆశ్రమంనుంచి పిలిపించుకొని, తమతోపాటు భోజనానికి కూర్చోబెట్టుకొనేవారు. కుమారునికయితే అక్కయ్యగార్లను చూస్తే అదెంత ప్రీతో చెప్పతరంకాదు. పెద్దక్కయ్యగారేమో విష్ణువును "ఏమేమి నేర్చుకొన్నావు? కొత్తపాఠ ప్రవచనాలేమి? గుర్రపుస్వారి ఎలాగుంది? ఏనుగుకు అంకుశఘేకావాలా? విలువిద్యలో ఎంత ముందుకు వచ్చినావు? ఎంత



దూరం గురిపెట్టి కొట్టగలవు?" అని వచ్చినప్పుడంతా పెక్కుప్రశ్నలు వేసేది. అక్కయ్యగారు అడగడానికి ముందే చెప్పవలెనని తమ్ముని తొందర. మొత్తంమీద తను నేర్చుకొంటున్న పాఠక్రమాలను, కొత్త కొత్త విద్యల వివరాలను అక్కయ్యగారికి వారం వారం పూసగుచ్చినట్టు నివేదించేవాడు. అక్కయ్యగారు "సై" అని కుమారుని వెన్నుతట్టవలె; అప్పుడు కుమారునికి తృప్తి. చిన్నక్కయ్యేమో కుమారుని అంతరంగ గురువు, సంస్కృత వ్యాకరణ తర్క శాస్త్రాదులలో చిక్కులు తోచినపుడు చిన్నక్కయ్యవద్దకు పరుగెత్తి వచ్చి చెప్పించుకొని వెళ్ళేవాడు. ప్రభువులు ఒకమారు "లక్ష్మి! మానుఎక్కడానికి వాడే ప్రయత్నించనీ. వానిని చివరివరకు నీవే తోయడం సాధ్యమా?" అని అన్నారు.

అనధ్యాయదినాలలో అక్కయ్యగారలను ఉద్యానవనాలకు, కొండలకు, అరణ్యాలలోని రమణీయస్థలాలకు, సుందర నదీసరోవర తీరాలకు పిలుచుకొని పోవడమంటే కుమారవిష్ణువుకు చాల ఆశ. ఇలాటి అపురూప దినాలలో ప్రభువులూ వీరితోచేరి పాదచారులై కొండలు, గుట్టలూ ఎక్కి దిగుతూ, అరణ్యాలలో సంచరించి, పారే ప్రతి వాగులోనూ జలకమాడుతూ, కట్టెలు వంటచెరకులూ ఏరితెచ్చి, శాంతల, లక్ష్మి వంటలు చేయగా, అందరూకలిసి వనభోజనాలు చేయడమూ కద్దు. ఇలాటినాళ్ళలో రాజమాతకూడ ఈపసివారితోచేరి విహరించి, వనభోజనాలలో పాల్గొన్నదీ కద్దు. "నర్తనంచేసేకాలు నాటుదారిని మెట్టీనా? వీణాపలికించే చేయి జాణగా గోధుమలు పిండి కొట్టీనా?" అని శాంతలను ప్రభువులు పెండ్లయిన కొత్తలో పరిహసించినారు. వంటవార్పులలో తాను నలమహారాజు కుడి చేయి అని శాంతల ప్రభువులకు నిదర్శనంచూపించినది. ఆకాలంలో లక్ష్మి చేసిపెట్టి ఉళుందోర, పుళియోరలను ప్రభువులు చవిచూచి రిచ్చపడిపోయినారు. అప్పటినుంచి ఆ శ్రీ వైష్ణవునికి వారానికి ఒక్కమారయినా పుళియోర నైవేద్యం అవశ్యమైనది.

గహనమైన రాజ్యవిషయాలను ప్రభువులు ఒక్కొక్కమారు రాజమాతతో ఆలోచించేవారు. ఈలాటి గహన విషయాలు కోడండ్రకూ తెలిసిఉండనీ అని రాజమాత ఆ సందర్భాలలో వారినీ పిలిపించి దగ్గర

కూర్చోబెట్టుకొనేవారు. "ఈ ముద్దు గారమ్మల కెందుకు మగవానికష్టం?" అని ప్రభువులు రాజమాతతో ఒకమారు నివేదించినారు. రాజమాత "బాగుంది! ఈ విషయాలన్నీ వీరికి ఇక యెప్పుడు తెలియవలె. రాజ్యంలో ఎవరు ఏమిటి? ఏది ఏమిటి? ఏది ఎందుకు? అని వీరికి తెలియవద్దా? రాజధర్మం, పరిపాలన రీతినీతులూ వీరికి క్రమక్రమంగా తెలిసి తీరవలె. మీతండ్రిగారు ప్రతి విశేష సందార్భాన్ని మాతో ఆలోచించక ఉండేవారు కారు. ఏ పెద్ద తీర్పయినా మా అభిప్రాయం అడగక ఉండేవారు కారు." అని సమాధాన మిచ్చినారు. అప్పుడు ప్రభువులు "అట్లయితే, నాతోపాటు రథం ఎక్కించి, యుద్ధభూమికూడా పంపండి" అని ఎగతాళిగా అన్నారు.

ప్రభువులు అప్పుడు ఎగతాళిగా అన్నమాట సర్వథా నిజమయినది. ఒకమారు ముఖ్యారు ప్రెగ్గడ విష్ణువర్ధన ప్రభువుల దేవేరులలో ఒకరి విషయమై అనుచితాలు పలికినాడు. ముఖ్యారు అప్పుడు విష్ణువర్ధనప్రభువుల చిన్నదేవేరులలో ఒక్కరైన దేవకిదేవి పాలనలో ఉండినది. ప్రెగ్గడ పలికిన అన్యాయపు మాటలకు కోపావిష్టురాలయిన శాంతలదేవి అస్త్రం ధరించి పతితోపాటు రథంఎక్కి ఆ ప్రెగ్గడపై యుద్ధానికి బయలుదేరి, యుద్ధంలోని వానికి గర్వభంగం చేసినది. వానిని చంపవలెనని ఆమె ఇష్టపడలేదు. కాని, ఒక దండనాయకుని అస్త్రమొకటి అకస్మాత్తుగా వచ్చి ప్రెగ్గడ రొమ్మున నాటినది. దైవమే శిక్ష విధించినదని మహారాజ్ఞి అనుకొన్నది. ఆ ప్రెగ్గడ రణభూమిలో చచ్చిపడినాడు. దానిని చూచిన ఉత్తరక్షణమే శాంతలకు పశ్చాత్తాపం కలిగినది. మరునాడే ఆమె ఆ ప్రెగ్గడ ఇద్దరు కుమారులను పిలిపించి, "మాకుమారుల మనసు చాల నొప్పించినాము. మీ తండ్రిగారు.ఎవరి బాణానికో తటాలున అడ్డుతగిలి. అది తాకగా, దైవవశులయినారు. మీ తండ్రిగారు ఇతరుల విషయంలో అన్యాయంగా అగౌవకరమైన మాటలు అనడం తప్పు. మీ ప్రెగ్గడతనం మేము తొలగించము. ఈ 'కమ్మెన' గ్రామాన్ని మీకు సర్వాధికారాలు గల ఉంబళి గ్రామంగా ఇచ్చినాము. దీనిని చక్కగా వృద్ధిపరచుకోండి. మాకు అధీనులై ధర్మంతో జీవించవలసినది." అని సెలవిచ్చి తన మనో వైశాల్యాన్ని దేశానికి చాటినది.



శాంతలకు, లక్ష్మికి రాజసభలో స్థానమానాలు లభించినవి. చిన్ననాటినుంచి ఉత్తమ వాతావరణంలో, సత్సహవాసంలో భక్తి ధర్మ న్యాయనీతి మార్గాలలోనే పెరిగిన మహారాజ్ఞి మనస్సు న్యాయాన్యాయ పరిశీలనలో సత్యపథగామిగానే ఉండడం ప్రభువులు గ్రహించినారు. దీనివల్లనూ వారికి పరస్పర ప్రేమ విశ్వాసాలు గాఢంగా పెరిగినవి.

శాంతల, లక్ష్మి ప్రభువులవద్ద ఇలాగు హెచ్చు ప్రేమ విశ్వాసాలు గడించుకొనడం చూచి వగతెగని, యోగ్యతలేని, హెచ్చు సంస్కారం పొందని చిన్న దేవేరులకు అసూయ ఏర్పడినది. ఈ ఐశ్వర్యఖని మధ్య ఆ అసూయ నానాటికీ పెరిగినది. పెక్కు కుతంత్రాలను, కుట్రలనూ ఈ దేవేరులు చేసినారు. కాని, వాటివల్ల వారు తమ పేరు తామే పాడుచేసుకొన్నారే తప్ప శాంతల విష్ణువర్ధనుల పరస్పర ప్రేమ విశ్వాసాలకు ఏ తీరు భంగమూ కలిగించడం సాధ్యంకాలేదు. ప్రభువులే చిన్న దేవేరుల నడవడి చూచి అసహ్యపడేటట్టు అయినది.

శాంతల తన సవతులకు ఎన్నోవిధాలుగ బుద్ధి, హితవు చెప్పినది. "ప్రభువుల ప్రేమ పొందడానికి ఇది తప్పుదారి" అనినది; "రాచనగరు గౌరవానికి కళంకం తెస్తున్నది మీ నడత" అని భయపెట్టినది. అసూయ పొరగమ్మిన కన్నులకు, మందమతులకు శాంతల హితవు మోసమని తోచినది. ప్రభువుల మనస్సుకూ దీనివల్ల శాంతి భంగమైనది. ఒకచోటనే ఉంటే మనస్తాపాలు పెరగవచ్చునని ప్రభువులు ఒక్కొక్క చిన్న దేవేరికి ఒక్కొక్క చిన్నప్రాంతపు ఆధిపత్యమిచ్చి, వారిని అక్కడక్కడే ఉంచినారు. అక్కడ ఉన్నప్పటికీ వారి కుతంత్రాలు తప్పలేదు. నడతలు సరిపోలేదు. ఇక స్వేచ్ఛగా విడువడం రాజుల ఇంటితనానికే చెడు పేరు తేవచ్చుననుకొని శాంతల వారందరినీ మళ్ళీ నగరుకు పిలిపించి, వారిపై దండనాయకత్వం తానే వహించి, వారిని అదుపులో పెట్టుకొన్నది. గంగరాజగారు అదిచూచి "ఆహా! ఉద్వృత్త సవతి గంధవారణ" అని శాంతలను కొనియాడినారు. ఆనాటినుంచి శాంతలదేవికి ఆ బిరుదు శాశ్వతంగా నిలిచినది.

## 3

రాజమాత, ప్రభువులు, శాంతల, లక్ష్మి, కుమారవిష్ణువు పెరుమల పండితుల కోరికపై శ్రీ విజయనారాయణ దేవుని ఆలయం దర్శించి రావడానికి ఒకమారు వేలాపురానికి వచ్చినారు.

రాజమాత, శాంతల, లక్ష్మి మహావిచిత్రమూ, సుందరాతి సుందరమూ, భవ్యాతిభవ్యమూ అయిన ఆ దేవాలయం దర్శించి, దర్శించి ఆశ్చర్యానందభరితులయినారు. ఐదు నూరు మంది శిల్పుల ఎనిమిదేండ్ల అవిచ్ఛిన్నకార్యసాధన ఆ మహాదేవాలయం, ఆ హొయిసళయశ స్తంభం నిర్మించిన మనస్సు, హృదయ వైశాల్యము ఎంత సుందరమో, ఎంత గొప్పదో, అంత సుందరమైనది ఆ దేవాలయం; అంత విశాలం దాని పరిస్తరణం. శిల్పులు ఒకరితో ఒకరు స్పర్థతో తమ కౌశలం ప్రభువులకు ప్రదర్శించవలెననే ఆ కాంక్షతో అపూర్వమైన చెక్కడపు చిత్రవిచిత్రమైన పనితనం చూపినారు.

ధనాశతోనో, అథవా ఇతర విధ బహుమానాల ఆశతోనో పనిచేసినవారు కారు ఆ శిల్పులు. తమ ఈ కలాకుశలత నిదర్శనం సర్వకాలాలూ ఉంటుందనే ఆశతోనే శ్రమపడినారు. భగవంతుని ఔన్నత్యం శిల్పంలో నిరూపించడానికి సాధ్యమైన విధాలు రెండు: ఒకటి :- అద్భుతాగారాకార నిరూపణం; రెండు:- అనుపమసౌందర్య నిరూపణం. ఈ కలోపాసకులయిన శిల్పులు దేవదేవుని సౌందర్య నిరూపణమే భగవంతునికి తాము ఇహ జన్మంలో చెల్లించదగిన సేవఅని, తమకు ఆ దివ్యశక్తిని అనుగ్రహించిన భగవంతునికి తమ కర్తవ్య నిరూపణను, తద్ద్వారా తమ ముక్తికి సాధనాన్ని సంపాదించుకొనినారు.

ఆనాడు భోజనసమయంలో ప్రభువులు శాంతలను సంబోధించి, “దేవీ! ఈ మహాదేవాలయం నీ మనస్సుకు ఒప్పినదా?” అని ప్రశ్నించినారు.



శాంతల :- “వర్ణించడానికి నోరు లేనందువల్ల ఊరకున్నాను; దేవ! దీనిలో ‘నాది’ అనే ఏ భాగమూ లేదుగదా?”

విష్ణువర్ధనులు :- “ధర్మార్థకామమోక్షాలలో పత్ని సమభాగిని అని శాస్త్రమే ఉన్నదికదా?”

శాంతల :- “అందువల్లనే, సమభాగిని కావడానికి నా పేరుతోను, ఇంత పెద్దదికాకపోయినా, ఒక భవ్యమైన చిన్న దేవాలయం, ఒక సుందరమైన విష్ణుమూర్తిని స్థాపించాలని ఆశపడుతున్నాను.”

విష్ణువర్ధనులు (లక్ష్మినిచూచి) :- “దేవీ, నీ ఆశఏమి?”

లక్ష్మి :- “నాఆశ వేరుగా ఉంటుందా? అక్కయ్య ఆశ తీరితే నాఆశా తీరినట్లే.”

విష్ణువర్ధనులు :- “ఓహో! మీ రిద్దరూ మొదలే మాట్లాడుకొన్నట్టుంది.”

శాంతల :- “లక్ష్మితో నేను ఈ సంగతి ఎత్తినదాన్నే కాను.”

ప్రభువులు తమ పంక్తిలోనే భోజనంచేస్తున్న రాజమాతవైపు చూచినారు. రాజమాత చిరునవ్వు నవ్వి “అప్పాజీ, బిడ్డల ఆశ తీర్చదగింది.” అనినారు.

విష్ణువర్ధనులు :- “అయ్యో! అమ్మా, దీనిలో మీరు చేరినారా? ఇంకా ఎవరెవరు చేరినారు? చెప్పండి.”

ఒక ప్రక్కగాకూర్చుని ఫలాహారం సేవిస్తున్న పెరుమల పండితులు “బిడ్డల ఆశకు మా సహానుభూతీ ఉన్నది.” అనినారు.

విష్ణువర్ధనులు :- “ఓహో! మామయ్యగారు కూడా! ఇది దొడ్డ లోలోపలి ఎత్తు. ఇంకా ఎవరున్నారిక్కడ?” అని కుమారవిష్ణువును చూచి, “నీ వెందుకు ఊరుకున్నావు?” అన్నారు.

కుమారవిష్ణు :- “అప్పాజీ అడిగితే మనవిచేద్దామనుకున్నాను. అక్కయ్య ఆశే నా ఆశ.

విష్ణువర్ధనులు :- "ఏమిటి? నీవూ ఆ వైపే మొగ్గినావా? ఇక మేము ఓడిపోయినాము." అని శాంతల వైపు తిరిగి, "దేవీ, ఇది బహు దృఢమైన మూలబంధం. భూమి కంపించినా ఇది ఇక అల్లలాడదు. ఇక ముందుకు సాగనీ వ్యూహరచన." అనినారు.

శాంతల గెలిచినాననే సంతృప్తి నవ్వుతో "విజయనారాయణ దేవుని మందిరం పక్కనే ఒక సౌమ్య కేశవస్వామి ఆలయం.'' అనినది.

విష్ణువర్ధనులు :- "వ్యూహరచన కూడ అప్పుడే ముందుకు సాగినదే. అందుకే ఇక్కడికి వచ్చినప్పటి నుంచి ఒక మాటాపలుకూ ఆడక మౌనంగా గుణకారం చేస్తున్నావా? తథాస్తు. తథాస్తు. తవఇష్టార్థ సిద్ధిరస్తు. ఈ సంకల్పం విజయనారాయణనుదే. మంచిది. అ భగవంతుడే ఈ ఉద్యమాన్ని నడిపించనీ. మామయ్యగారే నిలబడి ఈ కార్యాన్ని చేయించనీ."

పెరుమల పండితులు :- "మహాసంతోషంతో. చెన్నకేశవుని సంకల్పమే ఇది. పనివారినీ, శిల్పులనూ రేపే రమ్మని చెప్పిపంపుతాను."

* * * *

రెండు వసంతాలు గడిచే వేళకు సౌమ్యకేశవ దేవాలయమూ, ప్రతిష్ఠాపనకు సర్వాంగ సుందరమైన చెన్నకేశవమూర్తి సిద్ధమయినవి. పెరుమల పండితులూ, ఆగమికులూ ఆలోచించి ప్రతిష్ఠకు శుభదినం, శుభముహూర్తం నిశ్చయించినారు. వేలాపురంలో చెన్నకేశవుని ప్రతిష్ఠాపనోత్సవదినం లక్షకు పైగా ప్రజలు సమావేశమయినారు. ద్వారవతి ద్వారవతే వేలాపురికి వచ్చినది.

"ఈశుభమహోత్సవానికి దయచేసి, సౌమ్యకేశవస్వామి అనుగ్రహానికి పాత్రులు కావలె" అని కోరి పెరుమల పండితులు తమ గురుపీఠమయిన శ్రీరంగం యమునాచార్యుల శిష్యబృందానికీ, శ్రీరంగనాథస్వామి మహాభక్తులకూ, కంచి వరద రాజస్వామి భక్తులకూ, తంజావూరు, మధుర,



రామేశ్వరం మొదలయిన పుణ్యస్థలాల మఠాధిపతులకూ, భక్తాగ్రేసరులకూ సాదరమైన ఆహ్వానపుకమ్మలు పంపినారు.

హొయిసళరాజ్యంలోని వేలాపురి శ్రీ విజయనారాయణస్వామి దేవాలయాన్ని దర్శించివచ్చిన వారినుంచి దాని వర్ణనను అడిగి తెలుసుకొని తామూ ఆ శిల్పకలానిధి అని ఎన్నికగన్న మహాదేవాలయం దర్శిద్దామనే ఆశ వెలిదేశాలవారికి చాల పెరిగిఉండినది. ఇలాటి సుసమయం పోగొట్టుకోగూడదని వేలాది భక్తశిరోమణులు ఆనాడు వేలాపురికి వేంచేసినారు.

చుట్టుపట్ల ఊర్లవారందరూ మొదలే వేలాపురికివచ్చి చేరినారు. మాచికబ్బె, మారసింగమయ్యగారు, కేలమల్లుడు, జక్కియబ్బె, కల్యాణ రాహుతుడు, సహజదేవి విజయం చేసినారు. రాజవంశంవారందరూ వచ్చినారు. వేలాపురం వైకుంఠంలో సమానమయిపోయినది.

## 4

ప్రతిష్ఠాపన ముహూర్తానికి ముందే విజయనారాయణ దేవాలయం ఆవరణమంతా భక్తజనులతో క్రిక్కిరిసిపోయినది. ఆవరణంలోనే నిర్మించిన చెన్నకేశవస్వామి ఆలయంలో భాగవతోత్తములకు, విప్రవర్యులకు, రాజవంశీయులకు స్థానాలు ఏర్పరచినారు. కేశవస్వామి దర్శనం అందరికీ లభించనీ అని, వెలుపలి ఆవరణకుడ్యాలు, ద్వారాలూ అప్పుడింకా నిర్మించలేదు. దూరంలో నిలబడినా, గర్భాలయంలో జరిగే కైంకర్యాలన్నీ అందరికీ కనిపించేటట్టు ఉండేది.

ప్రతిష్ఠాపనకు పూర్వంకావలసిన విధులన్నీ సాంగంగా జరిగినవి. రాజమాత, ప్రభువులు, శాంతల, లక్ష్మి, తక్కిన దేవేరులు, కుమారవిష్ణువు స్నానమాచరించి, ధౌతదుకూలాలు ధరించి, పూజా సామగ్రిని గ్రహించి, మంగళవాద్యాలతో సౌమ్యకేశవస్వామి ఆలయానికి నడిచివచ్చినారు. ఆగమికులు అప్పుడు సుముహూర్తవేళ అని ప్రభువులకు విన్నవించు

కొనినారు. మంగళవాద్యాల ధ్వని మిన్నుముట్టినది. చెన్నకేశవస్వామి ముందువేసిన కాండపటం పక్కకు జరిగి, దివ్యదర్శనసమయం సన్నిహితమయినదని అందరూ వేచియున్నారు. గర్భాలయంలో సహస్రదీపాలు వెలిగినవి. దేవాలయ మహాఘంటలు నినదించినవి. వెలుపల భేరీభాంకారాది చర్మవాద్యాలు మ్రోగినవి. కాండపటంముందు పరాతంలో పెట్టిన కర్పూరరాశి ప్రజ్జ్వలించినది. కాండపటం ప్రక్కకు జరిగినది. లోకోత్తర సౌందర్యంతో బహ్వారే ప్రసన్న చెన్నకేశవస్వామి దర్శనం అందరికీ లభించినది. అందరూ మహానందభరితులయినారు. చెన్నకేశవస్వామి మధురభావం, నిలువు, భంగిమ, ఆభరణసౌందర్యం - అంతా మనోమోహకమైనది. అప్పుడు ఆగమికులు ఆ భవ్యమూర్తిని ప్రతిష్ఠించిన శిలాపీఠంపై చెక్కిన అక్షరపంక్తిని ముక్తకంఠంతో ఇలాగున చదివినారు:-

శాంతిక్షృత్సర్వభూతానాం ప్రతిష్ఠావిష్ణుకాంతయా
చెన్నకేశవదేవస్య శాంతిదేవాకృతోత్తమా.

పురోహితులు మంత్రాలు పఠిస్తుండగా, శాంతలదేవి హవనాది ఇతర కైంకర్యం సమాప్తిచేసి, అతిశయ శ్రద్ధాశక్తులతో చెన్నకేశవస్వామిని ప్రతిష్ఠించినది. శాంతల, లక్ష్మి సహస్ర సహస్ర పుష్పాలతో చెన్నకేశవుని పూజించి ధన్యలయినారు. ఇదంతా ఆచరిస్తున్నప్పుడు శాంతల హృదయం ఆనందంతో పొంగి, ఆమెకు భక్త్యావేశం కలిగినది. తనకు ఇంతటి సౌభాగ్యం కల్పించిన పతి వద్దకువచ్చి, నిండుసభలో సాష్టాంగప్రణామం ఆచరించినది. లక్ష్మికూడ అక్కయ్యను అనుసరించినది. అనంతరం ఇద్దరూ రాజమాతకూ, తమ తల్లిదండ్రులకు సాగిలంపడినారు; పెరుమల పండితులకు సాష్టాంగపడినారు. తాను మహారాణి అయినప్పటికీ దేవదేవుని సన్నిధిలో అల్పురాలనే భావించి శాంతలదేవి దైన్యంతో చేతులు జోడించి, అక్కడ ఉన్న సమస్త భక్తజనులకు, దేవదర్శనంకోసమని క్రిక్కిరిసిన తన ప్రజలకూ తలవంచి నమస్కరించినది. వారి కన్నులకు శాంతల, లక్ష్మి శ్రీదేవి భూదేవులవలె కనిపించినారు. శాంతలదేవి మనసు ఆనంద సమాధిమగ్నమయినది; లక్ష్మివైపు తిరిగి



"లక్ష్మి! వీణ అందుకో. నేను నేడు నా దేవదేవునికోసమే నర్తిస్తాను." అన్నది. దేనయ్య ఒక క్షణంలో వీణను, కాలిగజ్జెల సరాలను తెచ్చినాడు.

శాంతల గజ్జెలసరాలు చేతపట్టుకొని ప్రభువుల సన్నిధికివచ్చి ఆనందాతిరేకంతో నమస్కరించినది. ప్రభువులు శాంతల మనోభావం గ్రహించి, సంతోషంతో "చెన్నా, కానీ, చెన్నకేశవునికి నీ ఆనందనర్తన సేవ. ఇక్కడ నీకు ఏ సంకోచమూ వద్దు. ఇక్కడ ఉన్నవారందరూ భాగవతోత్తములు. మనమందరం ఆ కేశవుని గర్భంలో ఉన్నాము." అని సెలవిచ్చి, అనుమతించినారు. అటుతర్వాత శాంతలదేవి రాజమాతకు, పెరుమల పండితులకు, తన తలిదండ్రులకు నమస్కరించి, మళ్ళీ సదస్సుకు నమస్కరించి, గజ్జెలను భగవంతుని అడుగు తామరలకడ పెట్టి, పూవులతో అర్చించి, కర్పూరహారతి ఇచ్చినది. ఆ వేళకు లక్ష్మి వీణను శ్రుతిచేసినది. శాంతల గజ్జెలను తీసుకొని కన్నులకు అద్దుకొని, శారదను మనస్సులో స్మరించి, కన్నులు మూసుకొని, స్వల్పకాలం ధ్యానాసక్తురాలయినది. కన్నులు తెరచినప్పుడు ఆమె కట్టెదుట శిలావిగ్రహం కానరాలేదు; చెన్నకేశవుడే సాక్షాత్తుగా ఎదుట నిలబడి స్మితవదనుడై తన్ను తిలకిస్తున్నట్టు ఆమెకు భావన కలిగినది. ఆ వేళకు లక్ష్మి అక్కయ్య కాళ్ళకు గజ్జెలు అలంకరించినది. అప్పుడు దేవాలయ వాతావరణం చాల నిర్మలంగా ఉన్నది. భగవంతుని ఎదుట అందరూ పసిపాపలయిపోయినారు. శాంతల హృదయం ఉత్సాహంతో పొంగులువారినది. దేవేరుల నర్తనానికి విశాలస్థలం ఏర్పాటయినది. లక్ష్మి వీణానిక్వాణానికి తన మధురధ్వని కలిపినది. లక్ష్మికూడ శాంతలంత ఆనంద సమాధిలో నిమగ్నరాలయినది. అక్కయ్య కాలిగజ్జెల ధ్వని తాళం కట్టినది. అప్పుడు అక్కడఉన్న సమస్త భక్తుల హృదయాలూ ఆ మధురలయంలో, ఆ మధురనాదబ్రహ్మలో ఐక్యమయినవి; భక్తి పరాధీనమయినవి. ఇహలోకమే విస్మృతమయినది.

దేవదేవుని సమ్ముఖంలో, పూర్ణ భక్త్యావేశంలో శాంతల ఆనంద నృత్యం చేస్తున్నది. బంగారు తీగవలెఉన్న దేవిదేహం ఊగుతున్నది;

వంగుతున్నది; ఉన్న తానతమవుతున్నది; పక్షికంటె తేలికవుతున్నది. దేవదేవుని పూజకోసం శాంతల పుష్పోద్యానానికి వచ్చినది; నవవికసిత కుసుమాలను కోసి కోసి సంగ్రహిస్తుంది. విచ్చిన తామరలను తీసుకొంటూ, భ్రమరాలువచ్చి వాలితే, తానూ వాటిలో ఒకే భ్రమరిఅయి, ఒక పూవునుంచి మరొక పూవుకు వాటితోపాటు ఎగిరి, పూవులను తక్కిన భ్రమరాలు ముట్టకుండా నివారిస్తూ, మకరంద పూర్ణమైన, సౌరభ పూర్ణమైన పుష్పాలనే వెదికి వెదికి ఏరుకుంటుంది. ఏరుకున్న పుష్పాలను దేవాలయానికి తీసుకొని వస్తుంది; పరమభక్తితో దేవదేవుని అర్చిస్తుంది; ధూపదీపాలు నివాళి యిస్తుంది; ఆరతి ఇస్తుంది; అనందనర్తనం చేస్తుంది. ప్రసన్నుడవు కమ్మని దీనతతో వేడుకొంటుంది; కన్నీరు వేళ్లతో తుడుచుకొంటూ వేడుకొంటుంది; తన ఆత్మనే నివేదించు కొంటుంది. దేవదేవుడు సాక్షాత్కరిస్తాడు; శాంతలను అనుగ్రహిస్తాడు; ఆమెను తనలో ఐక్యం చేసుకుంటాడు.

అక్కడ చేరిన భాగవతోత్తములూ, భక్తులు ఇంత గంభీరమూ, ఇంత సుందరమూ, ఇంత భక్తిపరవశతాయుతమూ అయిన నృత్యం తామెన్నడూ చూచినదే లేదని, శాంతలదేవి ఖండితంగా మహాలక్ష్మి అంశమేనని, తమ కన్నులు ఈ నాడు సార్థకమయినవని భావించినారు. విష్ణువర్ధన ప్రభువుల హృదయమంతూ దేవి నృత్యంలో సమ భాగిఅయినది. ఆమె భావోన్నతితో ఆనందనృత్యం చేస్తున్నప్పుడు వీరి హృదయమూ ఆనందతాండవం చేస్తూ ఉండినది.

శాంతల శరీరం అలసిపోయేవరకు ఆనందనర్తనంచేసి తన చెన్నకేశవునికి సాష్టాంగపడినట్లే ప్రజ్ఞ తప్పి తూలిపోయినది. ఈ సూక్ష్మం గ్రహించినలక్ష్మి వెంటనే తను పలికిస్తున్న వీణవదలి కిందపెట్టి పరుగున వచ్చి అక్కయ్యను రెండుచేతులతో కాగిలించుకొని యెత్తుకొని, వెల్లికిల పడుకోబెట్టి వీవనతో విసరినది. మాచికబ్బె నోసటికి చన్నీళ్ళ తట్టి మెలకువ కలిగించినారు. ప్రభువులు అత్యాతురతతో దేవివద్దకు వచ్చినారు. అప్పుడే కన్నులుతెరచి బాహ్య ప్రపంచానికి వస్తున్న శాంతలకు చెన్నకేశవుడే దగ్గరికి వస్తున్నట్లు అనిపించినది. వణుకుతున్న చేతులను అతి



కష్టంతో జోడించినది. ప్రభువులు శాంతలను తమచేతులతో ఎత్తి మెల్లగా కూర్చోబెట్టి, "దేవీ, నీకు చాలఅలసటయినది. మాకేమో మహానందమయినది. అందరికంటె హెచ్చు ఆనందం నీ చెన్నకేశవునికి అయినది. ఇక నీవు విడిదికి వెళ్ళి విశ్రమించవలసినది." అని సెలవిచ్చినారు. ఆవేళకు, రాజమాత, పెరుమల పండితులు, గంగరాజగారు, మారసింగమయ్య - అందరూ దగ్గరికి వచ్చినారు. శాంతల కొన్ని నిమిషాల తర్వాత కొద్దిగా జలపానంచేసి, లేచినిలబడినది; అందరికీ నమస్కరించినది. అక్కడి జనమంతా "జయ్హో! జయ్హో! తల్లీ శాంతలదేవీ! మహారాజ్ఞీ జయ్హో! నాట్యసరస్వతీ జయ్హో!" అని మేరమీరిన హర్షానందాలతో ఘోషించినారు. తర్వాత అందరూ తమ మహారాజ్ఞికి తలవంచి భక్తి ప్రపత్తులతో నమస్కరించినారు.

రాజమాతతో పాటు మాచికబ్బె, శాంతల, లక్ష్మి విశ్రమించడానికి విడిదికి వెళ్ళినారు. ప్రభువులు పెరుమలపండితులతోపాటు ఆనాటి విశేష పూజలు సమర్పించడానికి విజయనారాయణుని కోవెలకు బయలుదేరినారు. భక్తసమూహం వారిని అనుసరించినది.

మహారాజ్ఞి దివ్యనృత్యాన్ని దర్శించిన శిల్పాచార్యులకు అప్పుడు మనస్సులో ఒకభావం భాసించినది. మహారాజ్ఞి నృత్యభావ భంగిమలలో కొన్నిటినైనా తమ శిల్పకళలో నిరూపించి దేవాలయాన్ని ఇంకా పదింతలు రమణీయం చేయవలెనని ఆశగలవారయినారు. ఒకొక్కరు ఒక్కొక్క భావాన్ని ఒక్కొక్క భంగిమను, ఏరుకొనినారు. "సౌందర్య శృంగార సారపు నెలవులు వీరు" అనేటట్లు శిలా బాలికలను చెక్కి, దేవాలయం చుట్టూ కన్నులకు రమ్యంగా కానవచ్చేచోట్ల జోడించి నిలిపినారు. వాటిని ప్రభువులు, మహారాజ్ఞి శాంతల, లక్ష్మి చూచి ముగ్ధులయినారు. ప్రభువులు ఆ ఉత్తమ శిల్పులకు బాగాపండే భూములను సర్వదుంబాలగా దానమిచ్చినారు; వారి కలానైపుణ్యాన్ని బహువిధాలుగా ఆదరించినారు.

మహారాణి అతిలోక నృత్యాన్ని చూచి ఆనందపడిన కేతమల్లునికి ఆ క్షణమే మనసులో భవ్యమైన ఒక ఆలోచన కలిగినది. కొంతసేపటి

లోనే మహాశిలావగా వృద్ధిపొందినది. విజయనారాయణ, చెన్నకేశవ దేవాలయాలను చూచి కేతమల్లుడు ఇదివరకే వెరగుపడినాడు. వ్యాపారి అయి దేశదేశాలు తిరిగి చూచిన అతడు ఇంతటి కలాకౌశలాన్ని మరి ఏ దేశంలోను చూడలేదు. ఇలాటి దివ్య దేవాలయం చూచి జనులకు కలిగే భక్త్యానందాలను అతడు ఇపుడు కండ్లార చూచినాడు. హొయిసళ నాడు ప్రజలలోను, ప్రభువులయందూ ఉన్న ఇలాటి దైవభక్తిని, ధర్మదృష్టిని అతడు మరెక్కడా చూడలేదు. విష్ణువర్ధన ప్రభువులయెడ వారి పెద్ద దేవేరి ఎడ కేతమల్లుని భక్తివిశ్వాసాలు నూరింతలు పెరిగినవి. "దేశంలో దైవభక్తిగల ధర్మిష్ఠుడైన ప్రభువు ఉండవలె. అలాటి దేశం వర్ధిల్లుతుంది. ప్రజలలో దైవభక్తి నెలవుచేసుకొన్నకొద్దీ, ధర్మమూ, సుభిక్షమూ, నెలకొంటాయి." అని కేతమల్లుడు తెలుసుకొనినాడు. అందువల్ల అతడు దైవకృపతో తనకు లభించిన సంపదనంతా దైవానికే సమర్పించి, మిగిలిన జీవితాన్ని విష్ణువర్ధన ప్రభువుల సేవలో హంసవలె, గరుడివలె, నందివలె గడపడమే తనకు పరమశ్రేయస్సని భావించినాడు. ఈ ఆలోచనకు తన పత్ని జక్కియబ్బె అంగీకారం ఉండనే ఉంటుందని ఆ ఉత్తముడు, ఎరిగినా, ఆమెకు తన మనస్సు విచ్చి చెప్పిన తర్వాతే కార్యోన్ముఖుడు కావలెనని నిర్ధరించినాడు.

# 5

ఆ నాటి సాయంకాలమే కేతమల్లుడు, జక్కియబ్బె తమ కుమార్తె చందలను పిలుచుకొని మహారాజ్ఞి శాంతల ఆరోగ్యం విచారించడానికి విడిదికి వచ్చినారు. మాచికబ్బె వారిని తమ కుమార్తె దగ్గరికి పిలుచుకొని వెళ్ళినారు. శాంతలదేవి తన తండ్రికి ధనికుడైన మేనల్లు డొకరు ఉన్నారని, అతడు దొడ్డవ్యాపారి అని, దేశాంతరం నుంచి గుర్రాలు, ఒంటెలు తెప్పించి వ్యాపారం చేస్తున్నారని చెప్పగా విన్నదేగాని, అతనిని ఇదివరకు చూడలేదు. మహారాజ్ఞికి ఈ సమయంలో ఒక దగ్గరి బంధువుతో పరిచయమయినది.



జక్కియబ్బె మహారాజ్ఞికి నమస్కరించి, "ఈనాటి భక్తినర్తనంతో తమకు చాల శ్రమకలిగి ఉంటుంది. ఇంత అద్భుతమయిన ఆనందనర్తనం మేము చూచినదే లేదు. మేము చూచినది పల్లెజనాల గంతులు. ఇది దేవవిద్య; గంధర్వవిద్య. చాల సంతోషపడినాము. ఇప్పుడు తమ కుశలం తెలుసుకొనడానికి వచ్చినాము. దేవిగారికి శ్రమ పరిహారమయినదా ? తమ తలిదండ్రులు మమ్ముల్ను ఇక్కడే కట్టివేసి నిలుపుకొనినారు. తమ రాజ్యం చాల బాగున్నది. ప్రభువులు మహావీరులు, ఉదారులు, ధర్మపరులు, జాత్యతీతులు, భగవద్భక్తులు. ఇలాటిప్రభువుల రక్షణలో ఉండడం మాకు సంతోషం; ధైర్యం." అన్నది.

శాంతల :- "అమ్మా, మీరు నాకు వావిలో తల్లివంటివారు. మాకు దగ్గరి చుట్టాలంటే మీరే. మీరు మాదేశంలో ఉండడం మాకు చాల సంతోషం. నా అయ్యగారు, అమ్మగారు-ఇద్దరూ మీ యిద్దరి విషయం నాతో చాలగా చెప్పినారు, ఈ కన్య మీ కుమార్తా ?"

మాచికబ్బె :- "ఔను. మాకు నీవలె వారికీ ఇది ఒక్కతే."

శాంతల :- "ఔనా ? ఇక్కడ రామ్మా చెల్లీ. నీ పేరేమిటమ్మా?"

కన్య :- నా పేరు చందల."

శాంతల :- "చందల ! ఎంత సొగసైన పేరు ! నీ రూపానికి తగిన పేరు. చందలా, నీవు ఏమేమి నేర్చుకున్నావు ? నేర్చుకొంటున్నావు?"

జక్కియబ్బె :-"మేము ఊరూరూ తిరుగుతుంటే దీనికి చదువెలాగు? దీనికోసమయినా మేమిక్కడ ఉండిపోవలె."

శాంతల :- చదువు నేర్చుకొనడానికి ఇప్పుడు వయసేమి మీరిపోయినది ? అయినా, ఏ వయస్సయితే ఏమి? మా గురువర్యులు అనేవారు- ఎవరికి విద్య నేర్చుకొనే ఆశలేదో, అథవా ఆశ ముగుస్తుందో, అక్కడికి వారి ఆయుస్సు ముగిసినట్లే - అని. నా చెల్లి చక్కగానే నేర్చుకుంటుంది అన్నీ. కాదూ చందలా ?"

చందల సిగ్గుతో తలవంచుకొన్నది.

మాచికబ్బె శాంతలతో "కూతురా ? నీవు నగరుకు వెళ్ళినమీదట, అటు లక్ష్మికూడ వెళ్ళినమీదట యిల్లు శూన్యమయినది. మీ అయ్యగారి కంతూ బ్రదుకే శూన్యంగా కనిపించినది. ఇప్పుడు వీరంతా మన యింట్లోనే ఉన్నారు. నీ మామయ్యగారిని ఒప్పించవలెనంటే చాలకష్టమయినది." అనినారు.

శాంతల కేతమల్లునిచూచి, నమస్కరించి, "మామయ్యగారు అంగీకరించినది చాల సంతోషం. ప్రభువులూ దీనిని విని తృప్తిపడేరు. మామయ్యా, వేరేయిల్లు ఏర్పాటు చేయడం వద్దనేవద్దు. అమ్మకేమో సాకటానికి ఒకబిడ్డ ఉండే తీరవలె. ఈ ఉత్సవాలన్నీ ముగిసినపిదప మీరు ప్రభువులను ద్వారవతిలో మరొకమారు దర్శించి మాటలాడవలె." అనినది.

కేతమల్లుడు :- "ఊరూరూ, దేశ దేశమూ తిరిగితిరిగి కొసకు ఇంటికి భద్రంగా చేరుకున్నట్టయినది మాకిప్పుడు. ఇక ఎక్కడికి పోతాము ? ఇక్కడే ఉంటాము."

అప్పుడు మాచికబ్బె తన కుమార్తెవద్దకువచ్చి చెవిలో ఏదో గుప్తమైన విషయం కొంతసేపటివరకు చెప్పినారు. దానిని వింటున్న శాంతల ముఖంలో మొదట మొదట కుతూహలం కనిపించి, తర్వాత తర్వాత ఆశ్చర్యం, తృప్తి, ఆనందం కనిపించినవి. శాంతల కేతమల్లునితో "మామయ్యా, ఇది నా మనసుకు బాగనచ్చినది. ఈ గుట్టును నేను కాపాడుకొంటూవుంటాను. ఇక మీరు నన్ను మహారాజ్ఞి అని సంబోధించరాదు. చందలవలె నేనూ మీ బిడ్డను. అట్లే అని భావించి నన్ను ఆశీర్వదించండి." అంటూ, లేచి ఎదుటికివచ్చి, భక్తితో కేతమల్లునికి, జక్కియబ్బెకు నమస్కారంచేసినది. ఆ దంపతులు "కూతురా, నీ ధర్మం వర్ధిల్లనీ. మహోన్నతురాలవు కా." అని ఆశీర్వదించినారు.

శాంతలదేవి చందలను దగ్గిరికి పిలుచుకొని, మేను నిమిరి, "మా అమ్మకు నీవిప్పుడు శాంతల. విద్య నేర్చుకొనడానికి ఆశపడు,



మా అమ్మ మంచి గురువులను నీ కోసం ఏర్పాటుచేస్తారు. నీవు విద్యావంతురాలవుతావు; భాగ్యశాలిని అవుతావు." అన్నది.

శాంతలదేవి కోరికప్రకారం కేతమల్లుడు, జక్కియబ్బె దేవుని ఉత్సవాలు దర్శించిన మీదట ద్వారవతికి అందరితో కలిసి వెళ్ళవచ్చునని నిర్ధరించి, మూడునాళ్ళూ వేలాపురిలోనే ఉన్నారు.

ఆ మూన్నాళ్ళూ విజయనారాయణునికి, చెన్నకేశవునికి విశేష పూజోత్సవాలు జరిగినవి. ఉత్సవ సమాప్తినాడు విజయనారాయణుని సన్నిధానంలో శాంతల, లక్ష్మి వీణ వాయించి పాడినారు. మహారాజ్ఞి చెన్నకేశవునిముందు ఎంత ఆనందంతో నర్తించినదో, అంత ఆనందంతోనే విజయనారాయణుని సమ్ముఖంలోను నేడు నర్తించినది.

మహాజనులు, భాగవతులు తమ మహారాజ్ఞిని "నాట్యసరస్వతి, గాన సరస్వతి" అని, లక్ష్మిదేవిని "విద్యాభరణ, గానకలానిధి" అని ముక్తకంఠంతో పొగడి పాడినారు. ఉత్సవాలు మహావిజృంభణలో జరిగినవి. నగరునుంచి దానధర్మాలు యథేచ్ఛంగా జరిగినవి. శాంతల, లక్ష్మి స్వయంగా బీదసాదలకు, వికలాంగులకు, అనాథశిశువులకు, అన్నదానం, వస్త్రదానం, ద్రవ్యదానం యథేచ్ఛంగా జరిపినారు. భూసురోత్తములకు గోదాన భూదానాలు జరిగాయి. పరదేశంనుంచి ఉత్సవంకోసం వచ్చిన భక్తులకు, అతిథులకు సర్వోపచారాలను పెరుమల పండితులే స్వయంగా చేయించడమే కాక ప్రభువుల చేతినుంచి ఉత్తమైన ఉడుగరలను ఇప్పించి, సంతుష్టిపరచి పంపినారు.

ప్రభువులు ఒకనాడు సపరివారంగా శ్రవణబెళ్ళగొళకు వేంచేసినారు. అనంతరం అందరూ ద్వారవతికి వెనుదిరిగినారు. ఇంకా ముగియవలసిన దేవాలయ కార్యాలను త్వరపరుస్తూ పెరుమల పండితులు వేలాపురిలోనే ఉండిపోయినారు.

ద్వారవతి చేరిన వెంటనే కేతమల్లు తన బహాదుద్యమానికి మూలబంధం వేసుకొన సాగినాడు. మాచికబ్బె, మారసింగమయ్య కేతమల్లుని

ఈ మహాకార్యానికి 'వెనుక బలంగా నిలచినారు. భగవద్భక్తురాలయిన జక్కియబ్బేకేమో "ఈస్వప్నం ఎంత ఎంతతొందరగా చేకూరుతుందో!" అన్న ఆతురత పుట్టినది. "ఈ సంకల్పం దైవప్రేరణం. మహాదేవునికి సమర్పణం. అందువల్ల ఈ పనికి ఏలాటి చ్యుతీ, ఏలాటి ప్రతిబంధకమూ రాజాలదు." అనినారు మారసింగమయ్య.

విజయనారాయణ, చెన్నకేశవదేవాలయాలను నిర్మించిన శిల్పులే కాక, ఉచ్చంగినుంచి భండారి మధువణ్ణ, గంగివాడినుంచి దేమోజు, బళ్ళిగ్రామంనుంచి దాసోజు - మొదలయినవారిని రప్పించి, కావలసినంత వస్తువులను, ధన ధాన్యాలను సంగ్రహించుకొని, శుభముహూర్తంలో కొత్త దేవాలయం శంకుస్థాపన నెరవేర్చినారు. ఐదునూర్లమంది పనివారు, నూరారుమంది శిల్పులు ఐదుసంవత్సరాలపాటు అవిచ్ఛిన్నంగా పనిచేసి దేవాలయపు గర్భగుడిని, లోపలి ఆవరణాన్ని కట్టి ముగించినారు. దేవాలయ బాహ్యావరణపు బ్రహ్మాండమైనపని ఇంకా అలాగునే మిగిలినది.

వేలాపురి దేవాలయాలు శ్రీ మహావిష్ణువుకు అర్పితమయినవి. ద్వారవతిలో నిర్మించిన ఈ జోడుదేవాలయాలు మహాదేవునికి అర్పితమయినవి. కేతమల్లుకు తనకు శివకృపతో లభ్యమయిన సిరిసంపదలనంతా శివునికే అర్పించి కృతార్థుడయినాడు. ద్వారవతిలోని జోడుదేవాలయాల నిర్మాణంలో విశేషమున్నది. ఇవి వేలాపురి దేవాలయాలవలె విడివిడిగా లేవు; ఒకదానికొకటి అంటినట్టు ఉన్నవి. రెండు దేవాలయాల నవరంగ (మధ్య) భాగాన్ని ఒక పెద్దదారి కలుపుతుంది. ఈజోడు శివాలయాల ఎదుట రెండు పెద్దపెద్ద నందిమంటపాలుకట్టి సిద్ధమయినవి. అయితే నందులు ఇంకా సిద్ధంకాలేదు. ఆ పెద్దమంటపాలకు తగినట్టు బృహదాకారం గల నందివిగ్రహాలే కావలసిఉన్నందున, అట్టి నందులను చెక్కి సిద్ధపరచడానికి తగిన పెద్దపెద్ద నయమైన రాతిబండలు అవసరమయినవి. అలాటి బండలు సమీపంలో దొరకనందున ఆపని అట్లే మిగిలినది. అయితే, మహాదేవుని ప్రతిష్ఠాపనోత్సవ సమయానికి నందివిగ్రహాలు తప్పక కావలె. ఒక నందిమంటపం వెనుకభాగంలో సూర్యనారాయణునికి ఒక దేవాలయం కట్టినారు.



శిల్పులు దేవాలయం ప్రథమ పీఠభాగాన్ని నేలమట్టంనుంచి నాలుగుమూరల యెత్తునకట్టి, తర్వాత దేవాలయ ప్రదక్షిణమార్గం దాదాపు ఏడెనిమిది మూరలంత మేరవదలి, అక్కడినుంచి దేవాలయ నిర్మాణం ప్రారంభించినారు. ఈ ఆవరణ కుడ్యం వెలుపలిభాగంపై ఏడెనిమిది వరుసలున్నవి. ఒక్కొకవరుసలోను రమ్యమైన చెక్కడపు పనితనం ఉన్నది. అట్టడుగు వరుసలో ఒకదానివెంట మరొకటిగా బయలుదేరిన యుద్ధసన్నద్ధమయిన ఏనుగులసాలు. ఈ ఏనుగులు వేయికిపైగా ఉన్నవి. అంగభంగిమలోను, ఆభరణాలలోను, నడకలోను, చూపులోను, పరుగులోను ఒకదానివలె మరొకటిలేదు. ఇది శిల్పులకౌశలం. రెండవవరుసలో సుడులుసుడులుగా గుబురుకొని దేవాలయం చుట్టూవ్యాపించిన పుష్పలతలు. మూడవవరుసలో భయంకరమైన సింహాలు, శార్దూలాలు, యాళులు. నాల్గవవరసలో సుందరమైన హంసలపంక్తి. ఐదవవరుసలో సుసజ్జితమైన యుద్ధాశ్వాలను అధిరోహించి నడుపుతున్న అశ్వికులు; గుర్రాల కళ్ళేలు పట్టుకొని నిలుచున్నభటులు; అస్త్రశస్త్రాలు ధరించి యుద్ధోన్ముఖులయినవారు, యుద్ధంచేస్తున్న కరితురగ రథపదాతులు; అతిరథ మహారథులు; యుద్ధోత్సాహాన్ని ఉల్బణంచేసే నానావిధ వాద్యాలను వాయిస్తున్నవారు; శస్త్రాస్త్రయుద్ధం; ఖడ్గఖేటకదనం; తోమరభిండివాలాల భండనం; కుంజరాల ద్వంద్వయుద్ధం; రణభూమిలో శాకినిఢాకినుల నర్తనం. దాని పైవరుసలో పురాణేతిహాసకథల చిత్రణం; యక్షులు, గంధర్వులు, గరుడులు. ఆటుతర్వాతి వరుసలో దేవతలు; దశావతారాలు; బ్రహ్మవిష్ణు మహేశ్వరుల అనంతరూపాలు, వారి దేవేరుల అనంతరూపాలు; అనంతనాట్యాలు; వీటన్నిటినీ సుందరంగా, సౌమ్యకోమలంగా, అనంతానంతంగా తీర్చిదిద్దినారు; శిల్పాచార్యులు.

దేవాలయ నిర్మాణం ప్రారంభించిన ఐదు సంవత్సరాలలోనే దేవాలయాల లోపలిభాగమంతా సిద్ధమయినది; వెలుపలి ఈ అలంకారపు చెక్కడపుపని ఇంకెంతకాలం నడిచినా ముగిసేటట్టు కనిపించలేదు. వేలాపురి దేవాలయాల కళాకౌశలంకన్నా ఒకచేయి మిగులే - అనిపించినది ద్వారవతి జోడు దేవాలయాల సొబగు,

# 6

వేలాపురిలో, ఆనాడు, మహారాజ్ఞి శాంతల చెన్నకేశవస్వామిని ప్రతిష్ఠించిననాడు, గంగరాజులుగారు అక్కడే ఉండి, ఆ సాయంకాలానికే శ్రవణబెళగొళకు ప్రయాణమయినారు. మరునాడే వారు శ్రవణబెళగొళవద్ద చంద్రగిరి 'శాసనబసది'లో ఆదినాథజినుని ప్రతిష్ఠ చేయవలసి ఉండినది. గంగరాజగారు తమ తల్లి పోచికబ్బె పేరుతో ఈ బసదిని (జైనదేవాలయం) నిర్మించినారు. ఈ బసది ఆదినాథస్వామి సేవార్థం 'పరమ' అనే గ్రామం ధారపోయడానికి నిశ్చయించినారు. ఇది శాసనమయినప్పుడు ఈ బసదికి శాసనబసది అనే పేరు పడినది.

ఈ పరమగ్రామం విష్ణువర్ధన ప్రభువులు గంగరాజగారికి మాన్యంగా ఇచ్చినది. ఆదినాథస్వామి ప్రతిష్ఠ అతి వైభవోపేతంగా జరిగినది. ప్రతిష్ఠాపనోత్సవానికి ప్రభువులు, రాజమాత, శాంతల, లక్ష్మి విచ్చేసి మహోత్సవంలో పాల్గొని ఆనందించినారు. ప్రభువులు అక్కడి చైత్యాలయాలకు అప్పుడు విశేష ధనసహాయం చేసినారు.

మరునాడు ప్రభువులు వేలాపురికి మరలినారు. గంగరాజులుగారు వేలాపురిలో ఆగక సరాసరి రాజధానికే బయలుదేరినారు. ద్వారవతి చేరిన మీదట గంగరాజగారు తమ కుమారుడు బొప్పణ నాయకుని పిలిపించి, "ఏచణ్ణా, హొయిసళ రాజ్యద్రోహులను నాశనంచేసి, రాజ్యం విస్తృతంచేసి, నిరుపాధికంగాచేసి, దేశసేవ చేసిన ఈ ఖడ్గాన్ని ఇక నీవు పట్టుకో. ప్రభువులు నిన్ను ఇమ్మడి దండనాయకుడుగా నియమించడానికి అంగీకరించినారు. ఈ విషయాన్ని నాకు సంతోషంతో సెలవిచ్చినారు. నీవు ఆ స్వామి సేవను నాకంటె హెచ్చు శ్రద్ధాభక్తులతో చేయవలసినది." అని ఆశీర్వదించినారు.

ప్రభువులు రాజధానికి వెనుదిరిగిన మీదట ఒకనాడు బొప్పణ నాయకుడు ప్రభువుల సన్నిధికివచ్చి, భక్తి వినయాలతో నమస్కరించి, వారి చేతులనుంచే ఇమ్మడి దండనాయకపట్టం స్వీకరించి, తన



తండ్రిగారు మహాప్రధానులు కావడానికి ముందు ఏ వీరత్వంతో యుద్ధభూమిలో "ఏకైక వీరుడు" అనే ఖ్యాతిని గడించినారో, అలాటి కీర్తినే తానూ గడించి స్వామిసేవను త్రికరణ శుద్ధిగా నిర్వర్తిస్తానని ప్రతిన పూనినాడు. ప్రభువులు బొప్పణ నాయకునికి ఇమ్మడి దండనాయంకరపు ప్రశస్తిదండం అందిస్తూ, "ఏచణ్ణా, మేము ఈ రాజ్యానికి ప్రభువులమయినా, రాజ్యాన్ని సంపాదించిపెట్టి, దానిని మాకోసం రక్షించినవారు మీ అయ్యగారు. ఇటువంటివారి కుమారునికి ఇప్పుడు మేము ఇస్తున్న గౌరవం కొంచెమనే మా భావన. మీ తండ్రిగారి పదవికి నీవు ఎక్కరావలె. దానిని చూచి సంతోషపడేకాలం మాది కానీ." అని సెలవిచ్చి, ఆశీర్వదించి, ఇమ్మడి దండనాయంకరపు ప్రశస్తి దండం అందించినారు.

బొప్పణ నాయకుడు తండ్రివలెనే గుణశాలి; వీరుడు; ఉదారుడు; యుద్ధకళాకౌశలం, శస్త్రాస్త్రనైపుణ్యం తండ్రినుంచి నేర్చి, నిరంతరాభ్యాసంతో వాటిలో ఆదర్శసామర్థ్యం సంపాదించి, తన తండ్రిలోనే "భలే" అనిపించుకొనినవాడు; తండ్రితోపాటు ఒకటి రెండుసార్లు యుద్ధభూమికి వెళ్ళి, అక్కడగూడ తన ధైర్యసాహసాలను ప్రదర్శించినవాడు.

బొప్పణ నాయకుడు తత్‌క్షణమే తనసైన్య విభాగంపై అధికారం వహించి, ఆ సైన్యాలతోపాటు హొయిసళరాజ్యం పశ్చిమోత్తర పూర్వ సీమాప్రాంతాలలో సంచరించి, చుట్టుపట్టు సామంతుల, నాయకుల, పెగ్గడల పరిచయమూ, ఎల్లలలోని దేశాల పరిజ్ఞానమూ చక్కగా చేసుకొనినాడు.

పొరుగునఉన్న తలవనపుర ప్రభువు పెడుతున్న చిక్కులు ఉండనే ఉన్నవి. కేతమల్లుడు తనరాజ్యంవదలి హొయిసళరాజుల ఆశ్రయరక్షణలు పొందినాడని, తనకున్న యావదాస్తి తలవనపుర రాజ్యంనుంచి ఉపాయంతో హొయిసళ నాడుకు సాగించుకున్నాడని విని తలవనపురాధిపతి హొయిసళ ప్రభువులపై విషంకక్కినాడు; హొయిసళ

సైనికులే మారువేషాలతో కేతమల్లుని ఆలమందను, అశ్వసమూహాన్ని తలవనపుర విషయం సీమలను దాటించి హొయిసళ రాజ్యానికి తోలుకొని పోయినారన్న కల్లబొల్లిమాటలు విని, నిజమనే నమ్మి మండిపడినాడు. "పేడి కేతమల్లుడు, హొయిసళ రాజు వీపువెనుక దాక్కున్నాడు. మాకు అమ్మిన ఆలమందను, గుర్రాలను తనవని దొంగవలె దొంగతనంగా చేరవేసుకొనినాడు." అని తలవనపురాధిపతి పలికిన అనుచితవాక్కులు విని కేతమల్లునికి కోపం పెల్లుబికినది.

ఆక్షణమే కేతమల్లుడు విష్ణువర్ధన ప్రభువుల సన్నిధానం చేరి, "మహాప్రభూ, ఆ నీచుడు ఇలాటిమాటలు అంటున్నాడు. నానుంచి తమరు అఖిలుని పరుషవాక్యాలు వినవలసివచ్చినది. నాకు తమ సైన్యంలో ఒక అతి సామాన్యపదవి దయచేయించండి. తమ వీరహస్తంలో ఒక కరవాలాన్ని అనుగ్రహించండి. ఆ దుష్టుని తలను తెచ్చి అప్పగిస్తాను. దయచూడండి." అని విన్నవించుకొనినాడు. ప్రభువులు కేతమల్లుని పరాక్రమానికి, దైవభక్తికి, ఔదార్యానికి మెచ్చి, "మహాభాగులయిన మిమ్ముల్ని మేము చాల మెచ్చుకొనినాము. తలవనపురరాజుకు భగవంతుడు ఇకనైనా మంచిబుద్ధి ఇచ్చేదని మేము చాలకాలం వేచి చూచినాము. వాడు తన తప్పులను తెలుసుకోలేదు; తెలుసుకొనడానికి ప్రయత్నించనూలేదు. ఇలాటి వారికి దైవమైనా ఏమిసహాయం చేసీని ? వానికన్నా, వాని సహాయానికి నిలబడిన ఆ చోళ సేనాపతి అదియమాన్ క్రూరుడు, కపటి, శీలరహితుడు. వీరికి ప్రోత్సాహకులు ఆ చోళ సామంతులయిన రాష్ట్రకూటులు. ధర్మం కంటే దర్పమే గొప్పదని భావించేవారు వీరు. వీరందరి కుత్సిత కార్యాలు లోలోపలే జరుగుతున్నవి. ఈ అదియమాన్ పేరుకు తగినవాడు. అయితే వీడు ధర్మబాహ్యుడైన యముడు. మేము వేగులవారినుంచి సమాచారాలు తెప్పించుకొంటున్నాము. ధనానికి, దోపిడికి ఆశపడే పలువురునాయకులను ఈ రాష్ట్రకూటులు ఆ చోళులకు కట్టిపెట్టినారు. వారి ఉద్దేశం మరేదీ కాదు; హొయిసళ దేశప్రజలు తినడానికి కట్టడానికి చాలినంత ఉండి సంతోషంలో ఉండడమే వారికి సంకటం. హొయిసళ భండారంలో అపారమైన ధనరాశి ఉన్నదని వారితలంపు; నిరంతరచింత; ఈర్ష్య.



తలవనపురాధిపతితో మమ్ముల్ని చెనకి, మనం వానితో తలపడినప్పుడు, వెనుకనుంచి, కుడి ఎడమ వైపులనుంచి ఈ దారిదోపిడిగాండ్రను ద్వారవతి మీద నడిపించవలెనని సిద్ధపడుతున్నారు ఆ రాష్ట్రకూటులు. పెద్దయెత్తున ఈ కుట్ర జరుగుతున్నది. దీనికి తగినముందు జాగ్రతపనులను, ప్రతీకార చర్యలను మనం చాలతొందరలోనే ప్రారంభిస్తున్నాము. గంగరాజగారే ఈ విషయాలన్నిటినీ పర్యాలోచన చేస్తున్నారు. మన ముందటి విజయయాత్ర ఇక్కడనుంచే మొదలవుతుంది. మీసహాయం మాకు ఆవశ్యకం. తలవనపురవిషయం విషయాలన్నీ మీరు బాగా తెలిసినవారు. మన సైన్యానికి స్వాభావికమైన రక్షణానుకూల ప్రాంతాలను మీరు చూపించవలసి ఉంటుంది. సైన్యంలో మీకొక నాయకపదవి ఇవ్వడానికి నిశ్చయించినాము. దాని సూచనగా, ఇదిగో, ఈ ఖడ్గం మీకు అందిస్తున్నాము. దీనిని మీరు ధరించవలసినది." అంటూ వెండిఒరలో మిలమిల మెరిసే ఒక ఖడ్గాన్ని కేతమల్లునికి దయచేసినారు. కేతమల్లుడు ఇప్పుడు 'కేతమల్ల నాయకులు' అయినాడు. కేతమల్ల నాయకులు ఆ ఖడ్గాన్ని భక్తితో స్వీకరించి, "ప్రభువుల దివ్య సన్నిధానంలో నాది మరొకమనవి. ఇప్పుడు నేను కట్టిస్తున్న శివాలయాలు రెండింటిని తమరు ఒకటి, మహారాజ్ఞి ఒకటిగా స్వీకరించవలె. అలాగు అనుగ్రహిస్తే మహాదేవుడే స్వీకరించినాడని నాకు సంతృప్తి అవుతుంది. నేను ధన్యుణ్నవుతాను." అని విన్నవించుకొనినారు.

విష్ణువర్ధనులు :– (ఆశ్చర్యంతో) "నాయకులవారూ, ఇది కని విని ఎరుగని త్యాగం! మీ మహాకార్యం మీ పేరుతోనే మహాదేవునికి అర్పితం కానీ."

"ప్రభువులు సంకోచించరాదు. ఏ ప్రతిఫలానికీ నేను ఆశపడలేదు; ఆశపడేవాణ్ణీకాను. ప్రభువులకూ, మహారాజ్ఞికి సమర్పించవలెనన్న ఉద్దేశంతోనే ఈ దేవాలయాలు కట్టించడానికి ప్రారంభించినాను. హొయిసళేశ్వర శాంతలేశ్వర దేవాలయాలనే సంకల్పించి పనికి పూనినాను. తమయిరువురి దేహాలూ, ఆత్మలూ ఒక్కటే అనే ప్రతీకంగా రెండు దేవాలయాలనూ ఒకే దేవాలయం వలె కట్టించినాను. దీనిని ప్రభువులు

స్వీకరించకపోతే, ఈ కేతమల్లుడు తాను అతి నికృష్టుడనే భావించుకొంటాడు.''

"నాయకులవారూ, చాల నిర్బంధానికి లోబరుస్తున్నారు. దీనికి దేవేరులూ ఒప్పుకోవలె గదా? ఒకవేళ ఒప్పినా మా ఒక్క మాట మాత్రం మీరు గౌరవించి తీరవలసి వుంటుంది.''

"శిరసావహిస్తాను. ఒప్పజాలని మాటను ప్రభువులు ఎన్నడూ ఆనతీరని నా నమ్మిక.''

"దేవేరులు ఒప్పితే మేము ఒప్పినట్టే భావించవచ్చు. దేవాలయాల లోపలి పనులన్నీ పూర్తి అయినవన్న వార్త మాకు చేరినది. ఇక వెలుపలి పనులన్నీ మా పాలికి ఉండనీ. అంతయినా మా మనస్సుకు కొంతతృప్తి.''

"ఇంకా మూడుపాళ్లే పని అది. నంది విగ్రహాలు పూర్తికావలె. బహిరావరణపు పనులే దేవాలయాల సమస్త సౌందర్యం. ద్వారపాలకులు పూర్తికావలె; ప్రాకారం కావలె.''

"ఇంత మాత్రమైనా మా పాలికి వద్దా? ఇక మీరు నిశ్చింతగా ఉండవలె నాయకులవారూ!''

"ఈశ్వర సంకల్పం, ప్రభువుల చిత్తం. నా నోరు కట్టినది. ఈ పనులు పూర్తిచేసి, ప్రభువులూ, మహారాజ్ఞీ తమ అమృత హస్తాలతో మహాదేవుని ప్రతిష్ఠిస్తే నేనూ, నా గృహిణీ ధన్యుల మవుతాము.''

"నాయకులవారూ, మీ అభీష్టం ప్రకారమే మహాదేవుడు నడిపిస్తాడు. బొప్పణ దండనాయకునికీ, మీకూ పరస్పర ప్రీతి ఉందని విన్నాము. చాల సంతోషం. ఒక్కమారు గంగరాజులుగారిని దర్శించి. వారి ఆశీర్వాదాలూ పొందండి.''

"ఆ విషయం నేను గ్రహించినాను మహాప్రభూ. గంగరాజులుగారు నాకు దూరపు వారేమీకారు. నాపై వారికి ప్రీతి విశ్వాసాలున్నవి. నన్ను



ఆదరంతో ఆశీర్వదిస్తారు.'' అని కేతమల్ల నాయకులు ప్రభువులకు భక్త్యానందాలతో నమస్కరించి సెలవు తీసుకొని, నగరునుంచి బయలుదేరినారు.

# 7

చెన్న కేశవస్వామి ప్రతిష్ఠాపనోత్సవాలు ముగిసి ఏడెనిమిది నెలల కాలమయినది. గంగరాజ మహాప్రధానులు ఇరుగు పొరుగు రాజ్యాలకు పంపిన వేగులవారు గంగ, కొంగ, చెంగాళ్వ, కొంగాళ్వ, సింద, సంతార, కదంబ, చోళ, చాళుక్య, పాండ్య, చేర రాజ్యాలలో వివిధ వృత్తులలో జీవిస్తూ, ఉపాయంలో, శ్రమలో, అక్కడి రాజ్య విషయాలను తెలుసుకొని, గంగరాజులుగారికి వర్తమానం పంపేవారు.

కన్నడ చోళులు, తెలుంగు చోళులు, చాళుక్యులు కలిసి హొయిసళ రాజ్యం ముక్కలుచేసి, తమలో తాము పంచుకొనడానికి ఎత్తులు వేయడం గంగరాజులుగారికి తెలియవచ్చినది. చోళుల సైన్యాధిపతి అదియమాన్, దామోదరుడు, నరసింహవర్మ ఉత్తర దిక్కునుంచి హొయిసళ రాజ్యంపై దండెత్తి వచ్చేది గాను, ఆ సమయానికే తెలుంగు చోళులు కోలాలపురం వైపునుంచి, తమిళ చోళులు శాల్య (సేలం), కోయమత్తూరు వైపునుంచి, పశ్చిమంలో వున్న కొంగాళ్వులు, చెంగాళ్వులు పశ్చిమం వైపునుంచి—ఒక్కుమ్మడిగా హొయిసళ రాజ్యంపై దండెత్తి వచ్చేదని సన్నాహాలు జరుపుతున్నారు. ఈ వార్తలన్నీ ఎప్పటి కప్పటికి గూఢచారుల మూలంగా ప్రభువులకూ, గంగరాజులుగారికి తెలుస్తూనే ఉండేవి. అప్పుడు వర్షాకాలం.

ఇంతలో గంగరాజులుగారు అందరు సేనాపతులను, డణాయకులను (దండనాయకులను) ద్వారవతికి పిలిపించుకొని, "శత్రువులు దండెత్తి రావడానికి ముందే మనమే వారిని తుంటలు తుంటలుగా విరువవలె. చాళుక్యుల ఉపద్రటను కూకటివేళ్ళతో నాశనంచెయ్యవలె.'' అని

ఆలోచించి నిర్ధరించి, హొయిసళ సైన్యం సర్వసేనాధిపత్యాన్ని తామే నిర్వహించుకొనినారు. "ఈ వయస్సులో ఈ శ్రమ సాధ్య కార్యం మీరు చేకొనడం సర్వథా న్యాయంకాదు. ఈసారి మేము యుద్ధభూమికి తరలు తాము." అని ప్రభువులు గంగరాజలుగారితో అనినారు. దానికి గంగ రాజలుగారు ప్రఫుల్లవదనంతో "ప్రభువులు ఆలాగున దయచేయడం విజయలక్ష్మి మాతోపాటు దయచేసినట్లే అయినది. నేను కత్తిపట్టడం ఇదే తుదిసారి. దీనికి అడ్డు తేకండి. మనదేశం చుట్టూ బెబ్బులులు పెచ్చు పెరిగి పొంచి ఉన్నవి. వీటిని వేటాడి నిగ్రహించి తీరవలె. అంతవరకు నా ఈ కత్తిని ఒరలో పెట్టను." అని తమ కత్తిని ఒరనుంచి బిరానలాగి ప్రభువుల ఎదుట వీర ప్రతిజ్ఞ చేసినారు.

వర్షాకాలం గడిచినది. గంగరాజగారితోపాటు దండనాయకులయిన మారసింగమయ్య, పునీసనాయకుడు, బొక్కణనాయకుడు, కేతమల్ల నాయకుడు యుద్ధభూమికి తరలడానికి సిద్ధమయినారు. గంగరాజలుగారి పుత్రుడు బొప్పణనాయకుడు "నేనూ వెంటవస్తాను" అని తండ్రితో మనవి చేసుకొనినాడు. "రాజధాని రక్షణకు నీవు ఇక్కడే ఉండవలసినది." అని గంగరాజలుగారు అతనిని ఒక సుసజ్జితమైన సైన్యంతో ద్వారవతిలోనే నిలిపినారు.

దండయాత్రకు తరలిన సైన్యం సైనికులు పదిహేను వేలమంది. వీరికి తగిన సిబ్బంది, ఏనుగులు, గుర్రాలు, ఎడ్లు, పాడి ఆవులు, పనివారు, శస్త్రాస్త్రాలను పదును పెట్టి ఒదిగించేవారు, రణవైద్యులు, ప్రార్థనాదులు జరిపే కటకాచార్యులు, వంటవారు, సేవకులు, అందరూ చేరి ఈ సైన్యం సముద్రంవలె విస్తారమైంది. ఈ సైన్యం బయలుదేరడానికి ముందు ఆరు నెలలపాటు అహర్నిశం గంగరాజలుగారి నేతృత్వంలో కఠిన యుద్ధ శిక్షణ పొందింది.

విజయ దశమి సుముహూర్తంలో విజయ యాత్రకు బయలు వెడలడ మని నిశ్చయమయినది. ఈ ముహూర్తం ప్రభువుల జన్మతారకూ కలిసి వచ్చినది. బయలుదేరడానికి ముందు ప్రభువులు వినాయకుని, వాసంతికా



దేవిని, మహావిష్ణువును, మహేశ్వరుని పూజించి, శాంతలను, లక్ష్మిని చూచి వీడ్కోలు పొందడానికి వెళ్ళినారు. దేవేరులు ప్రభువులకు మంగళం కలుగనీ అని హారతి ఎత్తి రక్ష పెట్టినారు. శాంతల ప్రభువులకు విజయ మాలిక వేసి, పట్టాకత్తిని చేతికి అందించి, విజయం కోరినది. ఇతర దేవేరులూ ప్రభువులకు విజయం కోరినారు. ప్రభువులు అందరితోను ముచ్చటించి, తాము ఎంత దూరంలో ఉన్నా రాచనగరునుంచి, తాము విడిసిన చోటికి, అల్లే అక్కడి నుంచి నగరుకు తొందరగా వార్తలను తెప్పించుకొనడానికి, పంపడానికీ అంచెల ఏర్పాట్లు చేసినామని చెప్పి, తర్వాత రాజమాతను దర్శించి, ఆశీర్వాదాలు పొందడానికి బయలు దేరి నారు. రాజమాత పుత్రుని కౌగలించుకొని, తలపై చేయిపెట్టి "భగవంతుడు కాపాడనీ!" అని ఆశీర్వదించినారు. ప్రభువులు కుమార విష్ణువును పిలి పించి, నగరు, అంతపుర రక్షణం అతనికి ఒప్పించి, ప్రేమతో అతనిని కౌగిలించుకొని, పిదప గంగరాజులతోపాటు ఏనుగపై కూర్చుని, సైన్యం సిద్ధంగా ఉన్న కటక ప్రదేశానికి వెళ్ళినారు. దారి పొడుగునా నిలబడిన దళాలను కుశలప్రశ్న చేసినారు.

ఆవేళకు కటకాచార్యులు రణగంబం నాటి, పూజించి, విజయం కోరుతూ ప్రార్థనలు జరిపినారు. రణగంబంవద్దకు ప్రభువులు దయచేసి నప్పుడు మహావాద్యాలు మోగినవి; మహాహారతి వెలిగినది. అప్పుడు రక్త వర్ణ వస్త్రాలు ధరించి ఎర్రగన్నేరు పూలమాలలు అలంకరించుకొని, దేహ మంతా కుంకుమ పూసుకొని, కొత్తగా సానపట్టిన కత్తిని చేతపట్టుకొని, రణకేక వేస్తూ బోకిమయ్య ప్రభువుల ఎదుటికివచ్చి, సాగిలంపడినాడు; తర్వాత రణగంబానికి మూడుసార్లు ప్రదక్షిణంచేసి, బలంగా కేకవేసి నాడు. రణభేరి, కొమ్ము, కాహళి, తమ్మెలు, తుములు చెవులు చిల్లులు పడేటట్టుగా మోగినవి. అందరూ చూస్తూచూస్తుండగానే, బోకిమయ్య ఎడమచేత తన శిగను గట్టిగా పట్టుకొని, కుడిచేతి కత్తితో ఒక్కేవిసురుకు తన శిరస్సును ఛేదించుకొనినాడు. తలనుంచి విడిపోయిన మొండెం కుత్తుక నుంచి రక్తంచిమ్మన గోవినుంచి చిమ్మినట్టు పైకి చిమ్మినది. తల రణగంబం మొదలుకు దొర్లినది. మొండెం పది పన్నెండు అడుగులు గంతికుసి పడినది.

సైన్యమంతా మహాధ్వనితో జయజయకారం చేసినది. ఆ మహాధ్వనికి గుర్రాలు సకిలించినవి; ఎడ్లు, ఆబోతులు రంకవేసినవి; ఏనుగులు ఘీంకరించినవి. రణవాద్యాలహోరు మిన్నుముట్టినది.

'రణబలి' అయిన బోకిమయ్య భార్యపిల్లలకు ప్రభువులు ఒక గ్రామాన్ని ఉంబలిగా దయచేసినారు. రణబలి అయిన బోకిమయ్య పేరుతో వీరగల్లు నాటించినారు. బోకిమయ్య వీరస్వర్గానికి చనినాడు.

ప్రభువులూ, గంగరాజులవారూ కూర్చున్న మహాదంతి తొండం పైకెత్తి రణోత్సాహంతో పెద్దపెట్టున ఘీంకరించి, వేగంగా ముందుకు నడిచినది. దానివెంటనే హొయిసళ మహాసేన ప్రళయజలధి ముంచుకు వచ్చినట్టు శత్రురాజ్యాలపై దాడికి బయలువెడలినది.

కొన్నినాళ్ళు పయనించి హొయిసళ సేన తలవనపురంవద్ద కావేరి ఈవలిగట్టున విడిసినది. అప్పటికి రాష్ట్రకూటులు, గంగులు చోళుల సామంతులయినారు. తలవనపురాధీశుడయిన గంగరాజు దామోదరుడు తన సహాయునికి చోళుల ప్రచండసేనాపతి అదియమాన్‌ను పిలిపించుకొనినాడు. అదియమాన్ మహాసైన్యంతో కావేరి ఆవలిగట్టునఉన్న తలవనపుర రక్షణకు సిద్ధుడై నిలబడినాడు.

"నీవు మాకు శరణాగతుడుకావడం లెస్స." అని గంగరాజులుగారు దామోదరగంగునికి, అదియమాన్‌కు చెప్పంపినారు. "యుద్ధంచేసి గెలుచుకోండి." అని సమాధానం పంపినాడు అదియమాన్. హస్తకార్తి, చిత్తకార్తి వర్షాలు పిచ్చిపిచ్చిగాకురిసి, హెచ్చుప్రవాహంలో ఉంది అప్పుడు కావేరి. ఇదే అదియమాన్‌కు, దామోదరునికి ఎక్కువ ధైర్యమిచ్చినది.

అంత పూర్ణప్రవాహంలోఉన్న కావేరినిదాటడానికి ఉద్యమించడం కేవలం వెర్రిసాహసమని గంగరాజుగారికి తెలిసినా, ప్రవాహం తగ్గేటంతవరకు కాలహరణంచేయడం పేడితనమని తోచినది. అంతలో, నదినిదాటే పనికోసం పంపిన నాయకులువచ్చి, "శివసముద్రంకడ ఒకచోట ప్రయత్నంతో దాటడం సాధ్యం." అని వర్తమానం తెచ్చినారు.



భీష్ములవారూ, ప్రభువులు ఆ వేళనే నదిలో స్నానంచేసి, "దారి చూపు తల్లీ!" అని కావేరిని ప్రార్థించి, భక్తితో ఉపవాసవ్రతం ఆచరించి, ధ్యాననిమగ్నులయినారు. సాయంకాలానికి అందరికీ ఆశ్చర్యంకలిగేటట్టు నదిలో నీరు ఒకధనుస్సుప్రమాణం తగ్గినది. రాత్రికి మరొకమూరెడు తక్కువకావచ్చుననే విశ్వాసమూ కనిపించినది. దైవం తమపాలిట ఉన్నాడని హొయిసళ సైన్యానికి ధైర్యంకలిగింది.

అర్ధరాత్రికి కొంచెం ముందుగనే నదిప్రవాహం ఇంకా ఒకమూరెడు దిగిపోయినది. గంగరాజుగారు అప్పుడు సేనను రెండుభాగాలుచేసి, ఒకభాగం పునీసనాయకుని అధీనంలోపెట్టి, శివసముద్రందగ్గర జాగరూకతతో, సురక్షితంగా, తెల్లవారేముందే కావేరిదాటి, ఆవలిగట్టుచేరి, సూర్యోదయమయిన మూడు నాలుగు గడియలలోగా, అదియమాన్ సైన్యాన్ని వెనుకప్రక్కనుంచి బలంగా ముట్టడించి ముట్టుపెట్టవలెనని కట్టానతిచేసి, తక్కిన సగంసైన్యాన్ని, బరువైన రథాదిసామగ్రిని తాము విడిసిన చోటినుంచే దాటించే మహోద్యమానికి తామే పూనుకున్నారు.

ఎత్తైన నాలుగు నాయకగజాలనుఎన్నుకొని, వెడల్పాటి పలకలను తెప్పించి రంధ్రంవేసి వాటి దంతాలకుఅమర్చి, ఆ పలకలను వాటిమెడకు వెనుకనుంచి బిగించికట్టి, శత్రువుల బాణాలలో, వాటికిగాని, వాటి వెనుక సాగివచ్చే సైన్యానికిగాని ఏలాటి అపాయమూ లేకుండాచేసి, ఆ చీకటిలోనే, నెమ్మదిగా నదిలోదింపి, ఆవలిగట్టువరకు నడిపించి, గట్టుమీది అడవిమరుగున ఒకచోట నిలిపించినారు. తక్కిన ఏనుగులతో గట్టుమీది చెట్లను, మానులను కూల్పించి, ఆ మానుమొద్దులను నదిలో గుండ్లు బండలు ఉన్నచోట సందులలో ఇరికించి కట్టినారు. ప్రతిసైనికుడు ఇసుక మోసుకొనివచ్చి నదిపొడుగునా పోసినాడు. నదిలో ఈవిధంగా ఒకదారి కల్పించుకొనినారు. నదిలో ప్రవాహమూతగ్గినది. సామాగ్రినంతా ఎడ్లమీద, గుర్రాలమీద, ఆవలిగట్టుకు సాగించినారు. పనేమో మహాకఠినం. ఎంత కష్టమయినా, ప్రభువులుగాని, గంగరాజులుగారుగాని వెనుదీసే స్వభావంకలవారు కారు.

తెల్లవారడానికిముందే హొయిళసైన్యం సద్దులేకుండా ఆవలిగట్టు చేరి .అడవిలో మానులనుసుకున సిద్ధంగాఉన్నది. హొయిళసైన్యమంతా నదిదాటి వచ్చినతర్వాత అదియమాన్ సేనాపతి మేల్కొన్నాడు. ప్రవాహపూర్ణమైనకావేరిని ఒక పెద్దసేన నీటిలోదిగి దాటడం అసాధ్యమని అదియమాన్ నిశ్చింతగా తన శిబిరంలో పడుకొనినాడు. హొయిళసైన్యం నదిదాటి తలవనపురంవైపు వస్తున్నది.''అన్న వార్తవిని అతనిధైర్యం సగం కుంగిపోయింది. ''ఏనుగులే ముక్కలై కొట్టుకొనిపోయే ఈ ప్రవాహంలో సేనలు ఎలాగు దాటివచ్చినవి ?'' అన్నది అతనికి ఎప్పటికీ ఆశ్చర్యంగానే ఉండిపోయినది.

భళ్లున తెల్లవారడమే తడవు, రెండు సేనలు జీవితాశను వదలి భయంకరంగా యుద్ధానికి తలపడినవి. ఇరువైపులా ఘోరనష్టం కలిగినది. అప్పటికి సూర్యోదయమై ఐదు గడియల కాలమయినది. శివసముద్రం వైపునుంచి నది దాటివచ్చిన పునీసనాయకుని కింది సైన్యం అదియమాన్ సైన్యాన్ని వెనుకనుంచి బలంగా ముట్టడించినది. రెండు సైన్యాల ఇరుకులో చిక్కుకున్న అదియమాన్ సైన్యం నుగ్గునూచమై పోయినది. భీష్ములవారి యుద్ధనైపుణ్య ప్రభావం అదియమానునికి అప్పుడు తెలియవచ్చినది. అదియమానుకు దిక్కుతోచలేదు. ఏలాగునో తప్పించుకొని రణభూమినుంచి పరుగెత్తినాడు. దామోదరుని మూడుపాళ్ళ సైన్యాన్ని హొయిసళ సైన్యం ముక్కలు ముక్కలుచేసి నదిలో విసిరి వేసినది. పాలు నురుగువలె వున్న కావేరి నీరు ఎర్ర నీరయినది. దామోదరుడు ప్రాణాలు దక్కితే చాలునని నగరులో తన భార్యలను, పిల్లలను వదలి పారిపోవడానికి సిద్ధపడుతున్నాడన్న వార్త హొయిసళ స్కంధావారానికి చేరినది. తత్‌క్షణమే కేతమల్లనాయకులు తమకింద దళాలతో వాయువేగంతో తరలి వెళ్ళి నగరును చుట్టుకట్టి ముట్టడించినారు. దామోదరుడు ఒక రహస్యమైన సురంగ ద్వారంగుండా తప్పించుకొని గుర్రమెక్కి పారిపోతూ దురదృష్ట వశాన కేతమల్లనాయకుల కంటపడినాడు. కేతమల్లనాయకులు దామోదరుణ్ణి తరుముకొని వెళ్ళి, పరిగెత్తుతున్న అతని గుర్రాన్ని పొడువైన బల్లెంతో పొడిచినాడు. దెబ్బతిన్న గుర్రం దామోదరుణ్ణి కిందికి పడదోసి



పరిగెత్తినది. కేతమల్లనాయకులు తమ గుర్రం మీదనుంచి కిందికి దూకి ''భార్య పిల్లలను వదలి పారిపోతున్న పేడి నీవు. ఇదిగో చూడు, నేను కేతమల్లుణ్ణి. పేడి కాదు. నీవిక ఎక్కడికి పోతావు ? తప్పించుకొని పరిగెత్తడం ఇతరుల సొత్తును అపహరించేటంత సులభంకాదు.'' అంటూ దామోదరుని తలను తమకత్తితో ఒకే దెబ్బకు మొండెంనుంచి వేరుచేసి, ఆ తలను తమ బల్లేనికి గుచ్చుకొని, పట్టణవీథులలో ఊరేగించి, తర్వాత హొయిసళేశ్వరుల పాదాలకడ దొర్లించి, ''ప్రభూ, ఇదిగో నా కానుక!'' అని అర్పించినారు. నాయకుల హఠం అలాంటిది! ప్రభువులు కేతమల్ల నాయకుల సాహసానికి మెచ్చి, ఆక్షణమే వారిని దండనాయక పదవిలో గౌరవించినారు.

చోళ గంగరాజుల తలవనపుర విషయం విష్ణువర్ధనుల దయినది. అపార యుద్ధ సామగ్రి, ధనధాన్యాలు, దామోదరుని సమస్త భండారము హొయిసళ ప్రభువులవే అయినవి. ఆదినమే ప్రభువులు తమ ప్రప్రథమ విజయ స్తంభం స్థాపించి, ఆ స్థలంలోనే కీర్తినారాయణ దేవాలయం నిర్మించ వలసినదని ఆజ్ఞచేసి, తలవనపురాన్ని తగిన రక్షణ సైన్యంతో తమ నాయకులలో ఒకరి రక్షణలో ఉంచి, వెన్నుచూపి పారిన అదియమాన్ చోళ సేనాపతిని వెన్నంటి మరునాడే అక్కడినుంచి త్వరగా బయలు దేరినారు.

అదియమాన్ పరిగెత్తి పరిగెత్తి దారిలో చోళుల సామంతుడు నరసింహవర్మ ఆశ్రయం జొచ్చినాడు. నరసింహవర్మ హొయిసళుల బల పరాక్రమాలు తెలియక అడ్డుతగిలి నిలబడినాడు. రెన్నాళ్లలో వాని సైన్యం నాశనమైపోయినది. విష్ణువర్ధనుల ఖడ్గపుదెబ్బకు నరసింహవర్మ తల రెండు తుండెములయినది. అదియమాన్ అక్కడినుంచి కంచికి పరుగిడి నాడు. హొయిసళ సేన అక్కడా వానిని వదలలేదు; వెన్నాడినది. రణ మత్తులయిన, విజయ మత్తులయిన హొయిసళ సైనికులకు ఇప్పుడు అడ్డేమి? ఆటంకమేది ? అదియమాన్ అక్కడినుంచి ముందుకుసాగి వెలుపల ఎవరికీ కనిపించక ఎలుకలు, పందికొక్కులవలె భూమిలోనే దాక్కున్నాడు.

ప్రభువులు తమ తండ్రి ఎరయంగ ప్రభువులవలె కంచి వరదరాజస్వామికి, కామాక్షీదేవికి వస్తువస్త్రాలంకారాలు సమర్పించినారు. ఆ సమయంలోనే ప్రభువుల బొక్కసపు ధనం నుంచి, మేలుకోటలో చెలువనారాయణస్వామి దేవాలయమూ నిర్మించబడుతూ ఉండినది. శ్రీరంగపట్టణం సమీపంలోని తొండనూరులోను నారాయణ దేవాలయం నిర్మాణంలో ఉండినది. ప్రభువులు మేలుకోటలోని శివాలయానికీ అప్పుడు ధన మాన్యాలు దత్తంచేసినారు. ఇట్టి సర్వమత సమదృష్టి గలవారికి, భేదరహితులకు, దైవాన్ని సర్వవస్తువులలోను కనినవారికి విజయలక్ష్మి సిద్ధించడం ఏ మాశ్చర్యం ?

ప్రభువులు కంచి నుంచి మధుర వైపు బయలు వెడలి, అక్కడి పాండ్యరాజుతో కప్పం పొంది, అక్కడినుంచి దక్షిణ సముద్రంచేరి, అక్కడ తమ కీర్తిస్తంభం నాటి, మరల కంచికి మరలివచ్చి, దేవాలయంలో ఉన్న మహాదుందుభిని మ్రోగించినారు. దాని అర్థం "హొయిసళుల రాజరికాన్ని దక్షిణపు రాజులందరూ ఒప్పవలె." అని. దీనివల్ల దక్షిణంలోని అధిపతులందరికీ క్రోధాసూయలు కలిగినవి. కొంగు దేశ రాజుకు విపరీతంగా కోపం వచ్చినది.

విష్ణువర్ధన ప్రభువులు కంచినుంచి కోళాలపురానికి వచ్చినారు. కోళాలపురం, నంగలి, నోళంబవాడి, గంగవాడి పాలకులు శరణుజొచ్చినారు. ప్రభువులు అక్కడి చోళసామంతులను పిలిపించి, వారిని తమ సామంతులుగా చేసుకొని "ధర్మంతో చక్కగా రాజ్యం నడిపించుకొని రండి." అని బుద్ధిచెప్పి, వారి రాజ్యాలను వారికే అప్పగించి, అక్కడి న్యాయరీతి నీతులను క్రమపరిచేభారం గంగరాజులుగారికి అప్పగించినారు. ప్రభువులు కొంతకాలం కోళాలపురంలో ఉండి, పునీసనాయకునికి మహాసైన్యం అప్పగించి, "ఆళ్వఖేడ, చెంగాళ్వ, తొడవ, కేరళరాజులను జయించిరా !" అని ఆనతిచ్చిపంపి, తాము హంజేరిమీదికి సైన్యాలు నడిపించినారు. అక్కడి చోళ సామంతుడు ఇరుంగోలరాజు విష్ణువర్ధనులకు శరణాగతుడయినాడు. ప్రభువులు వానిని గౌరవించి ధర్మంతో



దేశాన్ని పాలించవలసినదని ఆజ్ఞాపించి, ముందుకు చేర, పల్లవ రాజుల మీదికి దండెత్తడానికి ఏర్పాట్లు చేయసాగినారు.

చేరరాజుల రాయరాయపురం హొయిసళుల వశమయినది. పల్లవుల పొగరు అణచి, చక్రగొట్టపాలకుడు సోమేశ్వరుని గెలిచి, సామంతునిగా చేసుకొని, ఓఢ్రదేశపు ఎల్లలకు వెళ్ళి, పూర్వసముద్ర తరంగావళిలో తమ కీర్తి స్తంభం నాటి – ప్రభువులు ఈ విధంగా దక్షిణ పూర్వదేశాల దిగ్విజయం పూర్తిచేసినారు.

సైన్యంతో వెడలిన పునీసనాయకుడు, కేతమల్లు నాయకులు చెంగాళ్వ పరిపాలకులను గెలచి, తుళుప్రభువులను ఓడించి, నీలపర్వతం చేరి, పర్వతశిఖరంపై హొయిసళపతాకం ప్రతిష్ఠించి, అక్కడినుంచి బయలుసీమకు దిగి, కోయముత్తూరును స్వాధీనపరచుకొని, అపార ధనధాన్యరాసులను తెచ్చి ప్రభువులకు అప్పగించినారు.

అప్పటికి ప్రభువులు రాజధానినుంచి బయయిదేరి మూడు సంవత్సరాలయినది. రాజధాని బొప్పణ, కుమారవిష్ణువుల రక్షణలో ఉన్నది. నగరు వ్యవహారాలన్నీ మహారాజ్ఞి శాంతలదేవే నిర్వహించేవారు. పది పన్నెండు నాళ్ళ కొకమారు యుద్ధభూమినుంచి రాజధానికి తప్పక సమాచారాలు చేరేవి. రాజధానినుంచి యుద్ధభూమికి వస్తువులు సాగనంపడం, క్షేమ వార్తలు తప్పకపంపడం అంత తొందరగానే జరిగేవి.

కుమారవిష్ణువుకు ఇప్పుడు పదహారు పదిహేడేండ్ల ప్రాయం. శస్త్రాస్త్ర పారంగతుడు, శాస్త్రాధ్యయన సంపన్నుడూ అయినాడు. ప్రభువులవలె మహాశూరుడు, అతిధైర్యశాలి, వివేచనపరుడు, అక్కయ్యకు కుడిచేయి; రాజమాతకు జీవం. శాంతలదేవి ప్రతిశుక్రవారమూ ఓలగంలో సింహాసనం అలంకరించి, రాజ్యపరిపాలన వ్యవహారాలను విచారణచేసి, విమర్శించి, ఉత్తమమైన మంత్రాలోచన తెలిపేది. హేమాద్రి పండితులు ఆమె ఆలోచనలను, అభిప్రాయాలను మనసార గౌరవించేవారు. పెక్కువేళల్లో శాంతలదేవి చాల చిక్కైన న్యాయసూక్ష్మాలను పరిష్కరించి, అభియోగాల తీర్పిచ్చేవారు. లౌకికవిషయాలనూ ధర్మదృష్టితో కొలిచే

ఆమెకు తీర్పులివ్వడం కష్టమయ్యేదికాదు. తప్పుచేసినవారికి శిక్షవిధించడం కంటే, వారిలో వివేచనజ్ఞానాన్ని, ధర్మదృష్టినీ కలిగించి, వారిని ఉత్తమ ప్రజలుగా ప్రవర్తించేటట్టు చేయడానికి ఆమె సర్వప్రయత్నాలూ చేయడం అతి శ్లాఘనీయమయినది.

ఒకమారు దేవణ్ణఅనే నాగరికుడు భండారి ఆదియణ్ణ అనేవానికి తనభూమిని విక్రయించినాడు. దేవణ్ణ మరణించినమీదట అతని పుత్రులైన నాగణ్ణ, సోమణ్ణ-అనేవారిద్దరూ తమతండ్రి దేవణ్ణ పిత్రార్జితమైనఆస్తిని భండారి ఆదియణ్ణకు విక్రయించడం తమకు తెలియదని వ్యాజ్యం తెచ్చినారు. ఈ వ్యాజ్యం శాంతల మహారాజ్ఞి సముఖాన తీర్పుకువచ్చినది. భండారి ఆదియణ్ణ అనినాడు : దేవణ్ణ ధనంకోసం చాల చిక్కులు పడుచున్నప్పుడు తాను ఇరవై గద్యాణాల సొమ్ము యిచ్చి, అతని భూమిని కొనినాను-అని, ఇప్పుడు ఆభూమికి చాల వ్రయంచేసి బాగుచేసుకొన్నాను–అని...మహారాజ్ఞి శాంతల నాగణ్ణ సోమణ్ణలను, "నాగరికులారా, మీతండ్రి దేవణ్ణ ధర్మిగా బ్రతికినాడా? అథవా అధర్మిగా బ్రతికినాడా? అని ప్రశ్నించినది. దేవణ్ణ కుమారులు ఒక్కరిముఖం ఒక్కరు చూచుకొనినారు...నాగరిక దేవణ్ణ ధర్మిగానే మనుగడ సాగించినాడన్న సంగతి లోకానికితెలుసు, శాంతలకూ తెలుసు. ధర్మానికి, సత్యానికి ఏకాలంలోను చ్యుతి కలుగరాదనే దృఢవిశ్వాసం ఆమెకు ఉండినది. "మాతండ్రి ధర్మిగాను, శీలవంతుడుగాను బ్రతికినాడు." అని సమాధానమిచ్చినారు పుత్రులు. అప్పుడు శాంతల మహారాజ్ఞి అనినారు : "అట్టి ధర్మిసంతానానికి చెడుగెప్పుడూ కోరిఉండడు. న్యాయమైన వెచ్చాలను సర్దుకొనడానికి భూమిని విక్రయించి ఉంటాడు. అట్టి తండ్రిచేసినపనిని కుమారులు గౌరవించవలె. మీకు వ్యవసాయానికి భూమిలేకపోతే, దేవాలయానికి చెందిన కూన్యమాన్యాలను మేము ఇప్పిస్తాము. అన్నదమ్ములు అన్యోన్యంగాఉండి, ఈ జీవనోపాయాన్ని భగవంతుడే కరుణించి ఇచ్చినాడని భావించి, కష్టపడి వ్యవసాయంచేసి, దేవునిసేవకు సగం అప్పగించి, మిగిలినసగం మీరు సమంగా పంచుకోండి." అని తీర్పుచెప్పినది. ఈవిధంగా శాంతల మహారాజ్ఞి ఆయిద్దరు యువకులలోను దైవభక్తి విత్తి, న్యాయధర్మాలు పెంచి, వారిని సజ్జనులుగా చేసినది.

# 8

హొయిసళేశ్వరులు రాజధానినుంచి చాలదూరంలో ఉండే ఈలాటి సమయం కోసమే నిరీక్షిస్తున్న కొందరు మలెపలు (పర్వత ప్రాంతవాసులు) హొయిసళ రాజధాని ఇప్పుడు రక్షకులులేని ఊరని భావించి, తమ ఉద్దేశసాధనకు ఇదే తగిన సమయమని తలచి, యుద్ధతంత్రమేమీ తెలియని ఆటవికులను కూడగట్టుకొని, ద్వారవతిని కొల్లగొట్టడానికి వచ్చినారు.

రాజధానిని రక్షించడానికి బొప్పణనాయకుడు సిద్ధంగానే ఉన్నాడు. మలెపవారు హొయిసళనాడు రాజధాని రక్షకులే లేనినాడని అనుకున్నారు. ఆసమయంలోనే పునీసనాయకునితో ఓడిపోయిన కొంగు దేశపాలకులు ఒక్కటై సైన్యసామగ్రులను కూర్చుకొని, శాల్య (సేలం) హొసూరు మార్గంగా పయనించి, నెలమంగలం దాటి హొయిసళనాడు ప్రవేశించినారు. కొంగుల సైన్యం భయంకరంగా ఉండినది. పెక్కు ఏనుగులు, అశ్వసైన్యం వారికి ఉండేవి. హొయిసళ దేశాన్నంతా కాల్చి బుగ్గ చేద్దామనే బయలుదేరి వచ్చినది ఆసైన్యం. పడమటి వైపునుంచి కొండవారూ (మలెపలు), పూర్వదక్షిణ దిక్కులనుంచీ కొంగు సైన్యం రాజధానిని ముట్టడించడానికి సాహసపడి వస్తున్నారన్నవార్త రాజమాత చెవిలోను పడినది.

విష్ణువర్ధన ప్రభువు అప్పుడు రాజధానికి చాలదూరంలో ఉన్నారు. గంగరాజులుగారు తాము జయించిన రాష్ట్రాలకు దక్షులయినవారిని నియమిస్తూ ఆయా దేశాల స్థితిగతులను కూలంకషంగా విచారించి, తృప్తికరమైన ఏర్పాట్లు చేయడంలో నిరతులై ఉన్నారు. "ఈ కొత్తదేశాలలో నరులకంటే కిరాతులే హెచ్చుగా ఉన్నారు." అని గంగరాజులుగారు ప్రభువులకు వ్రాసి పంపినారు. "దైవంపై భక్తి, ధర్మంపై శ్రద్ధ—ఈ రెండూ నశించిన దేశం నశించి పోయినట్లే." అని గంగరాజులుగారు తెలిపినారు.

ప్రభువుల స్థలం ఇప్పుడు రాజధానికి బహుదూరంలో ఉన్నందున ప్రభువులు రాజధానికి మరలవలెనని ఒకసారి నిశ్చయించినారు; లేక దైవమే ఆయోచనను వారికి కలుగ జేసినది. కొద్దిపాటి సైన్యంతో రాజధాని మార్గం పట్టినారు. ఎంత వేగంగా ప్రయాణం చేసినా, రాజధానికి పదిహేను నాళ్ల ప్రయాణం అవసరం.

ఇక్కడ రాజమాత, శాంతల, లక్ష్మి, బొప్పణనాయకుడు, కుమార విష్ణువు, గంగరాజులుగారి పత్ని లక్ష్మిమతి దండనాయకి, ఒకరిద్దరు రాజ్య పరిపాలనాధికారులు, నలుగురు మంత్రులు నగరులో సభగూడి, ఈ సన్నివేశంలో తమ కర్తవ్యమేమని నిర్ణయించడానికి మంత్రాలోచన జరిపినారు. అదివరకే, ప్రభువుల వద్దకూ, గంగరాజుల వద్దకూ తగిన సైన్యంతో చాలినంత త్వరలో రాజధానివైపు రావలసినదని, ఒకవైపు కొండవారు, మరొకవైపు మహాసేనతో కొంగులూ రాజధాని మీదికి వస్తున్నారనీ.'' సమాచారం పంపడమైనది. అప్పుడు యుద్ధభూమి ఎంత దూరమున్నా గవ్యూతికి ఇద్దరు వంతున అశ్వికులయిన వార్తాహరులను ఏర్పాటు చేసినారు. ఇట్లున్నప్పటికీ ప్రభువులకు ఈవార్త తెలియడానికి మూడు దినాలు పట్టినది.

బొప్పణనాయకుడు నగర రక్షణకు ఉన్న ఐదారువేల మంది సైనికులను సిద్ధం చేసుకొనినాడు. ''పదిహేను ఇరవై నాళ్ళవరకు ఎంతటి తీవ్రమయిన ముట్టడినైనా ఆపగలను. అంతలోగా అయ్యగారయినా, ప్రభువులయినా రానేవస్తారు. లేకపోతే, మారసింగమయ్య మామయ్యగారుగాని, పునిసనాయకుడుగాని రానే వస్తారు. మనకు ఎలాటి భయమూ వద్దు.'' అనినాడు బొప్పణనాయకుడు మంత్రాలోచన సభలో. ''అంతఃపురమంతా వేలాపురానికి తరలడం మేలు.'' అనినారు ఎవరో ఒక్కరు. ''అది పేడితనం. ఆ ఊరయినా మనకు ఎలాగు రక్షణ ఇస్తుంది? శత్రువులు ఆ ఊరికి రాలేరా? ప్రజలను శత్రువులకు అప్పగించి, రాజధానిని వదలి పరిగెత్తి పోయిన పేడివారికి, పిరికివారికి విజయనారాయణు డెన్నటికీ ఆశ్రయ మివ్వడు.'' అన్నది లక్ష్మి. ''చక్కగా అనినావు లక్ష్మి.'' అన్నది శాంతల. కుమారవిష్ణువు చాలసేపు తనలో తానే యోచిస్తూ, తుదకు



బొప్పణనాయకుని చూచి, ''అన్నయ్యగారు సెలవివ్వనీ! ఎనిమిది నాళ్ల నగరరక్షణకు తక్కువకు తక్కువగా ఎంత సైన్యం కావలసి ఉంటుంది? కొండవారి సైనికులంతా చేరినా ఆరువేల మందికి మించరు. వారైనా అస్త్రశస్త్రాలులేని ఆటవికులు. మనకు సహాయం రావడానికి ఎనిమిది పదినాళ్ళయినా కావచ్చు ననుకొందాము.'' అనినాడు.

బొప్పణనాయకుడు:–''కోట అగడ్తనిండా నీరు పారించి, నగరాన్ని రక్షించుకొనడానికి కనిష్ఠపక్షం రెండువేల మంది సైనికులయినా కావలె. కోటమీద చుట్టూ సైన్యం నిలిపితే, కోటలో బలమైన సైన్యం ఉన్నదనుకొంటారు. కొండవారికి ఎక్కువగా బెదరవలసినదిలేదు. దండెత్తి వస్తున్న కొంగు సైన్యంలో ఏనుగులు, గుర్రపుదండూ, కాల్బలమూ హెచ్చుగా ఉన్నట్టువార్త. అంతేకాక వారివద్ద శస్త్రాస్త్రాలు కావలసినన్ని ఉన్నవట.''

కుమారవిష్ణువు :– ''ఈ శత్రుసేనలు దగ్గరికి వచ్చి ఒక్కటయ్యే వరకు మనం వ్యవధి ఇవ్వరాదు అన్నయ్యగారూ. నగరంలోని జనులకు భయం కలుగరాదు. అందువల్ల అన్నయ్యగారు, వేలాపురి ప్రజలకు ధైర్యం చెప్పడానికి ఐదునూరు మంది సైనికులను పంపి, రెండువేలమంది సైనికులను మీవద్ద సిద్ధంగా పెట్టుకోండి. ఆ కొండవారిని రాజధాని వరకూ రానివ్వకండి. వేలాపురి వైపునుంచి, ఇక్కడినుంచి, సైన్యం చుట్టుముట్టి వారి నాయకుడు పిల్లై నిలవకుండా వేటాడండి. నేను మూడువేలమంది సైనికులను తీసుకొనివెళ్ళి ఆ కొంగులను దూరంలోనే సహాయం ఒదిగే వరకు ఆపుతాను.''

బొప్పణనాయకుడు ''ఈ పిల్లవానితో ఇది సాధ్యమా?'' అనుకొని, ''ఇద్దరూ కలిసి నగరాన్ని రక్షించడం మంచిది కదా? అంతలో సహాయం రానే వస్తుంది.'' అన్నాడు.

కుమారవిష్ణువు :– ''మీ అయ్యగారుగాని, మా అప్పాజీగాని పిల్లవాళ్లు పిరికివారని, కోటలో దూరుకున్నారనీ అనుకోరాదు గదా!''

శాంతలకు కుమారవిష్ణువును కౌగలించు కొందామన్నంత ఆశ కలిగినది. బొప్పణనాయకుని నోరు కట్టినది. రాజమాత : "మన విష్ణువు మాట చెన్నమ దండాధీశ్వరుల వీర రక్తానికి సాక్షి. వాడన్నట్టు శత్రువులను రాజధాని వరకు రానివ్వగూడదు. నగరవాసులకు భీతి ఏర్పడరాదు. సైనికులలోను అధైర్యం పుట్టరాదు. దీనికి తగిన యోచనలు మీలో మీరే నిర్ధరించుకొని, తర్వాత మాకు తెలుపండి." అని చెప్పి యోచనతో తమ విశ్రాంతి గృహానికి వెళ్ళినారు. మిగిలినవారు శాంతల, లక్ష్మి, బొప్పణనాయకుడు, కుమారవిష్ణువు- వీరే. అక్కయ్య లేచివచ్చి తమ్ముణ్ణి చాల ప్రీతితో కౌగలించు కొన్నది. కుమారునికి మహానందమయినది.

నలుగురూ చాలసేపు చర్చించి, తుదకు కుమారవిష్ణువు చెప్పిన మాటనే ఒప్పినారు. ఆరాత్రే వేయిమంది సైనికులను బొప్పణనాయకుడు సకల శస్త్రాస్త్రాలతో వేలాపురికి పంపి, ఆ వైపునుంచి కొండవారిమీద పడవలెనని తెలిపి, ఐదువందల మంది సుసజ్జిత సైనికులను రాజధాని ఆపద్రక్షణకు పెట్టి, వేయిమందిని తాను నడిపించుకొని, తెల తెలవారే లోపల రాజధానివదలి వెళ్ళినాడు. "మీ అయ్యగారుగాని, మాఅప్పాజిగాని పిల్లవాళ్లు పిరికివారని, కోటలో దూరుకొన్నారనీ అనుకోరాదు గదా!" అని కుమారుడు అన్నమాట బొప్పణనాయకుని గుండెల్లో నాటి నిలచినది. బొప్పణనాయకుడు తండ్రివలె సాహసి, చిన్నప్రాయమువాడు. సైన్యాలను చతురతతో నడపడం, యుద్ధం చేయడం అతనికి వంశపరంపరగా వచ్చినవి.

బొప్పణనాయకుని రెండు సుశిక్షిత సైన్యాలు కొండవారిని దారిలో కొండల సందులలోనే ఇరికించి చుట్టుముట్టినవి. ఆ ఆటవికులకు విలువిద్య తెలియదు. వారు కొడవలి, గుద్దలి, కర్ర, కత్తి కట్టుకొని వచ్చినవారు. వారిని బొప్పణ నాయకుని సైన్యాలు బాణ వర్షంతో చంపి పడదోసినవి. హొయిసళ సైన్యం ఇంత త్వరలో వెనుకనుంచి, ముందునుంచి, మీదినుంచి పైబడుతుందని. బాణవర్షం కురిపిస్తుందని కొండవారు ఊహించలేదు. రక్షకులు లేని రాజధానికి తమ కర్రలపెళ్లే చాలునని తలపోసినారు. వారి నాయకుడయిన నరపిళ్లైను కూడా తప్పించుకొని పోనివ్వక, వారందరినీ వేటాడడానికి బొప్పణనాయకునికి ఆరేడునాళ్ళు పట్టినది.



ఇక్కడ రాజధానిలో కుమారవిష్ణువు బొప్పణనాయకుడు వెళ్ళిన నాడే ఇన్నూరుమంది సాహసికులయిన గూఢచారులను సభకూర్చి, వారికి గ్రామీణుల వస్త్రభూషణాలిచ్చి, గ్రామీణ వేషంవేయించి వారిలో ఇట్లనినాడు : "ఇప్పుడుమీరు మేముచెప్పినట్లు నడిపిస్తే మేము ఖండితంగా గెలుస్తాము. రాజధాని ప్రశాంతంగా ఉంటుంది. రాజధానిలోని ఆడవారు, పిల్లలు సురక్షితంగా ఉంటారు. అందువల్ల మేము చెప్పేమాటలు బాగా వినండి...కొంగులసైన్యం ఇక్కడికి మూడు గవ్యూతులదూరంలో ఉంది. మీరు అక్కడినుంచి ఒక గవ్యూతిమేర ముందుకువెళ్ళి, ఆమీదట పది గవ్యూతులదూరంవరకు ఉన్న ఊరు, పల్లెలవారిని, తత్‌క్షణమే రాజమార్గం నుంచి కనీసం గవ్యూతిదూరంలో ఉన్న గ్రామాలకు తరలివెళ్ళవలసినదని చెప్పవలె; వారు వెళ్ళేటట్టు చేయవలె. వారున్నపల్లెల పైరు పచ్చలను కోసి, తమ పశువుల మేతకోసం తీసుకొనివెళ్ళనీ. తమవద్ద ఉన్న ధాన్యాలను ఒక్క గింజగూడ విడువకుండ తీసుకొనివెళ్ళనీ. ఈ విధంగా ఒక్కొక్క గ్రామంవారూ వదలిపోయినవెంటనే, ఆఊరి చెరువులనీరు ఒక్కబొట్టూ మిగలకుండా పారిపోయేట్టు వదలిపెట్టండి. కుంటలను బావులను మన్నుపోసి మూసివేయండి. ఈ విధంగా రాజమార్గానికి ఇరువైపులా ఒక గవ్యూతిమేర పదిగవ్యూతుల దూరంవరకు ఒకబొట్టు నీళ్ళుగాని, ఒక్కగింజ ధాన్యంగాని శత్రువులకు చిక్కకుండా చేయండి. ఈయుద్ధం ముగిసినపిదప ఆ గ్రామాల పునరుద్ధరణకు, గ్రామస్థుల నష్టానికి పరిహారం రాజకోశాగారంనుంచి ఇప్పిస్తామని మాటఇవ్వండి. ఎందుకు ఈవిధంగా చేయవలసివచ్చినదీ, వివరించండి. రాజముద్రికా సహితమైన ఈ తామ్రశాసనాన్ని వారికి నమ్మికకలిగించడానికి మీకు అప్పగిస్తాము. దీనిని ప్రతిగ్రామం ప్రెగ్గడకు, గవుండకు (గ్రామణికి) చూపించినమీదటనే ఈపని నిర్వహించవలసినది. మీరీకార్యం ఎంతత్వరగా తృప్తికరంగా నిర్వహిస్తే అంతత్వరగా మనకు జయం లభిస్తుంది. శత్రువుల బలాన్ని ఈరీతిగా మనం కుంగజేయకపోతే, సద్య. వేరే మార్గమేలేదు. ఈపని హేయమయినదే. దేశ హితదృష్టిలో ఈ అనిష్టం ఇప్పుడు చేయవలసి ఉన్నది." కుమారుడు వారికి ఈ రహస్యాలోచనచెప్పి రాజముద్రా

సహితమైన తామ్రశాసనం వారిచేతికి అప్పగించి, ఆ ఇన్నూరుమందిని వీడ్కోల్పినాడు.

అనంతరం కుమారవిష్ణువు రెండువేలమందికిపైగా సైనికులను సిద్ధం చేసి, ఊరిబైటనిలిపి, తాను యోధుల ఉడుపులుధరించి, రాజమాత ఆశీస్సులు, అక్కయ్యల ఆశీస్సులు పొందడానికి అంతఃపురానికి వచ్చినాడు.

కుమారుని వేషభూషలుచూచి రాజమాత భయపడినారు; "కుమార, ఇదిఏమి ?" అని ప్రశ్నించినారు. కుమారుడు రాజమాతకు సాష్టాంగపడి "జయశీలుడివి కమ్మని నన్ను దీవించండి; మీ దీవన ఇప్పుడు నాకురక్ష. అమ్మా, అనుజ్ఞ ఇవ్వండి. కన్నీరు కూడదు; ఖండితంగా కూడదు." అని ఒక రీతిగా ఆనతే చేసినాడు. రాజమాత ఆ మాటల ఆంతర్యం వెంటనే గ్రహించి, కుమారుడు కొంగులపై యుద్ధానికి బయలుదేరినాడని తెలుసుకొని, అప్పుడు కన్నీరునించడం అశ్రేయస్సని తెలిసి, "దైవం సదా నీతో ఉండి, నిన్ను కాపాడనీ !" అని ఆశీర్వదించి, హృదయోద్వేగం తట్టుకోలేక అక్కడున్న ఒక ఆసనంలో కూర్చున్నారు. మాటలుపెంచి ఊరడించే సమయం ఇదికాదని కుమారుడు చేటికలను శైత్యోపచారానికి నియమించి, అక్కయ్యలను చూడడానికి వెళ్ళినాడు.

అక్కయ్యలిద్దరికీ భక్తితో నమస్కరించినాడు. ఇద్దరూ ప్రేమతో తమ్ముణ్ని కౌగలించుకొనినారు. పెద్దక్కయ్య అతనినడుముకు కత్తిబిగించి, ఆరతిఎత్తి, రక్షపెట్టి, విజయనారాయణుని ప్రసాదశేషమైన పూవులను అతని తలపైఉంచి, "దైవమూ, ధర్మమూ నిన్ను అన్ని విపత్తులనుంచి రక్షించనీ, జయశీలుడవై నీవు మరలివచ్చేవరకు మాకు నిద్రాహారాలు ఉండవు." అన్నది. తర్వాత కుమారుడు గుర్రమెక్కి, ఊరిబయట సిద్ధంగాఉన్న సైన్యంచేరి, వారితో గంభీరంగా "మహాయోధులారా, దైవమే మన శక్తిసామర్థ్యాలను నేడు పరీక్షించడానికి ఉద్యమించినట్టు కనిపిస్తుంది. ధీరత్వంతో యుద్ధరంగంలో మరణిస్తే యశస్సు, వీరస్వర్గం. శత్రువులు మనయిండ్లను కొల్లగొట్టి, కాల్చి, భార్యాబిడ్డల శీలాన్ని భంగం చేయకుండా అడ్డుకొనడానికి, ఈ హొయిసళ ధర్మరాజ్యం కాపాడు



కొనడానికి మనమిప్పుడు బయలుదేరినాము. మనలో ఎవరూ పిరికివారు కారు. భీరువులకు దైవసహాయంలేదు. జీవితాశవదలి శత్రువులను నిగ్రహించుదాము. మనమూ జీవించి, మనవారినందరినీ బతికించుకొంటామని మీరు ఒక్కరొక్కరుగా వీరప్రతిజ్ఞ చేయండి. ముందువేసిన అడుగు వెనక్కు తీయమని నాతోపాటు అందరూ ప్రమాణం చేయండి." అని అంటుండగానే, సైనికులందరూ, ఏకకంఠంగా "ప్రభూ! మాగుండెలో ఒకేచుక్క రక్తం ఉన్నప్పుడూ శత్రువును ఒక్క అడుగైనా ముందుకు వేయనివ్వం. ఇది నిజం." అని ఒక్కొక్కడుగా ఒక కుంభంలో తెచ్చి పెట్టిన పాలుతాకి ప్రమాణంచేసినారు.

శత్రుసైన్యం రాజధానికి దాదాపు మూడు గవ్యూతుల దూరంలో విడిసినది. కుమారవిష్ణువు మరుసటిదినం మధ్యాహ్నానికి శత్రుశిబిరం చూచినాడు. వెంటనే శత్రువులపై పడక, దూరంలోఉన్న దట్టమైన అరణ్యంలో దాగుకొనిఉండి, అర్ధరాత్రిలో ప్రచండమారుతంవలె, పిడుగువలె నిద్రిస్తున్న శత్రుస్కంధావారంపైపడి చెల్లాచెదరు చేసినాడు. వారి శస్త్రాస్త్ర ధనధాన్యాల శిబిరానికి మొదట నిప్పుపెట్టినాడు. వారి గుర్రాలను కట్లువిప్పి తరిమినాడు. ఏనుగుల ముఖానికి దివిటీలుచూపి కాల్చినాడు. అవి భయంతో ఘీంకరిస్తూ కట్టుకొయ్యలు తెంచుకొని పరిగెత్తినవి. శత్రువులు "అయ్యో ! మోసపోయినామే !" అనుకుంటూ మేల్కొని మండుతున్న మంటలను ఆర్పడానికి ప్రయత్నించినారు. కొందరు అస్త్రశస్త్రాలు పట్టుకొని పోరుకు నిలబడినారు. కుమారవిష్ణువుకత్తికి ఎదురే లేనట్టయినది. దివిటీల వెలుతురులో కుమారునికత్తి ముంగారు మబ్బులమధ్య ఎడతెగక మెరసే మెరుపువలె మిలమిలలాడినది. ఇంతటి అప్రతిముడైన సేనాపతిని చూచి హొయిసళసైనికులు వీరావేశంతో శత్రుసైనికులను నిర్భీతితో ముక్కలు చేసినారు. శత్రుసైన్యంలో అప్పుడు బెబ్బులులు మేకల మందలోదూరి వెళ్ళినట్టయినది.

కుమారవిష్ణువు ముందుగాపంపిన ఇన్నూరుమంది గూఢచారులూ తమకు ఆజ్ఞాపించిన విధిని సమర్పకంగాచేస్తూ వెళ్ళినారు. మొదటిరాత్రి ముట్టడిలోనే శత్రువుల అపార సైన్యసామాగ్రి ధాన్యం, పశుగ్రాసం

మొదలయినవి అగ్నికి ఆహుతిఅయినవి. ఇక మిగిలిన ఆహారసామగ్రి తగ్గినకొలదీ, వారి అంత్యమూ సమీపిస్తూవచ్చినది. శత్రువులు సేకరించిన నీరు మొదటిరాత్రి మంటలు చల్లార్చడానికే వెచ్చించినారు. మరునాడు నీళ్ళకోసం బావులు, గుంటలు తవ్వుకోడమే వారికి పనిఅయినది. పరుగెత్తిపోయిన గుర్రాలను, ఏనుగులను పట్టుకొనిరావడం మరొకపని. ఇట్లయి, శత్రుసైన్యం ఆనాడు ముందుకు అడుగువేయడమన్నా పడలేదు; వెనుకకు వెళ్ళడం అంతకంటే సాధ్యంకాలేదు. కొంగులసైన్యం ఈవిధంగా చాల ఇక్కట్టులో పడినది.

## 9

అక్కడ అతి స్వల్పమైన సైన్యంతో రాజధానికి తిరిగి వస్తున్న ప్రభువులకు కొండవారూ, కొంగువారూ రాజధానిపై దండెత్తి వస్తున్నారని, సాధ్యమైనంత త్వరలో సహాయానికి సైన్యంతో రావలెనని రాజమాత వర్తమానం పంపినారు; గంగరాజులుగారికీ రాజమాత ఈ వర్తమానం పంపినారు. ప్రభువులు "మేము రాజధాని రక్షణకు బయలుదేరినాము. సాధ్యమైనంత త్వరలో అక్కడికి చేరడానికి యత్నిస్తాము. మీరు మీ పనులన్నీ ముగించిన మీదటే రావలసినది. మీవద్ద ఉన్న హెచ్చుసేనలను రాజధాని రక్షణకు వెంటనే పంపండి." అని గంగరాజులుగారికి సమాచారం పంపి, తాము రెండు రెండునాళ్ల ప్రయాణం ఒక్కనాడే ముగిస్తూ, ఎనిమిదినాళ్లకు రాజధాని ఎల్లలుచేరినారు. మహారాజ్ఞి శాంతల ప్రతినిత్యమూ ప్రభువులకు వార్తలు పంపేది. బొప్పణనాయకుడు కొండవారిపై దండు వెడలినదీ, కుమారుడు కొంగులను అడ్డగించి ముందడుగు వేయకుండా నిలిపినదీ ప్రభువులకు ఇప్పుడు తెలిసినది. కుమారుని వశంలో తగినంత సైన్యం లేకపోవడం ప్రభువుల మనస్సుకు భయవ్యాకులతలు కలిగించినది. రాజధానిని వదలి అంతదూరం అంతకాలం పోవడం తప్పని అప్పుడు వారి మనస్సుకు తట్టినది.



రాజధాని అంతవరకు సురక్షితంగా ఉండడం చూచి ప్రభువుల మనస్సు ఇప్పుడు కొంచెం సమాధానపడినది. బొప్పణనాయకుని, కుమారవిష్ణువు క్షేమసమాచారం తెలుసుకొనడానికి వారి మనస్సు ఆతురతపడినది. ద్వారవతి దగ్గరయిన కొద్దీ వారి ఆతురత మరింత అయినది. అంతవరకు "ద్వారవతిని చూచేమా?" అనే యోచన ఒక్కటే ప్రభువుల మనస్సంతా ఆక్రమించినది. ఇప్పుడు తక్కిన యోచనలూ మిక్కుటమయినవి. సైన్యం ఊరిబయటే నిలిపి, తమ కాంభోజ తురగాన్ని వేగంగా కదం తొక్కిస్తూ, నగరుచేరి, తాము ధరించిన యోధుల ఉడుపులు విచ్చకుండా, మొట్టమొదట తమ తల్లిగారిని దర్శించడానికి వెళ్ళినారు. దాసదాసీజనం ప్రభువుల ఆవేశం చూచి ఆశ్చర్యపడినారు; వారి ఆతురతను చూచి భయపడినారు.

కలలో కంటున్నవారిని కట్టెదుటే కన్నట్టయినది రాజమాతకు. ప్రభువులు కాతరతతో తల్లిపాదాలకు శిరస్సు తాకించి నమస్కారం చేసినారు. కన్నతల్లి కళ్లల్లో అశ్రువులు ధారగట్టినవి. "అమ్మా, కుమారుని సంగతి ఏమిటి?" అనేదే ప్రభువుల మొదటి ప్రశ్న అయినది.

"అప్పాజీ, నాకు ఇష్టం లేకపోయినా, కొంగులపైకి సైన్యం నడిపించుకొని వెళ్ళినాడు. నేటికి తొమ్మిది దినాలయినది. నేను నిద్రపోయి అంతే అయినది. చాల చమత్కారమయిన యుద్ధం చేస్తున్నాడట నాతండ్రి. అప్పాజీ, నీవు రావడం నాకు పోయిన ప్రాణం వచ్చినట్టయినది. వెళ్లు; మొదట బిడ్డడిని కాపాడడానికి వెళ్లు." అనినారు రాజమాత.

"అమ్మా, ఇంతవరకు రాజధానిని రక్షిస్తున్న విజయనారాయణుడే కుమారుని రక్షిస్తున్నాడు; రక్షిస్తాడు. మీలాగే నాకూ కుమారుని చూచేవరకూ మనస్సుకు శాంతి ఉండదు. నేను సైన్యాలతో ఇప్పుడే సహాయానికి వెళ్లుతాను. ఈ తొమ్మిది దినాలూ శత్రువులను పట్టి నిలబెట్టినాడు గదా ఈ నరసింహుడు! అమ్మా అదే నాకు ఆశ్చర్యం. బొప్పణనాయకుని సంగతేమిటి?"

"అప్పాజీ, అది సమాశ్వాసకరంగానే ఉంది. బొప్పణనాయకుడు దండెత్తివచ్చిన కొండవారి నందరినీ మాపుమాపినాడట. నేడో, రేపో రాజధానికి రావచ్చు."

"అమ్మా, ఈ దుఃఖంలోను అదొక సంతోష వార్త. ఎంతయినా గంగరాజులుగారి రక్తం కదా!"

ప్రభువులు రాజమాత విశ్రాంతి గృహంనుంచి ఈవలికి వచ్చి అంతఃపురాధికారిని ఒకణ్ని పిలిచి, "ఇప్పుడే వెళ్ళి ఊరివెలుపల నిలబడిన సైన్యాలకు మేము ఈ విధంగా ఆజ్ఞాపించినట్లు తెలుపండి. తొడిగిన యుద్ధ తనుత్రాణాదులను విచ్చివేయకండి. సకల సైన్యమూ ఉన్నవారు ఉన్నట్టుగానే ఆహారం తీసుకోండి. గుర్రాలూ మేత మేసి, నీరు తాగని. ఇదంతా గడియలోపల ముగించి ప్రయాణానికి సిద్ధంగా ఉండవలసినది. మనం కుమారుని రక్షణకు పోతాము." అనినారు. తర్వాత ప్రభువులు దేవేరులను చూడడానికి వెళ్ళినారు.

చేటి ఒక్కతె ప్రభువుల అనిరీక్షితమైన శీఘ్రాగమనాన్ని మహారాజ్ఞికి మనవి చేస్తుండగానే ప్రభువులే అక్కడికి దయచేసినారు. శాంతల ఆసనంనుంచి లేచి ప్రభువులను గడపవద్దే ఎదురువెళ్ళి కలుసుకున్నది: ముఖంపై నవ్వు మొలకెత్తినది. కన్నులలో ఆనందబాష్పాలు తొణికిసలాడినవి; ప్రభువుల పాదాలు స్పృశించి నమస్కరించినది. ప్రభువులు ఆనందంలో దేవి కోమల బాహువులను పట్టి యెత్తి "కుశలమా?" అని అడిగినారు; ఆ చుట్టూ కలియచూచినారు. ఆ అరలో ఉన్నది ఒక కర్ర పలకల మంచం. దాని మీద ఒక తుంగచాప, నేలమీద ఒక తుంగచాప, ఒక తలదిండు, పచ్చడం, దేవుని మూలలో పూజా పుష్పార్చనతో ఒప్పారే శారదా విగ్రహం; ఒకటి రెండు పీటలు, వీణ, పూజాసామాగ్రి—ఇవి కనిపించినవి. శాంతల చాల చిక్కినది. వస్త్రభూషణాడంబరం లేదు. ముఖం మీద మాత్రం ఉజ్జ్వల దివ్య తేజస్సు. నిష్ఠాపరురాలయిన దేవి యోగినివలె కనిపించినది.



ప్రభువులు మంచంపై కూర్చున్నారు. శాంతల శారద పుష్ప ప్రసాదాలు ప్రభువులకు ఇచ్చినది. ప్రభువులు లేచి నిలబడి స్వీకరించి తమ కన్నులకు అద్దుకొనినారు. అనంతరం శాంతల శారద శేషప్రసాదమైన పాలు ప్రభువుల కిచ్చినది. ప్రభువులు దానిని కళ్ళకు సోకించుకొని తర్వాత తీసుకున్నారు. శాంతల తన మనస్సంతోషం వ్యక్తపరుస్తూ, "శారద మిమ్ముల్ని త్వరగా పిలుచుకొని వచ్చినది. నేను నిత్యం దానిని వేడుకొంటున్నాను. మీరు నేడు వస్తారని నాకు స్వప్నమయినది. స్వప్నం సత్యమే అయినది. నా తమ్ముడూ ఇలాగే రాని అని నోము పట్టినాను. లక్ష్మి అయ్యగారిని చూచిరావడానికి నిన్న వేలాపురికి వెళ్ళినది. ఈరాత్రే వచ్చును. రాకపోతే సమాచారం చెప్పంపుతానని అన్నది." అని విన్నవించినది.

"దేవీ, నీవు కఠిననిష్ఠలో ఉన్నావు. నియమాలతో నీ దేహం చాల కృశించినది. ఇది ఇంత అవశ్యకమా?" అని ప్రశ్నించినారు ప్రభువులు.

"కఠినవ్రతం చేకొన్నది నా అనుంగుతమ్ముడు యుద్ధానికి బయలు వెడలిన నాటినుంచి. మీ క్షేమంకోసం, వాని క్షేమంకోసం, నా హృదయ శాంతికోసం నా ఈవ్రతం." అన్నది శాంతల.

ఈమాటలు విని ప్రభువుల కన్నులనుంచి ఆనందాశ్రువులు బొటబొట కురిసినవి. "ఇది ఎలాంటి అమృతమయ హృదయం దేవిది?" అనిపించినది. ఒక్క క్షణకాలం ఆ ధీరోదాత్తుని హృదయమూ తల్లడించినది. అధీరులవలె మాటలాడినారు: "దేవి, కుమారుడు సుఖంగా తిరిగివస్తాడా? దొంగలను గెలిచి వారి సమస్తమూ తెస్తాడా? వాని నగుమోమును నేను చూచేనా?" అప్పాజీ అనే వానిమాటలు మరలవింటానా? వాడు విజయోత్సాహంతో వస్తాడా? దేవీ, వాడింకా బాలకుడుగదా! యుద్ధపుకష్టాలు ఎలాగు సహించేడు? వేడుకో; నీ శారదను వేడుకో; కుమారుని శిరోరుహంకూడా కొంకకుండా ఉండనీ అని వేడుకో; కుమారుని సుఖంగా తెచ్చిఇమ్మనీ వేడుకో!" ఈ విధంగా ఆ ప్రభువుల ప్రేమహృదయం అరక్షణం విలవిలలాడిపోయినది. శాంతల నేత్రాలలోను దుఃఖం ధారధారలయినది. ఆమె

"దేవా, నిన్నటివరకు అతనిని దైవం రక్షించుకొనే వచ్చినది. ఈదినం ఇప్పుడే వర్తమానం వచ్చేసమయం. పిన్నవాడయినా మహా పరాక్రమంతో పోరాడుతున్నాడట. శత్రుసైన్యానికి మహానష్టం కలిగిస్తున్నాడట." అన్నారు.

"దేవీ, అమృతంకానీ; నీవాక్కు అమృతంకానీ. అట్లయితే, యుద్ధం చేసి జయం గడిస్తున్నవాడు విజయనారాయణస్వామి. అతనికి, నీ శారదకు నా కోటికోటి నమస్కారాలు." అనినారు విష్ణువర్ధనులు.

శాంతల తనమనస్సు స్తిమితంచేసుకొని "ప్రభువుల మనస్సుకు శాంతి దయచేయి తల్లీ." అని అక్కడున్న నీరాజనంముట్టించి శారదను ఆరాధించినది. అప్పుడు చేటి ఒక్కతె తొందరగా తలుపులు తోసుకొని లోపలికి వచ్చినది. ప్రభువులు లోపల ఉన్నారన్న సంగతి చేటికి తెలియదు. అక్కడ మంచంమీద కూర్చున్న ప్రభువులను చూచి చేటి వడవడ వణికింది. ప్రభువులకు నమస్కరించి, కంపిస్తున్న ధ్వనితో మహారాజ్ఞిని సంబోధించి "దేవేరులు త్వరగావచ్చి తెలుపుమని సెలవిచ్చినందున ఇలా పరుగెత్తివచ్చాను. వేయితప్పులు చేశాను. క్షమించాలి తల్లీ. అవసరపు రాహుత్తుడొకడు యుద్ధభూమినుంచి సమాచారం తెచ్చినాడు. వచ్చిన వాడు సూటిగా పెద్దఅమ్మగారిని దర్శనంచేసుకొనడానికి పరుగెత్తాడు." అని మనవిచేసినది.

ప్రభువులు తొందరగాలేచి తల్లిఉన్న మందిరానికి వేగిరంగా వచ్చినారు. శాంతల వారిని అనుసరించినది.

రాజమాత అప్పుడు తమ పూజాగృహంలో ఉన్నారు. నగరు పురోహితులు సాయంకాలపూజకు సామాగ్రిని, పుష్పాలను అప్పుడే తెచ్చిపెట్టినారు. ప్రభువులు రాజధానికి దయచేసినారని, ఆ రాత్రే నగరంలోని దేవాలయాలన్నిట్లోను హెచ్చుగా పూజోత్సవాలు నడిచేటట్లు ఏర్పాటు చేయవలెనని రాజమాత పురోహితులవారితో చెబుతున్నారు. అప్పుడు చేటి ఒకతె తొందరగా లోపలికివచ్చి, వార్తావహుడైన రాహుత్తుడొకడు



కదనభూమినుంచి వచ్చినాడని, అమ్మగారి దర్శనానికి వేచిఉన్నాడని తెలిపినది. రాజమాత పూజాగృహం వెలుపలి తలుపులుతీసి "వాడిని గడప దగ్గరకు రమ్మనిచెప్పు." అని ఆజ్ఞాపిస్తుండగా, ప్రభువులూ అక్కడికి దయ చేసినారు. ఆశ్వికుడు తలుపు గుమ్మంవద్దకువచ్చి నిలబడినాడు. ప్రభువులను అక్కడచూచి వానికి ఆశ్చర్యమయినది. తర్వాత పీఠమండిగంతో నమస్కారంచేసి లేచినాడు. చెప్పవలసిన సమాచారం వాని గొంతునుంచి వెలువడలేదు. వాని అవస్థచూచి ప్రభువులు "భయపడవద్దు, ఏమిటిసంగతి? నిదానంగాచెప్పు." అనినారు. కంపించేధ్వనితో ఆ ఆశ్వికుడు "శత్రువుల ఏనుగులూ, గుర్రాలూ, పదాతిసైన్యం రాజధానివైపు బయలుదేరాయి. ఈ తొమ్మిదినాళ్ళూఉన్న స్థలంలోనే ఆపబడిన శత్రుసేన, ఈ వేకువనే అక్కడినుంచికదలి రాజధానిమీదికి నడుస్తున్నాది. దానిని దూరంనుంచే చూచి వెంటనేవచ్చి విన్నపం చేసుకొన్నాను. నేను చూచినప్పుడు శత్రుసైన్యం మూడుగవ్యూతుల దూరంలో ఉంది." అనినాడు.

ఆ మాటలువిని రాజమాతహృదయం తల్లడించిపోయినది. "ఏమిటి? శత్రువులదండు ముందుకుసాగినదా? అయ్యో కుమారా!" అంటూ రాజమాత తమ ఎడమచేతిని రొమ్ముపై పెట్టుకొని రొమ్మును అదిమి పట్టుకొనినారు. ఆ క్షణమే ఆమెజీవం దేహంనుంచి ఎగిరిపోయినది. "అమ్మా!" అంటూ ప్రభువులు రాజమాత నేలమీదికి ఒరిగిపోకుండా పట్టుకోడానికి దిగ్గునలేచి వచ్చినారు. పట్టుకొని కూర్చోబెట్టినారు. నిష్ప్రయోజనమయినది. రాజమాత కన్నులు మూతలుపడినవి. తల ఒకపక్కకు ఒరిగిపోయినది. ప్రభువులు తల్లినుదిటికి చన్నీళ్ళుతట్టి, శరీరం కదుపుతూ "అమ్మా! అమ్మా!" అనినారు. శాంతల గాలివీచినది. అమ్మా అమ్మా! అంటూ వాలిపోయిన ఆమె తలను పైకెత్తి మూతలుపడిన కన్నులను, నిర్జీవ ముఖముద్రను చూచినది. ప్రభువులకు శాంతలకన్నులలో కలిగిన నిరాశాభావం అర్థమయినది. ప్రభువులు అప్పుడు తల్లి ముక్కుమీద వేలుపెట్టి "ఊపిరి ఉందా?" అని చూచినారు. కన్నుల రెప్పలను విప్పి చూచినారు; తల్లి కాలధర్మం చెందినారని ప్రభువులకు ఇప్పుడు నిర్ధారమయినది. దగ్గర నిలబడిఉన్న శాంతలను, పురోహితులవారిని చూచి, ప్రభువులు నిరాశతో మెడ త్రిప్పినారు. పురోహితుల కన్నులనుంచి నీరు జలజల ప్రవహించినది. శాంతల

చేలాంచలంలో ముఖం కప్పుకొని "అమ్మా అమ్మా ! అమ్మా !" అంటూ గద్గదధ్వనిలో వస్తున్న దుఃఖాన్ని సహించలేకపోయినది. తలుపు గుమ్మం వద్ద నిలబడి ఇదంతా చూస్తున్న అశ్వికుడు "నేను తెచ్చిన చెడ్డవార్తకదా ఈ అనాహూతానికి కారణం." అని చాల మనస్సు నొచ్చుకుని, అక్కడి నుంచి వెళ్ళిపోయి ఆత్మహత్య చేసుకొనినాడు.

ప్రభువుల కన్నులూ చెమర్చినవి. ఇక్కడేమో కన్నతల్లి దుస్సహ వార్తవిని ప్రాణం విడిచినారు. అక్కడ, ప్రాణాలంత ప్రియతముడైన కుమార విష్ణువు శత్రువుల చేతచిక్కి బ్రతికున్నాడో, లేదో అన్న సంశయం. తమకు ఈ విపత్తులను తెచ్చి పెట్టినది శత్రుసేన. దీనిని నిర్మూలనం చేయనిదే తాము తల్లికి వాసోదక తిలోదకాలను విడువడానికి అనర్హులమని ప్రభువులు నిశ్చయించుకొనినారు. పురోహితులవారు పూజ కోసమని తెచ్చిపెట్టిన పూవులను రెండు చేతులతోను తీసుకొని, తల్లి పాదాలపై ఉంచి తమ అంత్యప్రణామం సమర్పించినారు. శాంతల ప్రభువులను అనుసరించినది. ప్రభువులు విజయనారాయణుని ఎదుట జ్వలిస్తున్న అఖండజ్యోతిని చేతపట్టుకొని తల్లి పాదాంగుష్ఠానికి తాకించి, తర్వాత ఆ జ్యోతిని దేవుని పాదాలకడ పెట్టి, పురోహితులతో "తర్వాతి క్రియలు సాంగంగా జరిపించండి. చితాగ్నిని మాత్రం ఎన్ని దినాలయినా సరే, నేనుగాని, లేక నా కళేబరంగాని వచ్చేవరకూ రక్షించండి. ప్రాణాలతో వస్తే తల్లిగారి ఉత్తరక్రియలు మేమే జరుపుతాము. లేకపోతే ఆ చితాగ్నికే మా దేహమూ అర్పించండి. ఇది మీ కర్తవ్యం." అనినారు. తత్‌క్షణమే శాంతల ప్రభువుల పాదాలు పట్టుకుని, "దేవ, జీవితంలోను, అనంతరమూ నేనూ, లక్ష్మి తమతోనే ఉండదగినవారం. మాకు వేరే చితి వద్దు." అనినది.

పాదాలు పట్టుకున్న శాంతలను ప్రభువులు చేతులతో పైకిలేపి, ఆమె కన్నులలో తమ కన్నులు పెట్టి చూచి, "చెన్నా, మీ స్నేహం మాకు అమరంగా, జన్మజన్మలకూ ఉండనీ, అమృతంకానీ. ఇప్పుడు నడువవలసిన కార్యాలు నడువనీ." అంటూ. తమ రొమ్ముపై ఉన్న హొయిసళ రాజ్యాంకితమైన పదకం ఉన్న రత్నహారం విసురుగా తీసి, దానిని విజయ



నారాయణస్వామి పాదసన్నిధిని పెట్టి "ప్రభూ, నీవు అనుగ్రహించినది నీకు సమర్పిస్తున్నాను. ఇది నీ ఆభరణం. దీనిని నేను చక్కగా కాపాడినానో, వ్యర్థం చేసినానో నీకే తెలుసు; నాకు తెలియదు. భగవన్ ! నీ సంకల్ప మేమిటో అట్లే జరుగనీ. తల్లి మరణానికి ముందు నాకు ఆమె దర్శనం ఒనగూర్చినావు. కరుణానిధీ !" అని నమస్కరించి, విసవిస వెళ్ళి కాంభోజాశ్వమెక్కి తమ సైన్యం వేచి ఉన్న స్థలానికి వేగంగా దౌడు తీసినారు.

ఒక పరువు దూరం పోయిన మీదట, అర్ధరాత్రి గడచిన మీదట రాజమార్గం పక్కనే విడిసిన శత్రువుల స్కంధావారంలో వెలుగుతున్న దీవిటీలను ప్రభువులు దాదాపు మూడావు పరువు దూరం నుంచి చూచినారు. కాళ్లు ఈడ్చుకొంటూ వచ్చే గుర్రాలను, అలసిపోయిన సైనికులను ఆ వేళలో అపాయం పాల్పడచేయడం న్యాయంకాదని, ప్రభువులు ఎరిగినదే. ఆరాత్రి పక్కన ఉన్న తోపులో గడిపి, తెల్లవారిన తర్వాత వెనుక వస్తున్న సైన్యాలను కూడగట్టుకొని, తర్వాత కర్తవ్యోన్ముఖులు కావడం మంచిదని నిశ్చయించి, మానులు దట్టంగా పెరిగిన ఒక తోపులో అప్పుడు విడిసినారు.

ప్రభువులు శాంతల శారదకు నైవేద్యం చేసి ఇచ్చిన పాలు వినా మధ్యాహ్నంనుంచి మరొక ఆహారంగాని, పానీయంగాని తీసుకోలేదు. అంతలోగా రాజధానినుంచి సైన్యానికి ఆహారం, గుర్రాలకు మేత వచ్చి చేరినవి. ప్రభువుల భోజనానికి ఉత్తమ ఫలాలూ వచ్చాయి. ప్రభువులకు ఆకలే అణగి పోయినది; ఏదీ కాబట్టలేదు. ఒక మానుకింద మెుదలు ఆనుకొని కూర్చుని, శూన్యదృష్టితో ఆకాశం చూస్తూ, హృదయాంతరాళంలో దుఃఖం మండుతున్నా, కర్తవ్య విముఖులుకాక సూర్యోదయంకోసం ఎదురు చూస్తూ ఉన్నారు. సైనికులు, గుర్రాలకు మేత, నీరు పెట్టినారు. ప్రభువుల వలె వారెవ్వరూ కూడ ఒక్క బొట్టు నీరూ తాకలేదు.

అప్పుడు రాత్రి అతి దీర్ఘంగా కనిపించినది. నిద్ర ఎవరికి కావలె? ఎవరికి వచ్చీని? తుట్టతుదకు పూర్వాకాశంలో అరుణచ్ఛాయ రంగరించు

కొన్నది. ప్రభువులు లేచి, ప్రాతర్విధులు పూర్తిచేసి, భటులు దగ్గరి చెరువునుంచి తెచ్చిపెట్టిన నీటిలో స్నానంచేసి, మడుగులు కట్టి, తల్లిని స్మరించి, వారి ఆత్మకు నమస్కరించి, తర్వాత ఆ తటాకంలో దిగి, ఉదయిస్తున్న సూర్యబింబాన్ని నమస్కరించి, "భగవన్, నారాయణా, మాతృదేవి అంత్యక్రియలు చేయని ఈ అభాగునికి, నీకు అర్ఘ్యం అర్పించే అధికారంఉందో లేదో? ఏమైనా అర్ఘ్యం అర్పిస్తున్నాను. ఈ అర్ఘ్యంలో నా శరీరం, ఆత్మ—రెంటినీ ఇప్పుడు నీకు అర్పిస్తున్నాను." అని మూడు సార్లు అర్ఘ్యమిచ్చి మూడుసార్లు ఆచమించి, అనంతరం యుద్ధపుఉడుపులను, కవచాన్ని ధరించి, కాంభోజిని అధిరోహించి సిద్ధమయినారు. ఆ వేళకు రాత్రి వెనుకబడిన సేనకూడ వచ్చి చేరినది. కొండవారితో తలపడడానికి వెళ్ళిన సైన్యం విజయోత్సాహంతో నిన్న అర్ధరాత్రికి రాజధానికి వచ్చినదనీ, బొప్పణనాయకుడు ఆసైన్యంతో మధ్యాహ్నానికి ప్రభువులను కలుసుకొని దర్శనం చేసుకొంటానని చెప్పిపంపిన సమాచారం ఈ సైన్యం ప్రభువుల సన్నిధానంలో మనవి చేసుకున్నది. ప్రభువులకు ఇప్పుడు మరింత ధైర్యం వచ్చినది. అప్పుడు వారు తమ నాల్గువేలమంది భటులను సంబోధించి, "సుభటులారా! ఈ దినం మనం మన పిత్రార్జితమైన భూమి కోసమూ, మన ఆలుబిడ్డల సంరక్షణార్థమూ, ప్రాణాలు ఒడ్డి యుద్ధానికి వెళ్ళుతున్నాము. ఇదే మన అంతిమ యుద్ధమూ కావచ్చు. ధర్మం మనకు సహాయపడనీ! విజయనారాయణుడు, విజయలక్ష్మి, నేడు మనతోపాటు ఉండనీ!" అంటూ కాంభోజ జవనాశ్వాన్ని వేగంగా, శత్రుశిబిరాభిముఖంగా నడిపించినారు. ప్రభువులకున్నంత మనోదార్ఢ్యంతోను సైనికులందరూ వారిని అనుసరించినారు.

ప్రభువులు వెనుకటిరాత్రి ఏస్థలంనుంచి శత్రుశిబిరాన్ని చూచినారో ఆ స్థలానికి వచ్చినారు. ఆసేన ఆవేళకు తనముందు ప్రయాణానికి సిద్ధం చేసుకొని బయలుదేరినది. ప్రభువులు ముందుకన్పిస్తున్న బయలు ప్రదేశంలోనే శత్రువులను ఎదిరించడమని నిశ్చయించి, కత్తిని ఒరనుంచిలాగి పట్టుకొన్నారు. సైనికులుకూడ తమ కత్తులను పట్టుకొని ఆక్రమణకు సిద్ధమయినారు.



ప్రభువులు "ఊఁ! ముందుకు!" అని ఆజ్ఞాపించనున్నారు. అలోగా శత్రుసైన్యపు అశ్వికుడొకడు పట్టణాభిముఖుడై గుర్రాన్ని శరవేగంతో నడిపించుకొంటూ రావడం చూచినారు. "ప్రాయశః, శత్రువులు మన సైన్యం చూచిఉంటారు. మీరు శరణాగతులు కావడం మేలు—అని ఈ రాహుత్తునితో రాయబారం పంపిఉంటారు. వీనిని చంపరాదు". అని ప్రభువులు గుర్రాన్ని కళ్ళెం వెనక్కులాగి నిలిపి, తమకత్తిని ఒరలో పెట్టుకున్నారు. వేగంతో వస్తున్న అశ్వారోహికి గుంపుగానిలబడిన ఈ హొయిసళ సైన్యం ఇప్పుడు తెస్సగా కనిపించేటంత దగ్గరయినది. అయినా, ఆ అశ్వారూఢుడు వచ్చేవేగం తగ్గలేదు. భయంకాని, ఆశ్చర్యంకాని వ్యక్తంచేయక, గుర్రంపరుగు తగ్గించనైనా తగ్గించక, సూటిగా వీరిఎదుటికి వచ్చినాడు; దగ్గరికివచ్చినాడు. ప్రభువులు చూచినారు. ఈ అశ్వారోహి హొయిసళ రాహుత్తుల వస్త్రతనుత్రాణాలు ధరించినాడు. ఇదీ ఒక మోసమేనని ప్రభువులు భావించినారు. అశ్వారోహికి ఇప్పుడు హొయిసళ రాజపతాక, శ్వేతచ్ఛత్రం కనిపించినవి. అప్పుడు వాడు "ఇదేమిటి ఆశ్చర్యం!" అనుకొని, గుర్రంమీదినుంచిదిగి, గుర్రాన్ని నడిపించుకొని వచ్చినాడు. పదిహేను ఇరవై అడుగులు ముందుకు వేసినాడోలేదో ప్రభువులే కనిపించినారు. ఆనందాశ్చర్య భక్తిగౌరవాలతో అక్కడే మండిగం వేసి తలవంచి నమస్కరించినాడు. ప్రభువులకు ఇది మరింత ఆశ్చర్యమనిపించింది. ప్రభువులు తమ సైనికునొకనిని వానివద్దకు పంపి, వానిని ప్రవేశపెట్టమనినారు తమఎదుట. దగ్గరికివచ్చిన అశ్వికుడు "హొయిసళేశ్వరులకు జయం కలుగనీ!" అన్నాడు. అప్పుడు ప్రభువులకు వాడు తమ సైనికుడనే నమ్మకం కలిగినది. ప్రభువులు "ఆసేన ఎవరిది? నీవు అక్కడినుంచి ఎట్లువచ్చినావు? ఎక్కడికి వెళ్ళుతున్నావు?" అని ప్రశ్నించినారు.

"ప్రభువులు అవధరించవలె. ఆ మహాసైన్యం మన ఇమ్మడి దండనాయకులు డహారవిష్ణువులవారికి శరణాగతమైన కొంగుదేశసైన్యం. నేను ఈ మన మహావిజయవార్తను రాజమాతకు మనవిచేయడానికి బయలుదేరినాను. ఇమ్మడి దండనాయకుల ఉత్తరువయినది." అని మనవిచేసినాడు సైనికుడు.

ప్రభువులకు మూర్ఛవచ్చినట్టయినది. మాట నోటినుంచి పెగలి రాలేదు. శాంభోజాశ్వాన్ని ఆనుకొని అట్లే క్షణకాలం నిలబడిపోయినారు. “ఇది నిజమా ? ఇది సాధ్యమా ? నిన్న నగరుకువచ్చిన వార్తాహరుడయిన ఆశ్వికుడు శత్రువుల మహాసేన ఏనుగులదండు ముందు నడువగా రాజధాని మీదికి వస్తున్నదని అనినాడే ! వాడు ఆ కల్లబొల్లి సమాచారం ఎట్లు తెచ్చినాడు ? ఈ సమాచారంవినే కుమారుడు నిహతుడయి ఉంటా డనుకొని తల్లి గుండె ఆగిపోయినది. నేను తల్లిని పోగొట్టుకున్నాను. నిన్న వచ్చిన ఆ ఆశ్వికుడు బొంకినాడా ? బొంకి నాతల్లి అంతానికి కారణ మయినాడా ? అట్లయితే వాడు ఆత్మహత్య చేసుకున్నాడెందుకు ? అయ్యో ! దైవమా ! ఇంతటి అమృత సమయాన్నే విషసమయంగా చూపించినావా ? హా ! దుర్విధీ ! తల్లి అన్యాయంగా మరణించినందుకు దుఃఖించనా ? కుమారుని ఈ అద్భుత విజయానికి సంతోషపడనా ? దైవమా ? మానవహృదయం రాయివలె ఉండవలెనని నీ నియమమా ? మానవుడు మమతను, అనుకంపను త్యజించి, రాయివలె ఉండవలెనా ? రాయివలె కావలెనా ? అమృతంలో విషబిందువు ఉన్నదని స్పష్ట మయినది; అయితే విషంలో అమృతం లేదుకదా ! లేక ఈ అమృతం, విషం రెండూ ఒకే వస్తువు రూప భేదాలు మాత్రమేనా ?” అని ప్రభువుల చిత్తం క్షణకాలం వికల్పాకుల మయినది. మరల సంయమ స్థితికి రావడానికి కొంతకాలం పట్టినది. “నిన్న వార్తతెచ్చిన కావలి రాహుత్తుడు మేము చూచినట్లే దూరంనుంచి శత్రుసేనను చూచి, సమాచారం పరుగునవచ్చి చెప్పి ఉంటాడు. దానిలో వాని తప్పేమీ లేదు. ఇదంతా మా దురదృష్టమే.” అనుకొన్నారు ప్రభువులు. తర్వాత వచ్చిన సైనికునితో “మంచిది. ఈ సంతోష వార్తను సాధ్యమైనంత త్వరలో అంతఃపురానికి అందించు. బొప్పణ దండనాయకులకూ తెలుపు. ఈవార్త మాకు తెలిసినదనికూడా తెలుపు”. అని వానిని పంపివేసినారు. పిదప తమ సైనికులను సంబోధించి, “దైవం నేడు మనజీవితంలో దాగుడు మూతలాట ఆడుతున్నది. దుఃఖాలను సాధ్యమయినంత త్వరలో మరువ డానికి మనుష్యుడు ప్రయత్నించవలె, లేకపోతే వాడు కార్యభ్రష్టుడు, కర్తవ్యభ్రష్టుడు అవుతాడని పండితులు చెబుతారు. కుమారుని ఈ విజయా



నికి మనమందరం మహా సంతోషపడటమే న్యాయం. అందువల్ల మాతల్లి గారి మరణవార్తను ఎవరూ కుమారుని చెవిలో పడవేయకూడదు. తగిన సమయంలో అది వానికి తెలియనే తెలుస్తుంది.” అనినారు.

మహాద్భుతమూ మహాశ్చర్యమూఅయిన కుమారుని ఈ విజయాన్ని విని సైనికుల అలసట మాయమైనది. సైనికులందరూ ఒక్కుమ్మడిగా జయజయ నినాదాలు చేసినారు. అంతలోగా కుమారవిష్ణువు విజయసైన్యం దగ్గిరికి వచ్చినది. ఏనుగులెక్కిన ఆ సైన్యంలోనివారు కొందరు ముందున్న సైన్యం తమ విజయానికి స్వాగతమివ్వడానికి వచ్చిన హొయిసళ సైన్యమనే ఊహించుకొని తెలుసుకొన్నారు.

ముందున్న ఒక మహాదంతిపై ఆసీనుడయిన కుమారవిష్ణువు ఎదురుగా సేనాముఖంలో శ్వేతచ్ఛత్రం కింద కాంభోజిపక్కన నిలబడిఉన్న ప్రభువు లను చూచి, ఆశ్చర్యానందాలతో “అప్పాజీవారే దయచేసినారు!” అంటూ ఏనుగుమీదినుంచి నేలమీదికి దూకి ప్రభువులున్నచోటికి పరుగున వచ్చినాడు. ప్రభువులు కుమారునిచూచి మూడువీండ్లకు పైబడినది. కేవలం పదిహేను సంవత్సరాల పసివాడు, శత్రువుల ఈ మహాసేనను ఓడించి, అద్భుతవిజయం సాధించినది ప్రభువులకు మహాభారత వీరుడైన అభిమన్యుని జ్ఞాపకం తెచ్చినది. తమ కుమారవిష్ణువు ఆ అభిమన్యునికి ఏవిధంగాను తక్కువకాడని ప్రభువులు, అతనికి స్వాగతమిచ్చి, తమ రెండుబాహువు లను ముందుకు సాచినారు. కుమారుడు “అప్పాజీ! అప్పాజీ!” అని అంటూ ఆ రెండు బాహువులమధ్య బంది అయినాడు. ప్రభువులు కుమారుని గట్టిగా కౌగిలించుకొని, తల నిమిరినారు. తల్లిమరణానికి కూడా స్రవించని కన్నీరు ఇప్పుడు ధారాపాతంగా స్రవించినది. ఈ ఆనంద దృశ్యం చూచి సైనికులందరూ సంతోషంలో “ఉఘే! కుమార ఉఘే!” అని జయజయ ధ్వనులు పెక్కుమార్లు చేసినారు.

ఆనందబాష్పాలు తొణికిసలాడే కన్నులతో కుమారవిష్ణువు ముఖ మెత్తి ప్రభువులను తిలకించి, “అప్పాజీ, చాల చిక్కిపోయినారు ? వచ్చినది ఎప్పుడు ? అని ప్రశ్నించినాడు.

"నీవు క్షేమమేనా? శరీరానికి గాయాలుకాలేదు కదా? నీ ఈ సాహసం హొయిసళ కులానికే కీర్తి. ఈ అసాధ్యకార్యం నీకు ఎలాగు సాధ్యమయినది?"

"అప్పాజీవారి ప్రసాదం. అమ్మగారి చలువ అక్కయ్యల ఆశీర్వాదం. సైనికుల ప్రేమ. అన్నిటికీ మించి దైవకృప. ఈ విజయం విజయనారాయణునిది అప్పాజీ! నాచేత్తో కత్తినడిపించినది వారే. వాని ఖడ్గమే శత్రుసైన్యాలను ఖండించినది."

"గొప్పమాట లన్నావు. దైవసంకల్పం లేకపోతే, ఏకార్యమూ నడవదు. అది నిజమే; మనం కర్తలమూ కాము; భోక్తలమూ కాము. కేవలం వాని ఆజ్ఞానువర్తులం. ఈ ఏనుగులు ఎవరివి? ఈ అశ్వరాజి, అక్షోహిణీ ఎవరివి?"

"ఏనుగులు ఇరవై, గుర్రాలు మూడువేలు, సైనికులు ఆరువేలమంది. ఇవన్నీ ఇప్పుడు తమవి. తమకు అప్పగిస్తున్నాను."

ప్రభువుల ఆనందానికి మేరలేకపోయినది. వెనుకటి రాత్రి దుఃఖంతో, ఆలోచనతో కలతపడి పోయిన వారి హృదయం ఇప్పుడు కొంచెం సమాధానస్థితికి వచ్చినది. ఇంతయినా, తల్లి మరణంతో కలిగిన దుఃఖం ఒకవైపు ఉండనే ఉంది. ప్రభువులు కుమారుడు చెరపట్టి తెచ్చిన వస్తువుల నంతా పరామర్శించినారు. కుమారుడు నడిపిన యుద్ధనీతి చతురతను, శత్రువులకు ఒక చుక్క నీరూ, ఒక గింజ ధాన్యమూ చిక్కకుండా చేసిన మీదట, గత్యంతరం లేక వారు శరణాగతులయిన తీరూ విని ప్రభువులు ఆశ్చర్యచకితులయినారు.

శత్రు సైన్యానికి, తమ సైన్యానికి ఆనాడు వనభోజనం చేయించినారు ప్రభువులు. తాము మాత్రం ఏదో సాకుతో స్నానమని నీటిలో దిగి నడినెత్తిపైవున్న సూర్యనారాయణునికి ముమ్మారు అర్ఘ్యమిచ్చి, మూడు దోసిళ్లు నీరుత్రాగి విశ్రాంతి తీసుకొనినారు. తర్వాత అందరూ రాజధానికి పయనమయినారు.

# 10

కొండవారి మీద దాడికి వెళ్ళిన బొప్పణనాయకుడు వారిని కొకటి వేళ్ళతో నాశనంచేసి, దండుతోపాటే వెనుకటి రాత్రి కొంచెం పొద్దు పోయిన తర్వాత రాజధాని చేరినాడు. ప్రభువులు రాజధానికి రావడం, రాజమాత నిధన వృత్తాంతం, ప్రభువులు రాజమాత దహన క్రియ పురోహితులకు అప్పగించి, శత్రు సైన్యాలను నిగ్రహించడానికి ఆ సాయంకాలమే సైన్యాలతో రాజధానినుంచి శత్రువుల మీదికి తరలడం బొప్పణ నాయకునికి తెలిసినవి. "కుమారుడు ఏమయినాడో!" అనే భయంతో, రాజమాత అన్యాయ మరణంతో బొప్పణనాయకునికి తన దిగ్విజయ సంతోషమే ఎగిరిపోయినది. "దైవం ఇలాగు కూడ మోసం చేస్తుందా?" అని అతను చింతపడినాడు. "రాజ్య మెందుకు? కోశ మెందుకు? ధర్మ మెందుకు? నీతి రీతులెందుకు? ఎవరు బ్రతికితే ఏమి? ఎవరు ఏలితే ఏమి? ఏది ఎలాగు పోతే ఏమి?" అని అతనికి జీవితం మీదే జుగుప్స ఏర్పడినది. వెంటనే తాను ప్రభువుల రక్షణకోసం వెళ్ళకపోతే కర్తవ్యభ్రష్టుణ్నవుతానని తోచినది. "ఈ లోకానికి రావడమే తప్పు, వచ్చిన తర్వాత, సాధ్యమయినంత త్వరలో తొలగిపోవడం మేలు." అనుకొని ఒకవేళ కుమారుడు యుద్ధంలో మడిసి ఉంటే, తానూ అక్కడే మడియడమే లెస్స అనుకొని, తెల్లవారే లోపల అన్ని సైన్యాలూ ప్రభువుల సహాయానికి బయలుదేర వలెనని ఉత్తరువుచేసి, ధరించిన కవచాదులు తీసివేసి, రాజమాత చితా దర్శనంకోసం రాజకుల పితృభూమికి ఆ నడిరేయిలోనే బయలుదేరినాడు.

మహారాణి శాంతల, అత్తగారి నిధనవార్తను ఆ సాయంకాలమే వేలాపురానికి చెప్పిపంపి, రథం పంపి లక్ష్మిని, పండితులను పిలిపించుకొన్నది. ఆ రాత్రే రాజమాత దహనక్రియలు ఏర్పాటయినవి. ఊరికి పూరే వచ్చి రాజమాత అనిరీక్షిత మరణానికి దుఃఖాంజలి సమర్పించి, పరదైవం వలె ఉన్న తల్లిని కోల్పోయిన వారివలె దుఃఖించినది.

త్వరలో చందనకాష్ఠాలచితి రాజవంశపు పితృభూమిలో సిద్ధమయినది. శాంతల, లక్ష్మి లక్కిన దేవేరులు స్నానంచేసి, అలంకార మంగళ ద్రవ్యాలుమాని, రాజమాత కళేబరం తీసుకొని వెళ్లుతున్న వాహకుల వెంట మహా దుఃఖంతో నడిచినారు. వారితోపాటు మాచికబ్బె, లక్ష్మీమతి దండనాయకి, జక్కియబ్బె మొదలయినవారూ నడిచినారు. రాజమాత పాదాంగుష్ఠాన్ని సోకిన జ్యోతి జ్వాలే దక్షిణాగ్ని అయి, వాహకుల ముందు నడుస్తున్న ఒక జైనాచార్యుల చేతిలోని ఘటంలో ఉన్నది. రాజ పితృభూమి చేరినతర్వాత రాజమాత కళేబరాన్ని చితారోహణం చేయించినారు. అంత్యక్రియలు విధ్యుక్తంగా జరిగినవి. చితికి అగ్నిస్పర్శను కుమారుడు, కుమార్తె, కోడలూ అయిన మహారాజ్ఞే చేయవలెనని జన ధర్మ భ్రాతృవర్గం నిర్ణయించినది. శాంతలదేవి హృదయంలో మహాజ్వాల మండుతుండగా, చేతిలో ప్రత్యక్షజ్వాలను పెట్టుకొని, చితికి ముమ్మారు ప్రదక్షిణం ఆచరించి, నమస్కారంచేసి, “అత్తయ్యగారూ, మా అందరికోసమూ ప్రేమనింపుకున్న మీ హృదయానికి నేను పెడుతున్న జ్వాలలు నా హృదయానికి తాకకపోయినా? అని దుఃఖంతో తపిస్తూ, అగ్నిని చితిలో ప్రతిష్ఠించినది. లక్ష్మితోపాటు ఇతర దేవేరులూ చితికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి, “వెళ్ళి వస్తున్నారా అత్తయ్యా!” అని విలపించినారు. మాచికబ్బె, జక్కియబ్బె, లక్ష్మీమతి కుమార్తెల దుఃఖాన్ని సమాశ్వాస పెట్టడానికి ప్రయత్నించినారు. అప్పుడు రాత్రి చాల పొద్దు పోయినది.

బొప్పణనాయకుడు రుద్రభూమికి వచ్చినప్పుడు చితి ప్రజ్వలిస్తున్నది. కపాలమోక్షం అయినతర్వాతనే రాజకులంవారంతా శుద్ధస్నానంచేసి, తమతమ గృహాలకు తిరిగి వెళ్ళవలసినది. అందువల్ల అందరూ కాచుకొని ఉన్నారు. బొప్పణనాయకుడు చితికి నమస్కరించి, “ఓ అగ్నీ, నీవు జగత్తులోని ఉత్తమ వస్తువులనే ఏరిఏరి తీసుకొని వెళ్ళుతావు. హుతవహుడా, నీవు నిత్యాసంతృప్తుడివి; ఆకలి తీరనివాడివి. ఒక్కరిని మిగిల్చి మరొక్కరిని తీసుకొని వెళ్ళవద్దు. అందరినీ ఒక్కమారే తీసుకొని వెళ్లు. నీకు శాశ్వతమైన అజీర్ణరోగం కలుగనీ.” అని హృదయ దుఃఖంతో



నోటికి వచ్చినట్టు మాట్లాడుతూ, సంయమం పోయి, తన తల్లి నిలుచుని ఉన్న స్థలానికివచ్చి, నమస్కరించినాడు. లక్ష్మీమతి దండనాయకి పుత్రుని చూచి, “ఏచణ్ణా, నీవు వివేకవంతుడివి. ఇలాగు మాట్లాడరాదు. ప్రాజ్ఞులు దుఃఖంలోను ధృతి పోగొట్టుకోరు. రాజమాత బాగా బదికినవారు. వారు ఏలోపమూ లేక కర్తవ్యం చేసి ముగించి, సుఖమరణం పొందినారు. అంత్యకాలంలో రోగశయ్య లేకపోవడం మానవజన్మకే పూర్వపుణ్యం. ఇలాటి అంత్యం ఎవరు మాత్రం కోరరు? ఇక్కడికి వారి కర్మలు సమసిపోయినవి. వారికి శాశ్వత పుణ్యలోకాలు ప్రాప్తించినవి. వారి పేరుతో శాశ్వత దానధర్మాలు నడిపించవలె.” అనినారు.

బొప్పణనాయకుడు తర్వాత మహారాజ్ఞికి నమస్కరించి, “ఇక్కడ ఉన్నవారందరి దుఃఖమంతా ఒక్కపాలయితే, దాని నూరుపాళ్లు దుఃఖం అక్కగారి హృదయం భరిస్తున్నది. నా కర్తవ్యమేమని ఇప్పుడు అక్కగారు ఆనతీయవలె.” అనినాడు. శాంతలదేవి పొంగిపొంగి వస్తున్న దుఃఖం దిగమింగుకుంటూ, దీనత ఉట్టిపడే తన ముఖాన్ని చెరుగులో కప్పుకొని, “బొప్పణ, ప్రభువుల సహాయానికి పోవలె. ఇంకా ఏమేమి జరుగుతుందో అని భయమవుతున్నది. ‘జయమైతే వస్తాను. లేకపోతే రాను.’ అని ప్రతిజ్ఞ చేసి వెళ్ళినారు. ఇలాంటి సమయాలలో వారు తిండి తీర్థం ముట్టరు. కుమారునికి అపాయం అయివుంటే, వారు జీవంతో వెనక్కురారు. ఈ చితి ఇట్లే మండుతుంటుంది. వారికోసం, నాకోసం, లక్ష్మికోసం, ఇంకా ఎవరెవరి కోసమో! నేను ఈస్థలం నుంచి కదిలేదాన్నికాను. కుమారుడు బ్రతికి ఉంటే, ప్రభువులూ జీవిస్తారు, నేనూ జీవిస్తాను; అంతఃపురానికి తిరిగివస్తాను. ఎవరి పుణ్యమైనా మనకిప్పుడు అరువురానీ; ఎవరి ధర్మమైనా అరువురానీ. ఈ చీకటి గడిచి వెల్తురురానీ. పోయిరా బొప్పణా! నీ తమ్ముణ్ణి కాపాడుకో; నీ ప్రభువులను రక్షించుకో. నేనిప్పుడు అభాగినిని; ఆశీర్వదించడానికి యోగ్యతలేని దానిని.” అనినది. బొప్పణనాయకుడు అక్కగారి మాటలకు వణికిపోయినాడు. వాడే ఎందుకు? పితృభూమిలో ఉన్నవారంతా వణికిపోయినారు. పురోహితులూ, పెరుమల పండితులూ, నోట మాటలేక స్తంభీభూతులయినారు. అక్కడ

గుమిగూడిన పౌరులందరూ "తల్లీ, మేమూ మీతోపాటే." అని కూర్చున్నారు; అందరూ తమతమ దైవాలను స్మరిస్తూ, ఆ మహాభయం పరిహారం కావాలని వేడుకుంటూ కూర్చున్నారు.

బొప్పణనాయకుడు ఆ నడిరేయి రాజ పితృభూమి వెలుపల ఉన్న తటాకంలో స్నానంచేసి, తన భవనానికి మరలి వచ్చి, యుద్ధపు దుస్తులు ధరించి, గుర్రమెక్కి తన సైన్యం ఉన్న శిబిరానికి సూటిగా వెళ్ళి మార్గాయాసంతో అలసి సొలసి నిద్రిస్తున్న నాయకులను అప్పుడు మేల్కొల్పి ఉన్న కఠిన పరిస్థితిని వారికి వివరించినాడు. అందరూ ఒకే మనస్సుతో ఆ క్షణమే బయలుదేరవలెనని నిశ్చయించినారు. ఎంత తొందరగా ప్రయత్నించినా సైన్యాన్ని సిద్ధపరచి, కదలడానికి శుక్రోదయ మయినది. దాదాపు రెండవ గవ్యూతి సమీపించేటప్పుడు, హొయిసళ సైన్యంలోని లేఖార్థ వాహకుడైన అశ్వికు డొకడు వారికి ఎదురు పడినాడు. వాడు దూరంలో కనిపించగానే బొప్పణనాయకుని హృదయగతి తీవ్రమయినది, ఇనుమడించినది; మూడురెట్లు హెచ్చయినది. దగ్గిరికి వచ్చిన అశ్వికుడు గుర్రం కళ్ళెంలాగి నిలిపి, గుర్రం మీదినుంచి కిందికి దూకి, బొప్పణనాయకునికి నమస్కారంచేసి, "హొయిసళేశ్వరులకు జయం." అనినాడు. "కుమారవిష్ణువు?" అని ప్రశ్నించినాడు బొప్పణనాయకుడు. "వారికే జయ మయినది!" అనినాడు అవసరికుడు. బొప్పణనాయకునికి భరించరాని ఆనంద మయినది; ఆశ్చర్యమయినది; నమ్మరానంత ఆశ్చర్యమయినది. అశ్వికుని, "ఇద్దరూ క్షేమమా? నిజంచెప్పు." అని మరీమరీ ప్రశ్నించినాడు. "ఇమ్మడి దండనాయకుల పాదాల ఆన. ప్రభువులు సుఖంగా ఉన్నారు. కుమారవిష్ణు దండనాయకులూ క్షేమమే. కదలివస్తున్నారు. నేనే సంతోషవార్తను ముందుగా రాజధానికి తెలుపడానికి బయలుదేరినాను." అని వాడు సమాధాన మిచ్చినాడు.

బొప్పణనాయకుడు గుర్రంనుంచి కిందికి ఉరికి, ఆ అవసరికుణ్ని ఆలింగనం చేసుకొని, "నీవు నూరేళ్లు సుఖంగా వర్ధిల్లు. ఈ సంతోష వార్తను తెలిపినందుకు నీకు ఇప్పుడే మా సైన్యంలో నాయకపదవి ఇచ్చినాము. నీ సంతోష సమాచారం మేము నగరుకు తెలుపుతాము. నీవు ఈ సైన్యంతో రాజధానికి రా." అని ఉత్తరువుచేసి, తన సైన్యానికంతా వెంటనే రాజధానికి మరల వలసినదని ఉత్తరువుచేసి, తన గుర్రాన్ని వాయువేగ మనోవేగాలతో పరిగెత్తించుకొంటూ రాజధానికి బయలుదేరినాడు. గుర్రం అంతవేగంగా వెళ్లుతున్నా బొప్పణనాయకునికి అది చాల నెమ్మదిగా నడుస్తున్నట్టే భాసించినది. ప్రతి రెండు పరువులకూ గుర్రాన్ని మార్చుతున్నప్పటికీ, గుర్రం శక్తికి మించిన వేగంతో వెళ్లుతున్నప్పటికీ, దారి ముగియ నేలేదని అతడు భావించినాడు. అప్పుడతనికి గరుత్మంతుని రెక్కలు వచ్చినా, వాటి వేగమూ తృప్తి కలిగించేదికాదు. ప్రభువులూ, కుమారుడూ రాజధాని సమీపానికి రాకముందే, శాంతలదేవికి సంతోషవార్త తెలిపి, మనస్సు కుదుట బరచి, వారిని నగరుకు పిలుచుకొని వచ్చి, ఆమె, పురజనులు, ప్రభువులకు, కుమారునికీ ఎదురు వెళ్ళి స్వాగత మిచ్చేట్టు చేయవలెననే ఆశ పొంగులువారేది బొప్పణనాయకుని మనసులో.



మితిమీరిన వేగంతో పితృభూమికి వస్తున్న అశ్వికుని దూరంనుంచే చూచి శాంతల "అంతా ముగిసినది." అని అనుకొన్నది. కన్నులుమూసి తెరచేటంతలో అశ్వికుడు బొప్పణనాయకుడని మహారాజ్ఞికి తెలిసినది. బొప్పణనాయకుడు ఇరవై అడుగుల దూరంలో గుర్రాన్ని కళ్లెంలాగి ఆపినాడు. లాగిన వేగానికి, రభసానికి, గుర్రం వెనుకకాళ్ళ మీద నిలబడి, జారి ముందుకు మోకరించినది. బొప్పణనాయకుడు కిందికి దూకి, ఒకే ఊపిరితో, ఒకే పరుగుతో వచ్చి, మహారాజ్ఞి పాదాలు గట్టిగా పట్టుకొని, పాదాలపై తల ఆనించినాడు. అతని వైఖరి, తొందర చూచి, శాంతలదేవి హృదయం మరింత కంపించి పోయినది. బొప్పణనాయకుడు గవ్యూతి దూరం నుంచి పరిగెత్తివచ్చినట్టు చాల రొప్పుతూ, రోజుతూ, "నా తల్లి పుణ్యం. నా అక్కగార్ల పుణ్యం. దైవకృప. నా తమ్ముడు బతికి ఉన్నాడు. శత్రుసైన్యమంతా చెరపట్టి తెస్తున్నాడు. అప్పాజీవారిని దారిలోనే కలుసుకొనినాడు. ఇద్దరూ ఆనందంతో తిరిగి వస్తున్నారు. అక్కగారు ఇక నగరుకు తిరిగి వెళ్ళవలె. తమ్ముణ్ని ఆదరంతో, ఉత్సవంతో, ఆనందంతో ఎదురువెళ్ళి గౌరవిద్దాము. ప్రభువులను మహానందంతో ఎదుర్కొందాము." అని విన్నవించినాడు.

మహారాజ్ఞి కన్నులనుంచి ఆనందబాష్పధార వెలువడడం బొప్పణనాయకుడు చూచినాడు. శాంతలదేవి అప్పుడు బొప్పణనాయకుణ్ని రెండు చేతులతోను పైకెత్తి, దగ్గరకి లాగుకొని, అతిశయ వాత్సల్యంతో తల నిమిరి, "నీవు కుమారునికి అన్నవే. నాకు తమ్ముడివి. ప్రభువులకు కుమారుడివి.—అన్నీ నిజం. ఇలాటి సంతోష వార్తను తెచ్చిన నీవు నూరేళ్లు సుఖంగా బ్రతుకు. నా మనస్సుకు ఎంత సంతోషం కలిగించినావో అంత ఆనందం నీ తల్లిగారి మనస్సుకూ కలిగినది. ఇక అందరమూ నగరుకు వెళ్లుదాము. చీకటి తొలగినది." అని అనినది. అందరూ దుఃఖభారం పోయి చులకనయిన హృదయాలలో నగరుకు నడిచినారు. పురజనుల ఆనందం రాజమాత గతించిన దుఃఖాన్ని మరపించినది. అప్పుడు సూర్యోదయమై ఆరేడు గడియలయినది.

ఎంత సంతోషమయినా, హెచ్చు ఆడంబరానికి అది సమయం కాదు. దీనిని మహారాజ్ఞి సెలవివ్వవలసిన అవసరంలేదు; పౌరులకే తెలిసినది. ఆనాటి సాయంసంధ్యాకాలానికి ప్రభువులూ, కుమారుడూ సైన్యమంతా ఊరిబైటనిలిపి, తాముమాత్రం దండనాయకులు, నాయకులతో రాజధాని ప్రవేశించినారు. బొప్పణనాయకుడు రాజధాని మొగసాల వద్దనే ప్రభువులను దర్శించి, స్వాగతంచెప్పి నమస్కరించి, కుమారుని ఆలింగనంచేసుకొని, ఉత్సాహంతో, మహోత్సవంతో రాజధానిలోపలికి పిలుచుకొనివచ్చినాడు. నగరు మహాద్వారంవద్ద శాంతల, లక్ష్మి, బమ్మల, రాజల, దేవకి మొదలయిన చిన్నదేవేరులు ప్రభువులకు, కుమారునికి స్వాగతం చెప్పినారు. శాంతల, లక్ష్మి కుమారవిష్ణువును మహాప్రీతితో ఆలింగనం చేసుకొనినారు. ప్రభువులు ముందు దయచేయగా, వారివెంట అందరూ నగరు ప్రవేశించినారు. అక్కయ్యలు, ఇతర దేవేరులూ ఆభరణరహితలయి ఉండడంచూచి కుమారవిష్ణువుకు ఆశ్చర్యమైనది. దాసదాసీజనం ముఖాలలోను అంత కళాకాంతులు కనిపించలేదు. ప్రభువులు తమ మందిరానికి దయచేసినారు. కుమారుడు అక్కయ్యలనుచూచి, "అమ్మ ఎక్కడున్నారు ? వారిని చూడడానికి వెళ్ళుదాము." అని అనినప్పుడు శాంతల చేలాంచలంలో ముఖం కప్పుకుంది. లక్ష్మి కన్నుల నీరుపెట్టినది.



దీనినిచూచి కుమారుడు భయపడి "అమ్మకు ఏమైనది అక్కయ్యా ?" అని అడిగినాడు.

ప్రభువులు పురోహితుల సూచనమేరకు స్నానంచేసి, వాసోదకవస్త్రశేషం ధరించి, ఉత్తర క్రియాధికారపు ధర్భలను స్వీకరించి, వాసోదక కుంభం చేతబట్టుకొని, దహనశాంతికోసం, అస్థిసంచయనంకోసం పితృభూమికి పాదరక్షలు లేక బయలుదేరినారు. బొప్పణనాయకుడు, పురోహితులు, పెరుమల పండితులు, అమాత్యులు, సౌమ్యవస్త్రాలుధరించి, శిరోవేష్టనాలు తీసివేసి, వట్టికాళ్ళతో ప్రభువులవెంట నడిచినారు. దారిపొడుగునా పురజనులు—ఆబాలవృద్ధం—ఈ దృశ్యంచూచి, దుఃఖపూరితులై "ఏ మహాభాగునికీ ఈ కర్మబంధం తప్పునుగదా !" అని అనుకున్నారు.

కుమారుణ్ని సమాశ్వసించడానికి అక్కయ్యలు విశ్వప్రయత్నం చేసినారు; సాధ్యంకాలేదు. దుఃఖతాపంలో అతితీవ్రంగా తప్తమైన హృదయమంటే, అతనిదే. ఈ దుఃఖాన్ని తట్టుకోలేక అతడు తనకు ఏ ఆపత్తు తెచ్చుకుంటాడో అనే సంశయంతో అక్కయ్యలు వాని పక్కవదలి కదలలేదు. కొంచెం సమాశ్వసించిన వారిదుఃఖం తమ్ముని తీవ్రదుఃఖంచూచి మరల తిరగబెట్టినది. మరణమూ జీవితంలో, జీవనంలో ఒకఘట్టమని శాంతల, లక్ష్మి ఎరుగుదురు. అయితే కుమారవిష్ణువుహృదయం ఇంకా లేలేతదికదా ! కుమారునికి కలిగిన హెచ్చుదుఃఖమేమిటంటే : "అమ్మ ఇంకా బ్రతికేవారే. నేను మరణించానని దుఃఖంలో మరణించినారు. నాకోసం మరణించినారు. నేనే వారి మరణానికి కారణమయినాను." అనేది. దీనికి ఎవరు సమాధానం చెప్పగలరు ? చాలసేపు దుఃఖించి, ఒకసారి మెడయెత్తి శాంతలక్కయ్యవైపు చూచి, "అప్పాజీ ఎక్కడ ?" అని ప్రశ్నించినాడు కుమారవిష్ణువు. "పితృభూమికి నడిచిపోయినారు." అని ఎవరో సమాధానమిచ్చినారు. "ఏమిటి ? అమ్మ ముఖావలోకనంకూడా నాకులేదా ?" అంటూ, తన ఉడుపులుపీకి విసిరివేసి, ఆ వికారస్థితిలో, వికృతవేషంలో లేచి పరుగుతీయబోయినాడు.

అక్కలిద్దరూ అతని రెండు రెక్కలూ గట్టిగా పట్టుకొని వెనక్కులాగినారు. దుఃఖభరంలో అతనికి అది లక్ష్యమా ? ఒక్కసారి దులుపుకొని, నగరు నుంచి పరుగుతీసినాడు. దారిపొడువునా "అమ్మా అమ్మా ! అయ్యో అమ్మా !" అని దుఃఖంతో అరుస్తూ, దిక్కు తెలియక విలపిస్తూ, శ్మశానానికి పరిగెత్తినాడు. పురజనులు అతనినీ, అతని ఘోరదుఃఖమూ చూచి, "అయ్యో ! ఇలాటి మహాశోకంలో బుద్ధి వికల్పంకావడమూ కద్దు. ఇతని దుఃఖం దేవునికే చేరనీ !" అని తామూ దుఃఖపడినారు. కుమారునికి ఏమీ తెలియదు; ఏమీ కనిపించదు; పురజనులు తనను ఈ వికారస్థితిలో, వికారవేషంలో చూస్తున్నారనే జ్ఞానమూ అతనికిలేదు. అతనిని పట్టుకొని ఆపే శక్తి, ధైర్యం ఎవ్వరికీలేదు. కొంతసేపటికిముందే విజయశాలిఅయి, మహాసంతోషంతో, మందహాస సుందరముఖంతో పురం ప్రవేశించినవాడు ఇంతలో ఈ ఘోరదుఃఖంతో తపించడంచూచి, "అయ్యో! ఈభూమిలో ఏదీ ఒక్కనిమిషమైనా స్థిరంగాఉండదు. సుఖమెంత ? దుఃఖమెంత ? విధి ఎందుకు ఇలాగు ఆడిస్తుంది ? ఎందుకు ఇలాగు కాడిస్తుంది ?" అని పురప్రజలు తపించిపోయినారు.

పితృభూమిలో పురోహితులతోపాటు ఉన్న ప్రభువులు అప్పుడే చితాశాంతికి ప్రథమ ఘటోదకం చల్లినారు. నూరారు మండూకాలు ఒకేమారు బెకబెకలాడిన శబ్దమయినది. చితిలో అగ్ని ఇంకా భయంకరంగా ఉంది. కుమారుడు వికారంగా విలపిస్తూ, ధైర్యం తప్పి పరుగున వస్తూ ఉండడం ప్రభువులు తిలకించినారు. పక్కకు తిరిగి ఇంకా ఆరని చితాగ్నినీ చూచినారు. కుమారుని హృదయం గ్రహించిన ప్రభువులు ముందు జరుగగల ఘోరం శంకించి, ఉదకఘటాన్ని కిందపెట్టి కుమారునికి ఎదురువచ్చి, తమ మహాబాహువులతో పర్వతం ప్రవాహాన్ని అడ్డగించి నిలిపేటట్టు కుమారుణ్ణి ఆపి, తమ రొమ్మున చేర్చుకున్నారు.

అప్పాజీని చూచిన వెంటనే, వారి దేహస్పర్శ కలిగిన వెంటనే, తల్లి ఎత్తుకొని ఓదార్చిన బిడ్డవలె కుమారుని దుఃఖం ఊర్ధ్వోన్మాదావస్థనుంచి అధోముఖంగా దిగినది; సమీపంలోని ఒక మానుకు ఆనుకుని తల వంచుకొని



కూర్చున్నాడు. ఆనాటి కర్మలన్నిటినీ ముగించి ప్రభువులు కుమారుణ్ణి తమతోపాటే పిలుచుకొని వెళ్ళినారు. కుమారుడు కొన్నాళ్లు ఆహార నిద్రలు మాని, ఎప్పుడు ఖిన్నుడుగా, మౌనిగా గడపినాడు. "నేనూ ఆహారం తాకను." అని అక్కయ్య రెండునాళ్లు అతనితోపాటే ఉపవాసం ఉన్నమీదట, గత్యంతరం లేక తిండి తాకినాడు. అమ్మ మరణ దుఃఖాన్ని మరువడానికి కుమారునికి కొన్ని నెలలు పట్టినది. దైవం అతని కన్నీరు తుడిచినది; మరల నవ్వించడానికి, మరల ఏడిపించడానికి.

రాజమాత మరణం, మరణ కారణం, గంగరాజులుగారు, మారసింగమయ్య, పునీస కేతమల్లనాయకులు, మొదలయినవారికి నాల్గునాళ్ల తర్వాత తెలిసింది. వారు అన్ని సైన్యాలతోనూ ఎంతో తొందరగా రాజధానికి బయలుదేరినా, వారు చేరినది పదవదినం. రాజమాత అంత్యక్రియలన్నీ గొప్పగా జరిగినవి. దానధర్మాలు గంగరాజుగారి నేతృత్వంలో అపారంగా జరిగినవి. అందువల్ల రాజవంశంవారి కందరికీ ఒకవిధమయిన మనస్తృప్తి కలిగింది.

యుద్ధభూమినుంచి తిరిగి వచ్చిన మీదట గంగరాజుగారి ఆరోగ్యమూ పట్టు తప్పినది. జయించిన రాజ్యాలను క్రమపరచి, నిర్వహణకు, పై విచారణకు సరైనవారిని నియమించి, రాజాదాయాన్ని మోసం లేకుండా, ప్రజల మనస్సు నొవ్వకుండా, క్రమంగా వచ్చేట్టు చేసి, ఈ విధంగా ఒక్కొక్క ఏర్పాటూ చేసేటప్పుడు, వారికి యుద్ధంలో అయ్యే శ్రమకంటే, హెచ్చుగా, దేహశ్రమ, బుద్ధిశ్రమ కలిగినవి. రాజమాత కర్మాంతరాలు ముగుస్తూ ఉండగానే భీష్ములవారి స్వస్థత చెడినది; పక్క పట్టినారు. రెండు నెలలపాటు వేసిన పక్క వేసినట్లే ఉండినది. ఉత్తమ భిషగ్మణులనినారు :- "భీష్ములకు ఇక ఉందామనిలేదు. అందువల్ల అమృతమూ పనిచేయదు." అని. ప్రభువులు ఇక తమకు గంగరాజులుగారు దక్కరని తెలుసుకొనినారు. వారి అస్వస్థత విషమించడం చూచి హొయిసళ రాజ్యమే భయావృతమయినది.

గంగరాజులవారికి నానాటికీ కఫబాధ హెచ్చయినది. "ఏచికిత్సా నాకు వద్దు." అనినారు. అంతిమ దివసాలు ఆసన్నమయినవి. గంగరాజులుగారు సల్లేఖనం అవలంబించి, దక్షిణ పార్శ్వానికి తిరిగి పడుకొని, అన్నపానాలు వర్జించి, పంచపదాలు ధ్యానిస్తూ, ఇహలోకాన్ని మరచినారు. ప్రభువులు, శాంతల, లక్ష్మి, మాచికబ్బె, మారసింగమయ్య అంతిమ దినాలలో అహర్నిశం వారి రోగశయ్య పక్కనే ఉన్నారు. ఇక ఒకటి రెండు నాళ్ళనగా వేలాపురినుంచి పెరుమల పండితులూ వచ్చినారు.

సుదినాన, సునక్షత్రంలో గంగరాజులుగారు ఇహంత్యజించి, పరవపదానికి వెళ్ళినారు. ప్రభువులు తండ్రినికోల్పోయినట్టు సంకట పడినారు. హొయిసళ రాజ్యంలోని ప్రతియింటా ఆనాడు మృత్యువు జొరబడి వెళ్ళిపోయినట్టయినది. రాజధానిలో ఉత్సవానికి చేరినట్లే జనం చేరి ఆ మహాత్మునికి దుఃఖాంజలి సమర్పించినారు. గంగరాజులవారి కళేబరం సమస్త రాజ మర్యాదలతోను రాజవీథులలో ఊరేగించి పితృభూమికి తీసుకొని వెళ్ళినారు. ప్రభువులు, కుమారవిష్ణువు, సమస్త సచివులు, చమూపతులు, రాజ్యాధికారులు, కోశాధికారులు, రాజధానిప్రజలు భక్తితో దుఃఖంతో, నగ్నశిరఃపాదులై పితృవనానికి నడిచివెళ్ళినారు. కళేబరం పితృభూమిలో ఉంచినప్పుడు దానిపై పడిన పుష్పరాశి కొండంత ఎత్తయినది.

ఆకుల మరుగున అణగిన సుగంధ పుష్పంవలె, హొయిసళరాజ్యాన్ని తామే కట్టి పెంచి, సింహాసనంపై కూర్చోక సర్వతోముఖంగా ఏలి, తమ యశస్సునే హొయిసళ రాజులకు ధారపోసి పోయిన నిష్కామ కర్మయోగి గంగరాజులుగారు పరమపదం చేరినారు. రాజమాత మరణించిన శోకమింకా తీరలేదు, అంతలోనే రాజ్యానికి ఈ మరొక శోకం సంప్రాప్తమయినది. బొప్పణనాయకుడు తండ్రి ఉత్తరక్రియలను చాల భక్తిశ్రద్ధలతో చేసినాడు. దాన ధర్మాలన్నిటినీ ప్రభువులే నగరునుంచే నడిపించినారు. దేశమంతటా సర్వచైత్యాలయాలలోను గంగరాజుల ఆత్మశాంతికి విశేష పూజలూ, అన్నదానాలూ జరిగినవి.

# 11

పట్టుదలగల కేతమల్ల నాయకులకు, దామోదరుని తల నేలపై దొర్లించినమీదట మనస్సుకు చాలవరకు సమాధానమయినది. వారిలాగే చిక్కులుపడిన పౌరులూ, వణిక్కులూ, శ్రీమంతులూ, కేతమల్లనాయకులు తలవనపురంలో ఉన్నప్పుడు వారివద్దకువచ్చి, "దైవమే ఈపనిని మీతో చేయించినది. మేమంతా మీ ఉపకారం జీవితం ఉన్నంతకాలం స్మరించుకొనేటట్టు చేసినారు. ఇక ఈ దేశానికి క్షేమమయినది." అని కేతమల్ల నాయకులను పొగడి, "వణిక్క దండనాయకుడయినాడు." అంటూ వెళ్ళినారు.

కేతమల్లనాయకుడు ద్వారపతికి మరలినమీదట దేవాలయాల నిర్మాణ కార్యక్రమం తొందరతొందరగా సాగినది.

కర్మబాధ్యులయిన ప్రభువులు ఆ సంవత్సరమంతా రాజధానినివదలి ఆటూఇటూ కదలడమే పడలేదు. అప్పుడప్పుడు వేలాపురికిపోయి మామగారయిన పెరుమల పండితులను చూచివచ్చేవారు. లక్ష్మి, ఒక్కొక్కసారి శాంతల, ప్రభువులతోపాటు తమ అయ్యగారిని చూచిరావడానికి వెళ్ళేవారు. పునీసనాయకుడు, మారసింగమయ్య దండనాయకులూ, "యుద్ధానంతరం చేరినరాజ్యాలలోని సామంతులు, నాయకులు, ప్రెగ్గడలు, గంగరాజులుగారు చేసిన కట్టుదిట్టాలలో, రీతిలో నడుచుకొంటున్నారా, విచక్షణ ఏమైనా సడలినదా ?" అనేదాన్ని అప్పుడప్పుడు పోయి పరిశీలించి వచ్చేవారు. దీనివల్ల దేశమంతటా రాజ్యభారక్రమం ధర్మంతో నడచేటట్టు అయినది.

గంగరాజుల తర్వాత హేమాద్రిపండితులకు ప్రభువులు మహామాత్య పదవిని దయచేసినారు. గంగరాజులుగారు రాజకార్యాలను నిర్వహించే రీతి నీతులను హేమాద్రిపండితులు బాగా తెలిసినవారు. దీనివల్ల దేశమంతటా శాంతి సుభిక్షాలు నెలకొన్నవి. ధార్మికులయిన ప్రభువులు, సత్యసంధులయిన సచివులు, అధికారులు, దైవభక్తిగల ప్రజలు ఉన్నప్పుడు భూలోకం స్వర్గంకాదా ?

ఈవిధంగా సుఖసంకథా వినోదాలతో గడుస్తున్నప్పుడు ఒకనాడు విష్ణువర్ధనప్రభువులు కుమారవిష్ణువుకు వివాహం చేయాలని ఆలోచించినారు. తమ ఆలోచనను శాంతలకూ తెలియచేసినారు. "ఇంకా పసివాడుకదా ? ఒకటి రెండు సంవత్సరాలు ఆగితే కాదా ?" అన్నది శాంతల.

"పద్దెనిమిది పందొమ్మిది కావస్తున్నది. నీ తమ్ముడు కసుకాయేమీ కాదు. చూడడానికి ఇరవై అయిదేండ్ల పెద్దమనిషి. అంతేకాక, మాబ్రతుకూ ఏమి శాశ్వతం ? ఈ యుద్ధాలలో మేము ఇంతవరకు మిగిలి ఉండడమే ఆశ్చర్యం ! నీ అత్తయ్యగారి వర్షాబ్దికం అయినతర్వాత చేయడమే మేలు. నీ తమ్మునికి నీవే సరైన కన్యను వెదుకు." అన్నారు ప్రభువులు.

శాంతల ముఖంలో కొంచెమైన తొందర కనిపించకపోవడంవల్ల ప్రభువులు మాటలు కొనసాగిస్తూ : "చూడు, ఇప్పుడు కాకపోతే, ఇక రెండుసంవత్సరాలు మాకు తీరదు." అన్నారు.

"ఎందుకు ? తీరదంటారు ఎందుకు ?" అని అడిగే స్వభావంకాదు శాంతలది. "అనుచితమయిన ఆలోచనలు నాప్రియుని మనసులో ఎన్నటికీ పుట్టవు." అని శాంతలకు తెలుసు. ప్రభువుల మనస్సును నీడవలె అనుసరిస్తున్న శాంతల "అలాగయితే, ఈ పెండ్లి ఆలోచన సముచితమే." అని గ్రహించినది. ఆరోగ్యం, గుణంగల ఇంటితనం, రూపు, శీలం, విద్య, వినయం ఉన్న కన్యను ఎన్నికచేసేభారం, ఆకన్యను కుమారునికి నచ్చజెప్పించే భారం—రెండూ శాంతల పాలిటికే పడినవి.

"నాకెందుకు ఇప్పటినుంచీ ఈ బొండకొయ్య ? ఇంత తొందరెందుకు ?" అన్న కుమారుని ప్రశ్నకు "నీ అప్పాజీవారు తొందరపడుతున్నారు. కావలెనంటున్నారు. నేనేమి చేయను ?" అన్నది అక్కయ్య. అప్పాజీని అడిగేటంతటి ధైర్యం అతనికిలేదు; అతనిస్థితి బహు ఇక్కట్టయినది. చిన్నక్కయ్యతో, పెరుమల పండితులతో, హేమాద్రి పండితులతో, అచ్యుత గోవిందులవార్లతో—అందరితోనూ అంగలార్చినాడు.



ప్రభువులకు చెప్పేటంత ధైర్యం వీరెవరికీ కలుగలేదు. కారణమింతే ! "ఇతనికి పెండ్లికానీ." అనేది వారి ఆకాంక్షకూడ. ఇతనిని చూచినప్పుడు మాత్రం "అయ్యో పాపం ? ఎవరైనా అప్పాజీవారికి మనవిచేయవలె." అంటూ ఛలోక్తితో పంపివేసేవారు.

బ్రహ్మచర్య యమనియమాలతోను, శస్త్రశాస్త్రాభ్యాసాలలోను, సాముగరడీలలోను నిరంతరం నిరతుడయిన కుమారునికి పెండ్లి "కుంటెద్దు కుత్తుకకు గుదిబండవలె." కనిపించినది. కొసకొసకు అతనికి కోపంవచ్చి, పెద్దఅక్కయ్యవద్దకు వచ్చి, "మీరంతా ఒకేగుంపులోని దొంగలు. నాతల్లి ఉండిఉంటే, నేను మీకంతా చేతులు కాళ్ళు కట్టుకొని ప్రార్థించవలసి వచ్చేదా ? పారాదేపక్షిని పంజరంలో పడవేసి చూచే కఠినాత్ములు మీరు. నీవూ అంతే. నోటితోమాత్రం తియ్యతియ్యని మాటలాడుతావు. అప్పాజీవారేమో నన్నుచూచిన తత్క్షణం ఏమి అడుగుతాడో ఏమి అంటాడో అని ముందుగానే ముఖం మూడుమూరలపొడవు చేసుకొంటారు. నాకు తెలుసు. ఇదంతా వగలు. మీకందరికీ ఆటలాడడానికి ఏదో నెపం కావలె. అయ్యో! ఈయజ్ఞానికి పశువు నేను. అప్పుడు వచ్చిన కొంగువారో, వేంగీవారో, చోళులో, చేరరాజులో—ఎవరయినా రాజధానిమీదికి ఇప్పుడు దండెత్తి రారాదూ ? అలాగయినా కొంత వ్యవధిదొరకేని. లేకపోతే ఎవరయినా ద్రోహులు ఇప్పుడు ఎదురుతిరగరాదూ ? నేనే సైన్యంతో వెళ్ళి మూడునాళ్ళలో మట్టుపెట్టి వస్తానని అప్పాజీవారి ఆనతి పొంది పోయి ఒక్క సంవత్సరమంతా గడుపుతూ, కూర్చుందునే ?" అని ఆక్రోశించినాడు.

"నీవే ఎవరినైనా ఎగసనతోసి నిలబెట్టు." అన్నది శాంతల.

"ఆమీదట అప్పాజీవారికి అసంగతి తెలియనీ. ఒకవేళ నీవే చెబుతావో ఏమో ! ఎవరు నమ్మేవారు ?"

"మరి ఏదో కొండవిరిగి తలమీద పడినట్టు పలవిస్తున్నావే ?"

"అయ్యో అక్కా, నీకు ఎలాగు తెలుస్తుంది నాకష్టం ! నాకిప్పుడు స్వస్థతలేదు. కొంచెం నిదానించండని అప్పాజీవారికి చెప్పరాదు ?"

"అలాగుననా? అయ్యో పాపం! ఒకటి రెండు నెలలయినా నిదానించండని చెబుతాను."

"ఒకటి రెండు సంవత్సరాలే స్వస్థత ఉండదు."

"అలాంటప్పుడు నీవే చెప్పకో. చెపితే ఎవరయినా ఒప్పేటట్టుండ వలె."

అక్కయ్య మాటలువిని కుమారవిష్ణువు బిక్కమొగంతో లేచి వెళ్ళి పోయినాడు. వాడు గుమ్మము దాటినాడో లేడో, ఇక్కడ శాంతల, లక్ష్మి నవ్వడం మొదలు పెట్టినారు. నవ్వు తెరలు తెరలుగా వచ్చినది. కోపంతో వెళ్ళిపోతున్న కుమారునికి ఈ నవ్వు వినిపించినది. అక్కడే ఆగి విన్నాడు. లక్ష్మి నవ్వినది; శాంతల నవ్వినది. లక్ష్మి ఇంకా నవ్వినది; శాంతల మరిన్ని నవ్వినది. కుమారునికి కోపం వచ్చినది. అక్కడినుంచి బిరబిర వెళ్ళిపోయినాడు.

ఆరాత్రి ఏకాంతసమయంలో శాంతల ప్రభువులకు ఈ సంగతి తెలిపినది. ప్రభువులు పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వినారు.

ఎవరెంత చెప్పినా, ప్రభువుల నిశ్చయం సడలించడానికి కాలేదు. శాంతల ఎంతో సాహసంతో ఆపజూసింది. సార్థకం కాలేదు. "దేవీ, కానిపోని మాటలలో ఏమిటి ఫలం? నేను చక్కగా ఆలోచించే ఈనిశ్చయానికి వచ్చినాను. వానికి ఏమిటి కష్టం? నావలె ఐదారుగురు కన్యలను వాడు పాణిగ్రహణం చేసుకో నక్కరలేదు. తన మనస్సుకు నచ్చిన ఒక్క కన్యను పెండ్లాడనీ. తగిన కన్యను నీవే వెదుకు. నీవు ఏరిన కన్యను వాడు మనసార ఒప్పుకుంటాడు. ఒప్పించు." అనినారు ప్రభువులు.

శాంతలకు ఈ విషయం చాల చిక్కయినది. మనసులోని చిక్కు ప్రియురాలి ముఖంలో ప్రతిఫలించడం ప్రభువులు చూచినారు. అప్పుడు, శాంతల చేతులు పట్టుకొని దగ్గర కూర్చోబెట్టుకొని, గుసగుసగా తమ మనస్సులోని భావాలను ఆమెకు తెలిపినారు. శాంతల ముఖం చెమర్చినది;



శరీరం భయంతో కంపించినది. ఆమె తన నుదుటి కుంకుమ సౌభాగ్యాన్ని, మెడలోని మాంగల్య మంగళాన్ని స్పృశించి, అంతరిక్షంవైపు చూచి, "విజయనారాయణ!" అని అన్నది.

"దేవీ, భయపడినావా?"

"లేదు ప్రభూ! మీకీ ఉద్యమంలో విజయం కోరినాను."

"మా సౌభాగ్యం మీరిద్దరూ. మీ ధర్మం, శీలం, స్వభావం, నోములు మాకురక్ష."

"ప్రభూ ఇది పరస్పరం. ఇవన్నీ చేరినా మీ ప్రీత్యనురాగాలకు సమానమా? మా హృదయానికి ఇంతకన్నా చలువ ఏమున్నది?"

"దేవీ, నీ పలుకులు మాకు అమృతమంత రుచి. నీ సమీపంలో ఉంటే మాకు స్వర్గంలో ఉన్నట్టు భాసిస్తుంది. మాకు ఇంకెక్కడా, ఇంకెవరివద్దా, ఈ సుఖం, ఈ సంతోషం, సంతృప్తి, ఈ శాంతి ఉండవు. దేవి, దీనిని ముఖస్తుతి అని భావించవద్దు."

"ప్రభువులు మా అందరి విషయంలోను ఎప్పుడూ, ఈలాగుననే ఉండవలెనని ప్రార్థిస్తున్నాను."

"నీవూ మా పాలిట ఇలాగే అమృతంగా ఉండుమని మేమూ భగవానుని ప్రార్థిస్తున్నాము. ఈ విజయాలు, ఈ సంపత్తు అన్నీ నీవే. నీనుంచి, నీ శారదనుంచి, నీ విజయనారాయణుని నుంచి...."

"ఔను. మీరు కొసకు చెప్పిన మాటలు వాస్తవం. అంతా విజయ నారాయణుని కృప. మానుంచి కాదగినది మీ శుశ్రూషమాత్రం...... స్వామీ, ఒక్క వేడికోలు."

"చెప్పు, దేవీ, చెప్పు. అపేక్షించరాని విషయంలో నీ మనస్సు ప్రవర్తించదని మాకు తెలుసు. కనుక శంకా సందేహాలు మాని చెప్పు."

"దైవం అన్నీ అనుగ్రహించినాడు. సంతతి సౌభాగ్యం మాత్రం నాకు లేదని తోస్తుంది."

"అది మనమన పూర్వపుణ్యాలను బట్టి ఉంటుంది. సంతానం సౌభాగ్యమూ కావచ్చు; దౌర్భాగ్యమూ కావచ్చు. దైవం ఇచ్చినా సంతోషమే, ఇవ్వకపోయినా సంతోషమే."

"ప్రభువులు అవధరించవలె. మునుపు ఒకనాడు అత్తయ్యగారు నన్ను ప్రీతితో పిలిచి, దగ్గర కూర్చోబెట్టుకొని ఇలాగున అన్నారు: 'కూతురా, సంతతి పొందు. ఈ రక్తాన్ని నశింపజేయవద్దు. సంతతిని కొనసాగించే భాగ్యం నీది. ఇదొక్కటే మా కడపటి ఆశ. మేము ప్రాణాలు బిగబట్టుకొని ఉండడం దీనికోసమే; అప్పాజీకి ఒక్క మగబుడుత పుట్టనీ అని. ఆశతీరక మేము మరణిస్తే, మా ఆత్మకు ఖండితంగా శాంతి ఉండదు.' అని నాతలపై చేయిపెట్టి అన్నారు."

"దేవి, ఇప్పుడు కాలమేమి మించిపోయినది? నీకు సంతానం కలుగదని నీకు ఎలాగు తెలుసు?"

"స్వామీ? రెండేండ్లకు పైగానే మనం కలిసి ఉన్నాము గదా?"

"దేవి, ఇదేమిటి నీ భయం? నాకు ఆశ్చర్యంగా ఉన్నది?"

"అది నా హృదయానికి మాత్రమే తెలుసు."

"భద్రే, నీవు భయాదృతవై ఉన్నావు."

"ఉండవచ్చు. ఆ సందేహం దూరంకానీ. మీ ఆశీర్వాదం ఉండనీ. భగవంతుని కరుణ ఉండనీ. అయినా...."

"అయినా, ఏమి దేవీ?..."

"లక్ష్మికూడ మీ ఆదరాభిమానాలకు పాత్రురాలు కానీ."



"శాంతలా, ఏమిటి నీవు అంటున్న మాట! చోద్యంగా ఉన్నదే! మాకు లక్ష్మిపై ప్రేమాభిమానాలు లేవా? ఆ విషయంలో నీవు సంశయపడనక్కరలేదు. లక్ష్మి నీలాగే మాకు ప్రేయసి. లక్ష్మి నీతో అన్నదా ఆలాగున?"

"లేదు ప్రభూ. అది ఎప్పుడూ నాతో ఆలాగున అన్నదికాదు. అది నా చెల్లెలుకదా? నాకు కాకపోతే, దానికయినా ఒక్క మగ శిశువు కలుగనీ. అది నాశిశువే అవుతుంది."

"దేవి, మీ యిద్దరి అన్యోన్యం చూచిన కొద్దీ, విన్నకొద్దీ, మాకు అమృతం ఆస్వాదించినంత తృప్తి అవుతున్నది. సహోదరులు కాకపోయినా, పూర్వం ఏ కాలంలోనైనా, ఒక తల్లి కడుపున పుట్టినవారయినా మీ అంత అన్యోన్యంతో ఉన్నారా? మాకు ఇదొక మహాశ్చర్యం. దేవి, నీ హృదయం అమృతసాగరం. ఇది విష్ణువర్ధనుని పుణ్యం."

శాంతల ముఖం సిగ్గుతో తటాలున ఎర్రబడినది. తలవంచుకొన్నది. ప్రభువులు శాంతల చెక్కులను మృదువుగా పట్టుకొని యెత్తి, చూపులో చూపునాటి మందహాసంతో "మాకు తెలుసు. లక్ష్మి బిడ్డడిని నీబిడ్డడనే భావించే హృదయం నీది. అయితే, దానివల్ల నీ వనుకున్న సమస్య పరిష్కారంకాదు." అనినారు.

"ఎందుకు ప్రభూ?"

"హొయిసళ వంశంలో యువరాజపట్టం ఎప్పుడూ పట్టమహిషి పుత్రునికే."

శాంతల ఆమాటలకు భయపడి "పట్టమహిషికి పుత్రులు కలుగకపోతే?" అని ప్రశ్నించినది. ఈమాటలాడినప్పుడు ఆమెఫాలం చెమర్చినది.

"అప్పుడు పట్టమహిషి స్థానానికి మరొకరిని తేవడం జరుగుతుంది. కాని, ఇంతవరకు అట్టి సందర్భంరాలేదు."

శాంతల దీర్ఘంగా నిట్టూర్చినది. హృదయాన్ని సమాధానపరచుకొనే రీతిగా వక్షంపై చేయిపెట్టుకొని, తటాలున పతి రెండుపాదాలూ బిగువుగా పట్టుకొని, "స్వామీ, నన్ను మన్నించవలె. మీ మనస్సు నొప్పిపడేట్టు మాట్లాడినాను. మహాపరాధమయినది. క్షమ వేడుతున్నాను." అని విన్నవించుకొన్నది.

విష్ణువర్ధనులు చేతులుచాచి, శాంతలను పైకివత్తి, దగ్గిర కూర్చోబెట్టుకొని, "అపరాధ మేమిచేసినావు ? ఏమీలేదే ?" అనినారు.

"పట్టమహిషికి పుత్రుడు కలుగకపోతే, అని అడిగినానుకదా ? ఈ దోషానికి ప్రాయశ్చిత్తమేమి ?" అని ప్రశ్నించినది శాంతల.

ప్రభువులు మందహాసంతో "ఇదే." అంటూ ఆమెను అత్యానందంతో ఆలింగనంచేసుకొని, "దేవి, మన యిరువురి శరీరాలు ఎందుకు వేరువేరుగా ఉన్నవి ? ఒక్కటే కాగూడదూ ? చూచినావా ? పరమశివుడు అర్ధనారీశ్వరుడయినాడు. మనుష్యులకు ఈ అర్హతలేదా ? దేవతలు మనుష్యులను పలువిధాలుగా మోసంచేసినారు." అనినారు.

శాంతల పతి ఆలింగనంతో పులకాంకితురాలై సుఖమందహాసంతో "స్వామీ నా పట్టాన్ని నేనే లక్ష్మికిఇస్తాను. దీనికి మీరు ఒప్పుకొని, దానిని పట్టమహిషిగా ఏలుకోండి, లక్ష్మి పట్టపు దేవేరికావడం చూడవలెనని ఆశపడుతున్నాను." అనినది.

ప్రభువులు శాంతలనుచూచి, తమముఖాన్ని రెండుచేతులలోను కప్పుకొని, "దేవీ, ఇప్పుడునీవు మమ్ములను మన్నించవలె. ఈ కోరిక నీవు కోరదగిందికాదు; మేము ఒప్పదగినదికాదు. లక్ష్మి ఆ స్థానానికి అనర్హురాలనీకాదు...దేవీ, నీ నిర్మమత్వానికి మేము తలవంచుతున్నాము." అనినారు.



శాంతల చెవులుమూసుకొని. "శాంతం పాపం, శాంతం పాపం. ఇదేమిటి మీ మాటలు ? నేను మీకంటె చిన్నదానిని కానా ?" అనినది.

"దేవీ, దేహప్రమాణంలో, వయఃప్రమాణంలో, నీవు మాకు చిన్నదానివి. నీ మనస్సుమాత్రం చాల దొడ్డది, బహుదొడ్డది. మేము తలవంచడం దానికి."

"ప్రభూ, లక్ష్మిని మీరు తెలుసుకోవలె. దానిమనస్సు నామనస్సుకన్నా ఎంతోదొడ్డది. అక్కయ్య ప్రభువులను పాణిగ్రహణం చేసుకుంటుందని భావించి, ఇక తన అయ్యగారు తనను మరొకఊరికి పెండ్లిచేసి పంపితే, అక్కయ్య సహవాసం తనకు తప్పిపోతుందనే వ్యసనంలో తాను పెండ్లాడదననే నిర్ధరించినది. ఇట్టి చెల్లెలికి నా సుకృతమంతా ధారపోసినా కొంచెమే."

"ఈ గ్రహచారానికే మేము మీ యిద్దరినీ చేపట్టడం ?"

శాంతల సమ్మోహకంగానవ్వి, "గ్రహచారం కాదది; గ్రహమైత్రి. అందువల్లనే మేమిద్దరం ఒక్కటి." అన్నది.

"మేమిద్దరం అంటే, నీవూ మేమూ అనా, లేక నీవూ లక్ష్మి అనా?"

"స్వామీ, నేనూ మీరూ; మీరు లక్ష్మీ; అందువల్ల నేనూ లక్ష్మి."

"తథాస్తు. తథాస్తు."

"అందువల్ల లక్ష్మికూడా మీకు పట్టమహిషే."

"దేవి, నీవు మాటలలో సరసురాలు, చతురురాలవూ కూడ. అయినా, నీకు తెలుపుతున్నాను : ఏ రాజుకూ, ఏ కాలంలోను, ఇద్దరు పట్టమహిషులు ఏకకాలంలో ఉన్నది లేదు."

"ఇద్దరు ఎక్కడ ? మనం ముగ్గురం ఒక్కటే కదా ?"

"అయ్యో ! నీవు మమ్ములన్ను మాటల్లో ఇరికించివేస్తున్నావే."

"స్వామీ, అత్తయ్యగారు నా తలపై చేయిపెట్టి చెప్పిన మాట—హొయిసళ రాజుల రక్తాన్ని నశింపజేయవద్దు—అని. నేను అత్తయ్యగారికి మాట యిచ్చినట్లే అయినది. వారి ఆత్మకు తృప్తి కలుగవలె ప్రభూ. అత్తయ్యగారి మాటలు నా రొమ్ముపై ఉన్నవి. అదే నాకు రాత్రీ పగలూ దుఃఖం. ఒకవేళ నేను మరణించి కాలిపోయినా, నాగుండె కాలదు."

ప్రభువులు తటాలున శాంతల నోరుమూసి, "ఏమి మాటలివి దేవీ? నీ మాటల సుధలో స్వర్గాన్ని అధిరోహించిన మమ్ములను అక్కడినుంచి నరకానికి తలక్రిందులుగా పడేటట్టు చేసినావు. ఇది న్యాయంకాదు దేవీ, న్యాయంకాదు." అనినారు.

"నేను మాటలాడడం తెలియనిదాన్ని, దేవ. మీ మనస్సును నొప్పించవలెనని మాట్లాడిన దానినికాను. అత్తయ్యగారికిచ్చిన మాటను ఎలాగు నిలుపుకొంటాను అనే కాతరతలో ఔచిత్యం మీరినాను. మన్నించవలె."

"ఎవరు ఏమికోరినా, దానికి దైవానుగ్రహం కావలె. ఇదిగో, దేవీ, నేను చెప్పే దానినీ గమనించు: మా శాంతల మాకున్నంత వరకు ఇకెవరికీ, ఇకెవరికీ ఎందుకు ముల్లోకంలోను అసదృశ అయిన స్త్రీ రత్నం వచ్చినా, నీ స్థానానికి దానిని తీసుకోము. ఇది ఖండితం. నాకు సంతతి కలిగినా సరే, లేకపోయినా సరే. నా వరకూ ఇది ఖండితం. ఇప్పుడు నిన్ను అడుగుతున్నాము: ఒకవేళ లక్ష్మి పట్టమహిషి అయి, దానికీ సంతానం కలుగకపోతే, అప్పుడు నీ అత్తయ్యగారి కోరిక తీర్చడానికి ఇంకేమి చేయమంటావు? ఇంకా ఒక పట్టమహిషి? దానికీ కాకపోతే? దీనికి అంతమెక్కడ?"

శాంతలకు దిక్కుతోచలేదు. "అలాటి సందర్భాలలో ఏమిచేయడం స్వామీ?" అన్నది.

"రక్తం గుణం అన్నికాలాలలోను ఒకే విధంగా ఉంటుందంటావా?"



"నేనెరుగను దేవా?"

"ఒకటి రెండు తరాలలో వంశానుగతమైన గుణాలు మారుతూపోతాయి—కాలదేశ వర్తమానాలు మారేటట్టు. ధర్మాత్ముడైన రాజు, తన కొడుకు అవివేకి అయితే, గుణహీనుడయితే, తాను కాపాడుకొంటూ వచ్చిన రాజ్యాన్ని వాడికి అప్పగించరాదు. అలాగు అప్పగించడం వంశకీర్తికి గొడ్డలి కావడమేకాక, బిడ్డలవలెవున్న ప్రజలంతా ఆ దుర్మార్గుని పాలనకు చిక్కి, దేశంలో క్షోభం, దుర్భిక్షం ఏర్పడి ధర్మబాహ్యులవుతారు. అలాటి సంకటాలకు అవకాశమివ్వకుండా ఉత్తమ గుణాలున్నవాణ్ని, సత్త్వశక్తి సంపన్నుణ్ని దత్తు తీసుకొని రాజ్యం వాడిచేతిలో పెట్టడం మేలు."

"అప్పుడు ఆత్మజునికి, దత్తునికీ వైషమ్యాలు ఏర్పడి, దేశానికి అనర్థం కలుగవచ్చుగదా?"

"కావచ్చు; అవుతుందికూడ. అయితే, ధర్మి అయిన రాజు తన కర్తవ్యం చేయకతప్పదు. దీనిపై దైవయత్నం ఎలాగుంటే, అలాగున అవుతుంది. ఆలోచించిచూడు: నీ తమ్ముడు దేనిలో తక్కువ? దేశం దేశమే వాడిని ప్రేమిస్తున్నది; గౌరవిస్తున్నది. ధైర్య శక్తి సాహసాలలో వాడు ఏమిటి తక్కువ? విద్యావినయాలలో ఏమిటి లోపం? ఇలాటివాడు కదా రాజు కాదగినవాడు? మనకు పిల్లలు లేరని నీవుగాని, మా మనస్సుగాని, ఎందుకు వ్యథపడవలె?"

"నిజమేస్వామి. కుమారవిష్ణువువంటి పుత్రుడు లభించేటట్టయితే మూడు జన్మాల తపస్సు నిలిచేని."

"శాంతలా, ఇక నీ మనసు కలవరపడడం వద్దు. కుమారవిష్ణువుపై నీకున్న సోదరవాత్సల్యం మేము నిన్ను పెండ్లాడిన నాడే తెలుసుకున్నాము. దానివల్ల మా మనస్సుకు చాల సంతోషమయినది. లక్ష్మికూడ కుమారునిపై నీవలెనే ప్రీతితో ఉంటున్నది. మీ అత్తయ్యగారికేమో వాడు మనమడే. దీనివల్ల ఆమె ఆత్మకు అతృప్తి కాదనడం ఖండితం.

లక్ష్మి విషయంలో మాకు మధురభావన లేదని నీవు భావించవద్దు; నీవెంత గుణవంతురాలో, నీచెల్లెలు గూడ అంతే గుణవంతురాలు. మాకు నీవెంత ప్రియతమవో, అదీ అంత ప్రియతమ.''

''ఇప్పుడు నాకు చాల ఆనందమయినది, దేవ.''

''మీ యిద్దరి ప్రేమతో, కుమారుని భక్తితో, పండితులవారి ఆదర ప్రీతులతో, ప్రజల ప్రీత్యాశీర్వాదాలతో మేము తుష్టులమై సంతుష్టులమై ఉన్నాము. ఇంతకంటె ఎక్కువగా కావలసిందేమి ?''

ప్రభువులు శాంతలను ఆనందంతో ఆలింగనం చేసుకొని, ''మనస్సు ఊరటపడినదా ?'' అని అంటూ, లక్ష్మిని చూడడానికి బయలుదేరినారు.

# 12

ప్రభువుల మనస్సులో గొప్ప సంకల్పమొకటి ఉద్భవించినది. అది చక్రవర్తులకు మాత్రమే సాధ్యమయ్యే అశ్వమేధయాగం. దానికి ముందుగా హొయిసళరాజ్యాన్ని దక్షిణ, పశ్చిమ సముద్రాల వరకు విస్తరింపజేయవలెననే ఆలోచనా ప్రభువులకు ఏర్పడినది. విష్ణువర్ధన ప్రభువులకు తమ భుజబలంపై అభిమానం ఉండినది. కుమారవిష్ణువు ఇప్పుడు వారికి కుడిభుజమే అయినాడు. బొప్పణనాయకుడు మరొకభుజం. మామగారు మారసింగమయ్యగారు, కేతమల్లనాయకులు, పునీసనాయకుడు, చిక్కమరియానె భోకిమయ్య మొదలయిన చండప్రచండ దండనాయకుల అఖండ సహాయబలం ఉన్నది. అతుల పరాక్రములు, అమిత యుద్ధానుభవసంపన్నులూ అయిన వీరవరులున్న అపారసేన ఉన్నది. అపార గజ తురగ రథ సమూహమున్నది. ఏరాళంగా ధనకనక వస్తు సముదాయం ఉన్నది. ఇంత ఉన్నప్పుడు, ఇంత ఒదవి వచ్చినప్పుడు ఈ మహాకార్యాన్ని సాధించి తీరవలెననే అభిమానం ప్రభువులకు కలుగడం ఏమాశ్చర్యం ?



ఈ మహాకార్యం ప్రారంభించడానికి ముందు హొయిసళేశ్వర శాంతలేశ్వర దేవాలయాలలో మహాదేవుని ప్రతిష్ఠించి, కుమారవిష్ణువు వివాహంకూడా జరుపాలని ప్రభువులు నిశ్చయించినారు.

రాజమాత వర్షాబ్దికం జరిగినది. వెంటనే వసంతఋతువూ సన్నిహితమయినది. కుమారవిష్ణువుకు పెండ్లి అన్న సంగతి దేశం నాలుగంచులకూ వ్యాపించినది.

''నీవు ఒప్పింది నాకు సమ్మతం, అక్కయ్యా.'' అని కుమారవిష్ణువు శాంతలకు మాటయిచ్చినాడు. ఆ మాట అతనితో అనిపించడానికి అక్కయ్యలిద్దరూ నెలల తరబడి శ్రమపడినారు. ''కొసకు ఒప్పినాడు.'' అన్న మాటవిని ప్రభువులకూ సంతోషమయినది.

కన్యాన్వేషణమూ సులభంగానే అయినది. రాజమాత పూర్వం చేసినప్రకారం శాంతలకూడ ఒకటి రెండుమార్లు—అత్తయ్యగారి వర్షాబ్దికపు నెపంతో ఒకసారి, సుమంగలీపూజ నెపంతో మరొకసారి, రాజధానిలోని అధికారుల, మహాజనుల స్త్రీలను, పిల్లలను నగరుకు పిలిపించుకొని, విందుచేయించి, చందనపుష్ప తాంబూలాలు ఇప్పించి గౌరవించినది. అప్పుడు ఉత్తమోత్తమురాలనిపించినది ఒకకన్య శాంతలకు. పేరు సోవల. రూపం ఉన్నది; గుణం ఉన్నది. పైపెచ్చు తగినంత విద్యావతికూడ. ఈడూజోడూ చక్కగా కుదిరినది. ఉత్తమ బాంధవ్యం. ఈ సోవల వీరదేవామాత్యులవారి ఏకైక పుత్రిక. అందువల్ల రాజకారణానికీ మేలయినది.

శాంతల తన ఎన్నికను ప్రభువులకు తెలపినది. వారు ''వాడు చూడవద్దా ? నీ ఎన్నిక ఉత్తమోత్తమని నాకు తెలుసు. అయినా, వాడూ ఒక్కమారు చూచి ఒప్పుకోనీ.'' అనినారు.

''అదంతా నాకు వదలిపెట్టినాడు. 'అక్కయ్యా, నీవు నాకు కన్నులకు గంతలుకట్టి పెండ్లిచేయి. నేను అంగీకరిస్తాను.' అన్నాడు.''

"నీవు వానికి ఎలాటి మంకుబూడిద చల్లినావే! వానికి నీమీద ఉండే నమ్మకం చూచి నాకు చాల సంతోషమే. కాని, వాడూ ఒక్కమారు చూడనీ."

"వానికి సిగ్గుకాబోలు!"

"అదీ నీవే అంటున్నావా? నిన్ను మొట్టమొదటిసారి చూచినప్పుడు నాకూ సిగ్గనే అనిపించింది. అయినా, మీ అత్తయ్యగారు చేసిన ఉపాయంతో నా మనస్సుకు పూర్తిగా సమ్మతమైనది. అప్పుడు లక్ష్మే నీవని భ్రమపడినాను."

"అదేమీ అబద్ధమూ, భ్రాంతీ కాదు. ఉన్నసంగతిని దైవమే తెలిపినది."

"ఇదిగో! ఏమేమి జరుగాలని దైవనియామకం ఉందో, అది ఆయా విధంగా జరుగనే జరుగుతుందికదా! సరే. ఇప్పుడు నీవూ అదే ఉపాయం అనుసరించవచ్చును గదా!"

"సోవలకు నాట్యంకాని, గానంగాని తెలుసునని నాకు తెలియదు. కనుక్కుంటాను. మీరు ఆనాడు తెరమరుగునకూర్చుని మమ్ముల్ను చూస్తారన్నజాడ మాకు తెలసిఉంటే, మేము అంతఃపురంలో అడుగే పెట్టేవాళ్ళం కాము."

"మీ అత్తయ్యగారు చాల బుద్ధిమంతులు, శాంతలా."

"కనుకనే, ఇంత పెద్దరాజ్యానికి మహారాజ్ఞి అయి, రాజ్యం కాపాడుకొని, మీ చేతికి అప్పగించినారు."

"ఆశక్తి, యుక్తి, వివేచన, ఇప్పుడు మా పట్టమహిషికీ ఉన్నవి. ఏదైనా మంచినెపంతో, అంతఃపురంలో ఉత్సవం నడుపు. యథాప్రకారం తెరవెనుక వానిని కూర్చోబెట్టి కన్యను చూపు."

శాంతల అంగీకరించినది. అంతఃపురంలో కేరళనర్తకీ గాయనీమణుల మేళం ఏర్పాటుచేసి, ఊరిలోని ప్రముఖ స్త్రీ బృందానికంతా శాంతల,



లక్ష్మి ఆహ్వానాలు పంపినారు. కుమారవిష్ణువు తాను కన్యను చూడనక్కరలేదని హటం పట్టినా, వానిని తెరవెనుక బొప్పణనాయకునితోపాటు కూర్చోబెట్టి, వానికి సోవలను చూపక వదలలేదు.

"చూడు, బొప్పణా, ఆడవాళ్ళు ఎంత మంచివాళ్ళయినా, మగవాడు వారిచేతుల్లో మాత్రం చిక్కకోరాదు." అనినాడు కుమారవిష్ణువు.

"మగవాడు ఆవిధంగా తమచేతుల్లో చిక్కేవరకు వారికి శాంతే ఉండదు. అది అలాఉండనీ. ఈవిషయం అలాటిది ఏమీకాదు. నీసౌఖ్యమే మీ అక్కయ్యల ఉత్కంఠ. వారిఎన్నిక చాల శ్లాఘ్యంగా ఉంది." అన్నాడు బొప్పణనాయకుడు.

ప్రభువులు కాబోయే కోడలినిచూచి శాంతలతో, "దేవి, అపరంజి గుణం, వన్నె, దాని పరీక్షకునికి తెలిసినట్టుగా, ఇతరులకు తెలియవు. మంచివస్తువే మనదృష్టికి పడదెందుకో! నీ ఎన్నిక మాకు చాల తృప్తి కలిగించినది. వాడు ఏమన్నాడు?" అని, ప్రశ్నించినారు.

"అడిగినందుకు నా ముఖంచూచి, ఊరికే ఉన్నాడు. వాడిమౌనమే సమ్మతి అనుకున్నాను."

"ఒక్కమాటన్నా పలుకలేదా?"

"మాట్లాడినాడు. 'ఈవిషయంలో అప్పాజీవారికంటే నీకే హెచ్చు ఆతురమని ఇప్పుడు బాగా తెలిసింది.' అనినాడు."

"అబ్బ, ఈ ఆరోపణం నామీద పడలేదుగదా! మంచిదే అయినది. మేము అనుకున్నకారణం వానికి తెలియకపోవడమే మేలు. నీవు చెప్పలేదు గదా?"

"లేదు. ఈ పెండ్లితొందరకు కారణం వానికి తెలియదు. నేను వానికి చెప్పనూ లేదు."

"మంచిది. దేవీ, ఈ పెండ్లిప్రస్తావన వచ్చినతర్వాత వాడు నాదగ్గరకు ఎక్కువగా రావడం పోవడం లేదు. చెప్పిపంపితేమాత్రం వస్తున్నాడు. ఎంతమాటో, అంతే. కలుగజేసుకొని మాట్లాడడం లేదు. అంతా క్రమంగా సరిపోతుంది కదూ ?"

"వాడు అంటున్నాడు : 'అప్పాజీవారు నన్నుచూడగానే, ఏమి అడుగుతారో, ఏమి చెబుతారో అని ముఖం మూరెడుపొడువు పెడుతున్నారు. నేను మాట్లాడడమే లేదు. భయమవుతుంది. వచ్చివేస్తున్నాను.' అని."

"నేను ఇంత బింకతో ఉండకపోతే నిన్ను వేపుకొని బొక్కేవాడు. ఈ పెండ్లి జరిగేదే కాదు."

"మీరు ఎలాగున ఉన్నా సాగుతుంది. తల్లిలేని పిల్లవాడు, నేను బింకంగా వుండడం సాధ్యమవుతుందా ? ఇంకా ఈ సందేహాలన్నీ నామీదే. "అప్పాజీవారికి చెప్పిచెప్పి నీవే వారిమనస్సును చెడిపినావు." అని కూడా అన్నాడు."

"సోవల చేయి తాకేవరకు అది అలాగునే." అంటూ ప్రభువులు నవ్వినారు. శాంతలా నవ్వినది.

## 13

వీరదేవామాత్యులవారికి సోవల ఒక్కతే కుమార్త. ఆమెను ఎంతో అక్కరతో పెంచి, మంచి గురువులవద్ద విద్య నేర్పినారు. సోవల తల్లి చందవ్వ విద్యావతి. తమ కుమార్తెను ప్రభువులు కోడలుగా చేసుకొనడానికి నిశ్చయించడం ఆ దంపతులిద్దరికీ ఎంతో తృప్తి; ఎంతో ఆనందం.

వైశాఖ మాసంలో ఒక శుభదినాన శుభముహూర్తం వివాహలగ్నముని నిశ్చయమయినది. వివాహాహ్వాన పత్రికలు ఊరూరూ చేరినవి. బొప్పణ



నాయకునికైతే తీరికలేనంత సంబరం. పెండ్లి ఏర్పాట్లన్నీ అతనివే. కుమారవిష్ణువు పెద్ద ప్రజలకు, అధికారులకు కుమారుడు; పెద్దవారికి తమ్ముడు; పిన్నవారికి అన్నయ్య. అందరి ప్రీత్యాదరాలు సంపాదించినాడు కుమారుడు. పెండ్లి కూతురేమో వీరదేవామాత్యులవారి కుమార్తె. అందువల్ల పురజనులకు ఎంత తృప్తి ఉండదు ?

కుమారుని ఉపనయనం ఎంత ఆడంబరంగా జరిగినదో అంత వైభవాడంబరాలతోను వివాహం ఏర్పాట్లు జరిగినవి. అదిగో ఇదిగో అనే వేళకు పెండ్లి లగ్నమూ సమీపించినది.

మహాసామంతులు, సామంతులు, రాజాంగ రాజ్యాంగంవారు, పురప్రముఖులు, ఉద్యోగులు, అధికారులు వివాహానికి వచ్చి వధూవరులను ఆశీర్వదించి, కానుకలు అర్పించినారు; వధూవరుల ఈడూ, జోడూ చాల బాగుందని ప్రశంసించినారు. కుమారవిష్ణువు పెండ్లినాడు చాల హసన్ముఖుడుగా ఉన్నాడు. "బుంగమూతిలో ఉంటే, మేము పెండ్లికేరాము." అని అక్కయ్యలిద్దరూ బెదిరించినారు. పెద్దక్కయ్య ఎన్నిక అతనికి చాల తృప్తి కలిగించినది. మన్మథునివంటి రూపవంతుడు, అభిమన్యునంతటి వీరుడు. గుణవంతుడు, ఉదారుడు అయినవాడు తనను పెండ్లాడినాడని సోవలదేవి చాల మురిసిపోయినది. ఆమె చెలులందరికీ అత్యానందకరమైన సంబరం.

విష్ణువర్ధన ప్రభువులు వివాహంలో ముత్యాల గుత్తులతో ముచ్చటగొలిపే నవరత్నఖచితమైన బంగారు గండపెండేరాన్ని వాని కుడికాలికి అలంకరించినారు. ఆనాటినుంచే అతనిని తన నగరు సర్వాధికారి స్థానంలో నియమించినారు. వివాహ మంగళం మహా వైభవంతో జరిగినది. గురువుల, విప్రోత్తముల, బంధువుల మహాశీర్వాదాలు జరిగినవి. అందరికీ షడ్రసోపేతంగా ఆనందభోజనాలు జరిగినవి. ఆనాడు దేశమంతటా వధూవరుల అభ్యుదయంకోసం సమస్త దేవాలయాలలోను, చైత్యాలయాలలోను, విశేషోత్సవాలు జరిగినవి. ఆనాటిరాత్రి దంపతులిద్దరిని పట్టపు ఏనుగుపై అంబారీలో ఆసీనులనుచేసి, వేలాది దివిటీలు వెలుగుతుండగా రాజవీధులలో ఊరేగించినారు. పురజనులు ఇండ్లపై, మిద్దెలపై ఎక్కి ఆనందంతో పుష్పవర్షం కురిపించినారు.

శాంతల, లక్ష్మి మహా వైభవంతో, మహానందంతో కోడలిని అంతఃపురానికి పిలిపించుకొనినారు. ఆ మెరాకతో అంతఃపురం మరింత నిండినట్లు, సంపూర్ణమయినట్లు అనిపించినది. వీరదేవామాత్యుడు, చందవ్వ, తమ కుమార్తెను అప్పగించి చరితార్థుల మయితిమని భావించినారు. ఈ వేళకు కుమారునికి లజ్జస్థానంలో ప్రేమ మొలకెత్తినది. సోవల అత్తగారిని, మామగారిని ముత్యాలు మాణిక్యాలులాగ చూచుకొంటూ అందరి మెప్పూ పొందినది. పతి ఎడ ప్రీత్యాదరభక్తులతో నడచుకుంటూ ఆదర్శసతి అయినది. ప్రభువులకు అచ్చు మెచ్చిన కోడలు...కోడలెందుకు? కడుపులో పుట్టిన బిడ్డవలె ప్రీతిపాత్రురాలయినది. సోవలకు తక్కిన అత్తగార్ల దెప్పులు, చిక్కులు అప్పుడప్పుడు కనిపించీ కనిపించనట్లు వున్నప్పటికీ, 'సవతి గంధ వారణ'కు భయపడి, ఆ అత్తగార్లు తమతమ ఎల్లల్లోనే ఉండేవారు. అంతఃపురానికి చేరినట్లే ఒక భాగంలో కుమారవిష్ణు సోవల దేవులకు బస ఏర్పడినది.

జ్యేష్ఠాషాఢమాసాలు నగరుకు మహానందం కలిగించి వెళ్లాయి. ప్రభువులు శాంతలేశ్వర, హొయిసళేశ్వర దేవాలయాలు పూర్తికావడానికి వేచివున్నారు. కేతమల్లనాయకుల పర్యవేక్షణలో మూడుపాళ్ల పని పూర్తయి, ఒక్కపాలు మాత్రమే—కొంచెం మాత్రమే మిగిలినది.

ప్రభువులు కేతమల్లనాయకులను పిలిపించుకొని, "ఇక ఆలస్యమయితే, మా ముందు కార్యాలకు ఇబ్బంది కలుగుతుంది. వచ్చే భాద్రపద మాసానికి ఆలయాలలో మహాదేవుని ప్రతిష్ఠ జరుగకతప్పదు. వెలుపలి పనులను తర్వాతయినా పూర్తిచేయవచ్చు; ఇంతలో పూర్తిచేయవలసిన పనులు ఏవి ఉన్నా పూర్తిచేయడం లెస్స." అనినారు.

కేతమల్లనాయకులు : " ఆ వేళకు అన్నిపనులూ పూర్తి అవుతవి ప్రభూ! ఇప్పుడు అతిముఖ్యంగా కావలసిన పని ఏమిటంటే, రెండు పెద్ద నంది విగ్రహాలు పూర్తికావడం. ఆ నందులకు మంటపాలు నిర్మించడం ముగిసింది."



"అట్లయితే పని అంతా పూర్తయినట్టే. రెండు నెలలలో రెండు నందులను మలచడం కష్టమా ?"

"దేవాలయాల ఆకారానికి, భవ్యతకు మహోన్నతమైన నందులే కావాలని, బృహదాకారపు నందులే కావాలని శిల్పులు అంటున్నారు."

"అంటే ?"

"బాగా పెరిగి ఉన్నతంగా ఉన్న గజయూథనాథునంత ఎత్తయినా ఉండవలెనట. మంటపాలను ఆ ప్రమాణానికి కట్టించినాము."

"అట్లయితే, ఎక్కువ జనాన్ని ఆపనికి నియమించి, నిర్దిష్టసమయానికి దానిని పూర్తి చేయించండి."

"అయితే, ప్రభూ, అంతటి బృహదాకారపు నందులను చెక్కడానికి వాటికి దాదాపు ఒకటిన్నర, రెండింతలు లావున్న మెత్తరాతి బండలు కావలె. వాటికోసం రెండు నెలలనుంచి వెదికిస్తున్నాను. పొరలు పెడుసు, గర్భం గడుసు, లేని, అంతటి పెద్ద మెత్తరాతి బండలు ఈ చుట్టుపట్ల రెండుమూడు పరువుల దూరంలో ఎక్కడా దొరకలేదు."

"ఇంకింత దూరంనుంచైనా తెప్పించవలె కదా ?"

"నాల్గైదు పరువుల దూరంనుంచి అంత పెద్ద బండలను సాగించుకొని రావడమైనా ఎలాగు ప్రభూ ?... అడవిదారిలో, రాయిరప్పదారిలో, వంకలు వాగులదారిలో, దట్టంగా పెరిగిన మానుల మొద్దుల మధ్యనుంచి..."

"మనవద్ద ఏనుగులు లేవూ ?"

"పది, ఇరవై, నలభై ఏనుగలయినా లాగడానికి సిద్ధం చేసుకోవచ్చు. అంత పెద్దపెద్ద బండలను తీసుకొనిరాగల శకటాలు కావలెగదా ? ఆ బరువుకు విరిగిపోని శకటాలుకావలె. వాగులలో, వంకలలో చక్రాలు, ఇరుసులు విరిగిపోని దృఢమయిన మార్గం నిర్మించవలె."

"ఇది కఠినసమస్యగా పరిణమించినదే. పూర్వం తలవనపురంపై దండెత్తి పోయినప్పుడు—మీకు జ్ఞాపకం ఉందా ?—పూర్ణప్రవాహ అయిన కావేరిని మన సైన్యాలు దాటడమూ ఇంత కఠిన సమస్యగానే పరిణమించినదికదా ? అప్పుడు గంగరాజులుగారు ఉపవసించి, కావేరిలో స్నానం చేసి, పూజించి ప్రార్థిస్తే, కావేరితల్లి దారిచూపలేదా ? దానికన్నా అసాధ్యమైనదా ఇది ? దైవానుగ్రహానికి చేతులుచాచి, పనికి ఉపక్రమించండి. మహాదేవుడే దారిచూపుతాడు... అంతటి దొడ్డ బండలను ఇక్కడికి సాగించుకొనివచ్చి, నందులను ఇక్కడ గండరించిడానికి బదులు, నందులను అక్కడే గండరించి, ఇక్కడికి తీసుకొనిరావడం కొంతవరకైనా సులభంకాదా ?"

"నిజమే. సులభోపాయమే. బండలు దొరికితే అలాగు చెయ్యడమే లెస్స. పని సగం తక్కువవుతుంది. కాని, గండరించి సిద్ధపరచిన ఆ నందులను సురక్షితంగా ఇక్కడికి చేరవేయడం ఇంకా కష్టమవుతుంది. చాల జాగరూకతతో సాగించుకొని రావలసి ఉంటుంది."

"నాయకులవారూ, ఇది సులభకార్యం కాదు. ఈ మహాకార్యాన్ని మహాదేవుడే చేయించవలె. నాయకులవారూ మీరు చెప్పినదినిజం. మహాదేవుని వాహనాలు మహోన్నతంగానే ఉండవలె. శిల్పులు చెప్పినదికూడ నిజమే. ఈ మహోద్యమాన్ని రెండునెలల లోపుగా ముగించి మాకు ఆశ్చర్యం కలిగించండి. అలాటి బండలు ఒక గవ్యూతిదూరంలో ఉన్నా, మహాదేవుని కార్యానికి ఒనగూడక తప్పదు. మహాదేవుడు కరుణించేడు ! ఇది మా విశ్వాసం. బండలు వెదకడానికి వెయ్యారు మనుష్యులను నియమించండి. 'పదినాళ్ళలో వెదికి చెప్పేవారికి పదిపది బంగారు గద్యాణాలు బహుమానం.' అని చాటించండి. అప్పుడు భూగర్భంలోఉన్నా వెదికి తీసేరు !"

"ప్రభువుల ఆనతి. అలాగుననే చేస్తాను. ఈశ్వరుని సంకల్పం ఉన్నట్టే కాని."

కేతమల్లనాయకులు ప్రభువులకు నమస్కారంచేసి, ఉత్సాహంతో ముందుపనులు నెరవేర్చడానికి బయలుదేరినారు.

# 14

నూతనదంపతుల అన్యోన్యం చక్కగా పెరిగినది. దానినిచూచి ప్రభువులు, రాజ్ఞి శాంతల చాల సంతృప్తిపడినారు. ఇంతలో తిరునారాయణపుర దేవాలయం కట్టడమూ పూర్తి అయినది. యతివర్యులు శ్రీరామానుజాచార్యులవారు మహావైభవంతో చెలువనారాయణస్వామి విగ్రహాన్ని ప్రతిష్ఠించినారు. మహోదారంగా ధనసహాయంచేసిన విష్ణువర్ధన ప్రభువులను చూచి ఆశీర్వదించవలెనని, వారిని తిరునారాయణ పురానికి పిలుచుకొనివెళ్ళి చెలువనారాయణుని దర్శనం చేయించవలెనని సంకల్పించి యతివర్యులు వేలాపురికి వేంచేసినారు. దానికి ముందే పెరుమల పండితులవారు "ఒక్కమారు వేలాపురికి దయచేయవలె."నని విజయనారాయణస్వామి ప్రతిష్ఠాపనోత్సవ సమయంనుంచి యతివర్యులను ఆహ్వానిస్తూనే ఉన్నారు. ఇప్పుడు కాలం తనంతట తానే కలిసివచ్చినది.

"మేము విజయనారాయణుని సేవకు ఈనాడు వస్తాము." అని శ్రీరామానుజులు పెరుమలపండితులకు భాద్రపద మాసారంభంలోనే కమ్మ వ్రాయించి పంపినారు. పండితులకు పరమానందమయినది. వయస్సులో శ్రీరామానుజాచార్యులవారు తమకంటే పిన్నవారయినా, భగవదంశ పురుషులయిన రామానుజుల సందర్శనానికి పండితులు పెక్కునాళ్ళుగా ఉవ్విళ్ళూరుతున్నారు. రామానుజులవారు వేలాపురికి వేంచేసే సమయానికి ప్రభువులు, కుమార్తెలు, నవదంపతులు వేలాపురికి రావలసినదని పండితులు ద్వారవతికి కమ్మవ్రాసి పంపినారు. యతివర్యులపై అపార భక్తి పెంపొందజేసుకొన్న ప్రభువులూ, దేవేరులూ ఆసమయానికి వేలాపురికి పోవలెనని నిర్ధరించినారు.

అంతలో సోవలకు కొంత అస్వస్థత ఏర్పడినది. ఏమిటో చూచి భయపడినానని అన్నది సోవల. ఆనాటినుంచి ఆమెకు చాతుర్థిక జ్వరం రాసాగినది. ఔషధోపచారాలతో జ్వరం తగ్గలేదు; ఆమె కొంచెం కృశించినది. "తననీడనే చూచి భయపడినది. మంచి ధైర్యవంతురాలయిన పిల్ల." అనినాడు కుమారవిష్ణువు పెద్దక్కతో.

వస్తామన్నాడే శ్రీరామానుజులవారు శిష్యబృందంతో వేలాపురిని సమీపించినారు. ప్రభువులు ఆదిగా రాజవంశంవారంతా వెనుకటి దినమే వేలాపురికి వచ్చినారు. సోవల అస్వస్థురాలుగావున్నా యతివర్యుల దర్శన భాగ్యాన్ని, ఆశీర్వాదాన్ని పొందడానికి వచ్చినది.

ప్రభువులు, పెరుమలపండితులు రామానుజులకు రాజధాని మొగసాలలోనే ఎదురువెళ్ళి, సాష్టాంగపడి, అర్ఘ్యపాద్యాచమనీయాలతో ఆదరించి, కుశలమడిగి, సమస్త రాజమర్యాదలతో అడ్డపల్లకిమీద ఆయనను మేళతాళాలతో, సంభ్రమంతో రాజధానికి పిలుచుకొని వెళ్ళినారు. దారి పొడువునా భక్తులు, పురప్రముఖులు యతివర్యులకు ఉపచార నమస్కారాలు చేశారు. యతివర్యులకు కేశవాలయంలోనే విడిది ఏర్పాటు చేసినారు. ఆ మహాసుందర దేవాలయంచూచి యతివర్యులు ఆశ్చర్యపడినారు. "కేశవుడు ఇంత సుందరమైన మందిరం ఉండగా, మా పేదగుడిసెలకు ఎందుకు వస్తాడు? కేశవు డిక్కడే ఉన్నాడు. వైకుంఠ సమానమైన ఆలయమిది. 'యద్భావం తద్భవతి.' రాజదంపతుల మనస్సు ఎంతదొడ్డదో, ఎంత సుందరమో, ఈ ఆలయమే సాక్షి. ఇలాటిరాజు, మహారాజ్ఞి, ఇలాటి దేవాలయం ఉన్న హొయిసళనాడు పుణ్యాలవీడు. ఇలాటి ప్రభువులను అల్లుండ్లవారుగా పొందిన మీరు ధన్యులు." అని ప్రభువులను, పండితులను వారి ఎదుటే ప్రశంసించినారు; రెండునాళ్లు వేలాపురిలోనే ఉండి విజయనారాయణుని మనమార సేవచేసినారు.

మరునాడు ఉషఃకాలంలోనే ఆచార్యులవారు స్నానాదులు ముగించి, తమ అమృతహస్తంతోనే, విజయనారాయణ, చెన్నకేశవులకు తిరుమంజనం చేసి, అలంకరించి, మహారాధనకు కూర్చున్నారు. ఆ సమయానికి ప్రభువులూ స్నానం ముగించి, అర్హమైన మడుగులుకట్టి వచ్చినారు. వారితోపాటు దేవేరులు, కుమారుడు, సోవల స్నానాదులు పూర్తిచేసి, సౌమ్య వస్త్ర భూషణాలు ధరించి వచ్చినారు. అందరూ ఒక్కటిగా ఆచార్యులకు నమస్కరించినారు. ఆచార్యులు ఆ నమస్కారాలు నారాయణునికి అర్పించి, "నారాయణుని ప్రీతి కలుగనీ. నారాయణునికి ప్రీతి కలుగనీ. అందరూ కూర్చోండి." అనినారు.



అందరూ ఆచార్యులవారు ఆచరిస్తున్న తిరువారాధనను చూస్తూ కూర్చున్నారు. ఆరాధనం దివ్యంగా జరిగినది. మహా మంగళారతికి అందరూ లేచి నిలుచున్నారు. మంత్రపుష్పం ప్రార్థనాదులు జరిగినవి. అందరూ విజయనారాయణుని భక్తిశ్రద్ధలతో నమస్కరించినారు. తర్వాత ప్రభువులు యతివర్యులకు సాష్టాంగప్రణామం ఆచరించి, తీర్థప్రసాదాలను వారి చేతులనుంచే స్వీకరించినారు. పండితులవారు ప్రభువుల చరిత్రను వెనుకటిరాత్రే యతివర్యులకు తెలిపినారు. ఇలాటి మహాభాగుడయిన రాజర్షిని చూడడానికి యతివర్యులు ఎంతో కాలంనుంచి ఉవ్విళ్ళూరేవారు. రూపంలో, ఆకృతిలో, ఔన్నత్యంలో, బాహ్యాభ్యంతరాలలో విష్ణువర్ధనులు ఎంతటివారని శ్రీరామానుజులవారు మనస్సులో భావించినారో, ఆ భావనకంటే ప్రభువులు హెచ్చుగానే ఉండడం చూచి ఆనందించినారు; చాల సంతృప్తులయినారు. యతివర్యులు ప్రభువులను సంబోధించి, "రాజన్, నావిష్ణుః పృథివీపతిః - అనే వాక్యం నీ విషయంలో అక్షరశః చెల్లుతుంది. నీవు మహాధీరుడివి, ఉదారుడివి, యశఃకాముడివి అయిన వైష్ణవాంశ సంభూతుడివి. నీ సమస్తాభీష్టాలూ చేకూరుతాయి. కొసకు నీవు పరమార్థాకాంక్షివయి, పరమార్థం తెలుసుకొంటావు. ఈ భూమిలో నీ పేరు శాశ్వతంగా లిఖించి వెళ్లుతావు." అని ఆశీర్వదించినారు.

తర్వాత ఆచార్యులవారు తమ పాదాలపై తలలుమోపిన శాంతలను, లక్ష్మిని చూచి, "తనువును మనసును చెన్నకేశవునికి అర్పించిన సుందరులు మీరే మహనీయులు; మీరు విష్ణువర్ధన ప్రభువు పుణ్యరూపాలు. ప్రభువులను పుణ్య మార్గంలోనే నడిపించుకొని రాండి. మీ యిద్దరి తనుమనాలలో భేదమేలేదు. ఇది చాల అపురూపం." అని ఆశీర్వదించి ఆనందించినారు.

"నేను కుమారవిష్ణువును అభివాదనం చేస్తున్నాను." అంటూ కుమారవిష్ణువు యతివర్యుల పాదపద్మాలకు తన తనువును అర్పించుకొనినాడు. ఆచార్యులు అతని తలపై చేయిపెట్టి "మహావిష్ణువు కుమారుడివే నీవు. అంశపురుషుడివి నీవు." అని ఆశీర్వదించినారు. అనంతరం "నేను వారి సతి సోవలను." అంటూ సోవల నమస్కరించింది. ఆమె ముఖలక్ష

ణాలను చూచి యతివర్యులు "ఎందుకమ్మా, నీ ముఖంలో ఆరోగ్యమెందుకు లేదు?" అని ప్రశ్నించినారు. "భగవన్, ఈమె తాను భయగ్రస్తనయినానని అంటున్నది. ఒక నెలనుంచి చాతుర్థిక జ్వరం వస్తున్నది. ఉత్తమౌషధాలలోను నెమ్మది కలుగలేదు. ఆశీర్వదించవలె. అనుగ్రహించవలె. ఇద్దరూ మాకు బిడ్డల వంటివారు." అని విన్నవించినారు ప్రభువులు.

ఆచార్యులవారు స్వామికి తిరుమంజనం చేసిన తీర్థాన్ని మంత్రపూర్వకంగా సోవల శిరస్సుమీద, ముఖంమీద ప్రోక్షించి, "మనస్సులోని భీతి ఈ క్షణమే తొలగిపోనీ. ఆరోగ్యభాగ్యం కలుగనీ." అని ఆశీర్వదించినారు.

ఆనాడు ప్రభువులు నగరుకు పిలుచుకొని వెళ్ళి సువర్ణపుష్పాలతో పాదపూజచేసి, వారినుంచి వైష్ణవ ధర్మ మహాతత్త్వాలను ఉపదేశం పొందినారు. అప్పుడు, దానిలో ప్రభువుల ధర్మశ్రద్ధ ఇంకా పెరిగినది; పరమార్థచింతనాసక్తి ఉదయించినది. ప్రభువుల దైవభక్తి, ధర్మశ్రద్ధ, ప్రజానురాగం, ఉత్తమరాజ్య విచక్షణ — ఈ గుణాలను, ఈ గుణాలలో సమతూకంవారయిన శాంతల, లక్ష్మలను చూచి యతివర్యుల మనస్సుకు సంతృప్తి కలిగినది. చెలువనారాయణునికి ఎన్నో మాన్య దానాలు చేసి ప్రభువులు ధన్యులయినారు. సోవల చాతుర్థిక జ్వరం ఆగి, నానాటికీ ఆరోగ్యభాగ్యం పొంది, పూర్ణచంద్రునిలాగ ప్రకాశించినది. కొన్నినాళ్ళ తర్వాత ప్రభువులు సకల పరివారంతో తిరునారాయణ పురానికి విజయం చేసి, చెలువనారాయణుని దర్శనభాగ్యం పొంది, భగవంతుని, యతివర్యులను మనసార సేవించి, ఆశీస్సులు పొందినారు. తిరిగి రాజధానికి వస్తున్నప్పుడు ఆ ఊరి ఈశ్వరాలయానికి కూడా మాన్యాలు దానంచేసి అఖండ దీపానికి ఏర్పాటుచేసి వచ్చినారు.

వచ్చిన వెంటనే ప్రభువులు దిగ్విజయానికి అనుకూలాలను, సామగ్రిని, సైన్యాన్ని సంగ్రహించడానికి పూనుకున్నారు. పునీసనాయకుడు, చిక్కమరియానె, మారసింగమయ్య, గరుడిబాకిమయ్య, బాగిప్పయ్య, బొప్పణనాయకుడు, కేతమల్లనాయకులు—వీరంతా తమ సైన్యాలలో సిద్ధమయినారు. ప్రభువులు సకలసల్లక్షణాలు గల ఒక అశ్వాన్ని ఆభరణదుకూ



లాలతో అలంకరించి, దాని నొసటిపై "యజ్ఞాశ్వం" అని చెక్కిన బంగారు రేకును బిగించికట్టి, అది ముందు నడువగా, తాము మహోన్నతమయిన ఒక ఏనుగునెక్కి, విజయదశమి శుభముహూర్తాన దిగ్విజయ యాత్రకు బయలుదేరినారు.

బయలుదేరడానికిముందు ప్రభువులు శాంతలవద్దకువచ్చి "దేవీ, రాజధాని రక్షణకు ఈసారి పెద్దసైన్యం పెట్టి పోతున్నాము. కుమార విష్ణువు దానికి సేనాపతి అయి ఇక్కడ ఉండడం లెస్స. దానివల్ల మా మనస్సుకు నెమ్మది, ధైర్యం. మామయ్యగారు రాజధానిచుట్టూ ఎల్లలను కాపాడుతుంటారు. మా సమాచారాలన్నీ వారినుంచి ఎప్పటికప్పుడు తెలుసుకోవచ్చు. ఎనిమిది పదినాళ్ళకొకమారు మేము ఎక్కడున్నా సమాచారం పంపుతాము. రెండు మూడు నెలలలోపుగా మేము పూనుకున్న పనులన్నీ విజయనారాయణుని కృప ఒక్కటుంటే పూర్తవుతవి. ఏమైనా వసంతఋతువుకు ముందే, రాజధానికి వెనుదిరిగే సంకల్పముంది. మునుపటివలె చింతలో, వ్రతోపవాసాలతో దేహాన్ని కృశపరచుకోవద్దు. మేము వెనుదిరిగివచ్చినప్పుడు నిన్ను చూచి, సంకటపడేటట్టు చేయవద్దు. నీవిక్కడ సంతోషంతో ఉంటే, మేమక్కడ సంతోషంతో ఉంటాము. నీవు అలాగు ఉండడం మేము పూనుకొనినపనికి తోడ్పడగలదు. ప్రార్థనాదులను, దానధర్మాలను యథేచ్ఛగా నడిపించు. చేయి కదులాడేవరకు సాధ్యమయినన్ని దానధర్మాలు జరుపవలె... పెరుమల మామగారి ఆరోగ్యం ఇటీవల బాగులేదు. వారికి వయస్సు అవుతూవచ్చింది. లక్ష్మి అప్పుడప్పుడు వేలాపురికి పోయివస్తూ ఉండనీ. నీవూ అప్పుడప్పుడు వెళ్ళి చూచిరా. సోవల ఆరోగ్యం బాగా చూచుకో. ఆమె ఏమీ తెలియనిది." అంటూ ఉండగా లక్ష్మి అక్కడికివచ్చినది. ఆమె ప్రభువుల పాదాలుతాకి నమస్కరించి. "స్వామీ, కుమారుడూ తమవెంటే రావాలని హటం చేస్తున్నాడు. దాదాపు నెలనుంచి 'అప్పాజీవారికి నీవుచెప్పు, నీవుచెప్పు' అని మా యిద్దరితోనూ చెప్పుకుంటూనే ఉన్నాడు. "ఇప్పుడయినా ఈ క్షణమే నీవు అప్పాజీవారికి వెళ్ళి చెప్పు చెప్పు," అని నాకు ఒక్క నిమిషమయినా, విరామమివ్వక నన్ను ఇక్కడికి పంపినాడు." అనినది.

"లక్ష్మి, వాని ఆశ న్యాయమయినదే. మాలోనువచ్చి చెప్పుకొని నాడు. మేము వానికి చాల ఊరట కలిగించవలసి వచ్చినది. 'రాజధాని రక్షణకు నీవే సమర్థుడివి. నీ శక్తిసామర్థ్యాలలో మాకు చాల నమ్మకం ఉంది. నీ ధైర్యంపైనే మేమీ మహాకార్యానికి పూనుకున్నాము. నీరక్షణ రాజధానికి ఉంటుందని మేము ధైర్యంతో, నిశ్చింతతో మా పనులన్నీ ముగించడానికి సాధ్యమవుతుంది. మా చేయిబలం ఉడిగిపోయినప్పుడు మా అందరి రక్షణా నీకు సంబంధించినదేకదా ? నీవు ఇక్కడ ఉండడం వల్ల మే మెక్కడున్నా మాకు ధైర్యం ఉంటుంది.' అని చెప్పి ఊరడించ వలసి వచ్చినది. ఇంత చెప్పిన తర్వాతకూడా నిన్ను పంపినాడు చూచి నావా ? లక్ష్మి, వానికి వివాహమయిన సంవత్సరమిది. వానిని యుద్ధ భూమికి ఎలాగు పిలుచుకొని పోయేను ? మన ప్రజలు ఏమని అనేరు ? లక్ష్మి, ఇటీవల వానికి నీమీద నమ్మకం హెచ్చయినది. 'పెద్దక్కయ్య, అప్పాజీవారు ఒకటి. నాపరంగా పెద్దక్క ఒక్క మాటకూడ చెప్పదు' అని పెరుమల మామయ్యగారితో అనినాడట."

లక్ష్మి:- "స్వామీ, మీరు ఇప్పుడు సెలవిచ్చినమాటలనే నేనూ, అక్కయ్య పెక్కుసార్లు పెక్కు రీతులుగా చెప్పినాము. రానురాను చాల ముండివాడయిపోతున్నాడు. 'బొప్పణనాయకుడు పోవచ్చు, నేను పోరాదా ?' అని ఒక్కటే మాట."

విష్ణువర్ధనులు:- "బొప్పణనాయకుని పిలచుకొని వెళ్ళుతున్నాము. నిజమే. అతడూ ఈ సంవత్సరం పెండ్లిచేసుకొన్నవాడే. ఇతర కార్యాలకు ఆతనిని వినియోగించుకొంటాము. రణరంగంలోకి అతనిని వదలము."

శాంతల:- "సరి. అయితే, కుమారుణ్ని అలాగునే వినియోగించు కోండి."

విష్ణువర్ధనులు:- "అక్కడికి వెళ్ళినతర్వాత వీడు మాకు తప్పక తల నొప్పి కలిగిస్తాడు. ఇక్కడే చూచినాపుకదా, ఎంత రంపుచేస్తున్నాడో ! 'నన్నెందుకు రమ్మనినారు ? ఈ భాగ్యానికి నేను ఊరిలోనే ఉండేవాడిని



కదా ?' అని అడిగినా అడిగేవాడే. వీడిదగ్గర మేము అప్పుడు వాదానికి నిలుచుకోమా ?"

లక్ష్మి:- "అక్కయ్యా, నీకు ఏమేమిరావలె ? ఎన్ని వజ్ర వైదూర్య మరకతాలు ? ఎటువంటి ముత్యాలహారాలు ?—అని అడుగుతున్నాడు. నీకు ఇంత, పెద్దక్కయ్యకింత, అని పెద్ద పట్టీ వ్రాసుకొన్నాడు"

విష్ణువర్ధమలు:- "ఇవన్నీ ఎక్కడినుంచి తెస్తాడట ?"

లక్ష్మి:- "రాజుల కంఠాభరణాలనుంచి, కంకణ వలయాలనుంచి, భుజకీర్తులనుంచి, బొక్కసాలనుంచి అంటాడు."

విష్ణువర్ధనులు :- "దోచుకొనడ మంటే వాడికి చాల ఆశ ఉన్నట్లు తోస్తుంది."

లక్ష్మి:- "నేనూ అలాగునే అనినందుకు, అన్యాయమైన దోపిడి ధనం ఒక్కరిదయినా నిలవదు—అనినాడు."

విష్ణువర్ధనులు :- "మరి అలాంటది మనకైనా ఎందుకంట ?"

లక్ష్మి :- "అందరు రాజుల బొక్కసాలూ అంతే-అనినాడు. నేను అన్నాను : మా కందరికీ అయినది. సోవలకు ఏమీ వద్దా ?—అని. దానికి వాడు 'అప్పాజీవారు సోవలకు ఇప్పటికే మోయలేనంత మోపినారు. ఇంకేమయినా మోపితే, ఆ భారానికి పాతాళానికే దిగిపోయీని' అన్నాడు."

ఆమాట వారందరూ పెద్దపెట్టున నవ్వడానికి కారణమయినది.

# 15

విజయదశమి శుభముహూర్తాన విష్ణువర్ధన ప్రభువులు విజయ యాత్రకు బయలు వెడలినారు. ఆనాడు ప్రభువులు విజయనారాయణుని విధివత్తుగా పూజించి, వాసంతికాదేవిని అనుగ్రహంకోసం ప్రార్థించి, ప్రీతిపాత్రులైన పత్నులు ఆదరంతో పెట్టిన రక్షలు స్వీకరించి, కుమార

విష్ణువును పిలిచి "ఇదిగో, నీవిక్కడ ఉన్నావనే ధైర్యంతోనే మేమిప్పుడు బయలు వెడలడం. ఇకమీది యుద్ధాలన్నీ నీవే!" అని సమాశ్వాసించి, లక్ష్మితో "ఎనిమిది నాళ్ళకొకమారు నీవూ, నీ అక్కయ్యా వేలాపురికి పోయి మామయ్యగారిని చూచి రండి. ఇటీవల తపస్సుతో వారి దేహం కుంగిపోయినది." అని చెప్పి, శాంతల చేయి పట్టుకొని, "దేవీ, సగం ప్రాణం నీవద్ద వదలిపెట్టి వెళ్లుతున్నాము. విజయనారాయణుని సంస్మరణ మరవకుండా ఉండు. నీ వ్రతాలు, నియమాలు, నోములూ, మమ్మల్ని ఎంతటి ఇక్కట్టులోను కాపాడుతవి; జయం సంపాదిస్తవి. మీ రిద్దరూ ఆవేదన పడకూడదు; కన్నీరు పెట్టకూడదు. మీకంట నీరుకారితే, మా గుండెనుంచి రక్తం కారీని. జాగ్రత? సంతోషంతో మమ్మల్ని పంపండి. విజయనారాయణుని కృప ఉంటే మూడే నెలలలో పనులన్నీ పూర్తిచేసుకొని తిరిగి వస్తాము." అని ఆత్మీయతతో పలుకరించి, వారిద్దరినీ సమాధానపరిచి, తృప్తితో విజయయాత్రకు బయలుదేరినారు. సైన్యమంతా ప్రభువులను అనుసరించినది.

దండు వెడలిన పదవనాడే హొయిసళ సేన నోళంబవాడిని ముట్టడించినది. నోళంబవాడి జయసింహుని పరిపాలనలో ఉండినది. ఈ జయసింహుడు పల్లవులను జయించిన పాండ్యరాజుల సామంతుడు; చాళుక్య వంశస్థుడు. చాళుక్యుల జన్మశత్రువులు విష్ణువర్ధనులు. అప్పుడున్న చాళుక్య ప్రభువు ఆరవ విక్రమాదిత్యుడు. విష్ణువర్ధనుల గుణ స్వభావాలను, శక్తి సామర్థ్యాలను తెలుసుకొనకనే ఈ విక్రమాదిత్యుడు వారితో పగ చేసుకొన్నాడు; ప్రబలమైన పగ చేసుకొన్నాడు.

హొయిసళ రాజులు ఎరయంగ ప్రభువులు కాలధర్మం చెందేవరకు చాళుక్యుల మహా సామంతులు, ఎరయంగ ప్రభువులు కాలమయిన సంవత్సరమే ఈ చాళుక్య విక్రమాదిత్యుడు హొయిసళరాజ్యపు ఎల్లలలో ఒకదానిని తన బంధు వొకనికి పంచిపెట్టడానికి ప్రయత్నించినాడు. "ఎరయంగ ప్రభువుల కుమారులింకా పసికూనలు; ఎందుకు ఎదిరించేరు?" అని విక్రమాదిత్యుడు భావించినాడు. అయితే ఈ ఎరయంగ ప్రభువుల ముగ్గురు కుమారులు—బల్లాళ, బిట్టిదేవ, ఉదయాదిత్యులు ముగ్గురూ ప్రతిఘ



టించి నిలబడినారు. రాజమాత మహాదేవి అక్కగారు కుపితపన్నగివలె లేచి నిలబడి, "నేను గొడ్రాలిని కాను. నా కుమారులు తమ అయ్యగారి సొత్తును కాపాడుకో గలరు." అనినారు. "నా కత్తి అంచులు విరిగిపోతే కదా! ఈ చాళుక్యులు హొయిసళ నాడులో కాలుపెట్టగలరు?" అని గంగరాజులుగారు గర్జించి కుమారులకు పురిపెట్టినారు. చాళుక్య విక్రమాదిత్యుడు తన సైన్యాధిపతి సంతార జగద్దేవుని పెద్ద సైన్యంతో "ఈ పిన్నవారి పొగరు అడగించి ద్వారవతిని కాల్చివేసిరా." అని పంపినాడు. "ఎరయంగ ప్రభువుల పిల్లలు పసికూనలు కాదు; సింహపిల్లలు." అని జగద్దేవునికి త్వరలో అనుభవానికి వచ్చినది. ద్వారవతిని ముట్టడించడానికి వచ్చిన ఈ జగద్దేవుని సేనను హొయిసళ కుమారులు గంగరాజులుగారి సేనాధిపత్యంలో నిర్లక్ష్యంగా ఎదిరించి, జగద్దేవుని సైన్యంలో నాల్గింట మూడుపాళ్లు రణరంగంలో మట్టుపెట్టినారు. జగద్దేవుడు ఏనుగెక్కి రణరంగంనుంచి పరుగెత్తినాడు. బిట్టిదేవుడు వానిని తరుముతూ వెళ్ళి వాడి బాణాలతో వాడెక్కిన ఏనుగును నొప్పించినాడు. ఏనుగు జగద్దేవుని నేల మీద పడద్రోసి, అంకెతప్పి పరుగెత్తినది. అప్పుడు జగద్దేవునికీ, పిన్నవాడయిన బిట్టిదేవునికి మల్లయుద్ధం జరిగింది. చిన్నవాని దెబ్బలకు బాధపడి జగద్దేవుడు కాలికి బుద్ధిచెప్పినాడు. "పారిపోతావా పేడి!" అని బిట్టిదేవుడు జగద్దేవుని పట్టుకొని లాగినాడు. అయితే బిట్టిదేవుని చేతికి చిక్కినది జగద్దేవుని మెడలో మెరిసే అమూల్యమైన పచ్చలహారం. జగద్దేవుడు చిక్కక పారిపోయినాడు; బిట్టిదేవుడు పచ్చలహారాన్ని రాజమాతకు అప్పగించినాడు.

అప్పటినుంచి విష్ణువర్ధనులు చాళుక్య షష్ఠ విక్రమాదిత్యునిపై తీవ్రమైన పగ సాధిస్తూనే వచ్చినారు. చాళుక్యుల పేరే తుడిచివేద్దామన్న ఆశకూడా వారికి ఉంది. చాళుక్య విక్రమాదిత్యుడు వివేకి, ఆలోచనాపరుడు అయి విష్ణువర్ధనుల సత్త్వాన్ని కొంతకాలం గమనించి, తర్వాత ఆమహాసామంతుని స్నేహం మిగుల్చుకొని ఉంటే, విష్ణువర్ధనులు చాళుక్యుల కీర్తిస్తంభమై నిలచేవారు. ఇప్పుడు విష్ణువర్ధనులు చాళుక్యులకు ప్రబల వైరి అయినారు. విష్ణువర్ధనులు ఇప్పుడు పూనుకున్న దండయాత్ర చాళుక్య

సామంతులందరి వెన్ను విరచడానికే. ఆలాగుచేస్తే చాళుక్య వృక్షం వాడి నాశనమవుతుందని వారికి తెలుసు.

అందువల్లనే, ప్రభువులు ఈ విషయాన్ని ముందు శాంతలచెవిలో గుసగుసలాడినప్పుడు, ఆమె విజయనారాయణున్ని స్మరించి, తన నుదుటి కుంకుమ సౌభాగ్యాన్ని మెడలోని మంగళసూత్రాన్ని స్పృశించినది. "భగవాన్, వీటిని రక్షించు." అని.

నోళంబవాడి రాజు జయసింహుడు విష్ణువర్ధనుల యజ్ఞాశ్వాన్ని ఆకట్టికట్టివేసినాడు. అప్పుడు పెక్కుగజాశ్వరథాలున్న పాండ్యుల సైన్యం జయసింహుని సహాయానికి వచ్చి నిలబడినది. రెండు సైన్యాలకూ "దుమ్మె" అనే ప్రాంతంలో సంకుల సమరమయినది. విష్ణువర్ధనుని సైన్యంలోని ఒకకొత్త దండనాయకుడు చామదేవుడనేవాడు ఈ యుద్ధంలో అతుల పరాక్రమంతో పోరాడినాడు. జయసింహుని పాండ్యసేన ఓడిపోయినది. చామదేవుడు విజయోత్సాహంతో అక్కడినుంచి ముందుకు సైన్యాలను తానే నడిపించుకొని వెళ్లి, ఉచ్చంగి, బంకాపురాలను కైవసం చేసుకొనివచ్చి, విష్ణువర్ధనులకు అప్పగించి, వారినుంచి "సుభట" పట్టం సంపాదించుకొన్నాడు.

జయసింహుడు పరాజయంపొందడం, ఉచ్చంగి, బంకాపురాలు విష్ణువర్ధనుల కైవసంకావడం చూచి స్వయంగా పాండ్యరాజే సైన్యాలు కూడగట్టుకొని యుద్ధానికి వచ్చినాడు. విష్ణువర్ధనులు ఎదుటినుంచీ, సామంత చట్టనాయకుడు ఎడమనుంచి, మాచణ్ణ నాయకుడు కుడినుంచి పాండ్యుని ముట్టడించినారు. పునిసనాయకుడు, గరుడి బోకిమయ్య నాయకుడు విష్ణువర్ధనులకు అంగరక్షకులుగా నిలబడినారు. 'దుమ్మె' అనేచోటే మరల ఘోరమైన యుద్ధం జరిగినది. దండయాత్రకు వెడలిన నిమిషంనుంచి, విజయలక్ష్మి హొయిసళ ప్రభువులవెంటే ఉన్నది. విష్ణువర్ధనుల కత్తి పాండ్యరాజు తలను ఎగిరించివేసింది.

తర్వాత విష్ణువర్ధనులు సుప్రసిద్ధమైన హానగల్లు దుర్గంమీదికి దాడి వెడలినారు. చేజిక్కిన బంకాపురిని ఉత్తరపు ఎల్ల రాజధానిగాచేసుకొని,



విజయోత్సవానికి చిహ్నంగా గదగు పట్టణంలో వీరనారాయణదేవాలయం నిర్మించినారు. హానగల్లు దుర్గం అత్యంత దుర్గమమైనది. విష్ణువర్ధనుల సైన్యం అక్కడ నెలలతరబడి స్కంధావారంలో ముట్టడిలో ఉండవలసివచ్చినది. దుర్గానికి ఇరుగుపొరుగునగల గ్రామాలలోని జనాన్ని దూరంగాపంపి, దుర్గ మార్గాలన్నిటినీ అరికట్టి, దుర్గానికి ఎలాటి సహాయమూ లభించకుండా చేయడానికి హొయిసళ సైన్యానికి కొంతకాలం పట్టినది. ఇంత చేసినా, దుర్గంలోపల ఉన్న శత్రుసైన్యాలకు నాల్గు నెలలకు చాలినంత ఆహారపదార్థాలు, నీరు ఉండేవి. ఈ ఆహారపదార్థాలు పూర్తయేవరకు మూడునాలుగు నెలలకాలం కాచుకొని ఉండడానికి విష్ణువర్ధనులు ఇష్టపడలేదు. మొట్టమొదటి నెలలోనే కోటను బలంగా ముట్టడించినారు.

హానగల్లుదుర్గం అప్పుడు రెండవతైలపుని మనుమడు మల్లికార్జునుని పాలనలో ఉన్నది. వానితండ్రి మయూరవర్మ నాల్గు సంవత్సరాలు మాత్రమే రాజ్యంచేసి మరణించినాడు. ఈమల్లికార్జునుడు దృఢకాయుడూ కాడు; సాహసపరుడూ కాడు. వెలుపలనుంచి దుర్గానికి ఏ సహాయం రావడానికీ ఇప్పుడు సాధ్యంలేదు. మల్లికార్జునుడు కోటలోని తన అంతఃపురంలో అనారోగ్యంతో పక్క పట్టినాడు. కోటలో తగినంత సుశిక్షితమైన సైన్యం ఉన్నది. వెలుపలకూడ కొంతసైన్యం దుర్గంచుట్టూ, దుర్గద్వారాలను కాపలా కాస్తున్నది.

విష్ణువర్ధనులసైన్యం తీవ్రమైన ముట్టడిని ఆరంభించిననాడే విపుల సైన్యం నష్టమయినది; నలుగురు ఉత్తమ నాయకులు మరణించినారు. కోటమీద ఉన్న మల్లికార్జునుని సేనలో అతి చతురులయిన విలుకాండ్రు ఉండేవారు. వారు కురిపించిన శరవర్షంలో ఒకేనాడు ఐదునూర్లమంది హొయిసళ సైనికులు భూపతితులయినారు; నలుగురు పెద్దనాయకులూ మరణించినారు. ఈ నలుగురు నాయకులను చంపినవాడు ఒక్కడే. ఇతడు గొప్ప ధానుష్కుడు. ఈ నలుగురు నాయకుల ప్రాణాలను హరించిన నాలుగు నారాచాలు ఒకేతీరువి. నాల్గూ గుండెలోదూరి, గుండెలు చీల్చినవే. నలుగురు మరణించినదీ ఒక రీతిలోనే,

విష్ణువర్ధనులూ ధనుర్విద్యానిపుణులే. అయినా ఈ విలుకాని తనం చూచి ఆశ్చర్యపడినారు; భయపడినారు. "వెదికి వెదికి నాయకుల హృదయాలనే ఛేదించి చంపుతున్న ఈ విలుకాడు కలియుగార్జునుడే అయి ఉండవలె. ఈనాల్గు అంబులవంటివి రణరంగమంతా వెదకినా మరొకటి దొరకలేదు. కనుక నాల్గు అంబులూ వాడు తొడిగినవే అయిఉండవలె; వదలినవి కూడా నాల్గు బాణాలే అయిఉండవలె. మరెవరినీ వాడు గురి పెట్టి కొట్టలేదు. ఏరి ఏరి నాయకులను హత్య చేసినాడు. ఈ పరిస్థితిలో సైన్యంలోని ఇతరనాయకులు, దండనాయకులు రేపు యుద్ధభూమిలో కాలు పెట్టడానికే భయపడేరు? ముందు దారి ఏమిటి? భగవంతుడా?" అని యోచిస్తూ కూర్చున్నారు.

ఆనాటిరాత్రి ప్రభువులు చాల పొద్దుపోయేవరకు తమ సేనాపతులతో మంత్రాంగం జరిపినారు. ఒకమారు బొప్పణనాయకుని చూచి, "మనకు శత్రుసైనికు లెందరు చెరచిక్కినారు?" అని అడిగినారు ప్రభువులు.

"నిన్నటి యుద్ధంలో దాదాపు ఇరవైమంది శత్రుసైనికులు మాత్రం చెరచిక్కినారు. విచారించగా, ఈ విలుకాని పేరు చమూపతి కుంజుసెట్టి అనీ, అతడు కేరళదేశం వాడనీ తెలిసినది. మల్లికార్జునుడు అనారోగ్యం వల్ల యుద్ధభూమికి ఇంకా కొన్నినాళ్ళ వరకు వచ్చేట్టులేదట. అందువల్ల సైన్యం సర్వాధికారాలూ కుంజుసెట్టే వహించుకొన్నాడట. తనకు సరి సమానులయిన నూరుమంది విలుకాండ్రను వాడు తనవద్ద పెట్టుకొన్నాడట. కుంజుసెట్టి శబ్దవేధి విద్యనూ ఎరుగునట. అంబులో వెంట్రుకను రెండుగా చీల్చగలడట." అని మనవి చేసినాడు బొప్పణనాయకుడు.

"బలెబలె బొప్పణా! ఎంత వేగి ఎంతవిషయం సేకరించినావు?" అని బొప్పణనాయకుని పొగడినారు ప్రభువులు. అక్కడ చేరిన చమూపతులకు "ఇక మీరుపోయి రేపటి యుద్ధానికి సన్నాహం చేయండి. ఇప్పుడు మేమూ, బొప్పణనాయకుడూ మనకు దొరికిన ఈ విషయసామగ్రిని ఎలాగు ఉపయోగించుకోవాలనే విషయమై యోచిస్తాము. ఇక మీద శిరస్త్రాణ



వక్షస్త్రాణాలు లేక యుద్ధభూమిలో ఎవ్వరూ అడుగు పెట్టకండి. ఇలాటి సందర్భాలలో యుక్తి చాతుర్యాలతోనే కార్యం సాధించవలసి ఉంటుంది. అంబుల జడివానకు వృథాగా మన సైనికులను పాల్పడ జేయరాదు." అని అందరినీ స్కంధావారానికి పంపివేసి, తామూ, బొప్పణనాయకుడూ చాణక్య నీతి నొకదానిని ఆలోచిస్తూ, కూర్చున్నారు.

# 16

"నేడు సైన్యాలు యుద్ధభూమికి వెళ్ళడం వద్దు." అన్న రాజాజ్ఞ తెల్లవారే లోపల బయలు వెడలినది. దండనాయకులకూ, చమూపతులకూ ఇది ఆశ్చర్యం కలిగించినది. యుద్ధభూమికి బయలు వెడలనున్న సైన్యం అట్టే నిలబడిపోయినది.

శత్రుసైన్యాలు కుంజుసెట్టి నాయకత్వంలో యుద్ధానికి సిద్ధంగా ఉన్నవి. తెల్లవారి ఎంత ప్రొద్దెక్కినా హొయిసళ సైన్యం శిబిరంనుంచి బయలుదేరక పోవడంచూచి, కుంజుశెట్టికి ఆశ్చర్యమయినది. తన కైవాడం చూచి, హొయిసళులు బెదరిపోయినారనే భావించినాడు వాడు. అయినా, తన కర్తవ్యంలో లోపమేమీ రాగూడదని జాగరూకుడయి కాచుకొని ఉన్నాడు.

అప్పుడు, వెనుకటినాడు చెరపడిన హానుగల్లు సైనికులగుంపు హొయిసళుల స్కంధావారం నుంచి బయలుదేరి, తమ శిబిరానికి అభిముఖంగా నడిచినది. విష్ణువర్ధనులే వారిని చెరవిడిపించి పంపినది. ఈ గుంపు "మల్లికార్జున మహారాజులకు జయము, విజయము?" అనే సంతోష నినాదాలతో దుర్గ సింహద్వారం వద్దకు సరాసరిగా రావడంచూచి, ఇదేదో శత్రువుల కుహనావ్యూహమే కావచ్చునని సంశయపడినాడు కుంజుసెట్టి. తమ సైనికులవలె వేషభూషలు ధరించిన వీరు శత్రు సైనికులే అయి ఉంటారని ఊహించి, తన క్రింది విలుకాండ్రకు "సిద్ధంగాఉండండి!"

అని ముందు హెచ్చరిక చేసినాడు. ఒకటి రెండు బాణాలూ ఈ గుంపు ముందు ఎదురుతూ పోయినవి.

"అక్కడే ఆగండి. ఎవరు మీరు?" అని దుర్గంమీద నిలబడిన కుంజుసెట్టి గట్టిగా ప్రశ్నించినాడు. మేము మీ సైనికులం. నిన్న శత్రువులకు పట్టుబడిన్నాము. ఇప్పుడు మాకు విడుదల అయినది. మల్లికార్జున మహారాజులవారికి జయం, విజయం !" అని ఆగుంపు మరల నినదించినది. కింద దుర్గద్వారాన్ని కాపలాకాస్తున్న మల్లికార్జునుని సైనికులు వచ్చినవారు తమవారేనని గుర్తించినారు.

హొయిసళ విష్ణువర్ధనులే తమను చెరనుంచి విడిపించినారని, సేనాపతి కుంజుసెట్టికి హొయిసళ ప్రభువులనుంచి తాము కమ్మ ఒకటి తెచ్చినామని ఈ గుంపువారు తాముతెచ్చిన కమ్మను కుంజుసెట్టికి పంపినారు.

"ఓహో! మా చేతిదెబ్బ వేడెక్కి ఇప్పుడు సంధి కోరుతున్నారా?" అంటూ కుంజుశెట్టి కమ్మను చదివినాడు.

"ధనుర్వేద పారంగతులయిన కేరళవాసులు కుంజుశెట్టి సేనాపతులవారికి, హొయిసళేశ్వర విష్ణువర్ధనుల ఆజ్ఞాధికారి బొప్పణుని విన్నపం. మా ప్రభువులూ మీ ధనుర్విద్యాకౌశలం విన్నారు. ఇప్పుడు తామే కండ్లారా చూచి మెచ్చుకొనినారు. యుద్ధంకంటే విద్యలోను, కళలలోను హెచ్చు అభిమానులయిన మా ప్రభువులు విద్యావంతులకు, కళావేత్తలకు హెచ్చు గౌరవ ప్రోత్సాహాలను ఇస్తారు. మీ ధనుర్విద్యానైపుణ్యాన్ని చూచి ఆనందించగోరుతున్నాము. తాత్కాలికంగా యుద్ధం కూడా ఆపినారు. సౌహార్ద సౌమనస్యాలతో మాయీ పిలుపును మీరు గౌరవించి, మా ప్రభువుల మనస్సుకు మెప్పు కలిగిస్తారని నమ్మినాము. మీ అధికార గౌరవాలకు దైవసాక్షిగా ఏదోషమూ, లోపమూ రాకుండా చూడడం మా కర్తవ్యమని భావిస్తున్నాము. మిమ్ములను ఆదరంతో ఆహ్వానిస్తున్నాము. మధ్యాహ్నత్వరం మా శిబిరానికి దయచేయండి."

బొప్పణ దండనాయకుడు



విష్ణువర్ధనులు మంచి ధానుష్కులన్న ఖ్యాతిని కుంజుసెట్టి విన్నాడు. 'ఇలాటి కలాభిమానిఎదుట తన కలానైపుణ్యం ప్రదర్శించకపోతే తను నేర్చినవిద్యకు మాన్యత లేకపోవచ్చున'ని అభిమాని అయిన కుంజుసెట్టి ప్రభువుల స్వాగతానికి ఒప్పి, అప్పుడే తిరుగు కమ్మను వ్రాయించి పంపించినాడు. "ఒకవేళ తన శక్తిసామర్థ్యాలకు మెచ్చి, ఇలాంటి యోధులతో విరోధం తగదని విష్ణువర్ధనులు యోచించవచ్చు. సంధి కోరవచ్చు. ఒకవేళ అలాగున అయితే, మంచిదే." అనే ఆశకూడ కుంజుసెట్టికి అప్పుడు కలిగినది.

నిర్దిష్ట సమయానికి కుంజుసెట్టి తన ధనుర్బాణాలతో, ఇద్దరు ఆప్తులతో గుర్రమెక్కి హొయిసళసైన్యం స్కంధావారానికి వచ్చినాడు. బొప్పణనాయకుడు తానూ తన యిద్దరు ఆప్తులతో వారికి ఎదురేగి, స్వాగతమిచ్చి, సగౌరవంగా తన ప్రభువులవద్దకు పిలుచుకొని వెళ్ళినాడు. దండనాయకుల, చమూపతులమధ్య సూర్యునివలె ప్రకాశిస్తున్న విష్ణువర్ధనులు దివ్యాసనారూఢులై ఉన్నారు.

ప్రభువులు సంతోషంతో నవ్వుతూ కుంజుసెట్టికి స్వాగతమిచ్చి, ఉచితాసనం అలంకరించమనికోరి, అతని ధనుర్విద్యాక్రమాన్ని విచారించి, ఆ మహాసాధన విశేషాలను అడుగుతూ, ప్రశంసిస్తూ, "ఇంతటి అపూర్వ చాపలాఘవంచూచి సంతోషపడడానికి మేమందరం కుతూహలంతో ఉన్నాము. కష్టమని భావించరాదు. మీ విద్యను మేము చాల గౌరవిస్తాము." అని సెలవిచ్చినారు.

కుంజుసెట్టి ప్రభువుల ప్రోత్సాహానికి హర్షించినాడు. ఆ నిండు సభనుచూచి ఆనందించినాడు. తన ధనుస్సుకు అల్లెత్రాకు ఎక్కించి, ఠంకారంచేసి, మనస్సులోనే తన గురుదేవుని, పశుపతిని స్మరించి, వందనం చేసి, చాపచాతుర్యం ప్రదర్శించడానికి సిద్ధమయినాడు. ప్రదర్శనంలో ప్రధానాంశాలు మూడు : మొదటిది—కుంజుశెట్టి కంచు అద్దంముందు నిలబడి, వెనుకఅద్దంలో ప్రతిబింబిస్తూ దూరంలోఉన్న కృతకపక్షి తలను బాణంతో ఛేదించినది. రెండవది—దూరంలో వ్రేలాడగట్టిన గుర్రపుతోక

వెంట్రుకను తీక్ష్ణమైన బాణంనుంచి రెండుతుంట్లు చేయడం. మూడవది—అత్యాశ్చర్య కరమయినది. ప్రేలాడగట్టిన గుర్రపుతోక వెంట్రుకను రెండు చీలికలుగా చీల్చడం. ఈ చాపలాఘవాన్ని కుంజుసెట్టి చూపినప్పుడు సభవారంతా కండ్లు తెరచుకొని బొమ్మలవలె ఉండిపోయినారు. కుంజుసెట్టి ముగ్గురుమనుష్యుల దూరంలో వీరాసనంలో కూర్చుని, ప్రాణాయామంలో ఉచ్ఛ్వాస నిశ్వాసాలను నిరోధించి, విల్లు చేతపట్టుకొని, తీక్ష్ణతమమూ, సూదికొనకన్నా సన్నని మొనగలదీ అయిన బాణం సంధానించి, రెప్పపాటులేక తదేక ధ్యానంతో తనదృష్టిని వెంట్రుకమీద కేంద్రీకరించి, బాణాన్ని చేతిలో కొద్దిగా పైకి ఎగరవేసి తూచినట్టుచేసి, అల్లెత్రాడుపై సంధించి, తన లక్ష్యమైన వెంట్రుకపార్శ్వం, శరాగ్రం ఒకే మట్టంలోకి వచ్చిన క్షణాన బాణం వదలినాడు. బాణం తాకినవేగానికి వెంట్రుక కొసనుకట్టిన గుండు కొంచెంగా కదలింది. బాణపు సూక్ష్మాతిసూక్ష్మమైన కొన వెంట్రుకకు ఆవల పడినది; బాణం ఇవతల పడినది. సభవారు చూచినదంతే. కుంజుశెట్టి ఈ శరసంధాన సమాధియోగంనుంచి లేచినపుడు, అతని కన్నుల్లో ఆనందబాష్పాలు కనిపించినవి. అతడు రెండు చేతులు జోడించి మహాదేవునికి అనంత ప్రణామాలు సమర్పించినాడు. సభలోనివారి కండ్లకు వేలాడగట్టిన వెంట్రుక ప్రేలాడగట్టినట్టే ఉన్నది. కుంజుసెట్టిమాత్రం తాను కృతకృత్యుడయినట్లే కనిపించినాడు. విష్ణువర్ధన ప్రభువుకూ ఏమిజరిగినదో తెలియలేదు. కుంజుశెట్టికి అందరి ముఖాలలోను ప్రశ్నార్థక చిహ్నమే కనిపించినది. అప్పుడు అతడు లేచివెళ్ళి, ప్రేలాడగట్టిన ఆ వెంట్రుకనుతెచ్చి ప్రభువులముందు పెట్టినాడు; తాను చీల్చిన భాగాన్ని రెండు భాగాలుగా పట్టుకొని చూపినాడు. బాణం కొనఉన్న ప్రమాణానికి సరిగా, వెంట్రుకసమంగా రెండు చీలికలయినది. ఆ ఆశ్చర్యంచూచి సభవారంతా దిగ్భ్రాంతులయినారు. ప్రభువులు తమ దివ్యరత్న ఖచిత సువర్ణ చాపాన్ని అంబులపొదిని తెప్పించి, "చాపవిద్యా మహోన్నత, వీటిని నీవు స్వీకరించవలె. ఇది మా సంతోషపు అల్పపారితోషికం. పృథ్విపుట్టినమీదట ఇంతవరకు నీవంటి చాపవిద్యా ప్రవీణుని ఎవరూ, ఏకాలంలోను, చూచిఉండరు. నీవు సుభటుడివి." అని పొగడి, సువర్ణ విభూతిపట్టాన్ని కుంజుసెట్టి ఫాలానికి కట్టించి, శ్రేష్ఠ



దుకూలాలతో అతనిని గౌరవించి, పంపించినారు. కళాభిమానులైనవారు విష్ణువర్ధన ప్రభువులు.

కుంజుసెట్టి ఆనందతుందిలుడయినాడు. "ఇటువంటి ప్రభువు సేవ తనకు లేకపోయెగదా! ఇటువంటి ప్రభువును ఇప్పుడు శత్రువుగా పరిగణించి యుద్ధం చేయవలసి వచ్చినదికదా!" అని అతని మనస్సు కష్టపడినది. ఒక విధంగా విష్ణువర్ధనులకు కావలసినదీ అదే. కుంజుసెట్టిని ఈ విధంగా బహూమానించడం వల్ల, అతని విద్యను గౌరవించడం మాత్రమేకాక యుద్ధంలోను కుంజుసెట్టి చేతులను ఒక విధంగా కట్టివేసినట్టయి తన్మూలకంగా ఒక తంత్రం సాధించినట్టు అయినదని విష్ణువర్ధనుల మనస్సుకు సమాధానం కలిగినది.

కుంజుసెట్టి తన పాళేనికి తిరిగి వెళ్ళినప్పుడు మల్లికార్జుమని వైపు వారంతా అతనికి లభించిన ఉడుగరలను, రత్నఖచిత సువర్ణ ధనువును, అంబుల పొదిని, సువర్ణ విభూతిపట్టాన్ని, 'చాపవిద్యా మహోన్నత' బిరుదునూ చూచినారు. పలువురు సంతోష పడినారు; పలువురు అసంతృప్తి పడినారు. శత్రుసేనలోను విష్ణువర్ధనుల కప్పుడు గౌరవ మేర్పడినది.

అప్పుడు సాయంకాలం సమీపిస్తూ ఉన్నది. నలుగురు మల్లికార్జున సైనికులు పరిగెత్తివచ్చి కుంజుసెట్టికి నమస్కరించి "స్వామీ, నిండిన మూడు బండ్లు మన దుర్గ ద్వారంముందు నుంచి శత్రుశిబిరం వైపు పోతూండగా, ఆపి, చూచినప్పుడు లోపల ఉన్న పెద్ద బానలలో మద్యం నిండి ఉండడం కనిపించినది. బెదిరించి, బెదిరించి 'ఎక్కడికి?' అని ప్రశ్నించగా బండిలోలేవా డొకడు 'అక్కడవారు హెచ్చు ధనమిచ్చి కొంటున్నారు.' అని శత్రు శిబిరం వైపు చేయి చూపినాడు. దేవరవారి ఆనతి ఏమి?" అని మనవి చేసినారు.

కుంజుసెట్టికి కోపం వచ్చినది. "ఏమిటేమిటి? శత్రుసైనికులకు మన పురవాసులు మద్యం ఒదిగిస్తున్నారా? ఈ నీచకార్యం ఎన్నాళ్ళనుంచి జరుగుతున్నదో? ఆ బండ్లవారిని చెరలోపెట్టండి. తర్వాత విచారణ

చేద్దాము. ఈనాడు ఎట్లయినా మా సంతోషదినం. ఆ బండ్లలోని మద్యం దుర్గ రక్షణ సైనికుల కందరికీ ఒక్కొక్క గిన్నెడు పంచిపెట్టండి. జాగ్రత! మితి ఉండనీ. మితిమీరిన వారిని చీకటి కొట్టులో పడ వేస్తాము." అని కుంజుసెట్టి ఆనతిచ్చినాడు.

చెరచిక్కిన బండ్లవారు హానగల్లు దుర్గవాసుల వలె వేషాలుధరించిన హొయిసళ సైనికులు, బండ్లు, ఎద్దులు, బానలు పురవాసులనుంచి సంపాదించినవి. మద్యం హొయిసళ సైనికులు స్వయంగా సిద్ధపరచినది. ఎక్కువ మత్తు తలకెక్కేటట్టు, మంచి రుచి ఉండేటట్టు వండిన ఆ మద్యాన్ని మల్లికార్జునుని సైనికులు మనసారా స్వీకరించినారు. పరిణామం—రాత్రి మేల్కొని ఉండి దుర్గ రక్షణ చేయవలసినవారు మత్తులోపడి గాఢనిద్ర పోయినారు.

విష్ణువర్ధనుల చాణక్యనీతి ఇక్కడకూడా బాగా ఫలించినది. దుర్గ రక్షకులు మయికంలో పడి ఉన్నప్పుడు, హొయిసళ సైనికులు గ్రామీణుల వేషంలో "దుర్గాన్ని లగ్గపట్టడానికి అనుకూల మెక్కడ?" అని దుర్గంచుట్టు వెదక సాగినారు. రెండవ ప్రహరం రక్షకులు వచ్చేలోపుగా వీరు తమ కార్యసాధనం చేసుకోవలసి వచ్చినది. మల్లికార్జునుని సైన్యం దుర్గాన్ని లగ్గలుపట్టడానికి అభ్యాసం చేసుకొనే స్థానమే హొయిసళ సైనికుల కంటపడినది. అక్కడక్కడ గోడరాళ్ళ మధ్య బొటనవ్రేలు ఊనడానికి తగినంతి సందులు, కొన్నిచోట్ల కర్ర గూటాలూ కనిపించినవి. ఈ విషయాన్ని ప్రభువులకు మనవి చేసుకొనడానికి ఈ వేషధారులయిన సైనికులు తమ శిబిరానికి వచ్చినారు. అప్పుడు వారి శిబిరంలో ఒక విశేష సన్నివేశం జరిగినది.

లెంకరాయడనే ఒక సైనికుడు తాను "భైరవుడు" కావడానికి నిశ్చయించి, ముందుకు వచ్చి ప్రభువులకు నమస్కరించి "ప్రభూ, నేను లెంకను. రేపు భైరవుడు కావడానికి సంపూర్ణ సంతోషంతో వచ్చినాను. వీడెమిచ్చి, అనుమతించవలె." అని మనవి చేసుకొనినాడు. ప్రభువులు కొంచెంసేపు ఆలోచించి, లెంకరాయని ధైర్యానికి, ఆత్మాహుతి నిశ్చ



యానికి మెచ్చుకొని "లెంకరాయ, నీవు ఆదర్శభైరవు డయినావు. ఇదిగో విడెము (తాంబూలం) తీసుకో. రేపు నీవు వీరస్వర్గానికి అధిరోహించి వెళ్లు. నీ భార్య పిల్లలకు ఏబది గద్యాణాలను, ఐదుపుట్లు పండే ఖండ్రికను మేము ముడుపు కట్టుతున్నాము." అనినారు. లెంకరాయనికి మహానందమయినది.

రేపు రణభైరవునికి ఆహుతి అయ్యే ఈ భైరవ లెంకరాయనికి అప్పుడు విష్ణువర్ధనుల శిబిరంలో విశేష మర్యాదలు జరిగినవి. అనంతరం బొప్పణనాయకుడు లెంకరాయన్ని గుట్టుగా పిలుచుకొనిపోయి, అతనిని ఈ సందర్భంలో మరొక యుద్ధ తంత్రానికి అప్పగించినాడు.

మొదటి జాము కోడికూయడానికి ముందే లెంకరాయనికి మల్లికార్జున రాజు వేషం వేసినాడు. అదృష్టవశాత్తు లెంకరాయడూ మల్లికార్జుని వంత ఎత్తే ఉన్నాడు. ఇలాగు ఉండడం చూచే బొప్పణనాయకుడు ఈ కొత్త చాణక్యనీతిని వెదకినాడు. తన సైనికులు అప్పుడే తెలుసుకొని వచ్చిన దుర్గం లగ్గలు పట్టడానికి సాధ్యమయిన స్థలానికి లెంకరాయణ్ని చీకటిలో, కంబడి కప్పి పిలుచుకొని వెళ్ళి ఎంతో ప్రయాసతో కోట యెక్కించినాడు బొప్పణనాయకుడు. "నిర్ణీత సమయంవరకు ఎవరికీ కనిపించకుండా, ఎలాగునైనా ఎక్కడనైనా దాగి ఉండు. అంతలోగా నీవు ఎవరి కంట నైనా పడితే పనిపాడవుతుంది. సరిగా ఉదయం ఐదు గడియల పొద్దెక్కగానే నీ పనిని నెరవేర్చు." అని లెంకరాయనికి చెప్పి, బొప్పణనాయకుడు శిబిరానికి తిరిగి వచ్చినాడు. మర్నాటి యుద్ధరీతే విశేషరీతిగా సాగినది.

# 17

కుంజుసెట్టి హొయిసళ శిబిరానికి వెళ్ళి, విష్ణువర్ధనుల నుంచి సత్కారం పొందడం మల్లికార్జున మహారాజు మనస్సుకు నచ్చలేదు. ఇది శత్రువుల కుహకపద్ధతి అనే, అతడు పరిగణించినాడు. కుంజుసెట్టిని పిలిపించి, "శత్రువులనుంచి నీవు బహుమానాలు పొందడమా? ఇది

ఎలాంటి సిగ్గులేని తనం ?" అని మల్లికార్జునుడు కుంజుశెట్టిని నిందించినాడు. బనవసిని పోగొట్టుకొన్న దుఃఖం మల్లికార్జునునికి ఇదివరకే మిక్కుటంగా ఉంది. "ఇంతమంది చతురులైన ధనుర్ధారులుండీ మనకింత అవమానమా!" అని అతని మనసు నొప్పిపడినది. "హొయ్సళుల మీద మాకు మక్కువ ఎక్కువ. విష్ణువర్ధనుడేమీ సామాన్యుడుకాడు. యుద్ధ తంత్రాలను బాగా ఎరిగినవాడు. రేపటి యుద్ధంలో అతని ఏనుగులదండు మనదుర్గం మహాద్వారాన్ని పిండిపిండి చేస్తుంది. దానికోసం వారు సర్వసన్నాహం చేసుకుంటూ ఉండడం నేను కండ్లార చూచినాను. ఏనుగులకు ఎలాంటి దెబ్బ తగులకుండా వారు జాగ్రత పడుతున్నారు. సైనికులూ మన బాణాలతో ఎలాంటి కష్టమూ కలుగకుండా శిరస్త్రాణం, వక్షస్త్రాణం ఏర్పాటు చేసుకొన్నారు. అందుకోసం వారు ఒకనాటి యుద్ధాన్నే ఆపివేసినారు. ఇదంతా చూచినతర్వాత వారితో స్నేహంతో ఒడంబడిక చేసుకొనడమే మంచిదని నాకులోస్తున్నది." అనినాడు కుంజుసెట్టి.

కుంజుసెట్టి మాటలు విని మల్లికార్జునుని ఒళ్లు మండినది. "రాజులంటే ఎప్పుడూ స్వతంత్రులుగానే ఉండవలె. లేకపోతే 'రాజు' అనే పేరెందుకు ? సామంతుడనే అంకుశం మనమీద వద్దు. మేము తలవంచితే, కైలాసంలో ఉన్న మా అయ్యగారూ, తాతగారు తైలపచక్రవర్తి తమ వంశం ఇక్కడికి అంతమయినదని గుండెపగిలి పోయేరు. రేపటి యుద్ధం ఎంత కష్టతరమయి నప్పటికీ నీవు దుర్గం రక్షించుకోవలె. మా దురదృష్టానికి ఇప్పుడే మా ఆరోగ్యం చెడిపోవలెనా ? సాధ్యమైతే రేపు మేమే దుర్గం మీదికి వచ్చి మన సైన్యానికి కనబడుతాము." అని కుంజుసెట్టికి మల్లికార్జునుడు సూచన చేసి చింతా నిమగ్నుడయినాడు.

కుంజుసెట్టి దుర్గరక్షణకు తనకు చేతనయినంత ఏర్పాటును సూర్యోదయవేళకు పూర్తి చేసినాడు. సూర్యోదయమైన కొంత సేపటికి హొయిసళ శిబిరంనుంచి ఉన్నతమైన గజయూథం బయలుదేరినది. ముందునుంచిగాని, పైనుంచికాని ఆ గజాలకు బాణాలు తాకనట్టు రక్షణ కల్పించినారు. పొడుగాటి మానుదిమ్మలు రెండిటిని అవి తొండంతో మోసుకొని ముందుకు నడిచినవి. వాటితోపాటు శిరస్త్రాణాలు, కవచాలు ధరించి, కత్తి, డాలు,



విల్లు, బల్లెం—ఇతర శస్త్రాస్త్రాలు ధరించిన హొయిసళ సైనికులు నడిచినారు. పదాతి సైనికులు చెట్లకొమ్మలను భుజాలకు, తలపైన కట్టుకొనినారు. పదాతి సైనికులు చెట్లకొమ్మలను భుజాలకు, తలపైన కట్టుకొని దుర్గం లగ్గ పట్టడానికి కావలసిన సామగ్రితో నెమ్మదిగా నడుస్తూ, అడవి దారిలో పడి వెనుకటిరాత్రి రెంకరాయణ్ని లగ్గలు ఎక్కించిన స్థలానికి నడిచినారు. ఈ పదాతి సైనికులదండు శత్రు సైన్యం కంటపడలేదు. శస్త్రాస్త్రాలతో బయలుదేరిన సైనికుల వెంట రథాలు, అశ్వికదళాలు వెడలినవి.

దుర్గ మహాద్వారంవైపు బయలుదేరిన సైన్యం, శత్రువుల దృష్టిని తమవైపు లాగుకొనడంకోసం కొమ్ములు, కాహళులు, తప్పెటలు మొదలయిన వాద్యాలను బలంగా మ్రోగిస్తూ వచ్చినది. హొయిసళ సైన్యం దుర్గద్వారంవైపు ముట్టడించడానికి రావడంచూచి, దుర్గంపైనున్న కుంజుసెట్టి తన విలుకాండ్ర నందరిని కోట కొమ్ములకు పిలుపించుకొనినాడు. దీనివల్ల రహస్యంగా దుర్గాన్ని లగ్గపట్టడానికి బయలుదేరిన హొయిసళ సైనికులకు మరింత అనుకూలం కలిగినది.

పైనుంచి బాణవర్షం కురుస్తున్నా, శిరస్త్రాణం, ఉరస్త్రాణం ధరించిన హొయిసళ సైనికులు, ఏనుగులు నిరభ్యంతరంగా మహాద్వారం సమీపించగా, ద్వారంవద్ద కావలిఉన్న మల్లికార్జునుని సైన్యం తలపడినది. ఉభయులకు సంకుల సమరమై రక్తపు కాలువలు పారినవి. ఇరువైపులు పలువురు క్షతనిహతులయినారు.

అప్పుడు హొయిసళ సైన్య మధ్యంలో మహా కోలాహలం పుట్టినది : "అదిగో ! మల్లికార్జున మహారాజు ! దుర్గంపైన అదిగో ! అదిగో ! కొట్టు. చంపు." అని కేకలువేయడం ప్రారంభించినారు. తమ ప్రభువులు దుర్గంపైన దర్శనమిచ్చినారని అతని సైనికులు జయజయ నినాదాలు చేసినారు; ఉత్సాహంతో తమ రాజువైపు చూచినారు. హొయిసళ ధనుర్ధారులు తీక్ష్ణబాణాలను గురిపెట్టి వదలినారు. గురిపెట్టి వదలిన బాణాలన్నీ చాలవరకు దుర్గప్రాకారం చివరిభాగానికి తగిలి వ్యర్థంగా కూలిపోయినవి. ఆ సమయంలోను ఏనుగులు దుర్గమహాద్వారం తలుపులను మాను దుబ్బలతో కొట్టి కూల్చడానికి ప్రయత్నించినవి,

ఇంతలో దుర్గంమీద కనిపించిన మల్లికార్జునుని రొమ్మును ఒక తీక్ష్ణమైన బాణం తగిలినది; వాడువికారంగా అరుస్తూ, దుర్గం పైనుంచి లోపలికి తలక్రిందులుగాపడి ముక్కలు ముక్కలయి పోయినాడు. హ్హో ! హ్హో ! మల్లికార్జునుణ్ని చంపివేసినాము. చంపివేసినాము. అతడు చచ్చినాడు; మల్లికార్జునుడు చచ్చినాడు.'' అని హొయిసళ సైన్యం అత్యానందంతో తమ కత్తిని, డాలును పైకెత్తి, పైకి విసిరి పట్టుకొంటూ, ఆనందనృత్యం చేసినారు. దీనిని చూచి మల్లికార్జునుని సైన్యానికి ఏమీ తోచలేదు. లెంకరాయడు స్వర్గానికి వెళ్ళిపోయినాడు. "అయ్యో ! అనారోగ్యంతో పక్కపట్టిన ప్రభువులు అపాయమనికూడా గ్రహించక కోటమీదికివచ్చి ఈలాగు ఘోరవిపత్తుకు గురిఅయినారే !'' అని కుంజుసెట్టి కూడా భయపడినాడు.

ఆ సమయానికి ఏనుగులు దుర్గ ద్వారాన్ని పగులగొట్టి కిందికి కూల్చివేసినది. హొయిసళ సైన్యం ప్రళయ జలంవలె లోపలికి చొచ్చుకొనిపోయినవి. మల్లికార్జునుడు హొయిసళ సామంతుడయినాడు. ఈ విధంగా ఉచ్చంగి, బసవసె, బెళవల, సంతలిగె, హలసిగె, హులికెరె, సలిమలె, లొక్కిగుండి, హానగల్లు విష్ణువర్ధనుని పరిపాలనకు చేరిపోయినవి. విష్ణువర్ధనులు హెద్దొరె అనే నదికివెళ్ళి, ఆ నదీజలంలో తమ కాంభోజాశ్వాన్ని, ఖడ్గాన్ని కడిగినారు.

పైన పేర్కొన్న ఊళ్ళలో బెళవల, హలసిగె అనేవి అప్పుడు కదంబరాజయిన జయకేశి పాలనలో ఉండినవి. ఈ జయకేశి చాళుక్య షష్ఠ విక్రమాదిత్యుని అల్లుడు. ఇతని రాజధాని పశ్చిమసముద్ర తరంగాలు తాకుతున్న గోవా. తన పాలనలోని గ్రామాలను విష్ణువర్ధనులు స్వాధీనపరచుకొన్నారన్న కడుపుమంటతో ఆ జయకేశి హొయిసళుల గోవులను అపహరించినాడు. అప్పుడు విష్ణువర్ధన ప్రభువులు వాడిని గోవాకు తరుముకొని వెళ్ళినారు. జయకేశి తట్టుకోలేక అప్పుడు గోవులను అప్పగించి శరణాగతుడయినాడు. ప్రభువులు పశ్చిమ సముద్రతీరంలో విజయ స్తంభాలు నాటి, తమ దిగ్విజయాన్ని సంపూర్ణంచేసి, తర్వాత ద్వారవతి దారి పట్టినారు. పశ్చిమోత్తరాల దిగ్విజయం ఈవిధంగా పూర్ణమయినప్పటికీ, శరణాగతుడైన హానగల్లు మల్లికార్జునుడు కొన్ని సంవత్సరాల తర్వాత మరల తలయెత్తి ప్రబలుడయినాడు. అప్పుడుగూడ ప్రభువులే మరలవచ్చి, వానిని నామరహితుణ్నిగాచేసి, హానగల్లును తమ ఉత్తరపు ఎల్ల రాజధానిగా చేసుకొనినారు.



# 18

విష్ణువర్ధన ప్రభువులు విజయ వైభవంతో ద్వారవతికి విజయం చేసినారు. కుమారుడు రాజధాని వెలుపలే అప్పాజీవారికి ఎదురువచ్చి, మహా వైభవ ప్రేమలతో స్వాగతమిచ్చినాడు. విజయశాలిఅయి వేంచేసిన ప్రభువులమీద పురజనులు పుష్పవర్షం కురిపించినారు. ప్రభువులు నగరు వద్ద కాంభోజాశ్వం దిగి, వెంటనే శాంతలను చూడడానికి వెళ్ళినారు. ప్రియుని రాకనే ఎదురుచూస్తున్న శాంతల ప్రభువులను దర్శించిన వెంటనే, హృదయం పొంగి, కన్నీరు చిందగా, వారి పాదాలకు నమస్కరించినది. ప్రభువులు హృదయేశ్వరిని తమ రెండు చేతులతోను పట్టుకొనియెత్తి, "దేవి, నీ స్థానం ఇది.'' అని ప్రీతితో తమ హృదయానికి అదుముకొని, తమ అతుల విశ్వాసం వ్యక్తపరచినారు.

ప్రభువులు తమదేవేరి దుఃఖంతో చిక్కి శల్యమైపోయి ఉంటుందని భయపడినారు. ఇప్పుడు వారి మనసు సమాధానపడినది. నిండు హృదయంతో "నీవు మా విజయశ్రీవి. నీవు మా పుణ్యరూపిణి. నీ ధర్మం, నీ వ్రతం, నీ సౌశీల్యం మాకు రక్ష.'' అనినారు.

శాంతల ప్రశంసలు అందుకున్నా, లజ్జతో మందహాసం చేస్తూ, "ప్రభూ, ఆమాటలు అనవలసిన దానిని నేను. మీరు చేయిపట్టుకొని నన్ను పైకెత్తినారు; లేకపోతే ఎలాగు ఉండే దానినో! ఎక్కడ ఉండే దానినో ! మహారాజ్ఞిగా చేసుకొనినారు; అందరి గౌరవాదరాలకూ పాత్రురాలనుగా చేసినారు.'' అని విన్నవించుకొనినది.

ప్రభువులు శాంతల ముంగురులను మృదువుగా ఎత్తి వెనక్కు సవరిస్తూ, "చెన్నా, అందరి ప్రీత్యాదరాలకు నీవు పాత్రురాలుకావడం నీ గుణగణాలతోనే. నీవు గుణవంతురాలు కాకపోతే, జనం ప్రీత్యాదరాలతో చూచేదా? మేమైనా మా ఎదలో నీకుచోటు ఇచ్చేవారమా? దేవీ, రూపలావణ్యాలున్నచోట గుణం ఉండడం విరళం...ఇది ఉండనీ. లక్ష్మి ఎక్కడ? ఎలాగు ఉన్నది? పండిత మామయ్యగారు ఎలాగు ఉన్నారు?"

"అదే చెప్పదలచినాను. పెద్దయ్యగారు ఇటీవల చాల కృశించినారు. మీరు తిరిగివచ్చే సమాచారం తెలిసిన మీదట లక్ష్మి వేలాపురికి వెళ్ళి అయ్యగారిని పిలుచుకొని వచ్చినది."

"ఈ స్థితిలో వారిని లక్ష్మి ఎందుకు పిలుచుకొనిరావలె? మేమే వేలాపురికి వెళ్ళివచ్చేవారం గదా?"

"నేనూ అలాగుననే అన్నాను. అయితే వారు వినవలె గదా?"

ప్రభువులు, శాంతల పెరుమల పండితులను, లక్ష్మిని చూడడానికి బయలుదేరినారు.

కొన్ని నెలలు సుఖంగా గడచిపోయినవి. ఒకే ఒక దుఃఖసమాచారమేమిటంటే, లక్ష్మి రెండు నెలలలో కర్మబాధ్యురాలు కావడం. లక్ష్మి, శాంతల సమానంగా దుఃఖపడినారు. మాచికబ్బె, మారసింగమయ్యగారు, కుమారవిష్ణువు, ప్రభువులు ఈ దుఃఖం పంచుకొన్నారు. పెరుమలపండితుల జీవితం ఆదర్శజీవితం. ముక్తాత్మవారిది.

ఇంతలో అశ్వమేధయాగానికి కావలసిన సన్నాహాలన్నీ జరిగినవి. రామేశ్వరము మొదలు వారణాసివరకు సమస్త విద్యా పీఠాలకు, గురు పీఠాలకు, రాజరాజాధిరాజ చక్రవర్తులకు, ఉద్దండ పండితులకు, మఠాధీశులకు అశ్వమేధయజ్ఞాహ్వానపు కమ్మలు పంపబడినవి. విద్వాంసులకు, వేదాధ్యయన సంపన్నులకు, మఠాధీశ్వరులకు రాజ్యకోశాగారంనుంచే ప్రయాణపు ఏర్పాట్లు కలిగించినారు. ఈ మహాయాగాంగాలయిన హవన



శాంత్యాదులలో పాల్గొనే ఋత్విక్కులు, ఆచార్యులు, వేదసంపన్నుల సంఖ్య వేయి అయినది.

యగచినదీ తీరంలోని రమ్యమైన వనప్రాంతంలో, విశాలమైన యాగశాల శాస్త్రోక్తరీతిలో నిర్మించబడినది. యాగద్రవ్యాలు, యాగోపకరణాలు, ఇతర సామగ్రి—అంతా అపారంగా సంగ్రహించబడినది. రెండు మూడు నెలలలో ఈ వనంలో ఒక పర్ణనగరమే రూపొందినది.

ఏర్పాట్లన్నీ సమర్పకంగా జరిగినవి. నిర్ణీతమయిన సులగ్న సుముహూర్తంలో విష్ణువర్ధన ప్రభువూ, దేవేరులూ స్నానంచేసి, మడుగు పీతాంబరాలు ధరించి, సకల బంధు పరివారాలతో, మహర్షులు, విద్వాంసులు, ఋత్విక్కులు, వెంటరాగా, మంగళవాద్య మంగళఘోషతో యాగశాలలో ప్రవేశించి, దీక్షాకంకణం ధరించినారు.

ఈ విస్తృతమైన యాగశాలలో ప్రధాన యజ్ఞవేది, హోమకుండం కాక నూరారు హోమకుండాలు ఉన్నవి. యాగం ఆరంభమయినది. అహర్నిశం విరామంలేకుండా జరుగుతున్న హోమాల ఆజ్యాహుతితో పుట్టిన ధూమం వనాన్నంతా సుగంధ పూరితంచేసింది. నూరారు కంఠాల నుంచి వెలువడిన సుశ్రావ్యమైన, స్వరబద్ధమైన వేదఘోష, హోమమంత్ర ఘోష అందరి హృదయాలు ఆవరించి, వారిని ఆనందపులకాంకితులను చేసినవి. శుచి, పవిత్రం అయిన ఆ మహాయాగశాల, పర్ణనగరం, తమదే అయిన అపూర్వ శోభతో నిలసిల్లినవి.

ఈ అశ్వమేధ క్రతువు పద్దెనిమిదినాళ్లు అవిచ్ఛిన్నంగా జరిగినది. ప్రభువులు, పట్టమహిషి శాంతల, లక్ష్మి, తక్కిన దేవేరులు మహానిష్ఠతో ఉండి, క్రతువును సాంగంగా పూర్తిచేసి, అవభృతస్నానంచేసి, దీక్షా కంకణం విసర్జించినారు. దీని తర్వాత విష్ణువర్ధనులు గోగర్భప్రవేశం చేసినారు. ఒక మనిషి ధారాళంగా లోపల ప్రవేశించి, కూర్చుని మంత్రానుష్ఠానం చేసి ఇవతలికి రాదగినంత పెద్దగా బంగారుతో చేసిన గోవుగర్భంలో ప్రభువులు ప్రవేశించి, కూర్చుని మంత్రానుష్ఠానంచేసి, ఇవతలికి వచ్చినారు. తర్వాత ఆ బంగారు గోవును హొయిసళేశ్వర శాంతలేశ్వర దేవాలయాలకు

దాన మిచ్చినారు. పిదప ప్రభువులు తులాపురుషులూ అయినారు. తక్కెడలో ఒకవైపు ప్రభువులు కూర్చుని, తమ బరువంత బంగారు తూగించి, దానిని విజయనారాయణ దేవాలయానికి దానమిచ్చినారు. ఆ పద్దెనిమి నాళ్ళూ భూరిభోజనాదులు జరిగినవి. ఋత్విక్కులకు, విద్వాంసులకు, యాగంలో పాల్గొన్నవారికి యోగ్యతానుసారం సంభావనలు, ఇతరులకు వస్త్రదానం, గోదానం, హిరణ్యదానం, అన్నదానం యథేచ్ఛగా జరిగినవి. దేవతలూ, మానవులూ అందరూ సంతుష్టులయినారు. ఆహూతులయిన రాజరాజాధిరాజులకు వారివారి అంతస్తుకు తగినట్టు సన్మానోపచారాలుజరిపినారు. అందరూ తమతమ స్థలాలకు సంతృప్తి సంతోషాలతో వెనుదిరిగినారు.

శాంతల, లక్ష్మి యాగాగ్నిని అతిశయ శ్రద్ధాభక్తులతో పూజించి పుత్రసంతానం కోసం ప్రార్థించినారు. యాగాంతం నాటిరాత్రి శాంతల ఒక కలగన్నది: తానూ, లక్ష్మి సంధ్యాసమయంలో తమ పర్ణకుటి వద్ద కూర్చున్నట్టు, అప్పుడక్కడికి ఒక మహాతేజస్వి మహాతపోధనుడు అయిన ఋషి వచ్చినట్టు, ఇద్దరూ ఆ ఋషికి సాష్టాంగపడి అనుగ్రహించవలెనని వేడుకొన్నట్టు, ఋషి ఇద్దరినీ ఆశీర్వదించి, తన చేతిలోని ఒకే నారికేళ ఫలాన్ని చూపిస్తూ, "నా వద్ద ఉన్నది ఈ ఒక్కటే ఫలం. ఎవరికి ఇవ్వను?" అనిఅడిగినట్టు, తాను అప్పుడు "భగవన్, దానిని నా చెల్లెలికి ఇవ్వండి." అని సమాధానమిచ్చినట్టు, అప్పుడు ఆఋషి ఆ నారికేళ ఫలాన్ని లక్ష్మి దోసిలిలో పెట్టి మందహాసంతో ఆగ్నేయ దిశాభిముఖుడై పోతూ, పెద్ద మంటవలె ప్రజ్వలించి అదృశ్యుడయినట్టు—కల గనింది. శాంతల ఈ స్వప్నవృత్తాంతం ఎవరికీ తెలుపలేదు.

విష్ణువర్ధనులు, దేవేరులు సపరివారంగా యాగభూమినుంచి రాజధానికి మరలి వెళ్ళినారు. హొయిసళరాజ్యంలో ధర్మం, సుభిక్షం నెలకొన్నవి. అసూయాపరులయిన ఇరుగుపొరుగు రాజులలోను, సామంతులలోను స్వభావతః పుట్టిన నీచత్వం, పెంచుకొన్న దురాశ స్వచ్ఛంద ప్రవృత్తీ తొలగలేదు. కొంతకాలం తర్వాత, లోలోపల కుట్రలు చేస్తూ హొయిసళ రాజులకు చెల్లించవలసిన కప్పం కానుకల చెల్లింపు ఏవో కుంటి



సాకులతో ఆలస్యంచేస్తూ, తక్కువచేస్తూ, అటు చాళుక్యుల స్నేహం కోసం అంగలార్చ సాగినారు. ఈలాగు ఎదిరించి నిలబడినవారిలో మల్లికార్జునుడు, జయకేశి ముఖ్యులు. హానగల్లు మల్లికార్జునుడు తగర పట్టణం నుంచి మాసణ ప్రభువును పిలిపించుకొని, ఈసారి దుర్గరక్షణకు అతనిని ముందుపెట్టుకొని, తను స్వతంత్రుడయినట్టు ప్రకటించినాడు. కుంజు సెట్టి అతనిని ఎప్పుడో వదలిపెట్టి పోయినాడు.

రాజ్యపు సీమా ప్రాంతాలు రక్షించడానికి, రాజాదాయం సంగ్రహించడానికి, ప్రజల భయాందోళనలను పోగొట్టడానికి, రాజభక్తి విశ్వాసాలను హెచ్చుచేయడానికి, న్యాయధర్మాల స్థాపనకు బొప్పణ నాయకుడు, కుమారవిష్ణువు అప్పుడప్పుడు దేశమంతటా పర్యటించవలసి వచ్చేది. కుమారునికి దేశపరిచయం ఈ విధంగా పెరుగుతూ వచ్చినది.

అశ్వమేధానంతరం ప్రభువులు హెచ్చుకాలం రాజధానిలోను, అప్పుడప్పుడు తలవనపుర, బంకాపుర రాజధానులలోను గడిపేవారు. ఇలాటి సమయాలలో ఒక్కొకమారు శాంతలకూడ ప్రభువులతో ఉండేది. లక్ష్మి ప్రధాన రాజధానిలో రాజ కార్యకలాపాలను నిర్వహించేది. చిన్న దేవేరులలో ఒక్కతె బమ్మలదేవి లక్ష్మికి సహాయపడేది. బమ్మలదేవి అశ్వహృదయం తెలిసిన జాణ. గుర్రపు స్వారిలోను నిపుణ. ఉత్కృష్టమైన తురగాలకు శిక్షణఇచ్చే రాజాశ్వశాల ఒకటి బమ్మలదేవి పర్యవేక్షణలో ఉండేది.

శాంతల, విష్ణువర్ధనుల అనురాగం నానాటికీ మధుర మధురంగా పెరుగసాగినది. ఒకరినొకరు కొన్ని నాళ్ళయినా విడిచి ఉండలేక పోయేవారు. ఇంతయినా శాంతలకుమాత్రం ఒక్క చింత ఉండనే ఉండేది. అది అత్తయ్యగారు చెప్పినమాట: 'హొయిసళ రక్తాన్ని ఎండిపోయేటట్టు చేయవద్దు. వంశవృక్షం కాపాడుకొని వచ్చేభారం నీది.' అన్నమాట. దీనికితోడు శాంతలకు ఆనాడు యాగాంత్యదినాన రాత్రి కడపటి యామంలో కన్నకలా తనకిక సంతానభాగ్యం లేదని శాంతలకు దృఢమయినది. 'అశ్వమేధమే పుత్రకామేష్టి అయినది. అగ్నిభగవానుదే లక్ష్మికి

వరం ఇచ్చినాను; అది సార్థకమయ్యేటట్టు తానూ ప్రయత్నించవలె.' అని ఆమె మనస్సుకు బోధ కలిగినది. ఒకనాడు ప్రభువులతో ఏకాంతంలో ఉన్నప్పుడు వెనుకటి విషయాన్ని మరొకమారు ప్రస్తావించినది.

విష్ణువర్ధనులు : "అయ్యో, ముగ్ధా, మళ్ళీ ఆమాటే అంటున్నావే! మేము నీపై ఎంత ప్రేమతో ఉన్నామో, అంత ప్రేమ లక్ష్మిపైనా చూపుతున్నాను. ఇది నీవు చూడడంలేదా? మంచిది. మరొకమారు మన మిక్కడికి వచ్చినప్పుడు లక్ష్మికూడ మనతో రానీ; వచ్చి ఉండనీ."

"ప్రభూ, నాకూ, లక్ష్మికీ ఎలాటి భేదభావమూ లేదుగదా!"

"అది మాకు తెలియదా?"

"అదీ కొంతకాలం మీ పట్టమహిషిగా ఉండనీ."

"శాంతలా, ఆమాట సంప్రదాయ విరుద్ధం. సాధ్యంకానిదని నీకు ముందే చెప్పినాము. మేముగాని, నీవుగాని, లక్ష్మిగాని జనంనోట్లో పడరాదు. నా శాంతల విషయంలో నావారుగాని, ఇతరులుగాని, మాకు శత్రువులుగాని అనుచితమైన మాటలు అనరాదు. అందువలన మాకు చాల బాధ అయ్యేని. దేవీ, నీవు పట్టమహిషి అయినప్పుడు నీ పట్టాన్ని లాగివేసి మరొకరికి యిస్తే, దుష్టులు లేనిపోని కారణాలు కల్పించి వాగుతారు. ఇది లోకుల స్వభావం. రజకుడన్న మాటలకు సీతామాత పరిత్యాగమే జరిగిందికదా! నీకు తెలియదా! ఇప్పుడు మనంతట మనమే ఆలోచించి చూద్దాము. లక్ష్మికి ఇప్పుడేమిటి కొరత? నా సుకృతంపై ఆనపెట్టి చెబుతున్నాను. లక్ష్మి నీకంటే ఏ విషయంలోను తక్కువ అని తలచలేదు; నడచుకోలేదు."

"అది నాకు తెలుసు; చక్కగా తెలుసు. నా చెల్లెలుకూడ అన్ని విషయాలలోను సంతృప్తితోనే ఉన్నది."

"మరి వేరుగ ఈ పట్టమహిషిపదవి లేనందువల్ల కలిగిన కొరత ఏమిటి? ఆమె నీకు వేరుకాదని తెలిసినతర్వాత మా హృదయంలో



మీ యిద్దరికీ సమానమైన స్థానమే యిచ్చినాము. దేవీ, నీ చెల్లెలిని నీవు అర్థం చేసుకొన్నదానికంటే మేమిప్పుడు హెచ్చుగా అర్థంచేసుకొన్నాను. నీ పట్టాన్ని ధరించడానికి ఆమె ఒప్పుకోదు. ఎన్నటికీ ఒప్పుకోదు. ఆమె మనస్సు దొడ్డది. నీవు ఊహించిన దానికంటె దొడ్డది. ఈ కొరత నీ మనస్సులో ఇంతకాలంగా ఎందుకున్నది? మా విషయంలో అనుమానమా? వృథావ్యథ యెందుకు? ఇకమీద లక్ష్మి ఎప్పుడూ మనతోపాటే ఉండనీ. ఇక నీ మనసు కుదుటపడనీ."

శాంతలకు నోరు కట్టివేసినట్టయినది. "నా హృదయావేదనను ప్రభువులకు ఏలాగు వ్యక్తంచేయను? వ్యక్తంచేయక ఎలాగు ఉండను? ప్రభువులు నా మనస్సు తెలుసుకోలేరా? అత్తయ్యగారిమాట నిలబెట్టడం ఎలాగు? చచ్చి స్వర్గానికి వెళ్ళినా నా ఆత్మకు శాంతి ఉండదు—అని అత్తయ్యగారు చెప్పి, మరణించినారు గదా? ఈ నాభారం తొలగించుకొనడం ఏలాగు?" అనే నానా దుఃఖాలోచనలు శాంతల మనశ్శాంతిని కలచివేసినవి.

శాంతల మాట్లాడడం ఆపివేయడం చూచి, ప్రభువులు ఆశ్చర్యపడి, 'లక్ష్మిని ఇకమీద వెంటపిలుచుకొని రమ్మన్న తర్వాతకదా దేవికి మనశ్శాంతి కలిగినది. ఆహా! తోడబుట్టువు కాకపోయినా, రక్తసంబంధం కంటె దృఢమయిన ఇట్టి సోదరీప్రేమను మేము కన్నది, విన్నది లేదు.' అని ఆనందపడినారు.

ఆ రాత్రి శాంతల ఆలోచనలు అంతం కాలేదు. ఆమె మనసులో ఉన్నది లక్ష్మిని పట్టమహిషిచేసి చూచి ఆనందిద్దామనికాదు. "లక్ష్మికి ఒక పుత్రసంతాన మయితే, హొయిసళ వంశం మిగిలినట్టవుతుంది. అత్తయ్యగారి ఆత్మ సంతృప్తిపడుతుంది. లక్ష్మి పట్టమహిషి కాకుండా, పుత్రవతిఅయినా, ఆ సంతానానికి సింహాసనమెక్కే భాగ్యం వస్తుందో. లేదో! ప్రభువులు కుమారవిష్ణువునే సింహాసనార్హుణ్నిగా నిర్ణయించినారు. ప్రభువులకు కర్తవ్యదృష్టి ఉన్నది; ధర్మదృష్టి ఉన్నది. తమ రక్తమే రాజ్య మేలవలెననే స్వార్థం వారికిలేదు; ఎవరు సమర్థులో

ధర్మాత్ములలో వీరులలో అలాటివారికే తమ సింహాసనాన్ని మీదు కట్టపెట్టినారు. ప్రపంచం నలుగంచులు వెదకినా, కుమారుని వంటివారు దొరకరు. దిట్టమైన ఆణిముత్తెమువంటివాడు నా తమ్ముడు. ప్రభుతాశక్తి కలవాడు. ప్రజలందరి ఆదర విశ్వాసాలకు పాత్రమయినవాడు. ఇలాటివానిని ఎన్నిక చేసి పెట్టిన నిగర్వి, నిష్పక్షపాతి అయిన ప్రభువు మనస్సును నా చాపల్యంలో కలతపెట్టడం సర్వ అపరాధం. అయితే, అత్తయ్యగారి ఆశను నెరవేర్చే దారి? అత్తయ్యగారి ఆత్మ ఎంత నొప్పిపడుతుందో? తపిస్తుందో? నా అత్తయ్యగారి ఆత్మ తెలివితేటలులేని ఆత్మా? కాదు. సంస్కార శుద్ధమైన ఆత్మ అది. దేశహితమే ధ్యేయంగా చేసుకొన్న ఆత్మ అది. ఆ పవిత్రాత్మకు, కుమారుడు సింహాసనమెక్కితే, అసంతృప్తి కలుగుతుందా? కాదు. నా మనస్సులోని భయం వృథా! వృథా! నా తమ్మునికే సింహాసనం లభించనీ.....అయితే, లక్ష్మికి సంతానం ఉంది కదా! అగ్నిదేవునివరం తప్పుతుందా? ఆ సంతానం భావిస్థానం, మానం ఏమిటి? మాకాలం గడచినతర్వాత లక్ష్మి సంతానం తనదే సింహాసనమని పోట్లాడితే? దేశంలోనే కక్షలు, ప్రతికక్షలు బయలుదేరితే? రాజ్యంలో క్షోభం ఏర్పడితే? అయ్యో! ఇదంతా యోచిస్తే, మనస్సుకు ఎన్ని అనుమానాలు, ఎన్ని భయాలు తోస్తాయి! నారాయణా! నీవే దిక్కు; నీకే తెలుసు. నీ సంకల్పమున్నట్లే నడుస్తుంది.'' అని శాంతల రాత్రంతా గింజులాడినది.

## 19

వర్షాకాలానికి ముందే శాంతల తన దాసదాసీవర్గంతో ద్వారవతికి మరలిపోయినది. ఆరేడు నాళ్లలో వస్తామని ప్రభువులు శాంతలను ముందుగా రాజధానికి పంపివేసినారు.

ద్వారవతికి వచ్చిన తర్వాత గూడ శాంతల మనస్సు కుదుటబడలేదు. అన్నివిధాల కుమారుడే ఈ సింహాసనానికి అర్హుడనే నిశ్చయమూ ఆమె మనస్సుకు కలిగినది. 'ప్రభువులూ ఈ నిశ్చయంతోనే ఉన్నారు. వారి



మనస్సును ఏ విధంగాను నొప్పించరాదు.' అనిపించినది ఆమె మనస్సుకు. అయితే ఇప్పుడు మరొక అధైర్యం ఆమె మనస్సులో మొలకెత్తినది. ''దైవం ఆశీర్వాదం అబద్ధంకాదు. లక్ష్మికి పుత్రసంతానం కలిగితే ఆ సంతానం స్థానమేమిటి? మర్యాద ఏమిటి? రాజవంశంలో అంతః కలహం ఏర్పడి హొయిసళ రాజ్యానికి హానివస్తే?'' అని.

శాంతల ద్వారవతి చేరేవేళకు రాత్రి అయినది. ద్వారవతి నిద్రాముద్రితమైంది. వేసవి కావడంవల్ల, పురజనులు వెన్నెలను అనుభవిస్తూ, ఇండ్ల ముంగిళ్ళలో అరుగులమీద, మంటపాలలో, దేవాలయాల విశాలావరణాలలో పండుకొన్నారు. కుమారుడు తనను చిన్ననాటినుంచి ఎత్తిపెంచిన వృద్ధ లక్కణునితో ముచ్చటిస్తూ, శాంతలేశ్వరాలయపు నంది మంటపంలో పడుకొని, జ్యోత్స్నామృతాభిషిక్తమైన ఆ దేవాలయం సొబగు చూచి, ఆనందిస్తున్నాడు. లక్కణుడు అడిగినాడుకదా: ''దొరా? నిద్రపట్టలేదా? చేతులు, కాళ్లు పట్టనా?'' అని.

''వద్దు లక్కణా, నిద్ర వస్తుంది; వచ్చేటట్టు ఉంది. అదేమిటి నీ విచ్చిన మాత్ర? దగ్గుకు మంచిదన్నావు. దగ్గేమో నిలిచినది. తలమాత్రం గిర్రున తిరుగుతున్నది.''

''కొంచెంసేపు అట్లే అవుతుంది దొరా! అది మాత్రదెబ్బ. నిద్ర వస్తే, ఆ మాత్ర చంద్రలోకానికి తీసుకు వెళ్లుతుంది. గొంతులో కఫం కడితే, రామబాణం ఆ మాత్ర.''

లక్కణుడు భిషజ్మణి భాస్కరపండితుల పరమశిష్యుడు. కుమారుడు గురుకులంలో ఉంటూ శస్త్రాభ్యాసం చేస్తున్న సమయంలో, ఈ లక్కణుడు తనకేమీ పనిలేనందున భిషజ్మణి భాస్కరపండితుల భవనంలో సేవా వృత్తిని తానై వేడుకొని సంపాదించి, కషాయభస్మ చూర్ణావలేహాసవారిష్ట తైలాదులను పండితులు చెప్పినట్టు సిద్ధపరచి, సిద్ధపరచి అనుభవం సంపాదించినాడు. లక్కణుని సద్గుణాలను పండితులు మెచ్చుకొని, అప్పుడప్పుడు ఒకటి రెండు చిట్కా వైద్యాలను తెలుపుతూ, అతనిని ధన్వంతరని కాకపోయినా కరక్కాయ వైద్యుణ్ణయినా చేయదలచినారు.

అయితే లక్కణుని మనస్సులో నిలిచిపోయిన ఓషధుల, ఔషధాల తెరగేవేరు. విషమూలికల, విషఫలాల, విషధాతువుల, విషద్రవ్యాల శుద్ధిప్రమాణ ప్రయోగాలలో నిపుణుడయినాడు. పండితులు వాని వక్ర మార్గంచూచి తమ వైద్యవిద్యాబోధనను అక్కడికే ఆపివేసినారు. ఆపినంత మాత్రాన ఏమయినది? ఆవేళకు లక్కణుడు చుట్టుపట్టు గ్రామవాసులకు ధన్వంతరే అయినాడు. భాస్కరపండితులు "హూఁ! నేను చెప్పించినది ఒకటయితే, వాడు నేర్చినదే మరొకటి." అనేవారు.

అక్కయ్య ద్వారవతికి వచ్చిన సంగతిని సేవకుడొకడు కుమార విష్ణువుకు మనవి చేసినాడు. కుమారుడు అదివిని లేచి కూర్చొనడానికి ప్రయత్నించినప్పుడు, అతని తల ఇంకా గిర్రున తిరుగుతూనే ఉంది. "దూర ప్రయాణంతో అక్కయ్య బడలిపోయి ఉంటుంది. నేనిప్పుడు అక్కడికి వెళ్ళితే నిద్రచెడి, రాత్రల్లా మాట్లాడుతూ కూర్చుంటుంది. అక్కయ్య శ్రమనుపరిహరించే నిద్రకు నేను భంగం కలిగించి నట్టవుతుంది. అందువల్ల తెల్లవారిన తర్వాత చూడడమే లెస్స." అనుకొని చంద్రమండ లాన్నే చూస్తూ పడుకొన్నాడు.

నగరులో శాంతల రాత్రి బాగా నిద్రపోయి ఉదయం తొందరగా లేచి, ప్రాతర్విధులు ముగించి, స్నానంచేసి, మడిగుడ్డలు కట్టి శ్రీశారద పూజను ముగిస్తుండగా, "అక్కయ్యా, అప్పాజీ ఎందుకు రాలేదు? ఎప్పుడు వస్తారు?" అంటూ కుమారవిష్ణువు లోపలికి వచ్చి, అక్కయ్య పూజలో నిమగ్నురాలయి ఉండడం చూచి, అక్కయ్యకు, శారదకు నమస్కరించి, ఒక సుఖాసనంపై కూర్చున్నాడు. శాంతల పూజ ముగించి, తీర్థ ప్రసాదాలను కుమారునికి ఇచ్చి, తానూ స్వీకరించి, తర్వాత స్మిత వదనంతో "మీ అప్పాజీవారు వీడెనిమిది నాళ్ళలో వస్తారు. నీవు సుఖంగా ఉన్నావా? సోవల ఎట్లుంది?" అని ప్రశ్నించినది.

"ఇంటినిండా ఉంది. నేనూ ఉన్నాను. నాతోపాటే రావలసినది. అయితే, ఆమె పనులు తెమలవద్దూ? అవేమిపనులో? ముట్టినదే మడు తుంది; కడిగినదే కడుగుతుంది. ఆమె పనులు ముగిసేవరకూ నేను కాచు



కొని కూచుంటే, నిన్న మధ్యాహ్నం వరకూ చూడడమే పడదు. అక్కయ్యా, ఆమె వెనకటి జన్మంలో నత్తగుల్ల అయి ఉంటుంది. చెప్పు అక్కయ్యా, మీ కొత్తరాజ్యం, కొత్తజనం ఎలాగున ఉన్నవి?"

"మీ అప్పాజీవారికి వేయిపనులు. ఒకటి ముగిసేవేళకు మరొకటి. నేడు బయలుదేరుదాము, రేపు బయలుదేరుదాము అనడంలోనే నెల గడిచినది."

"అక్కయ్యా, నిన్నరాత్రి నేనొక కలగన్నాను. దానిని చెప్ప డానికే ఇంతతొందరగా వచ్చినాను. ఎంత విచిత్రమైన కల! ఎంత అద్భుతమైన కల!"

"అంత అద్భుతమైన స్వప్నమా? చెప్పు నాతండ్రీ. వింటాను."

శాంతల ఒక సుఖాసనంలో ఆసీనురాలయినది. కుమారవిష్ణువు చెప్పడం ప్రారంభించినాడు.

# 20

కల అన్నానా? కలగాదు అక్కయ్యా అది. నేను కండ్లు తెరచు కొనే ఉన్నాను.....హొయిసళేశ్వర శాంతలేశ్వర దేవాలయాలను కట్టి ముగించినారు. రెండు ఆలయాల పూర్వ ముఖద్వారంలోని పెద్దపెద్ద నంది మంటపాలను కట్టడమూ ముగిసినది. నంది విగ్రహాలు మాత్రం పూర్తి కాలేదు. వాటికి తగిన ఘనపరిమాణంగల శిలలు చిక్కకపోవడమేకారణం. అప్పుడు అప్పాజీవారు 'ఎవరైనా సరే, ఇంత పెద్ద మెత్తని శిలలను చుట్టుపట్ల రెండు మూడు క్రోశాల దూరంలో ఎక్కడ వెదకి తెచ్చినా, వారికి పదిపది బంగారుగద్యాణాలు బహుమానం ఇస్తాము' అని చాటించి నారుకదా? అది నీకూ తెలుసు. జనులు అలాటి శిలలను వెదకి బహు మానాలు కూడా పొందినారు కదా!

అప్పుడు భాద్రపద పూర్ణిమకు ఇక మిగిలినవి రెండే నెలలు. అంతలోగా నందివిగ్రహాలు రెండూ సిద్ధంకావలెను. అప్పాజీవారు ఆపనికి నూరుమంది శిల్పులను నియమించి, నెలన్నరలోపుగా నందులు సిద్ధం కావలెనని కట్టాజ్ఞ చేసినారు. శిల్పులు అడవిలోనే విడిసి, ఆబృహదాకారం గల నందులను మహాదేవునిప్రతిష్ఠ ఇంకా ఇరవయినాళ్లుండగానే సిద్ధపరచినారు. ఈసంగతీ నీకు తెలుసు.

ఆకారం పెద్దదయినా, బహు సుందరమయినవి ఆ నందులు. ప్రకాండ దేహం, ఆకారానికి తగిన అంగసౌష్ఠవం, అలంకరణాలు, గొలుసులు, చిరుగజ్జెలు, చిరుగజ్జెల సరాలు, చిరుగంటలు, బిరుగంటలు, మెడలో పెనుగంటల సరాలు, ఒంటినిండ నగలు. మహాదేవునికి తగిన వాహనాలు. మేమందరం వెళ్ళి చూచి వచ్చినాము. నీవు ఆనాడు మీఊరి ధర్మేశ్వరునికి సేవ చెల్లించడానికి వెళ్లినావు. ఆనందివిగ్రహాలున్న స్థలానికి, మన రాజధానికీ దాదాపు నాల్గు పరువులు, ఒక గవ్యూతిదూరం.

అప్పుడు ఏర్పడినది చిక్కు. ఆ మహానందులను ఇక్కడికి సాగించుకొని రావడం అసాధ్యమయింది. ఎనిమిది ఎనిమిది చక్రాలున్న మహా శకటాలను అప్పుడే నిర్మించినారు. ఆ నందులు రెండింటినీ ఎలాటి భిన్నమూ కలుగకుండా శకటాలలో ఎక్కించడం మహాప్రయాస అయినది. ఆ నందులు కదలకుండా ఏనుగు తొండమంత పెద్ద మోకులతో శకటాలపై బిగించి కట్టినారు. నాల్గు నాల్గు ఏనుగులను కట్టి లాగించినారు. వీటికోసం రాజధానివరకు మరొక మార్గమే నిర్మించినారు. శకటాలు కొంచం దూరం వచ్చినతర్వాత వర్షంతో తడిసిన భూమిలో శకటాల చక్రాలు నందుల భారానికి దిగబడిపోయినవి. మరికొన్ని ఏనుగులను శకటాలకు కట్టి లాగించినారు. లాగినకొద్దీ చక్రాలు మరింత లోతుకు దిగబడిపోయినవి. ఏనుగులు లాగడంవల్ల శకటాలకు పూన్చిన కర్రదూలాలు విడిపోయి పీక్కొని వచ్చినవి. చక్రాలు పైకి లేవనేలేదు. విశ్వప్రయత్నం చేసినారు, శకటాలు అక్కడే సమాధి అయినవి.

ఈలాగున జరిగినదని విని అప్పాజీవారికి, నీకూ దిక్కే తోచలేదు. జనం అన్నారు : 'వర్షాకాలం ముగిసేవరకు ఈ నందులను అక్కడినుంచి



తరలించడం సాధ్యంకాదని'. చేతికి వచ్చిన ముద్ద, నోటికి రాలేదు. ఇక మిగిలినవి ఐదేనాళ్లు. నందులు నాలుగు పరువుల దూరంలో దిగబడిపోయినవి. అందరి ముఖాలలోను నిరాశాభావం తొంగిచూచినది. అప్పాజీవారికీ నీకూ మహావ్యథ కలిగినది. కేతమల్లనాయకులు "ఇంత జరిపించిన దైవం ఇప్పుడు చేయి వదలినది ఎందుకు ?" అని చాల బాధపడినారు. అప్పాజీవారికి మాత్రం మహాదేవుని ప్రతిష్ఠాపనోత్సవం పూర్తి చేసే దిగ్విజయానికి పోవాలనే ఆశ ఉంది. "మహాదేవ, నీ ఆశీర్వాదాలు లేకపోతే నేను దిగ్విజయానికి బయలుదేరను." అని కూర్చున్నారు.

అప్పాజీవారూ, నీవూ వ్రతముండి, మహాదేవుని మనసార పూజించి, "మహాదేవ, నీవే దారి చూపించవలె." అని వేడుకొన్నారు. అక్కయ్యా, ఆరాత్రి నీకొక స్వప్నమయినది, "మీ ఏర్పాట్లు మీరు చేసుకోండి. నా నందులను నేను పిలిపించుకుంటాను" అని మహాదేవుడే నీ స్వప్నంలో వచ్చి చెప్పినాడు. ఈమాట నమ్మరానంత ఆశ్చర్యం కలిగించినది నీకు. అప్పాజీవారికీ ఆరాత్రి, అదే స్వప్నం వచ్చింది : "మీ ఏర్పాట్లు మీరు చేసుకోండి. నా నందులను నేనే పిలిపించుకొంటాను" అని. "ఇది ఎలాగు? ఏలాగు సాధ్యం ? నమ్మడం ఎలాగు ? ఇద్దరికీ ఒకేరీతి సమాశ్వాసనం కలిగినదికదా ? మహాదేవా... ఇప్పుడు మేము కర్తవ్యపరులం కావచ్చునా ? లేక ఊరికే ఉండడమా ?" అనే శంక మీ యిద్దరికీ కలిగినది. కాని "మన నమ్మికను పరీక్షించడానికే పరమశివుడు ఈలాగున అని ఉండవలె. నమ్మిక పెట్టకపోతే దైవద్రోహుల మవుతాము. దైవాన్ని పరీక్షించడం తగదు. భగవంతుడు తన నందులను సమయానికి పిలిపించుకొంటాడు. లేకపోతే ఇద్దరికీ ఒకేరాత్రి, ఒకే సమయాన, ఒకేరీతి స్వప్నం కలుగదు. దీనిని మనం దృఢంగా నమ్మవలె." అని నీవు అప్పాజీవారికి చెప్పినావు.

నీవన్నమాటలో, రీతిలో, అప్పాజీవారికి నమ్మకం కలిగినది. "సర్వతంత్ర స్వతంత్రుడు తన నందులను ఏవిధంగానో పిలిపించుకుంటాడు. మన ఏర్పాట్లన్నీ మనం చేసుకొందాము." అని అప్పాజీవారు ఒప్పుకున్నారు.

"సత్యయుగాలలో, ధర్మయుగాలలో ఇలాటి దైవలీలలను అప్పటి జనులు చూడడం కద్దు. ఈ కలియుగంలోను ఇలాటి అద్భుతం ఒక్కటయినా జరిగితే, జనులు ధర్మపరులు అయ్యేరు. అధర్మపరులూ, నాస్తికులూ రూపుమాసేరు. మన విష్ణుప్రభు శాంతలదేవుల కాలం సత్యకాలం; ఇది వారి ధర్మతపస్సుల ఫలం. ఇలాటి ప్రభువుల పోషణలో ఉన్న మనం ధన్యులం. ఈ దైవలీలను చూచే సుకృతం మనది." అని ప్రజలందరూ ఆనందపడినారు.

"శిల్పులు, తక్కిన పనివారు నందివిగ్రహాలు ఎక్కడ ఆగిపోయినవో అక్కడే వదలిపెట్టి రావలసినది. అక్కడినుంచి రాజధానికి చేసిన దారిలో ఉండే వనవాసులందరూ. ఆదారికి రెండుక్రోశాలదూరం తొలగిపోయి నెలకొనవలసినది. దేవాలయ సమస్త కార్యకలాపాలు ప్రతిష్ఠాపనదినానికి ఒకనాడు ముందే పూర్తి చేయవలసినది." అని రాజాజ్ఞ వెలువడినది.

దినాలు గడచినవి. భాద్రపద శుద్ధైకాదశికి శివుడన్నమాట సర్వత్రా వ్యాపించినది. చుట్టుపట్టు జనమంతా రాజధానికి రావడం ప్రారంభించినారు. అప్పాజీవారూ, నీవూ మూడునాళ్ళుగా నియమనిష్ఠలతో ఉంటూ, అహర్నిశం శివపూజాధ్యానాదులలో మగ్నులయినారు. హొయిసళేశ్వర శాంతలేశ్వర దేవాలయంలో వేయారు శిల్పులు పనిముగించి, దేవాలయ సమస్తభాగాలను శుభ్రంగా ఉంచినారు. ఇక మిగిలినవి రెండేనాళ్లు. నందులు అడవిలో నాల్గుక్రోశాల దూరంలో ఉన్నవి. అయితే ఏమి ? అప్పాజీవారి విశ్వాసం ఆవంతయినా తగ్గలేదు. ద్వాదశీ త్రయోదశులకు దేవాలయంలోని అన్నిపనులూ ముగిసి దేవాలయాలు శుభ్రమయినవి. ప్రతిష్ఠాపనకు మహాలింగాలను తెచ్చి పాణివట్టాలలో బిగించడమూ అయినది. దేవాలయాలు రెండిటినీ తలిరుతోరణాలతో అలంకరించడమూ అయినది.

ఎవరో ప్రశ్నించినారు... ఎవరోకాదు ! హేమాద్రి మహాప్రధానులే అడిగినారు : "కేతమల్ల నాయకులవారూ, దేవాలయాల నవరంగమంటపాలు రెండిటిని ఎందుకీలాగు ఒకే మార్గంతో కలిపినారు ?" అని.



కేతమల్ల నాయకులు సమాధాన మిచ్చినారు : "మహాప్రధానులవారూ, మనప్రభువులూ మహారాజ్ఞిగారూ శరీరాలు వేరయినా ఒక్కటేకాదా?" అని.

చతుర్దశి సూర్యోదయమయినది. "నందులు ఇంకా అక్కడే ఉన్నవి." అనేవార్త రాజధాని అంతటా వ్యాపించినది. ఈవార్త నీచెవిలోను పడినది. దానివల్ల, అక్కయ్యా, నీకు ధైర్యం చెడలేదు. నీ మనస్థైర్యం చూచి అప్పాజీవారు ధైర్యం పొందినారు. "నందులున్నచోటికి, ఆదారిలో పట్టణవాసులుగాని, ఇతరులుగాని, ఎవరూ వెళ్ళరాదు." అని అప్పాజీవారు కట్టాజ్ఞ విధించినారు. ఆనాడు మీరిద్దరూ నిరాహారవ్రతం పూని మహాదేవుని ధ్యానంలోనే గడపినారు.

సాయంకాలం చతుర్దశి చంద్రుడు ఉదయించినాడు. పౌరులందరి ఇండ్లలోను ఆనాడు మహాదేవునికి విశేషపూజలు జరుగుతున్నవి. హొయిసళేశ్వర శాంతలేశ్వర దేవాలయాలలో లక్షదీపాలు వెలుగుతున్నవి. దేవాలయం నలుమూలలా, మహాద్వారాలమీద మహాదీపాలు ప్రకాశిస్తున్నవి. రాజధానిలో అందరి యిండ్లలోను దీపోత్సవాలు జరిగినవి. అందరి ముఖాలలోను, మనసులలోను భక్త్యుత్సాహాలు పొంగులు వారుతున్నవి.

సూర్యోదయానంతరం ఒక గడియ తర్వాత ప్రతిష్ఠాపనా ముహూర్తం నిశ్చయమయినది. దేవాలయంలో సకలసామగ్రి సిద్ధమయినది. చతుర్దశిరాత్రి అందరికన్నా ముందు నేనే దేవాలయావరణంలో ప్రవేశించినాను. మధురచంద్రిక దేవాలయ కుడ్యాల బహిర్భాగంపై ఉన్న శిల్పాలపై ప్రసరించి అతిశయశోభ కలిగించినది. అప్పుడు వెన్నెల ఎక్కువవుతూ వచ్చినది. ఇదెందుకు – అని నేను అంతరిక్షంవైపు చూచినాను. చంద్రబింబమే మహావేగంతో భూమివైపు వస్తూఉండడం చూచినాను. వెన్నెలలో నక్షత్రాల వెలుగు తగ్గినప్పటికీ, అప్పుడు అవికూడ అంతరిక్షంలో వేలాడగట్టిన ముత్యాలగుత్తులవె కనిపించినవి. ప్రకాశమానమైన ఆ గుత్తులు ఒకదానిచుట్టు మరొకటి వర్తులాకారంగా గిర్రున తిరుగుతున్నవి. చంద్రబింబం అప్పుడు నాలుగింతలు పెద్దదయినది. ఆ వెలుగులో

దేవాలయం అపూర్వ తేజస్సుతో శోభించినది. నేను కనురెప్పపాటుకూడా లేకుండా చూస్తున్నాను. సరోవరపు తేటనీటిలో ప్రతిబింబించినదానిని గాలివచ్చి కలచివేసినప్పుడు, ఆ ప్రతిబింబం నీటితరగలలో చెదరిపోయినట్లయి క్రమంగా మరల స్థిరాకారం దాల్చుతుందికదా! అట్లే అయినది, నాకండ్లకు ఆ దేవాలయాకారం. అయితే, అక్కయ్యా, ఇప్పుడు దేవాలయం ఒక్కటికి నాల్గింతలు పెద్దదిగా పెరిగి నిలిచినది. మరొకమారు దేవాలయాకారం చలించినట్లయినది. మరల సమస్థితికి వచ్చినప్పుడు దేవాలయం ఇంకా పెద్దదిగా పెరిగినది. బింబం మరొకమారు ఊగిసలాడినది. ఈసారి సమానస్థితికి వచ్చినప్పుడు దాని వైశాల్యౌన్నత్యాలు నాకంటికి ఆనలేదు. అప్పుడు నాకుచాలదూరంనుంచి చూస్తున్నట్టు అనుభవమయినది. నా దృష్టిలోనే ఒక వైపరీత్యం ఏర్పడినది. అంతదూరంనుంచి నిలబడి చూస్తున్నప్పటికీ, నాకండ్లకుమాత్రం చేతిముందే అన్నీ కనిపించినవి.

దేవాలయ వెలుపల ప్రతి గదిలోను ఉన్న అన్ని శిల్పాలు - యక్ష రాక్షస గరుడ గంధర్వ కిన్నర కింపురుషులు, ఉరగులు, సకలమృగ పక్షి సంకులమూ, పురాణయుగాల, రామాయణ మహాభారత కాలాల రాజులు, అతిథ మహారథులూ, మునివరులూ,సకలలోకాల దేవతలూ, దిక్పాలకులూ, మానవులూ, లతావృక్షాదులూ, సకలం తన నైజమైన ఆకార పరిమాణాలకు పెరిగి నిలబడి ఉండడం చూచినాను. నాకు ఆశ్చర్యమయినది; భయమయినది.

దేవాలయ గోపురం చంద్రమండలం తాకి నిలబడినది. అప్పుడు చంద్రమండలంనుంచి తప్తకాంచన కాంతిగల అమృతరస ప్రవాహమొకటి దేవాలయ గోపురాగ్రం నుంచి, నెమ్మదిగా శిలాద్రవంవలె మందగతితో పారుతూ వచ్చినది. ఆ తప్తకాంచన ప్రవాహం పైనుంచి ప్రవహిస్తూ దేనిని దేనిని కప్పినదో అవన్నీ సువర్ణమయమయినవి; సజీవమయినవి. గోపురంలో ఉన్న మునివరులూ, సిద్ధులూ, నాగులూ, యక్షులూ, శివగణాలూ, నంది భృంగులూ, అందరూ జీవంతో తొణికిసలాడ సాగినారు. అనంతరం ఆ తప్తకాంచన రసం దేవాలయ బహిఃకుడ్యం మీద శిల్పాలున్న గదులపై గూడ ప్రవహించసాగినది.



మొదటి గడిలోని మదనునిచేతి బొమ్మలవలె ఉన్న శిలాసుందరులందరూ భవ్యమానవాకారలయిన సుందరులయినారు. వారు తమ ఉడుపులను, తొడవులను సరిదిద్దుకొంటూ చేతులను, మేనుదీగలను వివిధ భంగిమలలో తిప్పుతూ, వాద్యాలు వాయిస్తున్నవారి తాళానికి, మేళానికి, చేతులు, మేను, తలలూ ఊపుతూ నర్తనం మొదలు పెట్టినారు. ఇప్పుడు మీదినుంచి రెండవగడికి ప్రాణం వచ్చినది. దేవాదిదేవ మహాదేవులూ, ఇంద్రాద్యష్ట దిక్పాలులూ, తమతమ లోకాలలో ఉంటూ, సభలు జరుపుతూ నిండోలగాలలో మహోన్నతాసనాలలో ఆసీనులయినారు. పైనుంచి మూడవగడికి జీవం వచ్చినది. హంసలు, శుకపికమయూరాలు రెక్కలు విచ్చి అటు ఇటు పారాడినవి. మకరాలు, ఉరగాలు ప్రాకులాడినవి. వానర సమూహాలు వృక్షాలమీది ఫలాలను లాగిలాగి తినినవి; విసిరివేసినవి; ఎగర్లాడినవి. నాల్గవ గడిలోసి రామాయణ మహాభారత కాలపు రాజులు, యోధులు మేల్కొన్నారు; కూర్చున్నారు; రథాలు నడిపించినారు. ఏనుగులమీద, గుర్రాలమీద, రథాలలోను కూర్చుని ఒకరి నొకరు అస్త్రశస్త్రాలతో, కత్తులతో, ముద్గరాలతో కొట్టుకున్నారు; చంపుకున్నారు. మరణించినవారి ఆలుబిడ్డలు ఏడ్చినారు. వారి రక్తమాంసాలను శాకినీ ఢాకినులు తిని, తాగి, గంతులు వేసినవి. ఐదవ, ఆరవ గదులలోని మానవులు, మృగపక్షులూ జీవం పొందగా, కిందినుంచి రెండవ గడిలోని భయంకర సింహ శార్దూలవ్యాళులు వొళ్లు జలదరించుకొని, చెవులు, కేసరాలు, తోకలు రిక్కించి చాచి, దిక్తటాలు వక్కలయ్యేట్టు గర్జించి, దేవాలయంచుట్టూ ఆ గడిలోనే ప్రదక్షిణం చేసినవి. అంతలో అట్టడుగు గడిలోని ఏనుగుల వరుస వరుసే ప్రాణంపొంది భయంకరంగా ఘీంకరించినవి. వేయూరు యుద్ధగజాలు తమ మెడల్లోని ఘంటలు "ఖణేల్, ఖణేల్" అని మ్రోగుతుండగా, వీపుపై నుంచి ఇరుపక్కలా వేలాడగట్టిన ఘనమైన ఘంటలు గణగణలాడగా, ఒకదాని తోక మరొకటి పట్టుకొని ప్రదక్షిణం చేసినవి. ఈ గడిపైన ఉన్న సింహశార్దూలాలు అలాగుననే ప్రదక్షిణం చేయసాగినవి. యోధులు యుద్ధంచేస్తూ సంహారంచేస్తూనే ఉన్నారు. వాద్యగాళ్లు వివిధ వాద్యాలను వాయిస్తూనే ఉన్నారు. విలాసినులు, అప్సరసలూ నర్తనం చేస్తూనే ఉన్నారు.

ఎంతఎంత వర్ణించినా, ఏవిధంగా ఏవిధంగా వర్ణించినా చాలదు అక్కయ్యా, నేను అప్పుడు చూచినదృశ్యం. వేయినాలుకల ఆదిశేషుని వర్ణనకూ అలవికాని దృశ్యమది. ఆ సింహ శార్దూలాలను చూచి నాకు భయం కలుగలేదు. ఏదో ఒక మహాశక్తే నాఒడిలిలో సెలవుచేసుకొన్నట్టు నా కప్పుడు అనుభవమయినది. నేను ఆలయంలోపలికి ప్రవేశించినాను. ఆలయ పూర్వద్వారంలో ఉన్న ద్వారపాలకులు మూడు మూడు పురుష ప్రమాణంలో ఉన్నారు. వారు దివ్యాభరణ భూషితులై, గదాంకుశాలు ధరించి త్రిభంగిలో నిలబడినారు. నన్ను వారేమీ అడ్డగించలేదు. “లోపలికి దయచేయండి.” అని ఉపచరించినారు. లోపలికి వెళ్ళినాను. దేవాలయం లోపలికి వెళ్ళినానో, బ్రహ్మాండం లోపలికే వెళ్ళినానో నాకు తెలియలేదు. ఆలయ వైశాల్యమూ చూడలేకపోయినాను. ఔన్నత్యమూ చూడలేక పోయినాను. లోపల ఎవరూ ఉన్నట్టు కనిపించలేదు. అప్పుడక్కడ అతి ప్రకాశమానమయిన వెలుగు ఉదయించినది. ఆ వెలుగులో రవితేజస్సూ, చంద్రుని చంద్రిక రెండూ చేరినవి. మైకంకమ్మిన వాడివలె ఉండిపోయినాను.

ఆలయంలో ఒకవైపు భూమినుంచి చాల పెద్దదైన ఒక కమలం పుట్టి వికసించినది. పక్కన మదగజగుండాలమంత మహాకాయం చుట్ట చుట్టుకొని ఆదిశేషుడు తన సహస్రఫణాలను విప్పుకొని నిలబడినాడు. ఫణారత్నకాంతి మండుతున్న నిప్పువలె ఉన్నది. ఆ మహాశేషుని తెల్లని నాలిక చీలికలు ఆ వెలుగులో మెరుపు దీగలవలె మెరసినవి. ఆదిశేషుని చూచి నాకు భయం కలుగలేదు. ఆ మహోరగానికి పక్కనే హిమాచ్ఛాదిత దవళగిరి శిఖర మొకటి భూమినుంచి పైకి లేచినది. ఇదంతా జరిగే వేళకు అక్కడక్కడ చుట్టుపట్ల వెయ్యారు చిన్నపెద్ద సుఖాసనాలు ఏర్పడినవి. విడిగిన ఆ మహాపద్మంలో బ్రహ్మ, సరస్వతి, ఉరగశయ్యపై లక్ష్మీనారాయణులు, ధవళగిరి శిఖరపీఠంపై ఉమామహేశ్వరులూ ఆసీనులయినారు. వారివారి పరివారజనులు వారికి ఇరువైపుల నిలబడినారు. త్రిమూర్తులూ, వారి దేవేరులూ అందరికన్నా ఉన్నతులూ, తేజస్వులూగాను ఉన్నారు. అప్పుడు త్రిమూర్తుల ఎదుటి విశాలం, వర్తులాకారం,



స్నిగ్ధం అయిన స్ఫటిక శిలాపీఠం ఒకటి నేలమట్టంకంటె రెండు మూరల ఎత్తున లేచి నిలబడినది. దాని చుట్టూ వివిధవాద్యాలు పట్టుకున్న గంధర్వులూ, శ్రేష్ఠాసనాలలో తుంబురునారదులూ, ఒకచోట ఉన్నతాసనంలో ఇంద్రుడూ శచీదేవి; మరొకచోట అగ్నిస్వాహాదేవి; అలాటి ఆసనాలలో యమ నిర్వృతి వరుణ వాయు కుబేరేశానులు తమతమ దేవేరులతో సహసంతోషంలో ఆసీనులయినారు. అప్పుడు మహా మధురమూ, దివ్యమూ అయిన వాద్య సమ్మేళనం మొదలయినది. అమృతం వర్షించే కంఠ మాధుర్యంగల అప్సరసలు, గంధర్వులూ, తమకంఠాలు కలిపి పాడినారు.

నర్తనం చేయనారంభించినవారు సకల కలామాత శ్రీ శారద. తర్వాత లక్ష్మీనారాయణులు ఆనంద నృత్యం చేసినారు. శివపార్వతుల నర్తనం అద్భుతంగా ఉన్నది. రతీమన్మథులు లావణ్యనృత్యం చేసినారు. రంభోర్వశీ నర్తనం మనోమోహకంగా ఉంది. వీరంతా నర్తనంచేసి ముగించిన పిదప నర్తనంచేసినవాడు గణపతి. అతనికి తాను నృత్యం చేయవలెననే ఆశ పుట్టి ఉంటుంది. అతనికి ముందెప్పుడైనా నర్తించిన అభ్యాసం ఉందో లేదో? చెవులు విసురుతూ, తొండం ఆడిస్తూ, మోటు చేతులను తిప్పుతూ, స్తంభాలవలె ఉన్న ఆ కాళ్లకు చిరుగజ్జెల సరాలు కట్టుకొని నాట్యరంగమెక్కినాడు గణపతి. అందరికీ పొట్టలో నగవు; ముఖంలో బిగువు. గణపతి కోపశాపాలకు పాల్పడరాదని నగవును బిగబట్టుకొని కూర్చున్నారు. వాద్యఘోష ప్రారంభమయినది. తుంబురునారదులు పాడినారు.

మహాదేవుడు పార్వతివైపు తిరిగి నెమ్మదిగా “వీనికెందుకు గంతులు వేయవలెననే ఆశ పుట్టినదిప్పుడు ఈ మహాకాయంతో.?” అనినాడు. పార్వతికి కొంచెం కోపం వచ్చినట్టు కనిపించినది. పిల్లవాళ్లు సంతోషంతో గంతులు వేయరాదా ఏమిటి?” అని ప్రశ్నించినది. శివుడు తాను అడిగినది తప్పయినదని తెలుసుకొని ఊరికే ఉండిపోయినాడు. గజాననుడు తాండవం మొదలుపెట్టినాడు. గజాననుని తాండవానికి స్ఫటిక శిలాపీఠం అదిరినది. భూమి కంపించినది. . మన్నని

శిలాపీఠంపై ఒక్కసారి గణపతి కాలుజారినది. ధమ్మని కింద పడినాడు. భయావృతమైన సభలో ఎవరూ నవ్వలేదు. శివుడుమాత్రం నవ్వినాడు. ఆ నవ్వు గణపతికి వినిపించినది. పార్వతి పతివైపు చూచినది. శివునికి అప్పుడు తాను నవ్వకుండా ఉండవలసిందని తోచినది. గణపతికి కోపం వచ్చినది. "నా నాట్యం నాకు సంతోషమిస్తే చాలు, ఇతరులు చూచి మెచ్చుకోనక్కరలేదు." అనుకుంటూ లేచిపోయి, దేవాలయం దక్షిణ ద్వారంలో ఒక పక్కన తన సంతోషంకోసమే నాట్యంచేస్తూ నిలుచున్నాడు.

అనంతరం గంధర్వులూ, వారి పత్నులూ బృందనాట్యం చేసినారు. అప్పుడు పట్టణవాసులందరూ ఆలయం లోపలికివచ్చి నడుస్తున్న నర్తనాలను చూస్తున్నారు. అప్పాజీవారు సుఖాసనంలో కూర్చుని తిలకిస్తున్నారు.

ఈ దేవలోకంవారి నర్తనాలు ముగిసిన తర్వాత ఇద్దరు గంధర్వ కన్యలు నా అక్కయ్యను నాట్యరంగానికి పిలిచినారు. నీవు ఎదుట ఉన్న త్రిమూర్తులకు, వారి దేవేరులకు, చుట్టూఉన్న దేవీ దేవులందరికీ, అప్పాజీవారికి భక్తి వినయాలతో నమస్కరించి ఆనందనర్తనం చేయనారంభించినావు. చిన్నక్కయ్య వీణె పలికిస్తున్నది. రంభోర్వశ్యాది దేవాంగనలు, దేవవరులు నీ నృత్యానికి అబ్బురపడినారు. బహుశః ఈర్ష్యపడినా ఎక్కువేమీ కాదు. సర్వస్వతీదేవి "మనకూతురీమె." అన్నది బ్రహ్మతో. ధర్మేశుడు "నా కుమార్తె ఈమె." అనినాడు పార్వతితో. "లక్ష్మి, ఈమె మన వేలాపురి బిడ్డకదూ?" అనినాడు చెలువనారాయణుడు మహాలక్ష్మితో.

"బలె! బలె! నాట్యము ఈమెకోసమే పుట్టినది." అనినారు అక్కడున్న తుంబరులు, నారదులు. శచీపతి "ఈనర్తనంచూచి నేర్చుకోండి." అన్నట్లు రంభోర్వశీ తిలోత్తమలవైపు చూచినాడు. "నర్తనం గంధర్వ విద్య, దేవలోకపు సొత్తు" అనేది అబద్ధమయినది అక్కయ్య, ఆనాడు నీవల్ల. అక్కయ్యా, నీవొకమారు చెలువకేశవునిముందు నృత్యం చేసిన దానికన్నా నేడు చక్కగా నృత్యంచేసినావు. నీనృత్యం ఆగగానే



అందరూ సంతోషసూచకంగా నినాదాలు, కరతాళ ధ్వనులూ చేసినారు. లక్ష్మి, సరస్వతి, పార్వతి లేచివచ్చి నిన్ను గట్టిగా కౌగిలించుకున్నారు. నీవు వారందరికీ చేతులు జోడించినావు. వారు ఆశీర్వదించినారు.

ఇదంతా జరిగినమీదట దేవాలయంలో ఉన్నవారందరూ అదృశ్యులయినారు. నీవొక్కతెవే నర్తన శిలాపీఠంపై నిలుచున్నావు. నన్నుచూచి "చాల అలసటగాఉంది నాకు." అన్నావు. నేను నిన్ను పిలుచుకొని, సూర్యాలయం తలుపుతెరచి "అక్కయ్యా, నీ విక్కడే విశ్రమించు." అన్నాను. నీవు సూర్యనారాయణ భగవానుని పాదాలమీద తల ఆనించి పవ్వళించినావు; వెంటనే నిద్రపోయినావు. నీ నిద్రకు ఎవరూ భంగం కలిగించరాదని నేను తలుపులాగి మూసుకొని, వెలుపలికి వచ్చినాను.

* * * * * *

శాంతల తాను కూర్చున్న ఆసనం వదలివచ్చి, కుమారునితల నిమురుతూ, ముఖం ఎత్తి చూచి, "తమ్ముడూ, ఇది తప్పు, ఇది తప్పు సుమా! ఇదంతా నీకు అక్కయ్యపై ఉండే అతిశయప్రీతి పరిభ్రమం. ఇంత గాఢమైన ప్రీతిని పెంచుకోరాదు. ముందుముందు దుఃఖానికి కారణం కావచ్చు. 'అతిసర్వత్ర వర్జయేత్!' అని విజ్ఞులు చెప్పడం తెలియనివాడివా? నామీద నీకున్న ప్రీత్యతిశయమే ఈసీ స్వప్నానికి కారణం." అన్నది.

"అక్కయ్యా, నీవింకా పూర్తిగా విననేలేదు." అంటూ కుమారవిష్ణువు కలవరించడం కొనసాగించినాడు.

* * * * * *

వెలుపలికివచ్చి చూతును గదా, ఆలయం లోపలున్న పట్టణవాసులందరూ ఇప్పుడు వెలుపల ఉన్నారు. దేవాలయమింకా చంద్రచుంబిగానే ఉన్నది. సింహ శార్దూలాలు రెండవగడిలోను, ఏనుగలు మొదటి గడిలోను వెనుకటిలాగే ప్రదక్షిణం చేస్తున్నవి. జనమంతా ఈ మహాదృశ్యాన్ని భయవిస్మయాలతో చూస్తున్నారు." ఏమి ఈ అద్భుతం! ఏమి ఈ మాయ! మనం భూమిమీదే ఉన్నామా? అథవా ఇంకే

లోకానికైనా సజీవంగా తీసుకొని పోబడినామా? ఈ విష్ణువర్ధన శాంతలల పుణ్యం ఎలాటిది? తపస్సు ఎలాటిది? స్వర్గాన్నే భూమికి దింపుతున్న ఈమహానుభావుడు విశ్వామిత్రునికంటే తపోమహిమాన్వితుడు. శాంతలదేవి అనసూయారుంధతులవలె పతివ్రత, తపస్విని. ఇలాటివారు కోరితే నందులురాక ఉంటాయా? తప్పక వస్తాయి. అథవా, ఇక్కడే ఉద్భవించినా ఉద్భవించవచ్చు.'' అని జనులందరూ నందుల ఆగమనాన్నో ఉద్భవాన్నో నిరీక్షిస్తూ, మేరుపర్వతంవలె స్వర్ణమయమయిన దేవాలయాన్ని రెప్పవేయక చూస్తూ నిలబడ్డారు.

అప్పుడు అర్ధరాత్రి గడచి జాము పొద్దయినది. కాతరులయిన ప్రజల దృష్టి ఇప్పుడు రంధ్రపాత్ర (ఘటికానిర్ణయపాత్ర) పై పడినది. ''ఎంత పొద్దుంది? ముహూర్తం వేళకింకా ఎంత పొద్దుంది!'' అని ఒకరినొకరు ప్రశ్నిస్తూ, ''సూర్యోదయాది ఒక గడియకు ప్రతిష్ఠాపనా ముహూర్తం. ఇంకా ఏడు గడియల కాలం వ్యవధి ఉన్నది.'' అని ఒకరి కొకరు సమాధానం చెప్పుకుంటూ, సమయం ప్రరీక్షిస్తూ నిలుచున్నారు.

అప్పాజీవారు స్నానం చేసి, ధౌతదుకూలాలు ధరియించి, వైఖానసులు, సిద్ధాంతులు, పురోహితులు వెంట నడువగా, భక్తితో చేతులు జోడించుకొని, మహాదేవుని స్మరిస్తూ దేవాలయానికి నడచివచ్చినారు. లోపలికి వచ్చిన వెంటనే ఈ మహాద్భుతం చూచినారు. 'కలగంటున్నానా!' అని భ్రమతో కళ్లు నులుముకొని చూచినారు. వెలుపల ఆవరణంలో ఉన్న ఒక శిలాసోపానంపై కూర్చున్నారు. ''ఉపవాస వ్రతంతో పిత్తోద్రేకం, చిత్తభ్రమం, దృష్టి వైపరీత్యం అయి వుండవచ్చునను కున్నారు. తమతోపాటు వచ్చినవారంతా, అక్కడ గుమిగూడినవారంతా వెరగుపడి నిలువుగుడ్లతో, తెరచిన నోటితో దేవాలయాన్ని చూడడం పరికించి, 'ఇది చిత్తభ్రమతో, దృష్టి వైపరీత్యంతో కలిగినదికాదు, అంతా మహాదేవుని సంతోషం.' అంటూ, ఈ మహాద్భుత దృశ్యాన్ని కళ్లు తెరచి చూస్తూ కూర్చున్నారు. అప్పాజీవారికి అవర్ణనీయమైన మన తృప్తి ఏర్పడినది. తమ రెండు చేతులలోను ముఖం మూసుకొన్నారు. దుఃఖాశ్రువు, ఆనందబాష్పం ఏకధారగా కురిసినవి. అప్పాజీవారి హృద



యంలో ఏకకాలంలో ఇంత సుఖం, ఇంత కష్టం ఎందుకు మిళితమైనవో తెలుసుకొనడం సాధ్యంకాదు. ''యఃకశ్చిత్ మానవుణ్నయిన నాపై దైవం ఇంత కృపచూపవలెనా? అతని సేవకుణ్ని నేను, నేనే చేయవలసిన పనిని దైవంపై మోపినాను. అయినప్పటికీ, దయామయుడు నా ఉద్ధారం కోసం బాసట అయినాడుకదా!'' అని వారికి దుఃఖం కలిగి ఉండవచ్చు. దైవాలు పెక్కని తెలిసిన తమ మనస్సుకు దైవమొక్కటె, రూపాలు పెక్కు అని భాసింపజేసి, సంశయం పోగొట్టి, కరుణించిన భగవంతునికి తమ ఆత్మార్పణలో కలిగిన సుఖరూపమయిన బాష్పాంబువయినా కావచ్చు.

అర్ధరాత్రి గడిచి పది గడియలయినవి. పూర్వాకాశంలో కొంచెం అరుణచ్ఛాయ ఉదయించినది. అప్పుడు భూమిపై పిడుగుపడినట్టా మహాశబ్దమయినది. ధర కంపించినది. అందరం పూర్వదిశనే చూచినాము. ''ఉల్కాపాతమయినదా! భూమి ఎందుకు కంపించినది?'' అని అందరూ భయపడినారు. కొందరనినారు: ''పూర్వాకాశం మేఘాచ్ఛాదితమైంది. పెద్దవర్షం కురవవచ్చును.'' అని 'మేఘాచ్ఛాదితమయితే అరుణచ్ఛాయ ఏమిటి?' అని కొందరు వాదించినారు.

అప్పాజీవారి హృదయం ఇప్పుడు నిర్భీకమయినది. అప్పాజీవారు దగ్గర నిలుచున్న ఆగమికులను చూచి, ''ఇప్పుడు పొద్దెంత?'' అని ప్రశ్నించినారు. ఆగమికులు పశ్చిమాకాశంలో దిగుతున్న చంద్రమండలం చూచి, క్షితిజానికీ, చంద్రమండలానికీ గల అంతరం పరిశీలించి, ''ప్రభూ, అర్ధరాత్రి గడచి ఒక జామయినది.'' అనినారు. ''ఇంత త్వరగా సూర్యోదయమా? ఆగమిక మహాశయులారా, పొద్దును బాగా పరిశీలించినారా?'' అనినారు ప్రభువులు. ఆగమికులు మరొకమారు నిదానంగా గమనించి, తర్వాత రంధ్ర పాత్రనూ పరిశీలించి, ''ఇంకా రెండు, రెండున్నర గడియ హెచ్చు ఉండవచ్చు ప్రభూ,'' అని మనవి చేసుకొనినారు.

అప్పాజీవారు పూర్వదిక్కును మరల చూచినారు. అరుణచ్ఛాయ ఉన్నది. ఎంత పొద్దు చూచినా, సూర్యమండలపు అంచులే కనిపించలేదు;

పక్షుల కలకలారవమూ వినిపించలేదు. "ఇదేమిటి ఆశ్చర్యం! అక్కడ సూర్యోదయ సమయమయితే, ఇటు ఇక్కడ చతుర్దశీ చంద్రుడు అస్తమించవలెగదా! చంద్రమండలం అస్తమించవలెనంటే ఇంకా దాదాపు ఒకజామంత వ్యవధి ఉన్నదికదా!" అనుకుని, అప్పాజీవారు రంధ్రపాత్ర కావలివానిని పిలిపించి, వాడు హోర హోరకూ గుర్తులుపెట్టే ఫలకం తెప్పించి చూచినారు. అర్ధరాత్రిని సూచించే పెద్ద బిందువు తర్వాత, ఆ పలకమీద మూడు చిన్నచుక్కలు సున్నంతో గుర్తుచేసి ఉన్నవి. ఆగమికులు చెప్పినకాలం సరిగానే ఉన్నది. అప్పుడు అప్పాజీవారికి మరింత ఆశ్చర్యమయినది. పూర్వదిక్కునే చూస్తూ కూర్చున్నారు. జనమంతా, రెప్పలువేసే అంతలోపల ఇంకేమాశ్చర్యం తమ కన్నులను తప్పిపోతుందో, అని భావించి రెప్పవేయక పూర్వాకాశం చూస్తున్నారు.

అప్పాజీవారు ఒకమారు చంద్రమండలాన్ని, ఒకమారు పూర్వదిగంతాన్ని, ఒకమారు రంధ్రపాత్రనూ చూస్తూ కూర్చున్నారు. రంధ్రపాత్రలోని నీరంతా కింద ఉన్న పాత్రలోకి బొట్టుబొట్టుగా స్రవించినది. ఒక హోరాకాలం గడచినది. కావలివాడు ఆ క్షణమే పైపాత్రను నీటితో నింపి, పలకమీద సున్నంతో మూడుచుక్కల జతకు మరొక చుక్కను చేర్చినాడు.

మా కన్నులు, జనుల కన్నులు నంది మంటపాలమీద ఉన్నవి. 'నందులు ఇప్పుడో, ఇక స్వల్పకాలానికో ఇక్కడే ఉద్భవిస్తాయి.' అని అంటూ జనులు రెప్పపాటు మాని చూస్తున్నారు. చూస్తున్నకొద్దీ జనుల ఉత్సాహం, నమ్మిక, ఆతురత పెరుగుతూనే పోయినవి. పూర్వపు బంగారు కాంతి ఇంకింత హెచ్చినది. పశ్చిమాకాశంలో చంద్రమండలం మెల్లమెల్లగా కిందికి దిగుతున్నది. ఇక రెండు గడియలలో చంద్రాస్తమయం కావచ్చునని తోచినది.

అప్పుడు పూర్వదిక్కులో, ఎక్కడో చాల దూరంలో, పర్వతశిఖరంనుంచి బండలు దొర్లినట్టు శబ్దమయినది. అందరూ పూర్వదిక్కునే చూడ దొడగినారు. ఈ శబ్దం రానురాను ఎక్కువయినది. కొంత సేపటికి ఈ సవ్వడి ఇంకా స్పష్టమయినది.



ముప్పై నలభై వేలమంది జనమున్న ఇక్కడ నిశ్శబ్దం, నీరవం. భయాశ్చర్యాలతో అందరి హృదయాలూ ఆగిపోవు గదా!--అన్నంత నిశ్శబ్దం. అప్పుడు రాజధాని పూర్వభాగపు కావలివారిద్దరు ప్రభువులకు 'జయ జయకారాలు' పెడుతూ, వెదుక్కుంటూ, ఒకే ఊపిరిలో పరుగెత్తి పరుగెత్తి ఇక్కడికి వచ్చినారు. జనం వారిని అప్పాజీవారి సన్నిధికి తీసుకొని వచ్చినారు. కావలివారి ముఖాలు ఆయాసంతో, భయంతో, వివర్ణమయినవి. ఇద్దరూ అప్పాజీవారి పాదాలపై పడి, వణకుతూ, నోట మాట రాక నత్తితో నంగి నంగిగా, "దేవ, నందులు! రాతినందులు నడిచి వస్తున్నవి. అవి ప్రాణంతో ఉన్నవి. బంగారు కాంతివలె ప్రకాశిస్తున్నది వాటి శరీరం!......అక్కడ కనిపించే బంగారుకాంతి ఆ నందుల దేహకాంతే! దేవా, వాటి కన్నులు జ్యోతులవలె ప్రకాశిస్తున్నాయి. మేము చూచి వచ్చిన దానిని మనవి చేసుకుంటున్నాము. దేవదేవా, ఇది కల్లకాదు. కల్లయితే మా తలలే ఇచ్చేము. ఏమి ఆశ్చర్యం! ఏమి ఆశ్చర్యం! రాతి నందులు ప్రాణాలతో లేచి నడిచి వస్తున్నవి! భగవాన్ బాహుబల స్వామి, ఆవిరాడ్రూప శిలాప్రతిమ! ఆ మహా పురుషాకారం! ఆ స్వామే సజీవుడై నందులను తోలుకొని వస్తున్నాడు. కావలి కోటకొమ్మమీద నిలిచిన మేము దీనిని కండ్లార చూచినాము. తత్‌క్షణమే పరుగెత్తివచ్చి దేవరవారికి మనవి చేసుకొనినాము. శిలాకృతులన్నీ సజీవమయితే, ఇది ఎలాటి కాలం? మాకు చాల భయంగా ఉంది. కాపాడవలె." అని మనవి చేసుకొన్నారు.

అప్పాజీవారు ఇలాగున అనినారు: "దీనికి భయపడ వలసినదిలేదు. అందరు దేవతలు నేడు మనపై దయదలచినారు." ఇలాగు అంటుండగా అప్పాజీవారి రొమ్ము ఉప్పొంగినది; ముఖం వికసించినది; కన్నులలో అపూర్వకాంతి శోభించినది. ఆనందబాష్పాలు ధారగట్టినవి. వారు తమ మెడలోని, రెండు రత్నహారాలను తీసి, వంగి నిలబడిన ఆ కావలివారి తలలపై ఉంచి, "ఇలాటి దృశ్యాన్ని అందరికంటె ముందే చూచిన మీరే మాకంటె భాగ్యశాలులు. పోయి, ఈ సంతోషవార్తను అందరికీ తెలుపండి. నందులు ప్రాణాలు కలిగి, నడిచి వస్తున్నవని తెలుపండి. భగవాన్

బాహుబలిస్వామే వాటిని తోలుకొని వస్తున్నారని తెలుపండి.'' అని మహోత్సాహంతో సెలవిచ్చినారు.

జనానికి ఈ సంగతి తెలిసినది; వారి ఉత్సాహానికి మితిలేనట్టయినది. దాదాపు ఒక క్రోశమాత్ర దూరంలో భగవాన్ బాహుబలి, శ్రవణ బెళుగోళ గొమ్మటేశ్వరస్వామి నందులను పిలుచుకొని వస్తున్నాడు. మహోన్నత శిలామూర్తి అయిన బాహుబలిస్వామి పన్నెండు పురుష ప్రమాణపు సజీవ సౌమ్య పురుషుడయినాడు. ఆ గొమ్మటుని ఒక్కొక్క అడుగుకూ భూమి కంపించినది. పాదతలానికి చిక్కిన తరులతాదులు పిండిపిండి అయినవి. నేలమట్టంనుంచి అహంకార దర్పాలవలె లేచి నిలబడిన రాతి బండలు బాహుబలి పదాఘాతానికి భూమిలోకి దిగబడి పోయినవి. నందుల శరీరం మెరుగుపెట్టిన బంగారంవలె ప్రకాశించినది. వాటి మెడలో, దేహంపైన, కటిపార్శ్వంలోను ఉన్న చిరుగజ్జె బిరుగజ్జెల, చిరుగంట బిరుగంటల, కటిఘంటా గళఘంటల సునాదం ఆ కాననమంతా నిండినది.

నందులు వేగంతో వస్తున్నవి. నేను, అప్పాజీవారు, చిన్నక్కయ్య హొయిసళేశ్వరునికోసం క్రొత్తగా చేయించిన ఉన్నతమైన రథాన్నిఎక్కి చూచినాము. ఆదృశ్యం మాకు బ్రహ్మానందం కలిగించినది.

జనాలి ఆనందోత్సాహాలకు మితి కనిపించలేదు. వస్తున్న నందుల నోటికి అందజేయడానికని నూరారు గెలల అరటిపళ్లు నరికి తెప్పించి, ఒలిపించి పెట్టినారు. విత్తులు విడిపించిన పనసతొనలను బుట్టలు బుట్టలుగా రప్పించినారు. వందలకొలది టెంకాయలను తెప్పించి, కొట్టి చిప్ప తొలగించి కొబ్బెర ముక్కలు ముక్కలుచేసి పెట్టినారు. బెల్లపుముద్దలు బుట్టలో తెప్పించి పొడిచేసి, పండ్లకొబ్బెర తేనె కలిపి రెండు కొప్పెరల నిండ సిద్ధంగా ఉంచినారు. ఇక రెండు కొప్పెరలలో శీతలోదకం నింపి పెట్టినారు. భగవాన్ బాహుబలిస్వామికి; పుష్పాభిషేకం చేయడానికి దేవాలయ మహాద్వారం పైన సుగంథపుష్పాలను రాశిరాశిగా సేకరించినారు. జనుల ఈ ఆనందంచూచి అప్పాజీవారికి హృదయం పొంగులువారినది.



నందులు, బాహుబలిస్వామి ఇక అర్ధక్రోశదూరంలో ఉన్నారన్నప్పుడు నిలచిపోయినట్టయినది. జనులన్నారు: "ప్రతిష్ఠా సమయం సూర్యోదయానంతరం గడియకుకదా! ఆవేళకు వస్తేసరి అని నిలిచినారేమో!" అని. నేనూ, చిన్నక్కయ్య మరల రథమెక్కి చూచినాము. బాహుబలి స్వామి కదలక నిలిచిపోయినాడు. నందులు నిలబడిపోయినవి. "జనులన్నమాట నిజంకావచ్చు. సమయానికి సరిగా భగవంతుడు నందులను పిలుచుకొని వస్తాడు." అని నేను చిన్నక్కయ్యతో అన్నాను. "నీమాటే నిజంకానీ!" అన్నది చిన్నక్కయ్య. అప్పుడు అక్కడున్నవారందరికీ, మాకూ ఒక విచిత్రానుభవం కలిగినది. గాలి స్తంభించిపోయినది. అంతవరకు హితంగా వీస్తున్న చల్లనిగాలి లటాలున నిలిచిపోయినట్లయినది. వృక్షాలలో ఆకులుకూడ అల్లలలాడడం నిలిచిపోయినది. దేవాలయ బహిఃకుడ్యంలోని వెలుపలివైపు గడులలో ప్రదక్షిణంచేస్తున్న ఏనుగులు, సింహాలు, తురగ ఖగమృగాలు, దేవతలు, నాట్యంచేస్తున్న గంధర్వాంగనలు, వాద్యనిపుణులు, సైనికులు, అతిరథ మహారథులు - అందరూ కదలక మెదలక అక్కడక్కడే అట్లట్లే నిలిచిపోయినారు; నిలిచిపోయినారు. "ఈ భీకర సన్నివేశం హఠాత్తుగా సంభవించినదెందుకు? ఇదేమిటి? ఏమిటి కారణం?'' అని ప్రజలు ఒకరినొకరు పృచ్ఛించినారు.

అప్పాజీవారు "ఇదెందుకు ఇలాగవుతున్నది? నందులు లటాలున నిలబడిపోయిన వెందుకు? ఒకవేళ జనం అనుకొంటున్నట్టు ఇంకా ప్రతిష్ఠాపన సమయం కాలేదనేనా? దేవాలయ బహిఃకుడ్య గడులలో ప్రదక్షిణం చేస్తున్న ఏనుగులు వ్యాళులు, ఇతర మృగ పక్షి సంకులాలు ఎందుకు ఆగిపోయినవి? యక్షులూ గంధర్వులూ, దేవతలూ, ఎందుకిలాగు నందులు నిలిచిన వెంటనే నిశ్చలంగా నిలబడిపోయినారు? భగవాన్ బాహుబలి ఎందుకు నిలబడిపోయినాడు?'' అని కలవరపడినారు.

రంధ్రపాత్రలోని నీరు మరొకమారు స్రవించిపోయినది. రంధ్రపాత్ర రక్షకుడు మరల పాత్రను నింపిపెట్టినాడు. పలకమీద మరొక చిన్న చుక్కపెట్టినాడు గుర్తుగా. "ఒక జాము గడచి ఐదుగడియల కాలమయినది. ఇక మూడున్నర గడియలుగదా మిగిలినవి. ఆవేళకు నందులు

వచ్చితీరవలెగదా!'' అనినారు జనం. అప్పాజీవారి మనసులో ఏదో కలవరం బయలుదేరినది. పూర్వదిశను చూచినారు. రంధ్రపాత్రను చూచినారు. పశ్చిమదిక్కును చూచినారు. అనంతరం మహాదేవుని ధ్యానం చేస్తూ కూర్చున్నారు. గాలి అలికిడే లేనట్టు కనిపించినది. ఊపిరాడడం కూడ కష్టమయ్యేటట్టు అందరికీ అనుభవమయినది. నాలైదు ఉచ్ఛ్వాస నిశ్వాసల తర్వాత ఒకమారు పెద్దగా ఊపిరి తీసుకోవలసి వచ్చినది. ఎందుకిలాగవుతున్నదని ఎవరికీ తెలియలేదు. ఉత్సాహంతో ఉన్న జనుల మనస్సులో ఇప్పుడు భీతి ఏర్పడుతూ వచ్చినది.

ఈ శోచనీయ స్థితిలో మరొకమారు రంధ్రపాత్ర వట్టిదయినది. కావలివాడు మరల నింపి, పలకమీద మరొకచుక్క పెట్టినాడు. ఇప్పుడు అర్థరాత్రి తర్వాత రెండు జాములయినవి. పూర్వదిక్కు కెంజాయమాత్రం అల్లాగే ఉన్నది. పశ్చిమాకాశంలో చంద్రమండలం ఉన్న స్థలంలోనే ఉంది. నందులు నిలిచినచోటే నిలబడినవి. భగవాన్ బాహుబలి నిలబడిన స్థలంనుంచి కదలలేదు.

రానురాను మాకందరికీ ఊపిరి ఆడడం ఇంకా కష్టమనయినది. ఎంత లాగుకున్నా, గాలి చాలకపోయినది. ఉబ్బసవ్యాధి వచ్చినవారివలె అయినాము. అప్పాజీవారి సమీపంలో నిలబడిన చిన్నక్కయ్య అవస్థ అయితే చాల ఘోరమయినది. అప్పాజీవారు మొదలే వ్రతనియమాలతో, ఉపవాసాలతో శక్తి తగ్గి ఉన్నారు. ఇప్పుడు ఊపిరాడడానికికూడ వారు కష్టపడుతూ ఉండడం ముఖభావంనుంచి వ్యక్తమయినది. అప్పాజీవారు అప్పుడు మెడ యెత్తి దగ్గర నిలబడిన ఆగమికులను చూచి ''భట్టులవారూ, ఇప్పుడెంత పొద్దయినది?'' అని ప్రశ్నించినారు. సమాధానం చెప్పడానికి వారికి చాల కష్టమయినది. రంధ్రపాత్ర లెక్కప్రకారం అప్పుడు అర్థరాత్రి గడచి, రెండు జాములయిపోయినవి. ఆవేళకు సూర్యోదయం చక్కగా కావలసినది. ఆగమికులు ''అర్థరాత్రి గడచి రెండుజాములు ఉండదు, ప్రభూ.''అనినారు.

అప్పాజీవారికి దిక్కుతోచనట్లయినది. ఆగమికులకు రంధ్రపాత్ర పలకమీది చుక్కలను ఎంచి చూపినారు. ఆగమికులు ''ఒక చుక్క చేయి



తప్పి హెచ్చుగా పడి ఉండవచ్చును ప్రభూ.'' అనినారు. ఆగమికులన్న మాటను అప్పాజీవారు ఆ విచిత్ర పరిస్థితిలో నమ్మ సాధ్యంకాలేదు; నమ్మకుండా ఉండడానికీ సాధ్యంకాలేదు. ఇంద్రజాల మహేంద్రజాలాల స్పర్థ నడుస్తున్నట్టు కనిపించినది. చుట్టూ నిలబడిన జనమంతా గాలికోసం నోరు తెరచుకొని, వివర్ణులయి నిలబడి ఉండడం, తమ స్థితీ అలాగునే అయి ఉండడం చూచి వ్యథపడినారు. ఈఘోర పరిస్థితిలో మరొకమారు రంధ్రపాత్ర వట్టిదయినది. కావలివారు మరొకమారు పాత్రను నింపిపెట్టి మరొక చుక్క గుర్తుపెట్టినాడు.

అప్పాజీవారూ, ఆగమికులూ, సిద్ధాంతులూ—అందరూ పూర్వాకాశం చూచినారు. సూర్యమండలరేఖ కూడ కనిపించలేదు. పశ్చిమంలో చంద్రుడు ఒక్క గీతంతకూడా కిందికి దిగలేదు.

రంధ్రపాత్ర లెక్క ప్రకారం అప్పుడు ముహూర్తకాలం ముగిసిపోయినది. నేను మరొకమారు ఎంతో శ్రమపడి తేరెక్క చూచినాను. నందులూ కదలలేదు; బాహుబలిస్వామీ కదలలేదు. జనమంతా నిశ్శక్తులయి, తేజోహీనులయి నీటినుంచి గట్టుకు విసరిన చేపవలె గాలికోసం నోరు తెరుస్తూ నిలుచున్నచోటే గుంపులు గుంపులుగా కూలబడినారు. గుడ్డలతో విసురుకున్నా గాలిలేదు.

అప్పాజీవారు అప్పుడు పైఊపిరి విడుస్తూ, ''సిద్ధాంతులవార్లూ, మీరు చెప్పండి, ఇప్పుడెంత సమయం?'' అని ప్రశ్నించినారు. ఎండిపోయిన వారి గొంతు, నాలుక ఇప్పుడు పిడచ గట్టుకుని పోయినవి. ''ప్రభూ, ఇట్టి ఆశ్చర్యకరమైన సన్నివేశం ముందు ఏకాలంలోను అయినట్టు వినము; కనము. కాలమే కల్లో, మా కన్నులే కల్లో! చెప్పలేము.'' అని వారనినారు. కూర్చున్న జనమంతా ఇప్పుడు పడుకొన్నారు. కూర్చోవడానికి కూడా వారికి శక్తిలేక పోయినది. హృదయం ఇక నిలిచిపోయే కాలం వచ్చినది.

ఏ తప్పుతోనో, ఏ దోషంతోనో, ఎవరి ద్రోహంతోనో ఇలాగు కావచ్చునని భావించి అప్పాజీవారు తమపరంగాను, జనులందరి పరంగాను

భగవంతునికి మొర పెట్టుకున్నారు. "కృపచూపిన దైవం ఇట్లెందుకు చేయి వదలినది ? ఎవరివల్ల ఏమి అపరాధమయినది ?" అని వారి మనస్సు దుఃఖించినది. అప్పుడు వారి మనస్సుకు దైవమే సూచించినదన్నట్లు గొంతెత్తి చిన్నక్కయ్యను చూచినారు. చిన్నక్కయ్య ఆకాశంవైపు ముఖమెత్తి, లేని గాలిని లాగుకొనడానికి యత్నించినది. అప్పాజీవారు "లక్ష్మి, మీ అక్కయ్య ఎక్కడ ?" అని అడిగినారు. లక్ష్మి రొప్పుతూ రొప్పుతూ "దేవ మధ్యరాత్రికి ఒక జాము మొదలు అక్కయ్యను చూచినాను; ఆ మీదట చూడలేదు." అనినది. అప్పాజీవారు చూచిరండని సేవకులను నగరుకు తరిమినారు. "వాసంతికాదేవి ఆలయంలో, పుట్టింటిలో, శారదాలయంలో అన్నిచోట్ల వెదికి పిలుచుకొనిరండి, బేగి పిలుచుకొని రండి." అని ఆనతిచ్చినారు. సేవకులు అన్నిచోట్ల వెదకి ప్రయోజనంలేక తిరిగివచ్చి విన్నపంచేసినారు. నగరు దాసీలు వచ్చి "జియ్యా, దేవిగారు అంతఃపురంలో లేరు. వారు ఈరాత్రి పక్కమీద పడుకోనేలేదు." అని మనవి చేసుకొనినారు. "ఇంటికీ రాలేదు." అని మాచికబ్బె తెలిపినారు. అప్పాజీవారు దిక్కు తెలియక పిచ్చివారివలె అయినారు. చుట్టూ వ్యాపించిన పౌరులూ, పిల్లలూ, స్త్రీలు ఊపిరికోసం కష్టపడుతుండడం చూడలేక "శివశివా, ఇదేమి ఘోరం !" అని కండ్లు మూసుకొనినారు. అప్పుడు చిన్నక్కయ్య నెమ్మది నెమ్మదిగా నేలపై దొర్లివస్తున్నట్లు నేనున్న చోటికి వచ్చినది. నా స్థితికూడ అందరివలెనె ఉండినది. కిందపడిన పుల్లను కూడ పైకియెత్తి తీసుకొనే శక్తిలేదప్పుడు నాకు. రథచక్రం ఆనుకుని నిలబడినాను. చిన్నక్కయ్య ఏలాగుననో నా దగ్గరికి వచ్చి అతిదుఃఖంతో, బాధతో "అక్కయ్య ఎక్కడ ? అప్పాజీవారు చాల కాతరులై ఉన్నారు. అన్నిచోట్ల వెదికించినారు. చిక్కలేదు." అని చెప్పి ఏడ్చినది.

వీరందరూ ఎందుకిలాగు దుఃఖపడుతున్నారని నాకూ చాల ఆశ్చర్యం కలిగినది. నేను చిన్నక్కయ్య చేయిపట్టుకొని నెమ్మదిగా సూర్యాలయం వద్దకు వెళ్ళినాను. సూర్యాలయం తలుపు నేను మూసినట్లే ఉంది. తలుపులను ఎవరూ తెరవలేదు. "అక్కయ్య ఒకవేళ ఇంకా నిద్రిస్తూ ఉండవచ్చు. నిద్రాభంగంకావచ్చు." అని తలుపు నెమ్మదిగా



తెరచినాను. ఆలయంలో సూర్యదేవుని ముందున్న అఖండదీపం జాజ్వల్యమానంగా వెలుగుతున్నది. ఆలయంలో స్వచ్ఛమైన వాతావరణం వ్యాపించినది. అక్కడ మాత్రం గాలి ఆడుతున్నది. అక్కయ్య సూర్యదేవుని పాదపద్మాలపై, తలపెట్టి తల్లి ఒడిలోని పిల్లవలె సుఖంగా నిద్రిస్తున్నది. గుడిలోపలికి వచ్చిన చిన్నక్కయ్యకు ఇప్పుడు ఊపిరి ఆడినది. నాకూ పోయిన ప్రాణం వచ్చినట్లయినది. "అక్కయ్యా !" అని గట్టిగా అరుస్తూ, నిన్ను కౌగిలించుకొంది చిన్నక్కయ్య. నీవు భయపడి వెంటనే లేచి కూర్చున్నావు. నీవు మమ్ములను చూచి "ఎందుకు లక్ష్మి, ఏమైనది ? ఏమైనది ?" అని భయపడి అడిగినావు. చిన్నక్కయ్య అన్నది: "లేచిరా, అక్కయ్యా. వేగిరంరా. నీవు వేగిరం వస్తే నలభైవేల ప్రాణులు దక్కుతాయి." అని. ఆమాటలువిని నీవు తటాలున లేచి, చిన్నక్కయ్యతోపాటు పరిగెత్తినావు. చిన్నక్కయ్యకు ఇంతలో చైతన్యం వచ్చినది. ఊపిరి తీసుకొనడం సులభమయినది. నాకూ అలాగే అయినది.

నీవూ, చిన్నక్కయ్య అప్పాజీవారున్న చోటికి వెళ్ళినారు. ఆ క్షణమే అప్పాజీవారికి ఊపిరి తీసుకొనడం సులభమయినది. ఎక్కడో అణగిపోయిన గాలి, నీవు సూర్యాలయం నుంచి వెలుపలికి వచ్చినప్పుడు, నీ వెంటే వచ్చినది. నిలిచిపోయిన గాలి మరల వీచసాగినది, అక్కయ్యా. ఆకులు, తీగలు కదలాడినవి. పక్షుల అలికిడి వినిపించినది. ఒక్కనిమిషంలో నలభైవేల ప్రాణులు చైతన్యం పొందినవి. నీవు రావడం కొంచెం ఆలస్యమయి ఉంటే, ఏమేమి అనాహుతాలయ్యేవో ! దేవాలయ కుడ్య బహిః ప్రదేశపు గడులలోని ఏనుగులు, సింహాలు, గుర్రాలు, పశుపక్షులు నవచైతన్యం పొంది, మరల ప్రదక్షిణం ప్రారంభించినవి.

మీ రిద్దరూ అప్పాజీవారికి నమస్కరించి నిలబడినారు. అప్పాజీవారు తలయెత్తి నిన్ను చూచి, కన్నులలో నీరు నిండగా, "దేవీ, ఇంతసేపు నీవు ఎక్కడున్నావు ? నీకోసం ఊరంతా గాలించడమయినది. ఇంత జనం నేను ఇప్పుడు బదకడం నీవిక్కడికి రావడంవల్ల." అనినారు. "జనులు ఎందుకింత కలతచెంది వ్యాకుల పడుతున్నారు ? అందరూ ఇంతెందుకు బడలిబారు ?" అనే యోచనలు నీమనస్సులో కలిగినవేమో ! నీవు అప్పాజీ

వారితో "ఎందుకు దేవ, సకలదైవసన్నిధిలో నేను నాట్యమాడినప్పుడు మీరూ అక్కడే ఉన్నారుగదా! ఈ పట్టణవాసులు ఉన్నారుగదా! పాతాళం, భూమి, అమరావతి, అలకావతి, వైకుంఠం, కైలాసం-వీటిలోని యక్షయక్షులూ, గంధర్వులూ, అప్సరసలూ. అప్సరులూ, దేవతలూ, దిక్పాలులూ, వారి దేవేరులూ, త్రిమూర్తులూ అక్కడ ఉన్నారుగదా! నా చెల్లెలు లక్ష్మి వీణ పలికించినది. ఉమ, రమ, భారతి నన్ను తాకి ఆశీర్వదించినారు. ఇదంతా మీరే చూచినారు......ఆమీదట నాకు చాల అలసట కలిగినది. నా తమ్ముడు నన్ను పిలుచుకొనివచ్చి, సూర్యాలయంలో పడుకొని నిద్రపో." అని చెప్పి, వాడే తలుపులు ముందుకులాగి మూసుకొని వెళ్ళినాడుగదా! అలసటలో మైమరచి నిద్రపోయినాను. ఇప్పుడు లక్ష్మి, నా తమ్ముడూ నన్ను మేల్కొల్పి పిలుచుకొని వచ్చినారు. నేను పడుకొన్న స్థలం తమ్మునికి తెలుసే. ఇప్పుడేమయినదిదేవా! ఇప్పుడే నగరకు వెళ్ళి, స్నానంచేసి, మడివస్త్రాలు కట్టుకొని, ప్రతిష్ఠాపనసమయానికి వచ్చి చేరుతాను." అనినావు.

అప్పుడు అప్పాజీవారి కన్నులనుంచి ఆనందబాష్పాలు స్రవించినవి. "దేవీ! నీవు దొడ్డదానివి. నిస్సంశయంగా దేవాంశ సంభూతవు. భగవాన్ సూర్యనారాయణుడుకూడ తన భక్తురాలొకతె తన పాదసన్నిధిని అలసటతో నిద్రిస్తున్నది, అలసట తీరేవరకు నిద్రించనీ అని ఆగి ఉన్నట్టు తోస్తున్నది. ప్రతిష్ఠాపనా సమయం సమీపిస్తున్నా నీవు మేల్కొనకపోవడంచూచి, కాలం ముందుకుపోకుండా అడ్డగించి ఆపినాడని తోస్తుంది. భూమి చలన వలనాలు నిలిచిపోయినవి దేవీ! దానివలన వాతావరణమే స్తబ్దమయినది. మాకంతా ఊపిరి తీసుకొనడానికికూడ గాలిచాలకపోయినది. ఇంతలో నీవు వచ్చినావుగనుక జనులందరూ బదికినారు; మేమూ బదికినాము. ఇక్కడజరిగిన అద్భుతాలెన్నో ఉన్నవి. వాటిని సావకాశంగా చెబుతాము ఇప్పుడు జరిగేది నీవే చూడు." అని అప్పాజీవారు చెబుతుండగా, సిద్ధాంతులు పరిగెత్తివచ్చి "ప్రభూ, ఆశ్చర్య మాశ్చరం! చలించకుండా ఆగిన చంద్రుడు చలిస్తున్నాడు. భూమి చలిస్తున్నది. అదిగో చూడండి పూర్వ దిగంతంలో సూర్యమండలం మెల్లమెల్లగా పైకి ఎక్కిరావడాన్ని, పడ



మట చంద్రమండలం త్వరగా క్షితిజంవైపు దిగుతుండడాన్ని. పక్షుల కలకలం వినండి." అని ఉత్సాహంలో అప్పాజీవారికి తెలియజేస్తున్నప్పుడు, జనులు పరుగెత్తుకొనివచ్చి మహానందోద్గారంతో "ప్రభూ, ప్రభూ, నందులు నడిచివస్తున్నవి. బాహుబలిస్వామి పిలుచుకొని వస్తున్నాడు" అని విన్నపం చేసినారు.

చీకటిపోయి వెలుగు వ్యాపిస్తూవచ్చినది. ఆ సమయానికి నందులు నడచివస్తున్న శబ్దం చక్కగా వినిపించినది. అప్పాజీవారు మా యిద్దరిని పిలుచుకొని తొందరగా మహాద్వారంవైపు నడచినారు.

నందులు! అక్కయ్యా బంగరురంగు నందులు! మేరు పర్వతంవలె ఉన్నతమై, పుష్టమై సర్వాభరణభూషితమైన ఆ నందులజంట రావడాన్ని పన్నెండు పురుషప్రమాణంలో ఉన్నా పరమ సౌమ్యుడూ, సుందరుడూ అయిన భగవాన్ బాహుబలిస్వామే వాటిని పిలుచుకొని రావడాన్నిచూచే ఆనందించవలె. అక్కయ్యా, నోటి మాటల వర్ణనకు అది అందని విషయం. జనులందరూ, "దీనికంటె పుణ్యదృశ్యం ఇక ఎక్కడిది? మన కన్నులు ఈనాటికి సార్థకమయినవి. ఇక మా కండ్లు ఇంకిపోయినా మాకు దుఃఖం లేదు. చచ్చేవరకు ఈ దృశ్యాన్నే మనస్సులో నాటుకొని జీవించవచ్చు." అని మాట్లాడుకొన్నారు.

నా అప్పాజీవారి, నా అక్కయ్యల పుణ్యమెంత! తపస్సెంత! లేకపోక ఈ కలియుగంలోను సత్యయుగాలలోనే అసాధ్యమైన అద్భుతం జరుగుతుందా? శిల అహల్య అయినది కృతయుగంలో. ఆ యుగానికి అంతమాత్రమే ఆశ్చర్యమనిపించినది.

బాహుబలిస్వామి దేవాలయ మహాద్వారంవరకు నందులను పిలుచుకొని వచ్చినాడు. అప్పుడు అప్పాజీవారు, నీవూ, చిన్నక్కయ్యా, నేనూ, అక్కడ వ్యాపించిన జనమంతా, ఆనందంతో, భక్తితో చేతులు జోడించుకొని, బాహుబలిస్వామికీ, నందులకూ సాగిలంపడి నమస్కరించినాము. మహాద్వారం పైనుంచి జనులు బాహుబలిస్వామికి పుష్పాలతో మస్తకాభిషేకం చేసినారు. ఆ తపోదధీచి మహాదేవునికోసం ఒక్కమారు

చేతులు జోడించి, నమస్కరించి, తన తపస్స్థానమైన ఇంద్రగిరికి తొందరగా మరలిపోయినాడు. నందులు మహాద్వారం లోపలికి నడిచివచ్చినవి. రెండు కొప్పెరలనిండ జనం నింపిపెట్టిన పంచామృతం తిని, నీరు తాగి, తమ కోసం కట్టిన మంటపాలవైపు నడచి వెళ్ళినవి. మంటపంలోకి ఎక్కి ప్రవేశించి, మహాదేవునికి అభిముఖంగా, సుఖంగా పడుకున్నవి. అప్పుడు పూర్వాకాశంలో ఒక పెద్ద కారుమొయిలు సూర్యబింబాన్ని పూర్తిగా కప్పినది. చీకటి ముసిరినట్టయినది. అలాగు ముసిరినది ఒకే ఒక నిమిష కాలం. ఆ కారుమొయిలు తొలగిపోయినది. వెలుగువచ్చినది. నందులు రెండూ అప్పుడు రాళ్ళయిపోయినవి! దేవాలయం తన పూర్వస్థితికి కుంచించుకొని పోయినది. సకలమూ శిల అయి నిలిచినది. పరమేశ్వరుని ఇచ్ఛానుసారం మహాద్భుత మొకటి నడిచిపోయినది.

"స్నానంచేసి, వేగిరం మడి దుకూలాలు కట్టుకొనిరా!" అని అప్పాజీవారు నీకు చెప్పినారు. నీవు త్వరగా జలకమాడి, మడిబట్టలు కట్టుకొని వచ్చినావు. ఆవేళకు మహాదేవ ప్రతిష్ఠాపనకు కావలసిన సకల సన్నాహాలూ అయినవి. మహాదేవుని ప్రతిష్ఠాపనోత్సవం అద్భుతమైన వితరణలో జరిగినది......ముగిసినది...

# 21

కుమారవిష్ణువు తాను చూచినకలను ఇంతవింగడించి వర్ణించి పూర్తి చేసేవేళకు శాంతల కన్నులనుంచి నీరు ధారగట్టినది. మనస్సులో దుఃఖమే అయినదో? సుఖమే అయినదో? లేక రెండూ కలిసి మెలసి వెలసినవో! శాంతల తన రెండు చేతులూ ముందుకుచాచి కన్నతల్లి కుమారుణ్ని గాఢంగా కౌగిలించుకొనేట్టు కుమారుణ్ని గట్టిగా కౌగలించుకొని చాల సేపు విలపించినది. "కుమార, మనకు మరల జన్మాలుంటే, ముందుజన్మలో నా తమ్ముడుగా నైనా పుట్టు. లేక నా కడుపులోనన్నా పుట్టు. నేను దీనికి వ్రతం పడుతాను. మహాదేవుడు ఈ సౌభాగ్యాన్ని ముందు జన్మకు



అనుగ్రహించనీ." అనినది. ఆ మాటలు విని కుమారునికి కన్నీరు పారినది. అతడు "అక్కయ్యా ప్రేమకు రక్తసంబంధమే కావలెనా? నేను నీతో బుట్టువుకాదని ఇప్పుడు నీ ప్రీతియేమైనా తగ్గినదా? లేదుకదా! ఇంకా మనకు జన్మలుంటే, ప్రతిసారీ నీవే నాకు అక్కయ్యవుకా, అమ్మకా. నేను దానికై ఈ జన్మంతా తపస్సు చేస్తాను." అనినాడు. శాంతల ఏమీ మాటలాడక తమ్ముని ముఖం చూస్తూ కూర్చున్నది. కొంత సేపటికి ప్రశ్నించింది: "ఇంత ప్రీతి ఎందుకు పెంచుకొనినావు నా తండ్రీ!"

కుమారవిష్ణు :- ప్రేమ విశ్వాసాలకు స్వార్థపు స్పర్శ ఉంటే కేవలం బాహ్యాడంబరంగానే మిగులుతుంది. నీవు నాకు పూజనీయురాలివి, అక్కయ్యా. ఈ ప్రీతి కావాలని నాటి నీరుపోసి పెంచినదికాదు. ఇది తనకుతానై పుట్టి కోమలంగా పెరిగి ఎదిగినది. నీ మధురప్రీతే దీనికి కారణం."

"అతీ అయిన ప్రేమాదరాలు — సోదరభావంవి కానీ, గురుశిష్య భావాలవికానీ, పతిపత్నీ భావాలవికానీ, మాతృపుత్ర భావానివికానీ, అంతంలో దుఃఖభాజనాలని వివేకులు చెపుతారు తమ్ముడా?"

"అక్కయ్యా, చూచిన కలను నీతో చెబితే, దానికి నీవు ఏమేమో చెబుతున్నావు గదా!"

"నేను చెబుతున్నాను, ఈ స్వప్నమంతా నీవు అక్కయ్యాపై ఈలాగు పెంచుకొన్న ప్రీతి పరిణామమే."

"అక్కయ్యా, నిర్మలమైన ప్రేమ దోషమునేటట్టయితే, మానవుడు రాయయి ఉండడం మేలు; మన్నయి ఉండడం మేలు."

"పోనీలే. ఇకమీద నిద్రరావడంలేదని లక్కణునివద్ద మాత్రలు తీసుకోవద్దు."

"లేదు, అక్కయ్యా. నిద్ర రానినాడు అక్కయ్య నిద్రనుకూడా పోగొట్టి మాటలు చెబుతూ కూర్చుంటాను."

కుమారుడు వెళ్ళిపోడానికి లేచి నిలబడినాడు. లేస్తూ, "దీనినంతా అప్పాజీవారికి చెప్పవద్దు. వారు నన్ను ఇంకా పిల్లబుద్ధి-అనే అనుకొనేరు." అనినాడు.

వారు నీవిషయంలో తెలుసుకొన్నదే అలాగు. దీనిని వారితో చెప్పినంతమాత్రాన నీవేమీ మా కన్నులకు దొడ్డవాడయిపోవు. నీవు మాకు ఎప్పటికీ పిల్లవాడివే. అలాగే ఉండు."

కుమారునికి కొంచెం కోపం వచ్చినది. కొంగుల సైన్యం నిర్మూలనం చేసి, వారి ఏనుగు గుర్రాలను చెరపట్టి తెచ్చినవారిని, అప్పాజీ వారినుంచి ఇమ్మడి దండనాయంకరం, గండపెండేరం, సర్వాధికారి అనే బిరుదులు పొందినవాడిని అక్కయ్య "పిల్లవాడు" అనే సంబోధించినందుకు అతనికి కొంచెం కోపం వచ్చింది. కోపవేగంలో దిగ్గున లేచినాడు. కుడికాలి గండపెండేరపు ముత్యాల గుత్తులు కదిలి మధురధ్వని కలిగించినవి. శాంతల దృష్టి ఆ మధుర నినాదం కారణంగా ఆకర్షితమయినది. కుమారుని ఎడమ కాలికికూడా ఒక బంగారపు తోడా ఉండడం శాంతల చూచినది. ఆశ్చర్యంతో "ఇదేమిటి తమ్ముడా ? ఈ ఎడమకాలికి ఆభరణం ?" అని ప్రశ్నించినది.

"ఒక్కకాలికి నగ ఉండడం అందంకాదని ఎడమకాలికికూడ నిన్న తొడుగుకున్నాను, అక్కయ్యా."

"అట్లయితే, రెండుకాళ్ళ ఆభరణాలూ ఒకే తీరుగా ఉండవలె గదా ! ఇదేమిటి అందం ? అక్కయ్య వద్దకూడ మరుగెందుకు ?"

"బోకిమయ్య గరుడి అయినాడట. నేను గరుడిఅయితే ఏమి తప్పు?"

శాంతల దిమ్మెరపోయి ప్రశ్నించినది : "తమ్ముడూ, నీవు గరుడి కావడానికి అప్పాజీవారిని అడిగినావా ? వారు సమ్మతించినారా ?"

"బోకిమయ్య తన అయ్యగారిని అడిగే గరుడి అయినాడా ? దీనికీ అప్పాజీవారి ఒప్పుదల కావలిస్తే, నేను ఆత్మార్పణం చేసుకొన్నట్టు



అవుతుందా ? సొంత మనశ్శుద్ధితో, పూర్ణానందంతో చేయవలసిన కర్తవ్యంకదా ఇది ? నీవు ఈ విధంగా అడగడం చూస్తే, వారివారి ప్రాణాలూ, వారివారి సొత్తుకాదని అనిపిస్తుంది."

ఈ మాటలకు శాంతల తన రెండు చేతులతో ముఖం కప్పుకున్నది. కన్నీరు చెరువుకట్ట తెగినట్టు ప్రవహించినది. కుమారవిష్ణువు దానిని చూడరాదని శాంతలముఖం చేతులతో కప్పుకున్నది.

తానన్నమాటలకు అక్కయ్య మనస్సు నొప్పిపడినదని అప్పుడు తెలుసుకొనినాడు కుమారుడు. అయితే తాను గరుడికావడంలో తప్పేమి? ఆత్మ సమర్పణం శ్రేష్ఠతర యజ్ఞంకాదా ? అక్కయ్య దీనికి సంతోషపడవలసినదికాదా ? అక్కయ్యకు ఎందుకు కష్టమయినదో కుమారునికి ఆశ్చర్యం కలిగినది. "నీ మనస్సుకు ఎందుకు నొప్పయినది ?" అని ప్రశ్నించినాడు.

"కుమార, నీవు మా యిద్దరి సొత్తు."

అట్లే. అట్లే. అందుకుగానే ఇలాగు చేసినాను."

"అప్పాజీవారినిగాని, నన్నుగాని నీవు అడుగవలసినదికదా ?"

"ఎందుకు ? నేను ఇలాగు చేయడంవల్ల తప్పేమి ? దీనినుంచి నాకు శ్రేయస్సుకదా ? యశస్సుకదా ?"

"నీ దృష్టిలో సరే. అయితే, ఇది మా దురదృష్టం !"

శాంతల పగిలిపోతున్న తన హృదయాన్ని అదిమి పట్టుకొని, మాటలాడినది. దుఃఖపు పొంగును భరించడం ఆమె కిప్పుడు అసాధ్యమయినది.

"దురదృష్టమేముంది, అక్కయ్యా, దీనిలో ? మీరు ఒప్పి, మెచ్చుతారనే చేసినాను. మీరు చూచి సంతోషపడుతారనే చేసినాను. నేను ఎడమకాలికి తోడా తొడగడం చూచి, సోవల తన ఎడమచేతికి కంకణం కట్టుకున్నది.—'తానూ ఆనాడే సతి అవుతానని.' నన్ను చూచి

నా మిత్రులు కొందరు 'నీతోపాటు మేమూ ఉన్నాము.' అని తామూ కంకణం కట్టుకున్నారు."

శాంతల గుండె ఇక నుగ్గునుగ్గు కావడ మొక్కటే మిగిలినది. ఇక ఎక్కువ వినలేక పోయినది. కుమారుడు ఎంతో నిబ్బరంతో చెప్పుకొంటున్నాడు. అతని అభిప్రాయంలో తాను, సోవల, తన స్నేహితులూ ప్రశంసనీయమైన పని చేసినామని సంతోషం. అయితే, అతని అక్కయ్య మనసులో "అయ్యో! వీడెందుకు ఇలాగు చేసినాడు? గరుడి కావడానికి ముందు తమకెవరికీ ఎందుకు చెప్పలేదు? తమను అడగలే దెందుకు? సర్వప్రయత్నంలోను దీనిని నిలపగలిగిగేవారం కదా! ఇప్పుడంతా చేయిజారి పోయినది కదా! ఇకేమి చేయడం? ఇప్పుడికేమి చేయడం?" అని తాళజాలనంత దుఃఖం కలిగినది. శాంతల పక్కపై అధోముఖిగాపడి దుఃఖపడ సాగినది.

కుమారునికి భయమయినది. "అక్కయ్యకు ఇదేమి బాధకలిగినది? అకస్మాత్తుగా ఇట్లెందుకు అయినది? నేను చెప్పినదాంట్లో చేసినదాంట్లో దోష మేమి? చెప్పరానిది చెప్పినానా? అనరానిది అన్నానా? నాకు తెలియదే." అని కాతరుడై, అధీరుడై అక్కయ్యవద్దకు వచ్చి, అడిగినాడు: "అక్కయ్యా, ఏమయినది చెప్పవూ? నీ కుమారుణ్ణి కదా నేను? తప్పుచేసి ఉంటే, చెప్పు. ఏమి తప్పు? ఎందుకు తప్పు? చెప్పవూ?... నేనూ, నా అన్నయ్య ఇంకా పసిపాపలయి ఉన్నప్పుడు, మా యిద్దరినీ మా కన్నతల్లి రాజమాత ఒడిలో పెట్టి, తాను సతి అయినది. రాజమాత తమ రొమ్ముకు కట్టుకొని సాకినారు మా యిద్దరినీ. అన్నయ్యకు పెద్ద వ్యాధి వచ్చి ఏమి చికిత్సచేసినా ప్రయోజనం లేక పోయినది. వాడు మరణించినాడు. రాజమాత అప్పాజీని పెంచినట్లే నన్నూ పెంచి పెద్దచేసినది. అప్పాజీవారు ఉపనయనం చేసినారు; ఉత్తమ విద్యాబుద్ధులు నేర్పించినారు. రాజ్యంలో గౌరవస్థానాలకు నన్ను నియమించినారు. తమ కుమారుణ్ణనే భావించి, ప్రీతితో, వాత్సల్యంతో చూచినారు. రాచనగరు సర్వాధికారాలూ నాకు దయచేసినారు. ఇలాటి ధర్మ ప్రభువులు గదా అప్పాజీవారు! ఈ ప్రాణం



వారిదికాదా? ఈ దేహం వారిదికాదా? నా సర్వస్వం వారిది కదా? నీవూ అలాటిదానివే కదా? నీవు వారిని వదలి ఉండగలవా, అక్కయ్యా? అప్పాజీవారయినా నిన్నువదలి ఉండగలరా? ఇలాటి పుణ్యాత్ములతో కలిసి ఉండడానికి నేను ఆనపెట్టుకొంటే, నీవు దుఃఖించడం ఎందుకు? దుర్మరణం కంటే ఇది నాకు శ్రేయస్కరం కాదా? తన దేశంకోసం, తన పెద్దలకోసం, తన రాజుకోసం, చావడంకన్నా ఉత్తమమైన చావు భటునికి ఉందా? చెప్పు, అక్కయ్యా? నీవు తెలిసినదానివి. నా అయ్యగారి రక్తం చిందించినవారి రక్తం నేను తాగకుండా విడువడమేనా? నా అప్పాజీవారితో, నీతో నిరంతరం ఉండాలనే ఆశతో ఇలాగు చేసినాను. నీతో సంతోషపు స్వప్నాన్ని చెప్పడానికి వచ్చినాను. నీవు ప్రాజ్ఞురాలవు. నేను ఇలాగున చేసినానని నీవు దుఃఖించడమా? మరే కారణంతోనైనా నీవు దుఃఖించేటట్టయితే నాతో చెప్పు. నీ దుఃఖం నిష్కారణ మయినదికాదు. నేను గరుడిని అయినాననికాదు. నీవు, అప్పాజీవారు సంతోషపడుతారు, 'బలె వీరపుంగవుడివి నీవు.' అని నీవు నా వీపుతట్టి సంతోష పరుస్తావని వచ్చినాను. నీ యీ దుఃఖం చూచి సహించలేను. నా మీద ఒట్టు..."

శాంతల తటాలున లేచి కుమారుని నోరు బలంగా మూసి "శాంతం పాపం! శాంతం పాపం! ఏమి మాటలివి తమ్ముడూ! నేను బాధపడుతుండడం నీవు చూడడం లేదా? నన్ను ఇంకా హెచ్చు దుఃఖానికి పాల్పడజేయడానికి ఒట్లు, ఆనలు అంటావా? చెప్పదగిన సంగతులను నీ అక్కయ్య నీతో చెప్పనే చెబుతుంది. చెప్పదగనిది ఎన్నటికీ చెప్పదు. నేడుకాదు, రేపు నీవే నా బాధకు కారణం గ్రహించుకోవచ్చు...ఇప్పుడు వెళ్లు. చిన్నక్కయ్యను ఇక్కడికిపంపు. నీవే పిలుచుకొనిరావద్దు. తెలిసినదా? నీ అక్కయ్య హృదయంలో నీ అభ్యుదయమే పెద్దయోచన. నేను మరల నిన్ను పిలిపించే వరకు ఎక్కడికీ కదలవద్దు. ఎందుకని అడగవద్దు. ఏ సమయంలో చెప్పి పంపుతానో ఏమో! నేడో, రేపో, ఇక నాలుగునాళ్ళకో! అంత వరకు నీవు ఇంటినుంచి వెలుపలికి రాకూడదు. నీ అక్కయ్య ఆనతి యిది. గౌరవించు. సోవలకూడ ఇల్లు విడిచి వెలుపలికి రాకుండా ఉండనీ.

దానికి ఈ పురాణమంతా ఏకరువు పెట్టవద్దు. అక్కయ్య దుఃఖపడినదని చెప్పవద్దు. వెళ్లు. తమ్ముడూ వెళ్లు. నీ అక్కయ్యకు నీమీద అణుమాత్రమూ కోపంలేదు. ఏదో సమస్య అప్పుడు నా కళ్ళముందుకు వచ్చినది. అందువల్ల ఖిన్నురాలయినాను. ఆ సమస్య ఎలాగు పరిష్కారమవుతుందో నిదానంగా ఆలోచించవలసి ఉంది. అది నాకు సంబంధించిన పని. నీవు దీనికోసం భయపడవద్దు. అక్కయ్యకు నీపై ఏమీ కోపంలేదు. ఇదిగో! ఇకమీద ఆ లక్కణుని మాత్రలు వద్దు. తెలిసినదా?" అని చిరునవ్వు నవ్వుతూ, కుమారవిష్ణువును పంపించి వేసినది.

అక్కయ్య నవ్వడం కుమారునికి ఎంతో ఊరట కలిగించినది. అయినా వెళ్లుతూ ఆలోచించినాడు: "అక్కయ్య నవ్వు నవ్వుకాదు. అది కేవలం నన్ను ఊరడించడం కోసమే. ఆమె మనస్సులో ఏదో దావాగ్ని చెలరేగినది. దానిని నాతో చెప్పదు. నేను గరుడికావడం బహుశ ఆమె మనస్సుకు ఒప్పలేదు. ఎందుకు ఇలాగయినది? దీనిలో దోష మేమిటి? సోవలకూ ఏమీ చెప్పవద్దన్నది. చెప్పిపంపే వరకు ఇల్లు కదలవద్దని నాకూ, సోవలకూ కట్టానతి చేసినది. దీని అర్థమేమి? అయ్యో దైవమా? దీని మూలకారణం నీకు తెలుసు; అక్కయ్యకు తెలుసు. అన్ని వేళలలోను, భగవంతుడా, నీవు అక్కయ్యను చేయిపట్టుకుని నడిపించినావు. ఇప్పుడూ నీదయ ఉండనీ, అక్కయ్య మనస్సు చాల దుఃఖపడినది. త్వరగా శాంతి కలిగించు." అని ప్రార్థిస్తూ, చిన్నక్కయ్య వద్దకువెళ్ళి, ఆమెను శాంతల వద్దకు వెంటనే పంపి, తను ఆలోచనలో తన మందిరం చేరి, సోవలకు అక్కయ్య ఆనతి తెలిపినాడు. సోవలకు భయాశ్చర్యాలతో మనసు, తనువూ కుంగిపోయినవి. అక్కయ్యమీద వారిద్దరికీ ఉన్న సమానగౌరవమే వారిద్దరూ ఈ విషయమై చర్చించడానికి అవకాశ మివ్వలేదు.

# 22

లక్ష్మి వెంటనే శాంతల మందిరం చేరినది. శాంతలకు అప్పుడు లక్ష్మితో రావలసిన పనేమీలేదు. కుమారవిష్ణువును పంపివేయడానికి అదొక నెపం. కుమారుడు ఇంకా తనవద్ద ఉన్నకొద్దీ, తన దుఃఖకారణ



తెలుసుకొనడానికి ప్రయత్నిస్తాడనే భయంతో అతనిని పంపించివేయడానికి పన్నిన పన్నాగమది.

తన మనస్సులోని దుఃఖాన్ని లక్ష్మి తెలుసుకోరాదు-అంతెందుకు-తన తలిదండ్రులూ తెలుసుకోరాదనే దృఢ మనస్సుతో దుఃఖాన్ని దిగమింగుకొని, సమాధానపు ముఖ ముద్రతో కూర్చున్నది శాంతల.

లక్ష్మి "అక్కా" అంటూ మందిరంలో ప్రవేశించినది.

శాంతల :- "రా, నా తల్లీ. నిన్ను చూచి యుగాలయినట్టుంది. నిన్న రాత్రి నేను రాజధానికి వచ్చినప్పుడే చాల పొద్దుపోయినది. నీ నిద్రను చెడపడం నా మనస్సు ఒప్పలేదు."

"నాకూ అలాగునే అనిపించినది. నీవు ఊరికివచ్చిన సమాచారమేమో. తత్క్షణమే తెలిసినది. అక్కయ్యకు మార్గాయాసమయి ఉంటుంది. నిద్రపోవడం అవసరం. నేనిప్పుడు చూడడానికి వెళ్ళితే, ఇక రాత్రంతా మాటల్లో గడచిపోతుంది. ఎప్పుడు తెల్లవారీని. ఎప్పుడు నిన్ను చూచేను! అని రాత్రంతా జాగారం చేసినాను."

"వానికితోడు నీవొక పిచ్చిదానివి."

"ఎవరికి తోడు?"

"ఇంకెవరికి తోడు? నీ తమ్మునికి తోడు. వాడూ రాత్రంతా నిద్రలేక అక్కకోసం చిత్ర విచిత్రమయిన కలలు కంటున్నాడు."

"కలలు గన్నాడా? ఏమి టేమిటి? ఎలాటి కలలట?"

"నేను చెప్పడం కంటే వాడే నీతో చెప్పడం మేలు. నీవే అడుగు. చాల విచిత్రమైన కలలు, లక్ష్మి. విని నాకు కన్నీళ్ళు పుట్టినవి. అదిచూచి అక్కయ్య దుఃఖపడుతున్నదనే భావన వానికి కలిగినది."

"దుఃఖపు కలలా? అక్కయ్యా దుఃఖపుకలలు కన్నాడా? అది మంచిదికాదు. దానిని నీతో ఎందుకనినాడు?"

"దుఃఖపుకల కాదు లక్ష్మీ. అదొక మహా విచిత్రమైన కల. దానిని చూచి నాకు దుఃఖమయినది."

శాంతల మనస్సును అదుపులో పెట్టలేక పోయినది. స్వప్నాన్ని లక్ష్మికి వివరిస్తూ కూర్చున్నది. అంతా విన్నతర్వాత లక్ష్మి కన్నులూ చెమర్చినవి. "అక్కయ్యా, కుమారునిది ఎంత సుందరమైన హృదయం ? ఎంత సొగసైన కలయిది ? స్వర్గాన్నే భూమికి దింపినదికదా, వాని ప్రీతి ! వాడు నూరు సంవత్సరాలు సుఖంగా బ్రతుకనీ. సోవలకు పదిమంది మగబిడ్డలు పుట్టనీ." అనినది లక్ష్మి.

"అది నా చెల్లెలికీ కలుగనీ."

"మొదట అక్కయ్యకు కావాలని నేను వ్రతం పట్టినాను."

"ఆ వ్రతఫలం నీకేకానీ. లక్ష్మీ. నీకు శిశువు పుడితే, అది నా శిశువు కాదూ ?"

"అక్కయ్య ప్రేమకు కొలతలేదు. అక్కయ్య శిశువు నా శిశువూ కాదా ఏమి ?"

"సందేహం లేదు; లక్ష్మీ సందేహం లేదు."

ఈ విధంగా పరస్పర సంభాషణతో శాంతల దినమంతా గడిపినది. రాత్రి అక్కా చెల్లెలు ఒకే శయ్యాగారంలో మాట్లాడుతూ పడుకొన్నారు. నిద్ర వచ్చేవరకు లక్ష్మి అక్కయ్యతో మాట్లాడుతూనే ఉన్నది. శాంతలకు నిద్రరాదు. మనస్సులోని యోచనలు మరొకమారు కెలక వేసినవి. "ఏమిటిదారి ? ఇది ఎట్లు పరిణమిస్తుంది ?" అని శాంతల నిదానంగా యోచించినది. పరిష్కారమయ్యే దారే ఆమెకు తోచలేదు. కుమారుడు గరుడి కావడమే ఈ అన్ని ఇక్కట్టులకూ కారణం. ప్రభువులు కుమారునికి యువరాజ పట్టం కట్టవలెనని నిశ్చయించినారు. దీనికోసం ప్రభువులు తొందరగా రాజధానికి రానున్నారు. దీనికోసమే శాంతలను ముందుగా రాజధానికి పంపినారు. ఇంతలో కుమారుడు ఎవ్వరికీ తెలుపక, ఎవ్వరినీ అడుగక గరుడి అయినాడు. దానిని చూచి శాంతలకు "అయ్యో !



ఇకేమిగతి ?" అనిపించినది. "ప్రభువులకు ఈ సమాచారం తెలిస్తే, వారి మనస్సు చాల నొప్పి పడీని. పరిణామం ఘోరమయ్యాని. వానికితోడు సోవలకూడ సతీకంకణం ధరించినది. వీరికితోడు సైన్యంలోని నాయకులు కొందరూ కుమారునితోపాటు మరణించడానికి సిద్ధమయినారు." అని శాంతల యోచన చేసినకొద్దీ, సమస్య కఠినమవుతూ వచ్చినది. "కుమారుడు చేసిన ఈ ప్రమాణాన్ని ప్రభువులు అసత్యం చేయించరు. తానిప్పుడు ఎలాంటి సంకటంలో చిక్కుకున్నదో అలాంటి సంకటంలోనే ప్రభువులూ చిక్కుకుంటారు. సింహాసనానికి ఇకముందు అధికారం ఎవరికి ? తనకు సంతతిలేదు. తాను బతికి ఉన్నంతవరకూ ప్రభువులు మరెవరినీ పట్టపుదేవేరిగా చేసుకోరు. లక్ష్మిని పట్టమహిషిగా చేసుకొండని ప్రభువులను వేడుకొని వేడుకొని...ఎంత వేడుకొన్నా, వారు ఆ మాటకు ఖండితంగా ఒప్పుకోనన్నారు. ఇప్పుడు మిగిలినది దత్తస్వీకార మొక్కటే. అలాంటి వారు ఎవ్వరూ కనిపించడంలేదు. ఆవిధంగా దత్తస్వీకారంచేసి, వానికి పట్టం కట్టినా, రేపు లక్ష్మికి కొడుకు పుడితే, ఆకొడుకు స్థానం, మర్యాదలు ఏమిటి ? అయ్యో ! దైవమా ! ఇది ఎలాంటి కఠిన సమస్యను తెచ్చి పెట్టినావు ? దీని పరిహారంకాని, ఇది ఇకముందు ఏ స్వరూపం దాల్చుతుందన్నదిగాని నీకొక్కనికే తెలివిడి." అని శాంతల రాత్రంతా దుఃఖంతోనే గడిపినది.

వేకువ అయినది. శాంతల లేచి ప్రాతర్విధులు ముగించి, స్నానం చేసి, ధౌత దుకూలాలు ధరించి, తన శారదాదేవి పూజలో నిమగ్నురాలయినది. మధ్యాహ్నం వరకు ధ్యానంలోనే ఉండిపోయినది. అక్కయ్య భోజనానికి రాకపోవడం చూచి, లక్ష్మి తానేవచ్చి అక్కయ్యను బలవంతంగా భోజనానికి పిలుచుకొని వెళ్ళినది. చింత పట్టుకొన్న ప్రాణానికి భోజనం కావలెనా ? నిద్ర కావలెనా ? అక్కయ్య మనస్సు ఏదో మహాపదలో చిక్కుకున్నదని లక్ష్మి ఇప్పుడు గ్రహించినది. "అక్కయ్యా, నాకూ తెలుపదగనట్టి సంగతా ? నిన్నటినుంచి, బహుశః కుమారుని చూచినప్పటినుంచి నీ మనస్సు ఏదో పెద్ద విపత్తులో వేగుతున్నది. నేను దానిని తెలుసుకో కూడదంటే, చెప్పవద్దు." అన్నది లక్ష్మి.

"నీవు ఆందోళన పడకు లక్ష్మి! అది క్రమేణ నీకు తెలియనే తెలుస్తుంది. కఠినసమస్య మాత్రం నిజం. శారదను శరణు పొందినాను. నా తల్లి నాకు దారి చూపకపోతే, మరెవరు చూపుతారు?"

శాంతలకు ఆరాత్రికూడ వెనుకటి రాత్రివలెనే దుఃఖకరమయినది. ఆమె మనస్సిప్పుడు పూర్తిగా ఉడికిపోయినది. లక్ష్మితోను రాత్రి చాల సేపు మాట్లాడలేదు. లక్ష్మి నిద్రించినదని భావించి, తన దుఃఖాలను ఒక్కొక్కటిగా తోడుకొని ఆలోచించి, ఆలోచించి, దారి కనలేక పోయినది. కట్టకడకు ఆమె మనస్సు ఒక నిర్ధారానికి వచ్చినది. "ఎందుకు కాగూడదు?" అనే ప్రశ్నకూడా ఆమె మనస్సులో పుట్టినది. "మరొక మార్గంలేదు." అని మనస్సు మరల నిర్ధారం చేసింది. "సరి. దైవమే చూపిన దారియిది. దీనినే అనుసరించదగినది." అని దృఢం చేసుకొన్నది. ఆమె మనస్సుకప్పుడు హెచ్చు ధైర్యం కలిగినది. దేనిని అసాధ్యమనుకుంటున్నదో, దానిని సాధ్యం చేసుకొనడానికి ఇదొక్కటే మార్గం కనిపించినది.

కుతకుతలాడే మనస్సుకు ఇప్పుడు నెమ్మది ఒదవినది. పక్కకు తిరిగి, "లక్ష్మి, నిద్రపోయినావా?" అని ప్రశ్నించినది. లక్ష్మి నిద్రపోయినది. నిద్రపోతున్న తనచెల్లెలి ముఖాన్ని చాలసేపు చూస్తూ ఉండినది శాంతల. తర్వాత, తన మనస్సులో అనుకొన్నది: "నా తల్లి, ఇలాటి కఠిన సమస్యలు నీకు ఎన్నటికీ రాకుండా ఉండని. నూరేండ్లు సుఖంగా యోచనలేకుండా ఉండు." అని. శాంతల ఈ విధంగా శుభాశంసన చేస్తూ నిశ్చింతగా నిద్రపోయినది.

అక్కయ్య నిద్రపోయినదో, లేక ఇంకా ఆలోచిస్తూనే ఉన్నదో, అని లక్ష్మి ఒకమారు మేల్కొని, ఆమె నిశ్చింతగా నిద్రపోవడం చూచి ఊరట పడినది. నిద్రపోతున్న నిసుగుకు మెలుకువరాని విధంగా కన్నతల్లి కప్పుకొనే పచ్చడం కప్పేరీతిగా, అక్కయ్యకు పచ్చడం కప్పి, దీపపు వత్తిని తగ్గించి, పడుకొని, తానూ నిద్రపోయినది.



మరునాటి మధ్యాహ్నానంతరం శాంతల కుమారవిష్ణువును పిలిపించుకొని, వెనుకటి రెండునాళ్లుగా అతని మనస్సులో కలుగదగిన భయసంశయాలను పోగొట్టడంకోసం సంతోషోత్సాహాలతో పలుకరించి, "ఇంకేమేమి కలలు కన్నావు?" అని పరిహాసంగాను అడిగి, పండ్లు, పాలు తెప్పించి, అతనితో కలిసిపుచ్చుకొని, తర్వాత, తను శివగంగాయాత్ర చేయదలచినానని తెలిపినది. దానికోసం కుమారవిష్ణువు రేపే అన్ని ఏర్పాట్లనూ చేయవలెనని చెప్పి, శివగంగ పది గవ్యూతులదూరం ఉన్నందున గవ్యూతి గవ్యూతికి ఒక్కొక్క జత గుర్రాలను మార్చడానికి వీలుగా, పది పన్నెండు జతల గుర్రాలను దారిలో అక్కడక్కడ తగిన పరివారంతో నిలుపడానికి ఏర్పాటుచేసి, శివగంగకుపోయి, అక్కడ ఒకటి రెండు నాళ్లు బసచేయడానికి స్థలం ఏర్పాటు చేసిరావలెనని కుమారునికి చెప్పినది. ప్రభువులు ఊరికి వచ్చిన ఒకటి రెండు నాళ్ళలో తను శివగంగకు బయలుదేరుతాననికూడ తెలిపినది.

కుమారునికి ఆశ్చర్యమయినది. అతడు "ఎందుకు అక్కయ్యా, నీవు ఒక్కతెవే ఎందుకు వెళ్ళవలె? నీతోపాటు ఎవరూ రాగూడదా? లేక వచ్చేవారెవరూ లేరా?" అని ప్రశ్నించినాడు.

శాంతల:- "వారివారికి పనులు ఎన్నో ఉండవచ్చు."

"ఇదేమిటి అక్కయ్యా, ఇలాగు మాట్లాడుతున్నావు? నీతోపాటు ఎవరు రావని అంటున్నారు? చిన్నక్కయ్య రారా? నేనూ, సోవల రావద్దా?"

"ఏమి మహాయాత్ర అని మిమ్మల్నందరినీ పిలుచుకొని వెళ్ళను?"

"అక్కయ్యా. నీవు ఎక్కడికీ ఒంటరిగా వెళ్ళినదానివిగావు. చిన్నక్కయ్య అయినా ఎల్లప్పుడూ వెంట ఉండే తీరవలె. ఇప్పుడు మాత్రం వారివారి పనులు వారివారికి అంటున్నావు! చూడు. నాకేమీ పనిలేదు. చిన్నక్కయ్యకుగాని, సోవలకుగాని అలాంటిపని యేమిటి? నేనైనా నీతోపాటు వస్తానక్కయ్యా. అప్పాజీవారు నిన్ను ఒంటరిగా ఖండితంగా పంపరు."

"నీ అప్పాజీవారు ఊరికి వస్తారు. నీవూ, వారూ కలిసి మాట్లాడ వలసినవి నూరువిషయాలు ఉండీని."

"అంతటి అత్యవసరమైన విషయాలేమీ నాకు తెలిసినంతవరకు లేవు. అప్పాజీవారు ఏమైనా చెప్పేదిఉంటే, ఒకటిరెండునాళ్ళు ఆలస్యం కావడంవల్ల ఇబ్బందియేమి? అంతటి ఆవశ్యక విషయాలుంటే నీతోనే చెప్పి పంపేవారుకదా?"

"నీ అప్పాజీవారు నాతోపాటు ఎవరైనా తప్పక వెళ్ళితీరాలన్నట్టయితే, అప్పుడు నిన్ను నాతోడుగా పిలుచుకొని వెళ్ళుతాను. ఇప్పుడెవరూ వద్దు."

"అప్పాజీవారు రేపు, ఎల్లుండి రాజధానికి రావచ్చు. అక్కయ్యా, అప్పుడు నేను రాజధానిలో లేకపోతే,......"

"మరేమీ చింతపడవద్దు. నేను ఈ పనికోసం నిన్ను పంపినానని నీ అప్పాజీవారికి తెలుపుతాను. నీవుమాత్రం రేపే ఈ సర్వసన్నాహాలూ చేయించవలె. నీవే శివగంగకుపోయి అక్కడి ఏర్పాట్లూ చేసిరావలె. ఈ పనులను మరొకరికి అప్పగించవద్దు. ఈ ప్రయాణపు సంగతిని ఎవరితోనూ అనవద్దు. ఈ పనులన్నీ ముగించుకొని తత్క్షణమే నాకు వచ్చి తెలుపు. నన్ను చూడడానికి మొదలు ఇక్కడ ఎవ్వరినీ చూడవద్దు. ఎవరితోనూ మాట్లాడవద్దు."

"అల్లాగే అక్కయ్యా." అని కుమారుడు లేచి అక్కయ్యకు నమస్కారంచేసి, వెళ్ళిపోయినాడు. వెళ్ళుతున్నప్పుడు పెక్కు ఆలోచనలు అతని తలలో జొరబడినవి. "ఇంత దగ్గర ఉన్న శివగంగకు వెళ్ళిరావడానికి అక్కయ్య ఇంత ఆతురతతో ఏర్పాట్లను ఎందుకు చేయిస్తున్నది? శివగంగను సాధ్యమయినంత త్వరలో చేరడానికి గవ్యూతికి గవ్యూతికీ గుర్రాలు మార్చవలెనట! ఇంత తొందరగావెళ్ళే కారణమేమిటి? శివగంగలో రేపు ఎల్లుండి ఏమైనా పర్వకాలమా? అక్కయ్యకు అక్కడ బంధువులెవరైనా ఉన్నారా?... ఏమైనాకానీ. చెప్పినట్లు చేయవలసినది"



అనుకొని పనికి పూనుకొనినాడు. కుమారునికి అక్కయ్య ఆజ్ఞ, అప్పాజీవారి ఆజ్ఞ, రెండూ దైవాజ్ఞ.

ఆనాడు సాయంకాల మవుతుండగా, ప్రభువులు రేపు మధ్యాహ్నానికి ముందు దయచేస్తారనేవార్త వచ్చినది. ఈ రెండు మూడునాళ్ళ చింతలో శాంతల సగమయినది. "ప్రభువులు తనను ఇట్లున్న స్థితిలో చూస్తే నిరుత్సాహపడేరు; అధైర్యపడేరు." అనుకొని ప్రభువులు విజయం చేసే వేళకు సంతోష ముఖముద్ర అలవరచుకోడానికి ప్రయత్నించ సాగినది. వేష భూషలతో, నవ్వు మోములో కనపడాలని నిశ్చయించుకొన్నది. అంతఃపురంలో మనోరంజన కార్యకలాపాలకు తత్క్షణమే ఏర్పాటు చేసినది. నాటక, నృత్య సంగీతాలకు మెరుపులలాగ ఏర్పాట్లు నడచినవి. సుమంగలీ జనానికి అంతఃపురంలో విందు, చందన పుష్ప తాంబూలాలు ఏర్పాటయినవి.

మధ్యాహ్నం సమీపిస్తుండగా విష్ణువర్ధనులు విజయోత్సవంలో పురం ప్రవేశించి, పురజనులు ప్రీత్యాదరాలతో జయజయ ధ్వానాలు చేస్తుండగా. నగరు చేరినారు. ఎప్పటివలె కుమారవిష్ణువు రాజధాని ఎల్లలోనే అప్పాజీవారిని ఆహ్వానించవలసినది. "ఏ పనిలోనో నిరతుడయి ఉంటాడు. అందువల్ల రావడం సాధ్యం కాలేదేమో!" అని ప్రభువులు ఊరకున్నారు.

అంతఃపురం ప్రవేశించి శాంతలను, లక్ష్మిని మొదట చూచినారు. శాంతల అలంకరించుకొని హాసన్ముఖిగా ఉన్నా, ఆమె ముఖం, కన్నులు వాడి ఉండడం ప్రభువులు చూడకపోలేదు. అంతఃపురంలో ఆనాడు మనోరంజన దృశ్యాలు చాల ఏర్పటయినవి. శాంతలతో నాల్గు మాటలు మాట్లాడడానికికూడ ప్రభువులకు అవకాశం దొరకలేదు. ఆ సన్నివేశంలో కుమారుని జ్ఞాపకంకూడ రావడానికి అవకాశం లేనట్లు, ప్రభువులు నిదానంగా ఊపిరి తీసుకొనడానికి వ్యవధిలేనట్లు కార్యకలాపాలు ఏర్పాటు చేసినది జాణ శాంతల.

పగలంతా ఈ మనోరంజన కార్యకలాపంలోనే గడచిపోయినది. ముత్తైదువులకు భోజనోపచారాలు, పూవులు, పండ్లు, తాంబూలం-అంతా స్వయంగా మహారాజ్ఞి, లక్ష్మీదేవి పూనుకొని చేయడంవల్ల, భోజనానంత

రమూ ప్రభువులు దేవేరులను చూడడానికి కాలేదు. ఆవేళకు అపరాహ్ణమయినది. ఇక సాయంకాలపు సంతోషదృశ్యాలు విరామం లేకుండా ఒకదాని తర్వాత మరొకటి.

రాత్రి ప్రభువులు భోజనం ముగించి, చంద్రశాలలో ఆసీనులయినారో, లేదో ఆప్తులూ, సచివులూ అందరూ వచ్చి చేరినారు. రాజ్యకార్యాలను పర్యాలోచిస్తుండగా నిద్రాసమయమూ సమీపించినది. ప్రభువులు అందరినీ పంపివేసిన మీదట, శాంతలను, లక్ష్మిని పిలిపించుకొనినారు. ప్రభువులే మాటలాడడం ప్రారంభించి, "దేవీ, ఇంతటి ఆనందోత్సవాలకు కారణమేమి?" అని ప్రశ్నించినారు. వెంటనే సమాధాన మివ్వడానికి శాంతలకు కొంచెం ఇక్కట్టే కలిగినది. తర్వాత అన్నది : "ప్రభువులు రాజధానికి రావడం విన్నాము."

"నీ ఆరోగ్యం సరిగాలేదా ? ఇంతిలో ఏమైనది ?"

శాంతల :-"ఏదో తెగతెంపులు లేని యోచన తలలో ప్రవేశించి, నిద్రను చెడిపినది."

"తెగతెంపులు లేని యోచనలు మాపాలికి ఉండనీ. మాకు చెప్పవచ్చునుగదా ! నీవూ, మేమూ, లక్ష్మి ముగ్గురం చేరి పరిష్కరించవచ్చును. రాజ్యానికి సంబంధించినదైతే, అమాత్యులు లేరా ? దేవీ, నీయోచనలు నీ ఆరోగ్యాన్ని పాడుచేస్తున్నవి. మాకు తెలుపవలె. మేము అన్నిటిలోను నీకు సమభాగులం కదా ?"

"తెలుసును దేవా, తెలుసు. కొన్ని విషయాలేమో మాకే సంబంధించి ఉంటవి. స్త్రీల మనోభావంలోనే తూచవలసి ఉంటుంది."

"ధర్మం దానిని ఎన్నటికీ ఒప్పుకోదు. అన్ని యోచనలను కలిసే యోచించవలె; కలిసే నిర్ధరించవలె. దంపతులలో ఏ ఒక్కరూ స్వాతంత్ర్యం వహించరాదు. ఇది సప్తపదిలోని ఒక ప్రమాణం. దీనిని మరచినావా ? ఈ విషయం తెలుపవచ్చు. తెలుపరాదు అని నిశ్చయించే



వివేచన నీకున్నదని మాకు తెలుసు. నీ మనస్సుకు నొప్పి కలిగించే విషయం మాకూ ఒకవిధంగా కాకపోతే మరొక విధంగా నొప్పి కలిగించనే కలిగిస్తుంది. ఇప్పుడు మా మనస్సు నొప్పిపడడంలేదా ? పతి సహృదయుడు కాదా దేవీ ?"

"ప్రభూ, నేను నా మనశ్శాంతికోసం శివగంగకు యాత్ర వెళ్ళుతున్నాను."

"వెళ్ళిరా, దేవీ. తప్పక వెళ్ళిరా. గంగాధరేశ్వరుని దర్శనం అవశ్యం చేసుకొనిరా. దూరమేమీ కాదు. ఎప్పుడు రావలెనన్నా వెళ్లిరా."

"రేపే వెళ్ళవలెనని మనసయినది. వెళ్ళివస్తాను. ఆశీర్వదించండి." అంటూ శాంతల ప్రభువుల పాదాలు స్పృశించి నమస్కరించినది. నమస్కరించిన శాంతలను ప్రభువులు పట్టుకొని యత్తి, "దీనికింత దైన్యమెందుకు, దేవీ ! మేము ఎప్పుడైనా నీ మనోభిలాషను ఉపేక్షించినామా ? శివగంగకు తప్పక వెళ్ళిరా. రేపే వెళ్ళిరా. లక్ష్మినికూడా పిలుచుకొని వెళ్ళు. సేవలను పిలుచుకొని వెళ్ళు. ఎవరెవరు వస్తారు ? మేము రావద్దా ?"

శాంతల మృదువుగా నవ్వి, "నేనొక్కతెనే వెళ్ళివస్తాను. లక్ష్మి మీతో ఇక్కడే ఉండనీ. మీరు ఇప్పుడేగదా రాజధానికి వచ్చినారు. అందువల్ల లక్ష్మి మీతోపాటే ఉండనీ." అన్నది.

"ఒక్కతే వెళ్ళుతావా ? అంగరక్షణకైనా, కొసకు దారిలో మాట్లాడడానికైనా, ఒక్కరు ? విడిది ఏర్పాట్లువారు ?"

"వద్దు. దేవదర్శనానికి, గురుసన్నిధికి వెళ్ళుతున్నప్పుడు ఆడంబరం కూడదని మా అమ్మ నాకు ఎన్నోసార్లు చెప్పినారు."

"అదిసరే. నీ మనస్సు ఒప్పినట్లు చేయి. మేనాలో ప్రయాణం చాల ప్రయాస. రథప్రయాణం కావచ్చు. తొందరగా చేరవలెనంటే దారిలో అక్కడక్కడ గుర్రాలను మార్చవలసి ఉంటుంది. దానికి అన్ని ఏర్పాట్లూ చేసుకొని, ఎల్లుండి బయలుదేరడం సాధ్యం. మేము లక్ష్మితో

పాటు వేలాపురికి వెళ్ళివస్తాము. నీవు తోడుగా ఎవరిని పిలుచుకొని పోతావో కొసకూ చెప్పలేదే ? మీ తల్లిగారినా ? అయ్యగారినా ? ఎవరైనా మగవారు...నీ తమ్ముడు ?"

"తమ్ముణ్ణి పిలుచుకొని వెళ్ళనా ?"

"అది సరే. ఎక్కడ ? వాడెక్కడ ? మమ్ముల్ని చూడడానికి కూడ రాలేదు. ఊరిలో ఉన్నాడా ? సోవలకూడా కనిపించలేదు."

"సోవల సుఖంగా ఉంది. తమ్ముడు నా యాత్రకోసం ఏర్పాట్లు చేయడానికి నిన్న శివగంగకు వెళ్ళినాడు."

"ఓహో ! అందుకోసమే మేము అతన్ని చూడడంలేదు. ఏదో అస్వస్థత యేమో అనుకున్నాము. ఇంకేమి ? అన్ని ఏర్పాట్లూ జరిగాయి. వెళ్ళిరా దేవీ ! నీ మార్గం సుగమంకానీ !"

"మీ ఆశీర్వాదం. అలాగే కానీ !"

## 23

మరుదినం ఉదయం ప్రభువులు తమ వేలాపురి ప్రయాణానికి ఏర్పాట్లు చేయవలెనని ఉత్తరువు చేసినారు. శాంతల శివగంగయాత్రకు కుమారుడు అన్నిఏర్పాట్లూ సమర్పకంగా చేస్తాడని ప్రభువులు ఆవైపు దృష్టి పెట్ట లేదు. ఉదయమంతా సచివులతోను, ఇతర ప్రభుత్వాధికారులతోను మాటామంతీతో గడచి పోయినది.

లక్ష్మి అంతసేపూ అక్కయ్యతోనే ఉన్నది. దేశపరిపాలనలోను, దేశ రక్షణలోను మహారాజ్ఞిపాత్ర ఎంత అవశ్యమన్న విషయం ఆమె అక్కయ్యనుచూచి నేర్చుకొనేది. ఈ విషయంలో శాంతలకూడ అప్పుడప్పుడు చెల్లెలికి ఎన్నో సూక్ష్మాలను తెలిపేది. సామంతుల, శ్రీమంతుల పత్నులతో స్నేహ విశ్వాసాలతో మెలగడం, ఉచితసమయాలలో



వారిని సన్మానోపచారాలతో గౌరవించడం,- మొదలయిన అనేక విషయాలను లక్ష్మి అక్కయ్యనుంచి నేర్చుకొనేది. తనకు తెలియని విషయాలలో "ఇది ఎందుకు అక్కయ్య ?", "ఇట్లెందుకు అక్కయ్యా ?" అని లక్ష్మి అడిగేది; శాంతల సమాధాన మిచ్చేది. అనేక సమయాలలో "ఇకముందు ఇది ఇలాగుననే అవుతుంది; ఇలాగుననే నడుస్తుంది" అనే నిశ్చయంతో శాంతల పనులు జరిపినప్పుడు, అవి అలాగుననే జరుగడంచూచి లక్ష్మి ఆశ్చర్యపడి, "అక్కయ్యా, ఇంత యోచన చేయడానికి నీకు అవకాశ మెక్కడ ? ఎంతదూరం యోచనచేసి, పనులు జరుపుతావు" అనడం కూడా కద్దు.

శాంతల మనస్సు రెన్నాళ్ళకింద ఉన్నదానికంటే ఇప్పుడు ఎంతో ప్రఫుల్లమయినది. "లక్ష్మిని పిలుచుకొని రెన్నాళ్ళు వేలాపురానికి పోయి వస్తాను" అని ప్రభువులు అన్నప్పుడు, శాంతల తన ఉద్యమానికి దైవమే సహాయం చేస్తున్నదని ఆనందించినది. "ఎందుకు ? ఏమి ?" అని ప్రశ్నించక ప్రభువులు తన శివగంగయాత్రకు వెంటనే అంగీకరించడంచూచి, శాంతలకు ఈ నమ్మకం ఇంకా దృఢపడినది. ఆమెకు ఉత్సాహం తొణికిసలాడినది. మనస్సులోని దారుణచింత దూరమయినది.

ప్రభువులు, శాంతల, లక్ష్మి, ఇతర దేవేరులు ఆ మధ్యాహ్నం ఒక్కటిగా కూర్చుని భోజనం చేసినారు. భోజనానంతరం కొంతసేపటికి ప్రభువులు లక్ష్మితోపాటు వేలాపురికి బయలుదేరినారు. తన తండ్రిగారి జ్ఞాపకార్థం వేలాపురిలో ఒక బృందావనం కట్టించవలెనని లక్ష్మి ప్రభువులను అడిగినది. "ఆసంగతి నీవు చెప్పనక్కరలేదు. అది మా కర్తవ్యం." అనినారు ప్రభువులు. ఆ సమయం ఇప్పుడు కలిసివచ్చినది. లక్ష్మి వేలాపురికి బయలుదేరడానికి ముందు శాంతల చెల్లెలిని కౌగలించుకొని, "లక్ష్మి, నా పూజలన్నిటినీ కేశవునికి అర్పించిరా. వచ్చే సోమవారం ప్రాతఃకాలం నా పేర విజయనారాయణునికి విశేషపూజ జరుగనీ; దీనిని మరువవద్దు." అన్నది. "అగత్యంగా చేయిస్తాను, అక్కయ్యా" అన్నది లక్ష్మి.

ప్రభువులు వేలాపురికి బయలుదేరిన కొంతసేపటికి కుమారవిష్ణువు శివగంగనుంచి తిరిగివచ్చి, వెంటనే అక్కయ్య దర్శనానికి వచ్చినాడు.

"నీవు వచ్చినది ఎప్పుడు ? ఎంత పొద్దయినది ?" అని శాంతల మొట్ట మొదట ప్రశ్నించినది.

"కనిపించడం లేదా, అక్కయ్యా, ఈ ధూళి, ఈ దుమ్ము, ఈ చెదరిన తల వెంట్రుకలు ? అన్ని ఏర్పాట్లూ చేసి ఎంత త్వరగా తిరిగి వచ్చినానో చూడు. వచ్చిన తక్షణమే నన్ను చూడుమని నీవు చెప్పినందున ఇలాగునే వచ్చినాను. ఇక వెళ్ళి స్నానం చేసి, ఉడుపులు మార్చుకొని, అప్పాజీవారిని మొదట దర్శించవలె...ఎక్కడున్నారు అప్పాజీవారు? ఏమన్నారు ?" అని ప్రశ్నించినాడు కుమారవిష్ణువు.

శాంతల తన ఎదమీద చేతులు జోడించి ఆనించుకొని, అరక్షణం కన్నులు మూసుకొని, మనస్సులో "నారాయణా, నీవు నాకు సహాయకుడివిగా ఉన్నావనడానికి ఇది మూడవనిదర్శనం. ఇక నాకు సంశయమే లేదు." అనుకొని, కన్నులు విప్పి, "హాఁ! ఏమన్నావు ? ఏమి అడిగినావు? అప్పాజీవారా ? నీ అప్పాజీవారూ, చిన్నక్కయ్య ఇప్పుడే వేలాపురికి వెళ్ళినారు. నిన్నూ, సేవలను అడిగినారు." అన్నది.

"అప్పాజీవారు ఏమనినారు ?"

"నేనే నిన్ను శివగంగకు పంపినానని చెప్పినాను."

"చూడు అక్కయ్యా! అప్పాజీవారిని సాయంకాలానికి ముందే దర్శించుకోవాలని పదిహారల ప్రయాణాన్ని ఎనిమిది హారలలోనే పూర్తి చేసుకొని, పాపం! గుర్రాలనూ అంతగా శ్రమపరచి, ఇంత తొందర తొందరగా వచ్చినా, అప్పాజీవారు వేలాపురికి వెళ్లిపోవలెనా ? అయ్యో! నా దురదృష్టమా ?"

"అది నా అదృష్టం." అని శాంతల మనస్సులోనే అనుకుంటూ, "ఇప్పుడు ఏమైనది ? అంతటి తొందర విషయం ఏదైనా నీవు తెలుపవలసి ఉన్నదా ?" అని ప్రశ్నించినది.



"మీకు మీపనులు దొడ్డవి. మాకు మాపనులు దొడ్డవి. ఎవరిపనులు వారికి దొడ్డవి. నేను స్నానం చేసి, వేరే వస్త్రాలు ధరించి, అప్పాజీవారిని దర్శనం చేసుకొని వస్తాను."

శాంతల భయపడి, ఆభయం పైకి కనపడనీయక "నీవు నాతో శివగంగకు వస్తావా? నేనొక్కతెనే వెళ్ళడానికి నీ అప్పాజీవారు సమ్మతించలేదు. నిన్ను తోడు తీసుకొని వెళ్లుతానని మనవి చేసిన మీదట సమ్మతించినారు." అన్నది.

"నేను మొదలే అన్నానుగదా! నిన్ను ఒంటరిగా పంపడానికి అప్పాజీవారు ఖండితంగా ఒప్పుకోరని."

"రేపు ప్రాతఃకాలం తర్వాత బయలుదేరితే, మధ్యాహ్నం తర్వాత లేక సాయంకాలానికి ముందే శివగంగ చేరవచ్చునుగదా ? మరుసటి దినం ఉదయం కొండకు వెళ్ళవచ్చు. శివగంగ కొండ చాల సుందరమయినది. నేను చిన్నతనంలో ఎప్పుడో చూచిన గుర్తు. కొండ గుహలలో గంగాధరేశ్వర, హొన్నాదేవుల దేవాలయాలున్నవి. చుట్టూ సుందర దృశ్యాలు."

"అంత పెద్దకొండను నీవు ఎక్కడం సాధ్యమవుతుందా ?"

"చూస్తావు కదా ?"

"రేపు కదా మనం బయలుదేరడం ? అప్పాజీవారిని దర్శించి రాత్రే తిరిగివస్తాను అక్కయ్యా."

"ఇంత దూరం ప్రయాణంచేసి, రేపు మళ్ళీ ప్రయాణం పెట్టుకొని ఇంత ఆత్రంగా ఎందుకు ఇక్కడికి రావడం ?—అని నీ అప్పాజీవారు అడుగుతారు. నీ విప్పుడు వేలాపురికి వెళ్ళితే, అర్ధరాత్రి అయిన తర్వాత తిరిగి వస్తావు. భోజనం చేయనిదే అప్పాజీవారు వదలరు. తర్వాత మాటామంతీ ప్రారంభమవుతుంది. రేపు నాతోపాటు నీవు రథంలో ఆవలిస్తూ, నిద్రపోతూ కూర్చో. నేను ఒక్కతెనే కళు మిటకరించిచూస్తూ

కూర్చుంటాను. నీ నమస్కారాలను నేను అప్పాజీవారికి తెలిపినాను. నీవు ఇప్పటికే చాల శ్రమపడినావు. రేపు నీవు అలసటతో ఉంటే ప్రయాణం సుఖంగా సాగదు. కనుక నీవు ఇప్పుడు ఎక్కడికీ పోక, స్నానంచేసి విశ్రమించు. ఏదైనా సమాచారం ఉంటే, వెంటనే చెప్పి పంపుతాను. ఇంట్లోనే ఉండు.''

''కానీ, అక్కయ్యా, నీవు చెప్పినట్లేకానీ. నీవు వద్దన్న తర్వాత నేను పోను. ఇంట్లోనే ఉంటాను. రేపు ప్రాతఃకాలం స్నానపూజాదులు ముగించుకొని బయలుదేరితే సరి. సోవలకు ఏమైనా చెప్పవలసిన మాట ఉందా? ఉపాహారాలు రుచిగా చేయగలదు. ప్రయాణానికి ఆమె చేత్తో ఏమైనా చేయించనా? ఆమె మనస్సంతోషానికైనా ఏమైనా చేయమని చెప్పవూ అక్కయ్యా. సంబరపడి సంబరపడి చేసేని.''

''మంచిది. ఏమి చేయవలెననేది ఆమె ఇష్టానికే వదలినానని చెప్పు. హెచ్చుగా ఏమీ చేయించవద్దు.''

కుమారవిష్ణువు అక్కయ్యకు నమస్కరించి తన నివాసానికి వెళ్ళినాడు. అక్కయ్య అత్యవసర ప్రయాణానికి కారణమేమని అతని మనస్సు ఇంకా ప్రశ్నిస్తూనే ఉంది.

అపరాహ్ణానంతరం, సాయంకాల మవుతుండగా శాంతల తల్లిదండ్రులను చూడడానికి పుట్టినింటికి వెళ్ళినది. కుమార్తె ఇంటికిరావడం మాచికబ్బెకు చాల ఆనందమయినది. మారసింగమయ్యగారూ ఇంట్లోనే ఉన్నారు. ఇంట్లో తనంత అందగత్తె అయిన కేతమల్లనాయకుల కుమార్తె చందల ఉన్నది. మాచికబ్బె తల్లికడుపు చందలనూ శాంతల అనే పిలిచినది. కేతమల్లనాయకులు, జక్కియబ్బె ఇప్పుడు ఎదురింట నివసిస్తున్నారు. చందల రెండిండ్లకూ కుమార్తె. శాంతల ఉపాస్యదేవత మందిరాన్ని మాచికబ్బె, చందల—ఇద్దరూ శుభ్రంగా ఉంచి, నిత్యపూజలు నడిపించుకొంటూ వచ్చినారు. చందల కూడ శారద భక్తురాలయినది. ''అమ్మా, దీనికీ నాల్గక్షరం ముక్కలు చెప్పించు'' అని కూతురు చెప్పిన మాటను



మాచికబ్బె మరువకుండా, చందలకూ మంచి విద్యా గురువును ఏర్పాటు చేసినారు. చందల ఆసక్తితో విద్యాభ్యాసం చేస్తూనూ ఉన్నది.

తాను, లక్ష్మి అంతఃపురానికి వెళ్ళినమీదట శారదాలయం శుచిగా పెట్టుకొని, పూజను క్రమం తప్పక నడిపించుకొని రావడం చూచి, శాంతలకు ఆనందమయినది; చందలను పిలిచి ప్రేమతో కౌగిలించుకొని, ''ఆ మహాతల్లి నీకు మంచి చేస్తుంది; నీశ్రద్ధ అచలంగా ఉండనీ.'' అని శుభం కోరినది. అనంతరం తల్లితండ్రులకు నమస్కరించి ఆశీర్వాదం పొందినది. ఆనాడు పెద్దదేచయ్య ఆనందమంతా చెప్పతరంకాదు. అంతఃపురం నుంచి వస్తున్నప్పుడు శాంతల దేచయ్యను మరువకుండా, వానికి సంతోషం కలిగించే ఉడుపులను తెచ్చినది. ఇప్పుడు వాటిని వారికిచ్చి వానికంటె తానే హెచ్చుగా సంతోషపడినది. తాను శివగంగకు రేపు వెళ్లుతున్నానని, తనతోపాటు కుమారవిష్ణువూ వస్తున్నాడని తల్లికి, తండ్రికి తెలిపినది. ఇంత తొందరయాత్ర ఇదేమిటని తల్లిదండ్రులు అడగకుండా ఉండలేదు. ''నా మనస్సంతోషం కోసం బయలుదేరినానమ్మా'' అన్నది శాంతల.

తర్వాత ఆమె మడిదుకూలాలు కట్టుకొని, తన ఉపాస్యదేవత మందిరానికి వెళ్ళి, భక్తితో పూజచేసి, పద్మాసనాసీనురాలయి గడియల తరబడి ధ్యాన నిమగ్నురాలయినది. భోజనసమయానికి తల్లేవచ్చి కుమార్తెను ధ్యానంనుంచి లేపి, పిలుచుకొని వెళ్లినారు. శాంతల, తలిదండ్రులు, చందల సమాన పంక్తిలో భోజనం చేసినారు. తర్వాత శాంతల కొంచెం సేపు ఉప్పరిగ చంద్రశాలలో కూర్చుని, తలిదండ్రులతో సంతోషంతో సల్లాపించినది.

పెద్దదేచయ్య అప్పుడు తన భోజనం ముగించి, శారదా పూజా మందిరంలో, దేవిదేనని పెట్టిన, పూర్వం శాంతల పలికించి పాడుతున్న వీణను అతి జాగరూకతతో మోసుకొనివచ్చి, శాంతల ముందుంచి, చేతులు జోడించినాడు. శాంతల కన్నెత్తి దేచయ్యను చూచినది. దేచయ్యకన్నుల నుంచి నీరు ధారకట్టినది. శాంతల గ్రహించినది. ''వాయించనా

దేచయ్యా?” అని ప్రశ్నించినది. వాడు సిగ్గులో బిరబిర కన్నులు తుడుచుకొని “హూఁ” అన్నట్టు తల ఊపి, వెళ్ళి ఒక మూలలో తల వంచుకొని కూర్చున్నాడు.

శాంతలకు పేగులు పిండివేసినట్టయినది. మాచికబ్బెకూ అదే అనుభవమయినది. మాచికబ్బె కుమార్తెతో “నీవు నగరుకు వెళ్ళిపోయిన తర్వాత చాలనాళ్ళు ఈ దేచయ్య మూపవాడయినాడు. గడియలు తరబడి దేవి పూజాగృహంలో కూర్చునేవాడు. ఇప్పుడు నీ ప్రాణమంతా ఈ వీణలో ఉన్నదని తెలుసుకొన్నాడు. దినానికి రెండుసార్లు దీనిని శుభ్రంగా తుడిచిపెడుతాడు. చక్కని పూలతో దీనిని అలంకరిస్తాడు. వానగాలి ఘూళి పడకుండా కప్పుతాడు. నీపై ఉన్న భక్తి విశ్వాసాలను ఇప్పుడు నీ వీణపై పెట్టినాడు. లేకపోతే వానిగుండెలు ప్రిదిలిపోయేవో ఏమో?” అని అన్నారు.

శాంతల నగరుకు వెళ్ళిన నాటినుంచి దేచయ్యకు ఇల్లు శూన్యమయినది. వాడు సంగీతశాస్త్రం తెలిసినవాడు కాకపోయినా, శాంతల వీణ పలికించినపుడు దాని సునాదం వాని యెదలో ఆనంద తరంగాలను చెలరేపేది. ఇప్పుడు ఆవీణ పలికించేవారేలేక పూజాగృహం మూలలోపడి ఉంటున్నది. దేచయ్యకు దానిని చూచినకొద్దీ దుఃఖం ఎక్కువయ్యేది. బిడ్డలు ఇంటినుంచి నగరుకు వెళ్ళినప్పుడు, శూన్యమయిన భవనం చూచి, మాచికబ్బె ఎంత సంకటపడినారో, అంత సంకటం దేచయ్యకూ కలిగినది. గడియలకొద్దీ దేచయ్య మబ్బు పట్టినవాడివలె పూజాగృహంలో శారదా విగ్రహాన్ని చూస్తూ, తన చిన్నదొరసానిగారిని తలుచుకుని తలచుకొని కన్నీటివరదలనే పారించిన సందర్భాలూ ఉన్నవి. వాని మూగదుఃఖం చూడలేని మాచికబ్బె వానిని పిలిచి “ఇదిగో, ఇది శాంతమ్మగారికి యిచ్చిరా.” అని ఏదో నెపంతో వానిని అంతఃపురానికి పంపి, శాంతలను చూచి వచ్చేట్టు చేసిన సందర్భాలూ ఉన్నవి. అయితే, ఎన్నిసార్లు ఆవిధంగా చేయడం సాధ్యం? అది సాధ్యమూ కాదు. నీతీకాదు. ఇట్లయి, దేచయ్య తల్లిని కోల్పోయిన అనదవలె చిక్కిపోయినాడు. ఆవేదన పడుతున్నవాడి జీవానికి అప్పుడు శాంతల వీణే ఒక నమ్మికయిన వస్తువయినది.



నాటినుంచి వాని మనస్సుకూ ఏదో ఒక సమాశ్వాసనమూ లభించినది. వీణను భద్రపరచడం వహించి, తన చిన్న దొరసాని సేవచేస్తున్నాననే మనస్సుకు కొంచెం సమాధానం తెచ్చుకొన్నాడు.

శాంతల వీణనుతాకి కండ్లకు అద్దుకొని ఒడిలో పెట్టుకొని పాటలాడించినది. అది నవ్వుతూ పలికినది. తనకూ, దేచయ్యకూ, అందరికీ తృప్తి కలిగేవరకు వాయించి, తర్వాత దేచయ్యలోనే పూజాగృహానికి పంపివేసి, తల్లిదండ్రులకు నమస్కరించి, నగరుకు తిరిగివచ్చి, ఆరాత్రి సుఖంగా నిద్రపోయినది.

శాంతలకు అరుణోదయానికి ఇంకా చాల పొద్దు ఉండగానే మెలకువ వచ్చినది. ఆమె ప్రాతర్విధులు ముగించి, స్నానంచేసి, దేహమూ, మనస్సూ శుచిగా ఉండగా, ఇష్టదేవతలను పూజించి, తర్వాత నగరుకు పిలిపించుకొన్న బ్రాహ్మణులను, ముత్తైదువులను పూజించి, దానాలు, వాయినాలు ఇచ్చి ఆశీర్వాదాలు పొందినది. అనంతరం అంతఃపుర దాసదాసీ జనులందరికీ ఉడుగరలిచ్చి తృప్తిపరచినది. తర్వాత కుమారవిష్ణువును, కోడలు సోవలను పిలిపించి, వారితోపాటు ఉపహారం స్వీకరించినది. ఆవేళకు ఉత్తమాశ్వాలు పూన్చినరథం అంతఃపుర మహాద్వారంవద్ద వచ్చి నిలిచినది. శాంతల రథమెక్కడానికి ముందు సోవల అత్తయ్యగారి పాదాలకు నమస్కరించినది. శాంతల ఆమెను ఆశీర్వదించి ఆలింగనం చేసుకొని, “భగవంతుడు నిన్ను సదా సుఖంగా ఉంచనీ.” అని శుభం కోరుతూ రథం ఆరోహించినది. ఆమె వెంటనే కుమారుడూ రథమెక్కినాడు.

సారధి మహారాజ్ఞికి నమస్కరించి, ఆమె అనుజ్ఞ తీసుకొని గుర్రాలకు కొరడా తాకించినాడు. రథం వేగంతో శివగంగమార్గం పట్టినది.

వసంతఋతువు అప్పుడే ఆరంభమయినది. ఆప్రాంతమంతా ముంగారు పంటలు బాగా పెరిగినవి. గుట్టలు బయలు ఇంకా పచ్చగా ఉన్నవి. మామిడి తలిరుటాకులు అప్పుడప్పుడే మోసులెత్తి కనిపిస్తున్నవి. పక్షుల గుంపులు ఆ తలిరుటాకులు తిని తృప్తిపడినవి. గుట్టలమీద, బయళ్ళలోను సొంపుగా మేస్తున్న పసువులను, చేలలో ఉల్లాసంతో పాడుకొంటూ పని

చేస్తున్న కర్షకులను, వారి భార్యలను, దారిలో అక్కడక్కడ కనిపించే గ్రామాలలో, పురాలలో సంతోషంతో తిరుగుతూ, బడులకు వెళ్లుతున్న పిల్లలనుచూచి శాంతల చాల ఆనందపడినది. కుమారుడు దారిలో వచ్చే పల్లెల, గ్రామాల, ఊళ్ళ, పట్టణాల పరిచయం ఆమెకు తెలుపుతూ, అవి ఏ సామంతుల, ప్రెగ్గడల, గ్రామణుల రక్షణలో ఉన్నవి, అక్కడి ఇతరాధికార వర్గంవారు ఎవరెవరు అనే విషయాలను అక్కయ్యకు తెలియజేసేవాడు. "ఇన్ని విషయాలు వీడు ఎలాగు నేర్చుకున్నాడు ? మన దేశమంత వీనికి కరతలామలకంవలె ఉన్నదికదా ! ఇలాటివాడు గదా ఈభూమికి ప్రభువుకావలె? అయ్యో విధీ! ఇలాటివానిని గరుడిగా ఎందుకు చేసినావు ? నీ సంకల్పం అంతర్యమేమో ?" అని శాంతల మనసులోనే కుమిలినది.

అక్కయ్య మౌనందాల్చడం చూచి కుమారుడు "అక్కయ్యా, ఏమి యోచన చేస్తున్నావు ? అదిగో చూడు ! జింకలమంద, మన రథధ్వనికి భయపడి, కాళ్లు నేలకు సోకుతాయో, సోకవో అన్నట్టు చెంగు చెంగున ఎగిరి పరుగెత్తడం. ఆ చిన్న పిల్లలు ఎంత వేగంతో తల్లిని అనుసరిస్తున్నాయో ? అదిగో చూడు మెడలు తిప్పి మనల్ని చూడడం. అక్కయ్యా, నీవు సాకేట్టయితే, చక్కని జింకపిల్లను తెచ్చిస్తాను." అని అక్కయ్య మనస్సును సుందర దృశ్యాలవైపు మరలించడానికి ప్రయత్నించినాడు. "వద్దు తమ్ముడూ. పాపం ! లేతకూనను కన్నతల్లినుంచి వేరుచేసి దొంగిలించి తేవడమూ ? అవి ఎక్కడ ఉండి పెరుగవలెనని దైవ నియామకమో, అక్కడే ఉంటేనే అందం చందం." అన్నది శాంతల.

"ఇక్కడ చూడు, అక్కయ్యా ఈ నేరేడుచెట్టు నిండుగా పెరిగి, పండినపండ్లు ఎలాగు గుత్తులు గుత్తులుగా బరువుతో వ్రేలాడుతున్నవో ? కిందచూడు. గాలికి రాలిన పండ్లనుంచి, కోతులు పీకి పారేసిన పండ్లనుంచి, బాటసారులు పీకి తిని పారేసిన పండ్లనుంచి, పశువులు వాటిని తొక్కి నడవడంనుంచి భూమికి నీలిరంగు పూసినట్టుంది. నేరేడుపండ్లు దప్పికకు మంచివి." అని కుమారుడు రథం ఆపమనిచెప్పి, కొమ్మలనుంచి మంచి పండ్లను విడిపించి, అక్కయ్యకిచ్చి, తానూ తినినాడు.



గవ్యూతికి గవ్యూతికి గుర్రాలను మార్చడంవల్ల దారి చాల వేగంగా గడిచినది. గుర్రాలకూ అలసట కలుగలేదు. వేగంగా వెళ్ళుతున్న రథంలో కూర్చున్న వీరికి ఎండవేడిమికూడ హెచ్చుగా అనుభవంకాలేదు. మధ్యాహ్న సమయానికి అరణ్యంలో రమణీయమైన సరోవరతీరంలో, చెట్లనీడ ఉన్నచోట రథం నిలిపి, ఇద్దరూ కిందికిదిగి, చల్లటి నీళ్ళలో ముఖం కడుగుకొని, చేతులు కాళ్ళూ కడుగుకొని, సోవల చేసిపెట్టిన దివ్యమైన వంటకాలను వనభోజనంచేసి, రథంనడిపే సారథికికూడ వంటకాలు పెట్టి, వాడు తిని, గుర్రాలను మేతకు నీటికి వదలేవరకు నీడలో విశ్రమించి, తర్వాత ప్రయాణం కొనసాగించినారు. సాయంకాలానికి ఇంకా కొన్ని గడియలు ఉండగనే శివగంగ చేరినారు.

## 24

మరుదినం ఎండ ఎక్కడానికిముందే శాంతల కొండ ఎక్కడానికి సిద్ధమయినది. కుమారుడూ సిద్ధమయినాడు. శాంతల గిరికి నమస్కారం చేసి ఎక్కడానికి ప్రారంభించినది. కొంచెందూరం ఎక్కగానే గంగాధరేశ్వరుని గుహాదేవాలయం కనిపించినది. ఇద్దరూ విఘ్నేశ్వరునికి, నందికి నమస్కరించి, గుహలో ప్రవేశించి, మహాదేవునికి భక్తితో ఎరగి, పిదప గిరిశిఖరానికి బయలుదేరినారు. దారి చాల చిక్కయినది; కఠినమైనది. మెట్లు చిన్నవి; అక్కడక్కడ జారిపడేస్థితి. ఇంత కఠినంగా ఉన్నా శాంతల మనస్సు శాంతంగా ఉంది. "తొందరపడవద్దు అక్కయ్యా, నిదానించు. పక్కనఉన్న బండను పట్టుకో. అంత చిన్నరాతిపై కాలుపెట్టకు. జారీని; పార్లీని." అక్కడ చిత్తడి హెచ్చు. పాచి పట్టింది. హెచ్చరిక !" అంటూ కుమారుడు అక్కయ్య చేయిపట్టుకొని నెమ్మది నెమ్మదిగా కొండ ఎక్కించుకుంటూ వెళ్ళినాడు. అలసట తీర్చుకొనడానికి అక్కడక్కడ కూర్చుంటూ, ఆయాసం పోగొట్టుకొంటూ, ముందుకు సాగిపోయినారు. దారిపొడవునా మంటపాలు. చిన్న పెద్ద గుడులు, వినాయక విగ్రహాలు, నందివిగ్రహాలు ఉన్నవి. కొండగాలి చల్లగా వీస్తున్నా చైత్రమాసపు ఎండ చురుకుగా ఉండినది.

ఆనాడు చైత్ర శుద్ధ పంచమి, సోమవారం. సోమధరుని దినాననే ఆయన దర్శనంపొంది, ఆయననే ధ్యానిస్తూ, కొండను ఎక్కుతున్నది శాంతల. పర్వతోపరిసానుప్రదేశం చేరినప్పుడు ఆమెకు చాల అలసట కలిగినది. తీర్థోద్భవ కుండంవద్ద ఇద్దరూ కూర్చున్నారు. "అక్కయ్యా, ఈకొండ ఇంత కష్టమైనదని తెలిసికూడా ఎక్కి వచ్చినావుకదా ?" అనినాడు కుమారుడు. "నేను చిన్నతనంలో పరిగెత్తి పరిగెత్తి ఎక్కినానని అమ్మ చెప్పేవారు. అదిప్పుడు సాధ్యమా ?" అన్నది శాంతల.

కొంచెంసేపు కూర్చొని అలసట తగ్గినతర్వాత శాంతల: "తమ్ముడూ, నోరు ఎండిపోతున్నది. దగ్గరేమో నీరులేదు. మనం మనవెంట తేవలసినది. మనం వచ్చినదారిలో విఘ్నేశ్వర మంటపం ఎదుటఉన్న దొనలో తేట నీరు ఉండడం చూచినాము; పక్కన అర్చకుల ఇల్లొకటి ఉన్నది. వారి నడిగి ఒక పాత్రలో నీరు తీసుకునిరా" అని కోరినది. "ఇప్పుడే తెస్తాను అక్కయ్యా. ఇక్కడే కూర్చో." అని కుమారవిష్ణువు నిమిషమాత్రంలో కిందికి దిగినాడు.

కుమారుడు దిగిపోయిన తర్వాత శాంతల లేచి, చుట్టూ చూచినది. సుందరమైన దృశ్యం. కొండ అడివారంలో శివగంగ ఊరు చిన్నగా కనిపించినది. చిన్ననాటి జ్ఞాపకం—అక్కడే ఎక్కడో దగ్గరలోనే "కోడుగల్ల బసవణ్ణ" అనే పేరుగల ఒక నంది విగ్రహం ఉండేది. కొసకు ఆమె ఆ నందివిగ్రహం ఉన్న ప్రాంతం వెదికి కనిపెట్టి, ఆ కోడుగల్లు బసవణ్ణ ఉన్నస్థలానికి వెళ్ళినది. ఆ విగ్రహం కనిపించినది. దానిచుట్టూ ప్రదక్షిణానికి చాల ఇబ్బంది. కాలు జారితే దేహంలోని ఎముకలుకూడ మిగిలే అవకాశంలేదు. చాల హెచ్చరికతో ప్రదక్షిణం చేయవలె. ఆడవారికి, పిల్లలకైతే అది సాధ్యమేకాదు.

శాంతల ధైర్యంతో ఒకసారి ఆ బసవునికి ప్రదక్షిణం చేసినది, చేతులు జోడించినది. తర్వాత మధ్యాకాశం సమీపిస్తున్న భాస్కరుణ్ణి చూచి చేతులు జోడించి, "భగవన్, సూర్యనారాయణ, ఇక నాకు నీవే దిక్కు. నీవేసాక్షి. ఇహ జన్మం అంతిమ కర్తవ్యమిది అని ఆచరిస్తున్నాను.



నీకు ఆత్మార్పణం చేసుకొన్నాను. నాకు వేరే మార్గమేదీ నీవు చూపలేదు. మా రాజ్యానికి శుభం కలుగనీ. లక్ష్మి పట్టమహిషికానీ. ఆమెకు పుత్ర సంతానం, దేశానికి ఒడయణ్ని ప్రసాదించు. ప్రభువుల మనస్సుకు ఎలాగయినా సమాధానపెట్టు. వారి అనురాగమంతా లక్ష్మికే లభించనీ. భగవంతుడా, కరుణించు ! కరుణించు." అంటూ కండ్లు మూసుకొన్నది. అంతే. శాంతల శరీరం బండలమీదపడి దొర్లిదొర్లి నూరు హస్తాలదిగువ పడినది. రమ్యమైన ఒక నక్షత్రం ఉదయించి భూమికి వెలుగిచ్చి కన్నుమరుగయినది. శకవరుషాలు ౧౦౫౦ (క్రీస్తుశకం 1131) విరోధికృతు సంవత్సర చైత్ర శుద్ధ పంచమి సోమవారం పూర్వాహ్ణం శాంతలదేవి శివగంగా పుణ్యక్షేత్రంలో దేహం త్యజించినది.

అదే సమయంలో ప్రభువులూ, లక్ష్మి వేలాపురంలో చెన్నకేశవునికి శాంతలదేవి పేరుతో పూజను సమర్పిస్తున్నారు. అర్చకులు పూవులునిండిన పళ్ళెరం మధ్యన నేతిదీపం పెట్టి దేవునికి నీరాజనం సమర్పిస్తున్నారు. పళ్ళెరం అర్చకులు చేతినుంచి అకస్మాత్తుగా జారి, దీపంతోపాటు నేలపై దొర్లిపడినది. దీపం కొండెక్కేటట్టు ఉన్నది. ఆరిపోతున్న వత్తిని ప్రభువులే తత్‌క్షణం చేతిలోతీసి ఎత్తి, జ్యోతిని ఉద్ధరించినారు. అరిపోతున్న ఆదీపం మరల ప్రజ్వలించినది. ప్రభువులకు ఇదేదో అశుభసూచన అని అనిపించినది. ఆక్షణమే గుండెలో పక్కన ఏదో వికారం కలిగినట్టు అనుభవమయినది. అర్చకులు భయపడినారు. "చేయి తడిగా ఉన్నందున పళ్ళెరం జారినది. సహస్రాపరాధాలయినవి. దేవరవారు మన్నించవలె" అని చేతులు జోడించి ప్రభువులను వేసుకొని, చెన్నకేశవునికి మరల కొత్తగా దీపారాధన చేసినారు.

దీపారతి కింద దొర్లినప్పుడు లక్ష్మీదేవికీ చాల బాధకలిగినది. కడుపులో పొడిచి పిడినట్టయినది. నిటూర్పొకటి ఆమె హృదయంనుంచి తనంతతానై బయలువెడలినది. ప్రభువులు లక్ష్మితోపాటు గర్భగుడినుంచి ఇవతలికివచ్చి, "లక్ష్మి, ఇదేదో అశుభసూచకంగా ఉన్నది. మనస్సుకు ఆందోళన కారణంగా ఉన్నది." అనినారు. లక్ష్మి "స్వామీ, నాకూ ఎందుకో భయమవుతున్నది. ఆరతిజ్యోతి అలాగు నేలమీద దొర్లి పడ

రాదు. మన తప్పేదైనా కేశవస్వామి మన్నించనీ. ప్రతిజ్ఞ ఉండి నేను ఏదోషమూ చేయలేదు. దేవుడు కాపాడవలె.'' అన్నది. ప్రభువులూ, లక్ష్మీ కేశవుని క్షమకోరుతూ దేవాలయం మెట్లపై కొంచెంసేపు కూర్చున్నారు.

అక్కడ కుమారవిష్ణువు కొండమీదినుంచి సరసర కిందికిదిగి, పూజారి యింట్లో ఒక శుభ్రమైన పాత్ర ఇప్పించుకొని, విఘ్నేశ్వరుని దొనలో నీరు నింపుకొని, తిరిగి పైకి ఎక్కిరావడానికి కొంచెం పొద్దయినది. అక్కయ్యను వదలిపోయినచోట ఆమెలేదు. ''అక్కయ్యా, అక్కయ్యా!'' అని కేక వేసినాడు; చుట్టూ చూచినాడు. సమాధానం రాలేదు. అక్కయ్య కంటికీ కనబడలేదు. ''దూరంగా ఎక్కటికైనా పోయినదేమో?'' అని, ధ్వనిని హెచ్చించి, ''అక్కా! అక్కా!'' అని కూతపెట్టినాడు. సమాధానం రాలేదు. కుమారునికి ఆశ్చర్యమయినది; భయమయినది. తెచ్చిన నీటిపాత్రను తీర్థోద్భవకుండంలోపల పెట్టి, ఒక బండమీదికి ఎక్కి, మరింత గట్టిగా ''అక్కా! అక్కా!'' అని చుట్టూ తిరుగుతూ పిలిచినాడు. కొండచరియల సందులనుంచి ప్రతిధ్వని వినిపించినది. సమాధానం మాత్రం లేదు. ''అక్కయ్య ఇంతలో ఎక్కడికి పోయినది? నా పిలుపు వినబడనంత దూరం ఎక్కడికి పోయి ఉండవచ్చు?'' అని కుమారుడు భయపడినాడు. మరొకసారి తన శరీరశక్తినంతా గొంతుకే ఇచ్చి ''అక్కా! అక్కా!'' అని అరిచినాడు. రెండు, మూడు, నాలుగు, ఐదుసార్లు ప్రతిధ్వనులు పుట్టినవి. సమాధానం మాత్రం లేదు.

సోమవారపు గిరి పూజకోసం వీరికంటె ముందుగా కొండ ఎక్కి వచ్చి, పూజ ముగించి, కొబ్బెర, పండ్లు ప్రసాదం తింటూ గుంపుగా కూర్చున్న గ్రామీణులు కుమారుని భయకాతరధ్వనికి అదరిపడి, ''అయ్యా, ఎవరో భాగ్యవంతురాలు, మీ అక్కయ్యగారే ఉండవచ్చు, ఇప్పుడే, కొంచెంసేపటికి ముందే, ఆకోడుగల్లు బసవడున్నచోటికి నడిచివెళ్ళినారు.'' అని తెలిపినారు. ''అదెక్కడ?'' అని ఆత్రంగా ప్రశ్నించినాడు కుమారుడు. ''అదిగో, ఆ వైపు'' అని వారు వేలు చూపినారు. కుమారుడు ఆ వైపు పరిగెత్తినాడు. కుమారుని భయాందోళనలను చూచి ఆ గ్రామీణులూ ''ఆ భాగ్యశాలినికి ఏమయిందో?'' అని భయపడి, కుమారుని వెంట తామూ వెదకడానికి తోడ్పడడం కోసం పరిగెత్తి వచ్చినారు.



కోడుగల్లు బసవడున్న చోటికి వచ్చినాడు కుమారుడు. అక్కడా చుట్టుపట్టు పరికించినాడు. పర్వతమే అదిరేటట్టు ''అక్కా—అక్కా—అక్కా—'' అని అరచినాడు. ఆ పెనుకూతకు కొండలోని ప్రతిరాతి సందులోను, బండలనడుమా, అడివారంలోని ఊళ్ళలోను, బయళ్ళలోను, ప్రతిధ్వనులు బయలువెడలినవి. ఉత్తరం మాత్రం లేదు. అప్పుడు కుమారుని ధైర్యం భగ్నమయినది. వణుకుతున్న ధ్వనితో ''ఈ వైపు వచ్చినదా? మీరు చూచినారా?'' అని గ్రామవాసులను అడిగినాడు. ''ఔనయ్యా, ఈ వైపే వచ్చినారు.'' అని సమాధాన మిచ్చినారు గ్రామవాసులు. ''మీ ఈ పిలుపు, ఆమె ఎక్కడున్నా వినబడవలసినదే.'' అనిన్ని అన్నారు. కుమారుని తల తిరిగినది; కాళ్లు కుసిపడిపోయినవి. అతడు వారిని ''ఈ కొండమీద క్రూరమృగాలేమైనా ఉన్నవా?'' అని ప్రశ్నించినాడు. ''అలాటివేమీ లేవయ్యా. ఉన్నా ఇంతపొద్దుకు అవి వెలుపలికిరావు.'' అన్నారు వారు. కుమారునికి సహనం తప్పినది; చాల భయం కలిగినది. ''అక్కయ్య ఎక్కడికి పోయినది?'' అని బండనుంచి బండకు పరుగెత్తుతూ, దిక్కు దిక్కులా గుండె పగిలిపోయేట్టు కూతపెట్టినాడు. ఇప్పుడు గ్రామవాసులకూ ''ఆమె ఏమయినదో!'' అనే భయం పుట్టినది. కుమారవిష్ణువు బండనుంచి బండకు పరిగెత్తుతున్నప్పుడు అతని కాళ్ళలోని బంగారు తోడాలను గ్రామవాసులు చూచినారు. కుడికాలి తోడానుంచి వ్రేలాడే ముత్యాల గుత్తులనూ చూచినారు. అప్పుడు వారికి ''వీరు మహారాజుగారే కావచ్చు'' అని తోచినది. భయభక్తులతో కుమారునికి నమస్కారంచేసి, అతనితోపాటు తామూ వెదుకసాగినారు.

గ్రామవాసుల గుంపులోని ఒక బాలుని సూక్ష్మదృష్టికి నూరు హస్తాల కింద పడిన స్త్రీ శరీర మొకటి కనిపించినది. అప్పుడు వాడు ''అదిగో! అదిగో!...అక్కడ!'' అని కిందివైపు చేతితో చూపినాడు. అందరిచూపూ ఆవైపు పరిగెత్తినది. గ్రామవాసులూ ఉత్తమ వస్త్రాలంకృతమైన ఒక స్త్రీ శరీరం అక్కడ పడి ఉండడం చూచినారు. కుమార

విష్ణువూ చూచినాడు. "తన అక్కయ్య పోయినది" అని అతని హృదయం అక్కడే నిశ్చయించినది. ఆ క్షణమే, "అక్కయ్యా, ఇదిగో నేనూ వచ్చినాను" అంటూ ఒకే దూకుతో తన అక్కయ్యను చేరుకున్నాడు.

గ్రామవాసులకు నోటమాటరాలేదు. కళ్లుమూసి తెరిచే లోపుగా ఈ దురంతం వారి కన్నులముందే జరిగిపోయినది. కుమారుడు అరనిమిషం కూడ నిదానించలేదు. నిలబడి ఆలోచించలేదు, వెనుకముందు చూడలేదు. అక్కయ్య పోయినదని అతని మనస్సుకు ఎప్పుడు తెలిసిందో ఆ క్షణమే అతడూ వెళ్ళిపోయినాడు. "ఆమె ఎవరో పాపం! కాలుజారిపడి మరణించి ఉంటుంది. ఆమె తోబుట్టువులయిన ఈ మహారాజులుగారు ఆ దుఃఖంతో తామూ దూకి ప్రాణాలు పోగొట్టుకున్నారు." అనుకున్నారు గ్రామవాసులు. వారికి చాల దుఃఖమయినది; చాల బాధ కలిగినది; "అయ్యో! అయ్యో!" అని దుఃఖంతో, భయంతో అరుస్తూ, వారు త్వరత్వరగా కొండదిగి శివగంగ గ్రామానికి పరిగెత్తినారు. గ్రామవాసులలో ఇద్దరు పురుషులు నెమ్మదిగా ఆ ఇరుకుల్లోనే దిగి, ఆ రెండు శరీరాలూ పడిన స్థలంచేరి, ఎవరికైనా ఊపిరి ఉన్నదేమో చూచినారు. మరణించిన స్త్రీ మహాలక్ష్మీదేవివలె ఉన్నారు. తల ఒకపక్క దెబ్బని గుజ్జుగుజ్జయి రక్తం విపరీతంగా స్రవించినది. రాజుగారూ పడినవెంటనే, ఒకటి రెండు సార్లు కాళ్లు చేతులు జాడించి చల్లబడినారు. అక్కయ్య కళేబరానికి ఏడుహస్తాల దూరంలో రాజుగారి శరీరం పడిఉంది. ఇద్దరు గ్రామవాసులూ ఆ ఘోరదృశ్యంచూచి, గుండెపగిలి, కన్నీరు కారుస్తూ మూగవారివలె నిలబడి పోయినారు.

కొండదిగిన గ్రామవాసులు "రాజుగారూ, వారి అక్కగారూ కొండమీదినుంచి పడి మరణించినారు" అని శివగంగ ఊరిలో వార్త వ్యాపింపజేసినారు. రథం నడిపించుకొని వచ్చిన సారధి ఆ వార్తవిని అక్కడే దిగజారిపోయినాడు. "అయ్యో! వారు మా శాంతలా మహారాజ్ఞిగారు, వారు కుమారవిష్ణువు." అని ఎలుగెత్తి విలపించినాడు. విడిది అధికారి పరుగులో వచ్చినాడు. ఒకే నిమిషంలో ఊరి జనమంతా పరుగెత్తి వచ్చినారు. ప్రెగ్గడ, గ్రామ రక్షకులు, ఇతరాధికారులు అందరూ



పరిగెత్తి వచ్చినారు, "ఎక్కడ? ఏ ప్రక్క? ఇద్దరూ కాలుజారినారా? అయ్యో! ఇంకేమిగతి?" అంటూ కొండయెక్కి కళేబరాలున్న స్థలానికి వచ్చినారు. ఆ గ్రామవాసులిద్దరూ దుఃఖపడుతూ అక్కడే కాచుకొని కూర్చున్నారు.

అతి పరితాపకరమైన ఈ దృశ్యంచూచి ఆ బాలవృద్ధం అందరూ దుఃఖించినారు. వారికి దుఃఖం పొంగివచ్చినది. "శాంతలా మహారాజ్ఞి గారు కాలుజారిపడి మరణించినారా? అయ్యో! దేశానికి ఎంతటి దుర్దినమిది? అక్క మరణంచూచి ఈ పుణ్యాత్ముడూ ప్రాణాలు వదలినాడా? గంగాధరేశ్వరా, నీ సేవకోసం వచ్చిన వీరికి ఈ ఫలమా? ఈ ప్రాప్తమా? అయ్యో! విష్ణువర్ధనులవారు ఈ దుఃఖాన్ని ఎలాగు సహిస్తారు?" అని విలపించినారు. కన్న తల్లిదండ్రులను పోగొట్టుకొన్నట్టు దుఃఖపడినారు ఆజనం.

ఇంతలో సారధి, విడిది అధికారి-మాట్లాడుతున్న వారు-తత్క్షణం కొండశిఖరానికి బయలుదేరినారు. ఆ వైపు నిలబడిన ఇద్దరు గ్రామవాసులు వారి సంకల్పం ఊహించి, వారిని ఆపి, "అయ్యో, మీ రెక్కడికి?" అని ప్రశ్నించినారు. సమాధానం రానందున ఆ గ్రామవాసులు వారిని బలంగా పట్టుకొని, ఆపి, అక్కడున్న ఇతరులకు వినబడేటట్టు పెద్దగా "అయ్యా, అయ్యా, వీరూ ప్రాణాలు వదలడానికి వెళ్లుతున్నారు. నిలపండి." అని కేకలు వేయగా, జనం పరిగెత్తివచ్చి వారిని ఆపినారు. సారధి, విడిది అధికారి "మమ్ముల్ను వదలిపెట్టండి. ఇక మేము తిరిగివెళ్ళి ప్రభువులకు మా ముఖాలు చూపలేము. మమ్ములు ఆపకండి. మీకు కోటి పుణ్యాలు." అని వేడుకొన్నారు. ప్రెగ్గడలు "చాలుచాలు. ఈ అనాహూతాలు ఇక చాలు. దీనిని మేము అడ్డగిస్తాము. ఖండితంగా అవకాశమివ్వము. చెప్పండి, మీకు ఈ విషయంలో ఏమైనా తెలిసిఉంటే." అని ప్రశ్నించినారు. వారు "లేదు...లేదు...యాత్రకని నవ్వుతూ నవ్వుతూ సంతోషంతో వచ్చినారు. ఇప్పుడు..."అనినారు.

మహారాజ్ఞి కోడుగల్లు బసవణ్ణను ప్రదక్షిణం చేస్తున్నప్పుడు కాలు జారికాని, లేక ఎండ వడకు తలతిరిగి కన్నులు చీకట్లుకమ్మి పడిపోయి

కాని ఈ అన్యాయం జరిగి ఉంటుంది. అక్కయ్యగారు ఇలాగు కావడం చూచి కుమారుడూ కలిసే వచ్చినవారు కలిసే వెళ్ళినారు." అని జనమంతా నమ్మినారు. గ్రామాధికారులు తమ ముందు కర్తవ్యమేమని యోచించినారు. దుఃఖభరితమైన ఆ హృదయాలకు ఏ యోచనా తోచలేదు. అక్కడున్న వయోవృద్ధుడొకడు "అయ్యో, మనమేమీ చేయరాదు. దీనికి మనకు అధికారంలేదు. ప్రభువులకు ఈసమాచారం పంపేవేళకు ఈ కళేబరాలనే అక్కడికి పంపవచ్చు. అది సాధ్యమా అన్నదానిని యోచించండి." అన్నాడు. ఇదే సరైన యోచన అని అందరూ ఒప్పుకొన్నారు. అప్పుడు ప్రెగ్గడ సారథిని, విడిది అధికారినిచూచి "ఇదిగో, ఈ కళేబరాలను సాధ్యమైనంత శీఘ్రంగా తీసుకొనివెళ్ళి ప్రభువులకు అప్పగించండి. అనంతరం మీ అంతరాత్మ ఎలాగు సూచిస్తే అలాగు చేయండి. ఇది మీ కర్తవ్యం. దీనిని నెరవేర్చకపోతే రాజశాపం మిమ్ముల్ని జన్మజన్మాలకూ విడువదు. దీనిని దైవమూ ఒప్పదు. మృతుల శరీరాలను ప్రభువులకు ఒప్పించండి. మృతుల బంధుమిత్రులకూ సమాచారం తెలుపండి." అనినాడు. దీనికి వారిద్దరూ ఒప్పక తప్పలేదు.

పిదప ఊరినుంచి రెండు ఊయాల తొట్లను, బోయీలను పిలిపించినారు. హొన్నావని ఆలయంనుంచి ఉత్తమ దుకూలం తెప్పించినారు. ముత్తైదువులు పసుపు కుంకుమలతో, పుష్పాలతో శాంతల కళేబరాన్ని అలంకరించి, ఆ ఉత్తమ దుకూలంచుట్టి, కన్నీటి పుష్పాలతో ఊయాల తొట్టెలోపెట్టి నమస్కరించినారు. పురుషులు కుమారుని కళేబరాన్ని రెండవ తొట్టెలోపెట్టి చేతులు జోడించినారు. బోయీలు నమస్కరించి, తొట్ల పగ్గాలకు వెదురుగడలు దూర్చి, ఊతకొయ్యలు పట్టుకొని, జాగరూకతతో అడుగులు పెడుతూ, నెమ్మదిగా కొండ దింగడానికి ఆరంభించినారు అందరూ కొండ దిగినారు.

వీరు శివగంగగ్రామం చేరగానే, ఊరికి ఊరేవచ్చి, బాష్పాంజలి ఇచ్చినది. కాలవిలంబం కాకుండా, కళేబరాలను రథంమీదికి ఎక్కించి, అవి వెలుపలికి పడిపోకుండా, వెదురు దబ్బలను అడ్డంగా కట్టినారు. ప్రెగ్గడలు సారథినిచూచి, "సాధ్యమైనంత త్వరలో, చీకటిపడేలోపుగా



నీవు రాజధాని చేరవలె. గవ్యూతి గవ్యూతికి గుర్రాలుమార్చే ఏర్పాటు ఉన్నదని విడిది అధికారి చెప్పినాడు. మేమూ మరొకరథంలో మీ వెంట వస్తాము." అని చెప్పినారు. విడిది అధికారి రథమెక్కి కళ్ళముందున్న దుఃఖదృశ్యం చూడలేక ముఖంమీద బట్ట కప్పుకొని కూర్చున్నాడు. రథం వేగంతో బయలుదేరినది. గవ్యూతి వెళ్ళినపిదప అక్కడి కొత్త గుర్రాలను రథానికి పూన్చడమైనది. అక్కడి గుర్రాల కావలివాడు "ఊరికి రావడానికి ఆనతి అయినదా?" అని అడిగినాడు. తొందరలోఉన్న సారథి "ప్రభువులనుంచి సమాధానం వచ్చేవరకు ఇక్కడే గుర్రాలను కాచుకొని ఉండు." అని చెబుతూ, రథాన్ని వేగంగా తోలినాడు.

వేలాపురి దగ్గర అయినకొద్దీ సారథి దుఃఖం ఎక్కువయినది. తన తలవ్రాతను నిందించినాడు. "పాపిగుర్రాలూ, మీరు జన్మాంతరంలో ఏ పాపంచేసి ఈ జన్మానికి వచ్చినారో! అలాంటి దేవిని, అలాంటి మహానుభావుణ్ని యాత్రకు తెచ్చిన మీరు, ఇప్పుడు వారి కళేబరాలను మోసుకొని పోతున్నారే? మీకు దీని జ్ఞానమేలేదా? మీకు ప్రాణాలులేవా? ఆత్మలేదా? తెలివితేటలనేవి లేవా? మీకు కొడితే నొప్పి అవుతున్నది కదా? అలాగే ఇతరులకు మనసు నొప్పయితే మీకూ నొప్పి కలుగదా? మీ పిల్లకు నొప్పయినప్పుడు మీకు దుఃఖం కలుగడం లేదా? కలుగుతుంది. అలాగే ఇతరులకు దుఃఖమయినప్పుడు, సంకటమయినప్పుడు, మీకు దుఃఖం కలుగదా? అథవా, ఈఅనుకంప మనుష్యునికి మాత్రమేఉన్నదా? ఇది లేనివాడు మీ వలెనే ఒక మృగం." అని దుఃఖభరంలో మాట్లాడుకొంటూ, ఆత్మనింద చేసుకొంటూ, "త్వరగా నడవండి." అని గుర్రాలను అదరించినాడు. అవి ప్లుతగతితో రథం లాగుకొని పరుగుతీసినవి.

సాయంకాలమయినది. గుర్రాలను పలుమారు మార్చడమూ జరిగినది. చీకటి పడుతూ వచ్చినది. వెలుతురు లేకపోయినప్పటికీ గుర్రాలు తమ సూక్ష్మదృష్టితో దారిపట్టి పరుగెత్తినవి. సాయంకాలమయి రెండు గడియలకు రథం వేలాపురి ఎల్లలు చేరినది. ఊరుదగ్గరికి వచ్చినప్పుడు సారథి ఊపిరీ ఎగిరిపోయినది. గుర్రాలు అభ్యాస బలంతో రథాన్ని లాగుకొని పోయి నగరు మహాద్వారం చేరి ఆగినవి.

శివగంగ నుంచి రథం తిరిగివచ్చినదని వాకిలి కావలివాడు తన నాయకునికి తత్క్షణమే పోయి తెలిపినాడు. నాయకుడు లోపల సర్వాధికారికి వెళ్ళి మనవి చేసినాడు. సర్వాధికారి వెలిగించిన దివిటీని చేతపట్టుకొని రథం వద్దకు వచ్చినాడు. సారథి తన స్థానంలో శవమై దొర్లిపడిఉన్నాడు. రథంనుంచి దిగిన విడిది అధికారిని సర్వాధికారి గుర్తుపట్టినాడు. విడిది అధికారి కన్నులనుంచి నీటిధార పారసాగినది. వాడు సర్వాధికారి ముఖం చూచి నిరాశతో తల ఊపినాడు. గొంతునుంచి ధ్వని వెలువడడమే కష్టమయినది. వాని అవస్థను సర్వాధికారి చూచి, "అయ్యా, రథంలో పడుకున్న వీరెవరు? నీవెందుకు విలపిస్తున్నావు? సారథి ఎలాగు మరణించినాడు? దొంగలా? ద్రోహులా? ఎక్కడ అడ్డుపడినారు? ఏమైనది? దేవిగారు ఎక్కడ? కుమారులవారు ఎక్కడ?" అని పైపైన పెక్కు ప్రశ్నలు వేసినాడు.

"అయ్యా, నేను హెచ్చుగా ఏమీ చెప్పలేను. ఊపిరే ఆడడంలేదు. సమాచారం చెప్పి చచ్చిపోదామని ప్రాణాలు బిగబట్టుకొని నిలుపుకొన్నాను. దొంగలు, ద్రోహులూ ఎవరూ కారు. మహారాజ్ఞిగారు, కుమారులవారు నేడు శివగంగ కొండ ఎక్కినారు. మహారాజ్ఞిగారికి దప్పి అయినది. కుమారులవారు నీరు తెచ్చేలోపల దేవిగారొక్కరే కొండశిఖరమెక్కి, అక్కడెక్కడో కాలుజారి అక్కడినుంచి దాదాపు నూరు హస్తాలు కిందపడి కాలధర్మం చెందినారట...నీరు తెచ్చిన కుమారులవారు దేవిగారికి వెదికి, కొనకు కిందపడి కాలధర్మం చెందడం చూచి, తామూ ఆక్షణమే, అక్కడినుంచి దూకి...వారి కళేబరాలు రథంలో. సారథి ఎప్పుడు, ఎలాగు చచ్చినాడో, గుర్రాలే రథాన్ని ఎలాగు లాగుకొని వచ్చినవో నేను ఎరుగను. పోచలదేవిగారికి, మహారాజ్ఞి తల్లిదండ్రులకు తెలుపండి. ఇక నాపని ముగిసినది." అంటూ ఆ దుఃఖ సమాచారం చెప్పిన తననాలుకను తానే కొరుకుకొని రెండు తుంటలు చేసుకొని ఉమ్మివేసి, అక్కడే ఉన్న రాతిస్తంభానికి తన తల బలంగా కొట్టుకొన్నాడు. వాని తలకాయ చీలి మెదడు వెలుపల పడినది. తత్క్షణం వాడు కిందపడి మరణించినాడు.



సర్వాధికారి "అయ్యో! అయ్యో!" అంటూ దిక్కుతోచక వగచు లోపలికి పరుగెత్తినాడు. ముందున్న విశాలమైన సభాభవనంలో ప్రభువులు ఒక తగ్గుగా ఉన్న పీఠంపై ఆసీనులై వేలాపురి నగర రక్షకునితో ఏదో మాట్లాడుతున్నారు. ఆనాడు సోమశేఖరుని దినం కనుక ప్రభువులు నిరాహారవ్రతులయి ఉన్నారు. లక్ష్మీదేవి అంతఃపుర పూజాగృహంలో ఏదో కార్యంలో నిమగ్నురాలై ఉన్నది. సర్వాధికారి 'అయ్యో!' అన్నకేక ప్రభువులకు వినిపించి, వారు ఆకేక వినిపించిన వైపు తిరిగి చూచినారు. సర్వాధికారి భయంతో దిగ్భ్రాంతునివలె పరిగెత్తివచ్చి ప్రభువులకు సాగిలపడి, ముఖం పైకెత్తి చూడలేక, విడిది అధికారి తనతో చెప్పినదంతా మనవి చేసినాడు. రెండు క్షణాలు ప్రభువులు కూర్చున్నచోటే స్తంభించిపోయినారు. తరువాత ఏమి తోచినదో, తత్క్షణమే లేచి, ఎప్పుడూ తమ వద్దనే పెట్టుకొనే చిన్న పేటికను పెట్టిన స్థలంనుంచి పైకితీసి, దానిలోని చిన్న వెండి సంపుటాన్ని చేతిలో పట్టుకొని, లక్ష్మి ఉన్న పూజాగృహం వైపు బిరబిర నడిచినారు. లక్ష్మి అక్కడే ఉన్నదని వారికి తెలుసు. కొంచెముందే దంపతులిద్దరూ పూజను ముగించినారు; ప్రభువులు ఇవతలికి వచ్చి నగరరక్షకునితో మాటలాడ సాగినారు. కనుక లక్ష్మి పూజాగృహంలోనే ఉండవచ్చునని ప్రభువులు భావించినారు. లక్ష్మి పూజాగృహంలోనే ఉన్నది. ప్రభువులు ఈవిధంగా తొందరగా దయచేయడం చూచి పూజాగృహంలో లక్ష్మితోపాటు ఉన్న దాసీజనం భయపడి వెలుపలికి వచ్చి నిలిచినారు. ప్రభువులు "లక్ష్మి! లక్ష్మి!" అని గట్టిగా పిలుస్తూ పూజాగృహం ప్రవేశించినారు. లక్ష్మి ప్రభువుల ఆందోళన చూచి నోట మాటరాక నిలుచున్నది. "లక్ష్మి! ఇక్కడికి రా. నోరు తెరు. ఈ చూర్ణం మింగు." అని అన్నారు ప్రభువులు. లక్ష్మి దగ్గరికి వచ్చి నోరు తెరచి, బొమ్మవలె నిలబడినది. ప్రభువులు వెండి సంపుటంలోని చూర్ణం ఆమె నోటిలో వేసి, దగ్గరిలోని అభిషేకపాత్రలో ఉన్న తీర్థం రెండు గుటకలు ఆమె నోటిలోకి వంచి "మింగు, మింగు లక్ష్మి! మింగు." అనినారు. లక్ష్మి మింగినది.

"మింగినాను దేవ!"

"కళ్లు మూసుకో, లక్ష్మి."

"మూసుకొన్నాను, దేవ!"

"భయపడకుండా ఉండు, లక్ష్మీ. వేరే మార్గంలేదు."

"అర్థంకాలేదు స్వామీ."

"ఒక్క క్షణంలో తెలుసుకొంటావు. ఈ కుశాసనంపై కూర్చో."

ప్రభువులు లక్ష్మిని చేయిపట్టుకొని కూర్చోపెట్టినారు. చేతులతో నొసలును, తలను నిమిరినారు. ప్రభువుల చేయి అప్పుడు అస్తిమితంగా ఉండడం లక్ష్మికి అర్థంకాలేదు. ఔషధం అంత తీక్ష్ణమయినది. రెండు నిమిషాలలో లక్ష్మి కడుపులో తీక్ష్ణజ్వాల లేచినది. మరొక నిమిషంలో ఆజ్వాల శరీరం వ్యాపించి శిరస్సుకు ఎక్కినది. లక్ష్మి అన్నది: "కడుపులో నిప్పుపెట్టినట్టు మండుతున్నది స్వామి!"

"మరి రెండుగుటకలు నీరు తాగు."

నీరు తాగినది.

"కాళ్లు చేతులు తేలిపోతున్నవి. తల తిరుగుతున్నది.

ప్రభువులు లక్ష్మిని చాపమీద నెమ్మది నెమ్మదిగా పండుకోబెట్టి కంటి రెప్పలు విడిపించి, కండ్లలో కండ్లుపెట్టి స్వల్పకాలం చూచినారు. కంటి మధ్యన నల్లపాప రానురాను చిన్నదవుతూ వచ్చినది. ప్రభువులు ఇంకా ఒక నిమిషకాలం అలాగునే చూస్తున్నారు. అనంతరం ఆమె కండ్లను మూసివేసినారు. ప్రభువులకు ఎంత దుఃఖమయినదో! పూజా విగ్రహరూపుడైన నారాయణుని అతి దైన్య దృష్టితో చూచినారు: "ఇంత క్రూరశిక్షకు నేను ఎలాగు పాత్రుడయినాను ప్రభూ?" అని. వెలుపల నిలబడిన దాసీజనంలో ఇద్దరిని లోపలికి పిలిచినారు. వారు వణుకుతూ వచ్చి నిలబడినారు. వారిని చూచి ప్రభువులు "మీరు భయపడ కూడదు. మీ రిప్పుడు భయపడి ధైర్యం చెడితే, లక్ష్మి మరణిస్తుంది; ఖండితంగా మరణిస్తుంది. లక్ష్మి బదుకవలెనని ఉంటే, ఇదిగో, మేము చెప్పేమాటలు శ్రద్ధగా వినండి. ఇది మూర్ఛ. మూర్ఛవచ్చే ఔషధం ఇచ్చినాము. దీని నిప్పుడు అత్యావశ్యకంగా ఇవ్వవలసి వచ్చినది. ఈ మూర్ఛ ఇంకా అర్ధదినమంతా అలాగునే ఉంటుంది. ఇప్పుడు మీకర్తవ్య



మేమని తెలుసుకోండి. ఇదిగో! ఈ మాత్రను చాల జాగ్రతగా ఉంచుకొని, జాముజామునకు తప్పక ఒకసారి శుద్ధమైన గంధపురాతిపై లఘువుగా పైపైన—అరచేయి వెడల్పు చుట్లు పదిహేను చుట్లు, పదిహేను చుక్కలు పాలలోగాని, లేక పదిహేను చుక్కల నీటిలోగాని రాచి, ఆ లేపాన్ని లక్ష్మి నాలుకమీద పూసి, రెండు మూడు గుటకల నీరు మెల్లమెల్లగా గొంతులోకి పోసి మింగునట్టు చేయండి. ఈ విధంగా జాము జాముకొకమారు—నాల్గుసార్లు చేయవలె. జ్ఞాపకం ఉండనీ. నాలుగుసార్లు. జాగ్రత. మరొకసారి చెబుతాను, గమనించండి. అరచేతి వెడల్పుచుట్లు. పైపైన తేలికగా పదిహేనుచుట్లు. పదిహేను చుక్కల పాలలోగాని, నీటిలోగాని. ఒక జాము కొకమారు. నాల్గుసార్లు. తెలివి వచ్చిన తర్వాత సుఖోష్ణమైన తేనె పాలు. ఆహారం అడిగితే లఘ్వాహారం; పండ్లు. లక్ష్మిని మీ చేతికి అప్పగించి వెళ్లుతున్నాము. ఇది ఎందుకు? ఏమి?—అని అడగకండి. ఆమెను నిలుపుకొనే భారం మీది." అని చెప్పి మాత్రను వారికి ఇచ్చి తాము ముందుకూర్చున్న చోటికి వచ్చినారు.

నాల్గైదు మంది పరిచారికలు శాంతల కళేబరం రథంనుంచి నెమ్మదిగా దింపి, ఏడుస్తూ, దానిని మోసుకొని వచ్చి ప్రభువుల ముందు ఉంచినారు. ఆ పరిచారికలు దుఃఖంలో కన్నీరు ధారగా కురిపిస్తున్నారు. శోకంతో, భయంతో వారు వణికిపోతున్నారు. వారు కళేబరంపై కప్పిన దుకూలాన్ని విడిపించి, ముఖాన్ని వెలుగుకు జరిపినారు. పరిచారిక లిప్పుడు వెకివెక్కి ఏడ్వసాగినారు. ప్రభువుల ఎదుట ఈ పరిచారికలు ఎప్పుడూ తలయెత్తి చూచినవారేకాదు. ఇప్పుడు దుఃఖభరంలో అంతా మరచినారు. వారి రోదనధ్వని కూడ ఎక్కువయినది.

ప్రభువులూ శాంతలముఖం చూచినారు. ముఖంలో ఆ వర్చస్సులేదు; ఆ తేజస్సు లేదు; ఆ సౌందర్యం లేదు; ఆ మార్దవం లేదు. సదా చిందులాడే మందహాసం లేదు. ముఖమిప్పుడు వివర్ణం; విగతలక్షణం. ఒళ్ళు చేతులు కూరుకొని పోయినవి. ఆకారమేలేని ఒక ముద్దవలె ఉన్నది. ప్రభువులు ఆ దాసీజనాన్ని చూచి "మీరు ఇలాగు గట్టిగా ఏడువరాదు. లక్ష్మి మేల్కొనివస్తే మరొకఘోరం జరుగుతుంది. లక్ష్మికోసం దయచూపండి.

వెలుపలికి వెళ్ళి దుఃఖించండి." అనినారు. అప్పుడు ఇద్దరు సేవకులు కుమారుని కళేబరం తీసుకొనివచ్చి, అతని అక్కయ్య కళేబరం ప్రక్కన పెట్టి, ముఖానికి కప్పిన గుడ్డను తీసినారు. ప్రభువులు కుమారుని ముఖం చూచినారు; మోసుకొని వచ్చినవారూ వెలుగులో చూచినారు. దాసదాసీజనులూ చూచినారు దాసీజనం మరింత ఘోరంగా రోదిస్తూ వెలుపలికి వెళ్ళి నిలబడినారు. అక్కడ ఉన్నవారందరూ పురుషులే అయినప్పటికీ దుఃఖంలో స్త్రీలయినారు. ప్రభువుల కన్నులలోమాత్రం నీరు ఊరలేదు. లోలోపల ఒడబాగ్ని రగిలినది.

ప్రభువులు మెడయెత్తి ఒక్కమారు సర్వాధికారిని చూచినారు. ప్రభువుల మనస్సును గ్రహించిన సర్వాధికారి గద్గద కఠంతోనే, "హేమాద్రి, అచ్యుత, గోవింద, వీరదేవామాత్యులకు, సోవలదేవిగారికి, మహారాజ్ఞిగారి తల్లిదండ్రులకు మనవి పంపినాను ప్రభూ." అని విన్నవించినాడు. తమ మనస్సులోని ప్రశ్నకు సమాధానం వచ్చినందుకు ప్రభువులు ఊరకున్నారు. ఒక విగడియతర్వాత ప్రభువులు "రథంతోలుకొని వచ్చినవాడు ఏడీ ? రథంలో ఎవరు వచ్చినారు?" అని సర్వాధికారిని ప్రశ్నించినారు. ప్రభువులధ్వని అతి దీనమయిపోయినది. కుంగిపోయినది. "ప్రభూ, సారథి దుఃఖంతో గుండెపగిలి తన స్థానంలోనే చచ్చి పడినాడు. బహుశః దారిలోనే మరణించిఉంటాడు. గుర్రాలు తమంతట తామే రథాన్ని ఇక్కడికి లాగుకొనివచ్చి నిలబడినవి. శివగంగకు వెళ్ళిన విడిది ఏర్పాట్ల అధికారి రథంనుంచిదిగి, నేను ఇదివరకే తమ సన్నిధానంలో మనవిచేసుకున్నంత మేర సమాచారం తెలిపి, తన నాలుకను కొరుక్కొని ముక్కలు చేసుకొని, తలను రాతి స్తంభానికి మోదుకొని పగులగొట్టుకొని, మరణించినాడు." అని సర్వాధికారి ప్రభువులకు తెలిపినాడు.

ప్రభువుల దుఃఖం మరింత హెచ్చయినది. తమ రెండుచేతులతోను ముఖం మూసుకొని, తల వంచుకొనినారు. రెండు క్షణాలతర్వాత దుఃఖపూరిత ధ్వనితో, "సారథి కళేబరాన్ని, విడిదిఏర్పాట్ల అధికారి శరీరాన్ని వార ఇండ్లవారికి అప్పగించండి. దహన సంస్కారాలకు అయ్యే వెచ్చం బొక్కసంనుంచి ఇప్పించండి. ఇరవై ఇరవై పల్లాల రాజమాన్య ఖండ్రికలను వారికి వంశ పారంపర్యంగా శూన్యమాన్యంగా ఇవ్వండి." అని ఆజ్ఞాపించినారు. ఇతరుల దుఃఖమూ తమ దుఃఖంకన్నా తక్కువది కాదని తెలిసిన ఆ మహాప్రభువులు.



అంతఃపురంలో ఉన్నవారందరూ వచ్చి, మృతుల కళేబరాలను చూచి, బాధ తట్టుకోలేక, ప్రభువుల ఎదుట గట్టిగా విలపించడానికి భయపడి, వెలుపలికి వెళ్ళి వికారంగా ఏడుస్తూ నిలబడినారు. ప్రభువుల దుఃఖం ఈ ఆక్రందనం విని ఇంకా ఎక్కువయినది. అప్పుడువారు సర్వాధికారితో "ఈ సమయంలో అంతఃపురంనుంచి ఎవరినీ వెలుపల, ఊరిలోకి వెళ్ళడానికి వదలకండి. ఈ రాత్రి ఊరికిఊరే ఇక్కడక వచ్చేని. వీడిచే వారికి చెప్పండి—ఇక్కడ ఇంత ధ్వనిలో ఏడువరాదని, లక్ష్మీదేవిగారికి తమ అక్కయ్య మరణమింకా తెలియదు. తెలియరాదు. ఆమె ఈ సద్దువిని ఇక్కడికివస్తే, మరొక మరణమయ్యాని. మా పైన ఈనాడు అందరూ దయదలచమని చెప్పండి. లక్ష్మీదేవిగారు పూజాగృహంలో ఉన్నారు. వీరెవరూ ఆవైపే అడుగు పెట్టరాదని చెప్పండి. ఊరిలోని వారెవరినీ నగరులోనికి వదలకండి. సోవలదేవి, అమాత్యులు, మా అత్తమామలు, వీరితోపాటు రాజధాని నుంచి వచ్చినవారు మాత్రం లోపలికిరానీ. వారికి కూడ వాకిటిలోనే తెలుపండి, లోపలికి వచ్చిన పిదప మా దుఃఖాన్ని హెచ్చు చేయరాదని. శివగంగనుంచి వచ్చిన రథం అలాగే ఉండనీ. మేము వచ్చి చూస్తాము." అని అతి దుఃఖ ధ్వనితో ఆనతిచ్చినారు ప్రభువులు.

దాదాపు అరగడియలో అందరి ఆక్రందన ధ్వని తగ్గినది. దుఃఖం హృదయాలలోపలే ఉడుకుతున్నది. అంతఃపుర వాతావరణం వికారంగా పరిణమించినది. దుఃఖవర్షం మాత్రం సంతతధారగా కురిసినది. శబ్దం తక్కువ.

ప్రభువుల దుఃఖం ముఖం మూతపడిన జ్వాలాముఖి (అగ్నిపర్వతం). కాని నీరైన దుఃఖం లోపలే ఉడుకుతున్నది. పొంగిపొంగి పైకివస్తున్నది. వెలుపలికి రావడానికి ఘోరసంయమం ఆటంకమయినది. అయితే ఎంత సేపు ? లోపలివేడి ఎక్కితే, ఎలాటి సంయమాన్నయినా చీల్చుకొని వెలు

వదే శక్తి దుఃఖానికి ఉన్నది. ప్రభువులు కఠిన హృదయులుకారు. చాల అనుకంపగల హృదయంవారిది. "కుమారవిష్ణువును చూచే వరకు తిండి తీర్థం ముట్టవద్దు." అని, అప్పుడే గతించిన తల్లి కళేబరపు అగ్ని సంస్కారమూ మరొకరికి అప్పగించి, కుమారుని కాపాడడానికి బయలు వెడలిన హృదయంకదా అది? యుద్ధానికి బయలుదేరినపుడు తమ శాంతల ముఖం వాడి ఉండడంచూచి, "దేవి నియమనిష్ఠలతో వ్రతోపవాసాలతో దేహం ఒక్కచెక్కలు చేసుకోవద్దు. అది మాకు దుఃఖం కలిగిస్తుంది. కన్నీరు పెట్టవద్దు. నీ కన్నీరు స్రవిస్తే, నా హృదయ రక్తం స్రవించీని." అన్న హృదయంకాదా అది?

ప్రభువులు రెండు కళేబరాలనూ చూస్తూ కూర్చున్నారు. కుమారుని ఉపనయన దినం తలపులో మెరిసినది. శాంతల అప్పుడు కన్య. ఆ మెనా, లక్ష్మిని చూచిన మొదటి దినమది. అనంతరం వారిద్దరూ దేవకన్యలవలె నగరుకువచ్చి వీణ వాయించిన దినం. తమ తమ మనసులను వారిద్దరూ చూరగొన్న దినం. వారు దేవేరులై అంతఃపురాన్ని పరిపూర్ణంచేసి, తమ హృదయాన్ని పరిపూర్ణంచేసిన దినం. తమ భాగ్యరవి ఉదయించిన దినం. తమ విజయగళమాలిక, కేశవదేవాలయ నిర్మాణం, హృదయేశ్వరి ఆనంద నర్తనం, కుమారుని వివాహం, అశ్వమేధం, హిరణ్యగోగర్భం—అన్నీ ముగిసినవి. తమ కట్టెదుటే తమ జీవితమే మన్నై, మసనమై ముగిసినది. "ఈ దుర్మరణాలు నా కళ్ళముందు ఎందుకు? చూడు నీ జీవిత ఫలాలను!—అని విధి తమకు చూపుతున్నదా? నా మహాపరాధమేమి? నాతప్పు నాకు తెలియనీ. నా అపరాధం నాకు తెలియనీ. ఇలాటి దుష్కృత్యం ఏమి చేసినాను దైవమా? లేక ద్రోహంనే ధర్మమనే భావించి చేసినానా?" అంటూ ప్రభువులు ఇంకా వ్యథపడినారు. లోపలి సంకటం వెలుపలికిరాదు; లోపల నిలవదు.

రాత్రి మూడు జాములయినది. ఆ రెండు గడియలకాలం ఒక దీర్ఘ శోక యుగమయినది ప్రభువులకు. రానురాను ఇక నిమిషాలు గడపడమే దుస్సహమయినది. ప్రభువుల ఈ మానసంకటం చూచి, అధికారులు భయపడినారు. "ఒక్కమారు వారు అయ్యో అనరాదూ? రెండు చుక్కలయినా



కన్నీరు రాలరాదూ? వారి హృదయం ఛిద్రమయితే ఏమిటిగతి? భగవంతుడా ఇంకేమి విపత్తు?" అని తమలో తాను మాట్లాడుకుంటూ దుఃఖపడినారు.

మరిరెండు గడియలు గడిచినవి. సభాగృహంలో ఇప్పుడు ప్రభువులొక్కరే. వారి ముందు ఆ రెండు కళేబరాలు. అప్పుడు వెలుపల రథాలు వచ్చి నిలిచిన శబ్దమయినది. స్త్రీల ఆక్రందన ధ్వని ప్రభువుల చెవిని పడినది. సర్వాధికారి భయపడుతూ భయపడుతూ లోపలికివచ్చి, "ప్రభూ, అత్తమామలు, సోవలదేవిగారు, అమాత్యులు." అనినాడు. మనస్సెక్కడో ఉన్న ప్రభువులు గొంతెత్తి చూచినారు. సద్దుకూడదు అనే అర్థం వచ్చేటట్టు తమ పెదవులపై వేలుపెట్టి చూపించినారు. "ఆజ్ఞ" అంటూ సర్వాధికారి వెలుపలికి పోయి, ప్రభువుల ఆజ్ఞను వారికి తెలిపినాడు.

చేతులు జోడించుకొని అమాత్యులు మొదట ప్రవేశించినారు. వారి వెనుక మారసింగమయ్యగారు, మాచికబ్బె, సోవల, సోవల తల్లి ప్రవేశించినారు. ప్రభువులు లేవలేక కూర్చున్న స్థలంనుంచే అత్తమామలకు నమస్కరించినారు; వెంటనే తలవంచుకున్నారు. వచ్చినవారు కళేబరాలను దగ్గరికివచ్చి చూచినారు. ప్రభువుల ఈ మౌనాన్ని. ఆవలిరిచూచి మరింత భయపడినారు. దుఃఖం ఉమ్మగిల్లి ఉమ్మగిల్లి పైకివస్తున్నా గౌరవించి తీరవలసిన రాజాజ్ఞ. వీరందరిమీదా బరువుగా పడింది. మారసింగమయ్య దగ్గిరికివచ్చి కూర్చుని తన హృదయరత్నం పగిలి ముక్కలయి ఉండడం చూచినారు. వణుకుతున్న చేతులతో మంచువలె చల్లనైన తమ కుమార్తె ముఖం, నుదురు, తలనిమిరి, "మాతల్లి, నీశారద నిన్ను ఈరీతిగా పిలిపించుకొనినదా? గంగాధరేశ్వరుని మందిరానికి వెళ్ళిన నీకు ఈ విపత్తా?" అంటూ వేడి పన్నీరు ఒలికించినారు. మాచికబ్బె ఒక్కమారు కుమారుని చూచినారు; మరొకమారు కుమార్తెను చూచినారు. కుమార్తె ముఖం, ఒళ్లు అంతా తాకినారు; తడవినారు. "అక్కా, తమ్ముడూ మాట్లాడుకొనే బయలుదేరినారా? ఏదేవుడు మీకీబుద్ధి చెప్పినాడు? మృత్యువు అంత దూరం మిమ్ముల్ను పిలుచుకొనివెళ్ళి మింగినదా?" అని కూతురును తాకి, కదుపుతూ, "లే, నాతల్లీ. లే నాకూనా, లే. శారద పూజకు వేళయినది.

దేవయ్య ఇదిగో స్నానానికి నీరుతోడి పెట్టినాడు. పూలుకోసి పెట్టినాడు. లే నా తల్లీ. ఇదిగో, అయ్యగారు వచ్చినారు. ఒకే ఒక్కసారి కళ్ళు తెరచి మామ్మల్ని చూడు. అంతేచాలు. నీవు మరణించలేదు. వీరంతా అబద్ధం చెబుతున్నారు. లేపండి...ఎంత సేపు నిద్రపోతుంది ? లక్ష్మి వచ్చినది కదూ ? చూడులక్ష్మి !'' అని దగ్గరున్న సోవలనే లక్ష్మిఅని భావించి పలుకరించినారు. మాచికబ్బె. మాచికబ్బెబుద్ధి అస్తవ్యస్తమయినది. మారసింగమయ్య దుఃఖంలోను ఈ విషయం గ్రహించినారు. ఇక బుద్ధి భ్రమణం కావచ్చునని, గత్యంతరంలేక లేచి, పత్ని చేయిపట్టుకొని పైకి లేపి, ''మాచీ, ఇక సద్దుచేసి బిడ్డను మేల్కొలుపవద్దు. రా. మెలకువయినప్పుడు తానే లేవనీ. ఇప్పుడు పొద్దుపోయినదేముంది ? చూడు ఇంకా తెల్లవారలేదు.'' అంటూ పత్నిని ఉపాయంలో పక్కకు పిలుచుకొని పోయి, తత్క్షణమే శైత్యోపచారానికి ప్రారంభం చేసినారు.

అత్తగారి మతిభ్రమణంచూచి ప్రభువులకు హృదయంలో శూలాలతో పొడిచినట్టయినది. తలయెత్తి చూచినారు. ఎదుట సౌభాగ్యవతి సోవల మహాసతి అలంకారాలతో ఒప్పుతూ మౌనంగా నిలబడినది. దూరంలో మంత్రులందరూ తలవంచుకొని నిలబడినారు. సోవలకు ధైర్యం వచ్చినది. వెళ్ళి కళేబరాలమధ్య మోకాలు నేలమీదఊని కూర్చున్నది. తన అత్తయ్య చరణాలపై తల పెట్టినది. చాటన వ్రేళ్ళను చేతులతో తాకి కండ్లను ఒత్తుకున్నది. సోవల కండ్ల కొసలలో నీటి బిందువులు దీపాల కాంతిలో వజ్రాలవలె మెరసినవి. అనంతరం ఆమె పతికి కప్పిన, ప్రస్తుతం కాళ్ళపైఉన్న పచ్చడం ఇవతలికి లాగినది. పతి పాదాలపై తన ముఖం పెట్టినది. సోవల కన్నీరు ధారలు కట్టినది. సద్దులేదు. తన పతిచేతిని తల మీద పెట్టుకొన్నది; తన చెంపలకు, నొసటికి అదుముకొన్నది; తననోటికి ఒత్తుకొన్నది. కళ్ళకు అద్దుకున్నదు; పిదప లేచి నిలబడినది. తనను ఎవరూ కనికరించేవారే లేరా ?—అని చుట్టూ చూపు సారించినది. తన కన్నతల్లి అపార మూకవేదనతో తల వంచుకొని, చాల దూరంవెళ్ళి కూర్చున్నారు. తండ్రి వీర దేవామాత్యులూ, హేమాద్రి ప్రధానులూ, అచ్యుత గోవిందులూ దుఃఖంతో మూగవాౖరై, ఖిన్నులై గోడలు ఆనుకుని నిలబడినారు.



గొంతెత్తి ఏడ్వడానికి ఎవరికీ ధైర్యంలేదు. సోవలకు ఇప్పుడు కావలసినది సహృదయత కనికరం. దీనినంతా చూస్తున్న ప్రభువుల పురుషహృదయం కరగి కలగిపోయినది. సోవల దుఃఖం ప్రభువుల హృదయవ్యథను మీటి మీదికి పొక్కచేసినది. ప్రభువులు కుమార్తె ముఖాన్ని అనుకంపతో చూచినారు. ''అప్పాజీ, అప్పాజీ'' అని కూయిపెడుతూ సోవల ప్రభువుల గుండెలపైపడి గట్టిగా పట్టుకొనినది. మహా విపత్తునుంచి దైవవశాత్తుగా, అకస్మాత్తుగా రక్షణ పొందిన పసికందును కన్నతల్లి ఎత్తుకొని తన రొమ్ముకు అదుముకొన్నట్టు ప్రభువుల చేతులు ఆమెను దుఃఖంలో కుతకుతలాడే తమ హృదయానికి అదుముకొనినవి. పూవువంటి రెండు హృదయాలూ పరస్పర బాధతో ఏకమయినవి. సోవల దుఃఖానికిప్పుడు ధ్వని కలిగినది. అప్పటికి ప్రభువుల సంయమమూ విరిగి ముక్కలయినది. ఇద్దరి కన్నులలోను అశ్రు ప్రవాహాలు ప్రళయ కాలవాహిను లయినవి. ఈదుఃఖం అమాత్యులందరి కండ్లకూ మరల కొత్తదుఃఖం తెచ్చిపెట్టినవి. కన్నతండ్రి వీరదేవామాత్యులు తను పత్ని చందవ్వను సమాశ్వాసించడానికి వెళ్ళి తామే కన్నీరు కురిపించినారు.

సోవల ప్రభువులను తన కన్నతండ్రి వలె ప్రేమతో గట్టిగా కౌగిలించుకొని ''అప్పాజీ, అప్పాజీ'' అని వెక్కివెక్కి ఏడ్చినది. సోవల ప్రభువులను అలాగు సంబోధించినదే కాదు. ఆ 'అప్పాజీ' అనే పిలుపులో ప్రభువులకు కుమారుని ధ్వని వినిపించినది; అతని ఆత్మధ్వని వినిపించినది. ప్రభువులు కుమారుణ్ని, సోవలను తమ బిడ్డలనే భావించినారు. అతి దుఃఖంలోను, ఆపత్తులోను, వ్యత్యాసాలు మాయమవుతవి; హృదయాలు పండుతవి. ప్రభువులు బిడ్డను తన రొమ్ముకు అదుముకుని, ''నా బిడ్డా, నా బిడ్డా, దీనికోసమే పుట్టినావా ?'' అని అతిదుఃఖంతో అన్నారు. సోవల తన చేతులతో అప్పాజీవారి కన్నీరు తుడిచినది. అయితే, అగి ఆగుతుందా ? ప్రభువుల కన్నీరు ఇప్పుడు వారి వక్షస్స్థలమంతా తడిపించి. వేడి నిట్టూర్పు ఒత్తిన కొలిమితిత్తినుంచి వచ్చే గాలివలె రభసంతో వెలువడు తున్నది. ప్రభువులు ''బిడ్డా, దీనికోసమే పుట్టినావా ?'' అన్నమాట నిజమయినది. సోవల పసుపు బట్టలు కట్టినది. మెడలో మాంగల్యం

మాత్రమున్నది; పుష్పమాలిక ఉన్నది. చేతి మణికట్లకు పూలదండలు చుట్టుకొన్నవి. ముడివిప్పిన కేశపాశం; చెవులలో పుష్పాభరణాలు. ప్రభువులు మరొకమారు సోవలను ఆపాదమస్తకం పరికించినారు. తాము చిన్నవారయినప్పుడు కుమారవిష్ణువు తల్లి, చెన్నమదండాధీశ్వరుల పత్ని చందలదేవిగారు సతి అయి పతి చితాగ్నికి దేహం అర్పించినపుడు ఎలాంటి పుష్పాభరణాలు ధరించినారో, సోవలకూడ అలాంటి ఆభరణాలనే ధరించినది. మెడలో మాంగల్య మంగళం, నొసట కుంకుమ సౌభాగ్యం. ప్రభువులకు గుక్కపట్టినట్టయినది. "సతి సోవలా!" అనినారు. సోవల ఔనన్నట్టు తల ఊపినది. తాను మునుపు కట్టుకున్న సతీకంకణాన్ని అప్పాజీవారికి చూపినది. అనంతరం తన పతి కళేబరం ఉన్నచోటికి వెళ్ళి ప్రభువు దృష్టికి పతి రెండు పాదాలను కనపరచినది. ప్రభువులు చకితులయి చూచినారు. కుమారుని రెండు కాళ్లలోను తోడాలు. ఒక్కటేమో తామే బహూకరించిన గండపెండేరం. ఇంకొక కాలికి గరుడి మాత్రమే ధరించదగిన తోడా. ప్రభువులకు తెరచిననోరు తెరచినట్టే, తెరచిన కళ్లు తెరచినట్టే ఉండిపోయినవి. కుమారుడు ఎప్పుడు గరుడి అయినాడు? ఎవరిని అడిగినాడు? గరుడి కమ్మని చెప్పినవారెవరు?" అని వారి మనస్సు ప్రశ్నించినది. సోవల ఇప్పుడు ప్రభువుల వద్దకు వచ్చి నిలచినది. ప్రభువులు ఆ మహాసతి పాదాలుతాకి కళ్ళకు అద్దుకొనినారు. సోవల యిప్పుడు పూజనీయురాలయినది. "అది కూడదు, కూడదు అప్పాజీ!" అంటూ సోవల ప్రభువుల కుడిచేతిని పట్టుకొని యెత్తి తన తలమీద పెట్టుకొన్నది. "అప్పాజీ, ఇక పోయివస్తాను. ఆజ్ఞ ఇవ్వండి." అని అన్నది. ప్రభువులు కూర్చున్నవారు కూర్చున్నటే "నారాయణ, నారాయణ" అని రెండుసార్లని తల వంచుకొని కూర్చున్నారు. సోవల కన్నీటిని కడపటిసారి తుడుచుకున్నది. ఇక ఆమెకు కన్నీరు తగదు. తన పతి కళేబరాన్ని ఎత్తుకొనిపోయి తన రథంలో పెట్టవలసిందని సేవకులకు ఆనతిచ్చినది. తర్వాత హేమాద్రి ప్రధానులకు, అచ్యుతగోవిందామాత్యులకు నమస్కరించినది. వారు ఆ మహాసతికి ప్రతినమస్కారం చేసినారు. పిదప సోవల మాచికబ్బెను చూడడానికి వెళ్ళినది. మాచికబ్బెకు ఇంకా ప్రజ్ఞ రాలేదు. శైత్యోపచారాలు జరుగనే జరిగినవి. సోవల మాచికబ్బె



పాదాలుతాకి కన్నులకు అద్దుకున్నది. మారసింగమయ్యగారికి నమస్కరించి, ప్రతినమస్కారం స్వీకరించి, తలిదండ్రులతోసహా రథమెక్కి ద్వారవలికి వెళ్ళినది.

కొంతసేపయిన తర్వాత ప్రభువులు మెడయెత్తి అమాత్యులను చూచి, దగ్గరికిరండని సైగచేసి పిలిచినారు. ప్రభువులు దుఃఖపూరితులయి "ఇది నా పురాకృతమో, అథవా విధి నియామకమో నేను అనుభవించవలె. ఇప్పుడు నేను చెప్పేమాటలు నడిపించండి. వెలుపల ఉన్నవారంతా తమతమ స్థానాలకు వెళ్ళి, అక్కడే ఉండి, ఈ రెండు జీవుల శాంతికోసం దైవాన్ని ప్రార్థించని. ఒక్క కావలివాడు కూడ ఇక్కడ ఉండవద్దు. ద్వారపాలకులూ వద్దు. అందరూ వెళ్ళిపోని. మీరంతా ప్రార్థనాగృహంలో ఉండి ఈ జీవులకోసం శాంతి ప్రార్థనలు జరుపండి. నేను ఏదో ఘోరమైన అపరాధమే చేసినాను. ఇది మనకు దైవం విధించిన శిక్ష; అనుభవించవలె. అనుభవిస్తాను. ఇప్పుడు నాపైన దయ ఉంచండి." అనినారు.

అమాత్యులు చెవులు మూసుకొని, "శాంతం పాపం!" అని, "ఆజ్ఞ ప్రభూ. అలాగే చేస్తాము" అని వెళ్ళి రాజాజ్ఞను అందరికీ తెలిపినారు. ద్వారపాలకులు, కావలివారు, అందరూ వెళ్లిపోయినారు. ఇప్పుడు నగరే జనశూన్యమయినట్టు కనిపించినది. సభామందిరంలో ప్రభువులొక్కరే వారిముందు శాంతల కళేబరం.

అర్ధరాత్రికి ఇంకా రెండు గడియల పొద్దున్నది. ప్రభువులు లేచి వచ్చి శాంతల కళేబరంవద్ద కూర్చున్నారు. ఒళ్ళంతా తాకితాకి చూచినారు. గాయాలు తగిలి, అక్కడక్కడ రక్తం స్రవించి, గుడ్డలమీద రక్తపు మరకలు ఉన్నవి. ప్రభువులకు అప్పుడు తమ దేహమే ఛిద్రచ్ఛిద్రమయినట్టు నొప్పయినది; చాల వ్యథ కలిగినది. దేవి చేతులను తమ చేతులతో పట్టుకొని కన్నీరు కురిపిస్తూ చూచినారు. ఎనలేని పూజలు, నోములు, దానధర్మాలు చేసిన చేతులు. తమను ఆదరించి సత్కరించి తాకి తనియించి, అమృతం వర్షించిన చేతులవి. ఇప్పుడు చల్లబడినవి; కట్టెలయినవి. ప్రభువులు అ చేతులను చాలసేపు తమ కన్నులకు అదిమి పట్టుకొనినారు.

ప్రేయసిముఖం చూచినారు. సౌందర్య సౌభాగ్య సౌశీల్య సుహాస సువచనాల ఆ నెలవు ఇప్పుడు వివర్ణం, వికారాకారం, భయంకరం. ధారలుకట్టి ప్రవహిస్తున్న ప్రభువుల కన్నీరు ఇప్పుడు ప్రభువుల తప్త హృదయాన్ని చల్లబరచడానికి ప్రయత్నిస్తున్నదా అనిపించినది. అమృతమయంగా ఉంటున్న దేవి నేత్రాలను రెప్పలు విడిపించి చూచినారు. చూస్తుండగానే ప్రభువుల తల వేడెక్కినది. శాంతల తమను చూచినట్టయినది. హీనంగా పిలిచినట్టూ అయినది. కొంతసేపు రెప్పవేయక కళేబరంముఖం చూచినారు. ప్రభువుల మనస్సుడు ఏమిలోచినదో! ఏమి అర్థమయినదో! తత్క్షణమే లేచి, అక్కడినుంచి వెలుపలిద్వారం వద్దకు నడిచినారు. అక్కడ ఎవరూ ఉండలేదు. మహాద్వారంవైపు వెళ్ళినారు. అక్కడా ఎవరూ లేరు. మండుతున్న దివిటీలుమాత్రం మహాద్వారానికి రెండు వైపులా పిడులలో చెక్కి ఉన్నవి. కళేబరాలను శివగంగనుంచి మోసుకొని వచ్చిన రథం అక్కడే ఉన్నది. దానికి పూన్చిన గుర్రాలు అలాగే నిలబడి ఉన్నవి. ప్రభువులు లోపలికివెళ్ళి వెలుగుతున్న దీప ముకటి తెచ్చి రథంపై పెట్టినారు. మరల లోపలికివెళ్ళి శాంతల కళేబరాన్ని కప్పిన దుకూలంతో పాటు తెచ్చి రథంపై పెట్టినారు. అది కదలి పార్లి పడిపోకుండా కప్పిన దుకూలాన్నే పీఠానికి గట్టిగా బిగించినారు. ద్వారపాలకులు పెట్టిపోయిన దివిటీలు రెండింటిని రథపు పక్క స్తంభాలకు బిగించి కట్టినారు. అక్కడే పాత్రలో నూనెలో నాన్పిపెట్టిన దివిటీ గుడ్డల చుట్టలను, ఆ నూనె పాత్రతోపాటు రథంలో పెట్టుకున్నారు. సారథి స్థానంలో తామే కూర్చొని, గుర్రాల కళ్ళేలను చేతపట్టుకొన్నారు. చెలకోలతో గుర్రాలను మేల్కొల్పి రథాన్ని శివగంగవైపు తిప్పి, అతివేగంగా నడిపించుకొని వెళ్ళినారు.

# మూడవ భాగము

# 1

ప్రభువులు రథాన్ని మహావేగంలో నడిపించసాగినారు. రాత్రివేళ కావడంవల్ల దారిలో ఇతర వాహనాల సంచారంకాని, మనుష్య సంచారం కాని ఉండలేదు. రథానికి పూన్చిన గుర్రాలు బాగ మచ్చికయినవి; వేగంగా పరుగెత్తేవి; ఆమార్గ పరిచయం వాటికి చక్కగా కలిగినది. ప్రభువులు నామమాత్రానికి గుర్రాల కళ్ళేలు పట్టుకున్నారు. వారి మనస్సు దుఃఖంతో నిండినది. దుఃఖాతిరేకంలో వారీ ప్రపంచాన్నే మరచినారు. వివేచనశక్తి కుంటుపడినది. "తాము ఏమి చేస్తున్నారు......చేస్తున్నది సరేనా ?" అనే చింతే అప్పుడు లేదు. మనస్సు మాత్రం ఏదో ఒక నిర్ధారానికి వచ్చినది. దాని సాధ్యతా సాధ్యతల తర్కం వారికి అక్కరలేదు.

వేగంగా పోతున్న రథధ్వని దూరానికి ముంగారు ఉరుములవలె ఆరాత్రి వినిపించేది. రాజరథానికి మాత్రమే కట్టేగంటల ధ్వనివిని మొదటి గవ్యూతిచివర నియమితుడయిన గుర్రాల కావలివాడు, నిద్రపోతున్న వాడల్లా, అదరిపడి లేచి కూర్చున్నాడు. శబ్దం శ్రద్ధగా ఆలకించినాడు. రానురాను శబ్దం స్పష్టమయినది. ఇది రాజరథమేనని నిశ్చయమయినది. "సాయంకాలం వేలాపురికి వెళ్ళిన రథం ఇంత తొందరగా ఎందుకు వెను తిరిగినది ?" అని ఆశ్చర్యపడినాడు. "ఈ వేళగాని వేళలో !" అంటూ వాడు తటాలున లేచి, తన రక్షణలో ఉన్న గుర్రాలు రెండింటినీ విచ్చి పట్టుకొనివచ్చి రాజమార్గంలో నిలుపుకొన్నాడు. అక్కడ ఒక గవ్యూతిని సూచించే సున్నంకొట్టిన పెద్ద అడ్డపు మానుగుర్తు ఉన్నది. వేగంగా వస్తున్న రథం రెండు విఘడియలలో అక్కడికివచ్చి నిలిచినది.

“వీడు నాకు పరిచితుడయిన సారథి కాదే ? ఎవరు వీడు ? రథాన్ని ఇంత వేగంగా నడిపిస్తున్నాడు ?” అని అశ్వరక్షకుడు ఆశ్చర్య కుతూహలాలతో చూచినాడు. ప్రభువులు వానిని చూచి, “మేము నీ ప్రభువులం. ఈ గుర్రాలను త్వరగా విప్పి కొత్తగుర్రాలను పూనించు.” అని సెలవిచ్చినారు. అశ్వరక్షకుడు ప్రభువులను చూచి భయపడినాడు; వణుకుతూ సాగిలపడినాడు. “భయపడవద్దు. చెప్పినది త్వరగాచేసి ముగించు”. అని నారు ప్రభువులు. కావలివాడు మారు మాటాడక గుర్రాలు విప్పి, కొత్త గుర్రాలను రథానికి కట్టినాడు. రథ చక్రాలకు ఇరుసుకు కందెన పూసినాడు. మండిపోయిన దివిటీల గుడ్డల చుట్టలను కిందికిరాల్చి కొత్తచుట్టలను వేసినాడు. అంతలో ప్రభువులు శాంతల కళేబరాన్ని రథ పీఠానికి కట్టిన కట్లను పరిశీలించి, అంతా భద్రంగా ఉందని తెలుసుకున్నారు. రథం ముందుకు సాగినది. నిద్ర మగతలోఉన్న గుర్రాలు చెలకోలు శబ్దానికి మేల్కొని చురుకుగా పరుగెత్తసాగినవి. ఈగుర్రాలు వేగంగా పరిగెత్తేవే; రథాన్ని నడిపే వారు అశ్వహృదయం తెలిసిన ప్రభువులు. ఇక వేగానికి ఏమి కొరత ?

శివగంగవైపు బయలుదేరిన ఈరథం మొదటి గవ్యూతిదాటి రెండవ గవ్యూతిలో సగం దూరం చేరినప్పుడు వేలాపురినుంచి ద్వారవతికి బయలుదేరిన సోవలదేవి రథం రాజధాని చేరినది. రథం వెనుకభాగంలో సోవల తలిదండ్రులు దుఃఖంతో మౌనంతో కూర్చున్నారు. సోవలదేవి రథం ముందుభాగంలో తన స్వామి కళేబరాన్ని తనపక్కనే పెట్టుకొని, రెండు చేతులలోను దానిని పట్టుకొని కూర్చునది. కన్నులలో నీరులేదు. సోవల తన స్వామితో కాపురంచేసిన కాలం బహు స్వల్పం. అది సోవల కిప్పుడు క్షణిక సుఖ స్వప్నంవలె అయినది. తనస్వామి మరణించిన దుఃఖం, హొయిసళ రాజ్యలక్ష్మి శాంతల మరణించిన దుఃఖం—ఈ రెండు దుఃఖాలనూ అణచిపెట్టుకొని కూర్చునది సోవల. “నా దుఃఖంకంటె అప్పాజీ వారి దుఃఖం అపారంకదా ? ఈ మహావిపత్తును వారు ఏరీతి సహించేరు ? లోకోత్తరుడయిన కుమారుడు, లోకోత్తురాలయిన పత్ని—ఇద్దరూ ఒకే నాడు ఒక్కటిగా ఆకస్మిక మరణానికి గురి అయినారు కదా ? ఈ దుఃఖ



స్థితిని ఏ మహానుభావుడయినా ఏరీతిగా సహించగలడు ? అప్పాజీ దీనిని ఏరీతి సహించగలరు ?” అని యోచించినది ఆసాధ్వి. తనదుఃఖం అంత దొడ్డదయినా, ఆ సమయంలో మరొకరిదుఃఖం తన దుఃఖంకన్నా హెచ్చైనదని తెలుసుకొంది. “ఈభూమి పుణ్యభూమి కాదు. పాప శేషమో, పుణ్యశేషమో ఏదో కర్మశేషం తీర్చుకొనడానికే ఆత్మలు ఇక్కడికి వస్తాయి. అక్క కాలుజారిపడినది చూచి, తాళలేక దుఃఖంతో దేహత్యాగం చేసిన నా స్వామే ముక్తుడు. ఆయన ఆత్మ ధన్యత్వం పొందింది. అక్కయ్యతోపాటు నేనూ శివగంగకు వెళ్ళిఉంటే, బాగుండేది. నేనూ నా స్వామినే అనుసరించేదాన్ని...నా స్వామికి పోవడానికి ముందు నా జ్ఞాపకం ఒకవేళ వచ్చిఉంటే ఏమిటిగతి ? ఒకవేళ వచ్చి ఉన్నా, నేనూ వెంటనే వస్తాననే వారు తమకర్తవ్యం నిర్ధరించి ఉంటారు. నాస్వామి నన్ను బాగా తెలుసుకున్నారు. సాధ్యమయినంత త్వరలో నా స్వామిని చేరుకోవలె. నాకోసం వారు ఎంతసేపు కాచుకోడం ? వారిని ఎంతత్వరగా చూచేను! ఇకమాకు ఈపాపభూమి స్పర్శే తప్పినది.” అని సోవల ఒకవిధంగా ఉత్సాహితురాలయినది. తనకూ, తన స్వామికీ, తన అత్తగారికీ ఇక శాశ్వత పుణ్యలోకాలే వేచిఉన్నవని ఆ ముగ్ధపూర్ణ విశ్వాసం.

ఆమె రథం పతిగృహంచేరి ఆగినది. ఆవేళకు దగ్గరి గ్రామాలనుంచి సోవల బంధుబాంధవులూ వచ్చినారు. అందరూ దుఃఖపడుతూ రథం చుట్టూ మూగినారు.

అక్కడ వేలాపురిలో ఇంతసేపు శైత్యోపచారాలు జరిగినా, మాచికబ్బెకు ప్రజ్ఞరాలేదు. వృద్ధురాలయిన ఆమెకు ఈ దుర్భర దుఃఖంతో మెదడులో ఒక భాగానికి రక్తోద్రేకం కలిగినది. ఇంద్రియ వ్యాపారం లోపించినది. అంగాంగాల సంకుచన ప్రకుచనాలు నిలిచిపోయినవి. హృదయ గతి కూడా నిలిచిపోయినది. కొన ఊపిరితో ఉన్నట్టయినది. చిన్ననాటినుంచి ఎలాటి దుర్దశగాని, బాధగాని తెలియని మంగళ పరంపరలో పెరిగిన మనస్సు ఆమెది. ఇప్పుడు అకస్మాత్తుగా సంభవించిన కుమార్తె మరణానికి ఆ తల్లి మనసు జర్జరితమైనది. భర్త మారసింగమయ్య

దగ్గరే కూర్చునారు. స్త్రీజనానికే ఆణిముత్తెవంటి కుమార్తె ఈ దుర్మరణానికి ఈడయినదన్న దుఃఖం ఒకవైపు; ప్రభువుల మనస్సును దావాగ్ని వలె కాల్చివేస్తున్న దుఃఖం ఏవిధంగా పర్యవసానం పొందుతుందో అన్న భీతి ఒకవైపు, ఇంత శైత్యోపచారం చేసినా పత్నికి మూర్ఛ తెలిసి లేవలేదు. ఇంకేమి జరుగుతుందో అనే భయం వేరే-ఈ అన్ని భయ దుఃఖాలూ ఏకకాలంలో చేరి ఆ వీరుని బుద్ధి చైతన్యాలనే పోగొట్టినవి. వారిముఖంలో నిరాశ వ్యాపించినది. నిస్తేజస్కులై, నిర్బలులై, "శివుడే దిక్కు." అని అధోవదనులై కూర్చున్నారు. తమకు తెలిసిన అన్ని ఉపచారాలూ చేసి నిష్ఫలులయినారు.

రాజధానిలో సోవల బంధు బాంధవులందరూ కుమారవిష్ణువు కళేబరం చూచి ఘోరంగా దుఃఖించినారు. వీరి దుఃఖాక్రందనానికి రాజధాని మేల్కొన్నది. కుమారవిష్ణు, శాంతలాదేవి మరణవార్త నిప్పంతి వేడిగా వేగంగా రాజధాని అంతటా వ్యాపించినది. మహారాజ్ఞి శాంతలాదేవి శివగంగగిరి శిఖరంనుంచి కాలుజారిపడి మరణించినారని, అక్కయ్య మరణించినదిగదా అన్న దుఃఖంతో వెంటనే కుమారుడూ గిరిశిఖరంనుంచి దూకి ప్రాణాలు వదలినారని వార్త వ్యాపించినది. కుమారవిష్ణువు ఎవరికీ తెలుపకనే గరుడి అయ్యారని, ఆనాడే సోవల తను 'సతి' అనే కంకణం ధరించినదని, కుమారవిష్ణువు గరుడికావటం చూచి, అతని సైన్యంలోని ఆరుమంది నాయకులూ అతనితోపాటు మరణిస్తామని కంకణం కట్టుకున్నారన్న సంగతికూడ ఇప్పుడు అందరికీ తెలిసినది. "మహారాజ్ఞి, కుమారుడు ఈ అకాలమృత్యుకు గురి అయినారా? అయ్యో! అయ్యో ! ఇదేమి అన్యాయం? ఇకేమిగతి ?" అని రాజధానే విలపించినది. మహాసతి కాదలచిన సోవల మీద వారికి భక్తి గౌరవాలు పెరిగినవి. ఊరిజనం ఆ వేళ గాని వేళలోను కుమారుని భవనంముందు సముద్రంవలె వ్యాపించినారు. శాంతలాదేవి కళేబరం వేలపురిలోనే ఉన్నదని, కుమారవిష్ణువు కళేబరం సోవలదేవే వేలాపురికి వెళ్ళి తీసుకొనివచ్చినదని జనానికి తెలిసినది.

రాజధాని సమీపంలోని సేనా శిబిరాలకూ ఈవార్త తెలిసినది. "అయ్యో ! ఇలాటి ధీరులకు, ఇలాటి వీరులకు ఈ అంత్యమా ? మాతల్లికి



ఈ దుర్మరణమా ? దైవం మనమీద ఇంత నిర్దయుడెందుకు అయినాడు ? ప్రభువుల హృదయానికి ఇక ఏ ఉత్సాహం ? ఇక ఏ సంతోషం ? ఇక వారి హృదయమూ ఎండిపోయినది; బలమూ ఉడిగినది. ఈరాజ్యానికి ఇదేమి విపత్తు ముంచుకువచ్చినది ? ముందేమిగతి ?" అని సేనలోని జనమంతా శోకంతో కళ్లే పోగొట్టుకున్నారు. స్నేహకంకణం ధరించిన ఆరుగురు నాయకులూ తమ సంకల్పసిద్ధికి ఏర్పాటు చేసుకొనసాగినారు.

అక్కడ వేలాపురిలో మూర్ఛితకు శైత్యోపచారం చేస్తున్న పరిచారికలలో ఒక్కతెకు దైవమే సూచించినట్లు తటాలున ఏదో జ్ఞాపకం వచ్చినది. ఆమె ఒక సేవకునితోపాటు పట్టణంలోకి వెళ్ళి తనకు బహుకాలం క్రిందట పరిచితురాలయిన ఒక వృద్ధురాలి యింటికి వెళ్ళి, ఆమెను లేపి, అతిసాహసంతో అంతఃపురానికి తీసుకొని వచ్చినది. ఆ వృద్ధురాలి జీవితమంతా వైద్యవృత్తిలోనే గడచినది. వృద్ధురాలి పతి బదికినకాలంలో ఆ ప్రాంతంవారి కంతా, ఆమె ఇంటి ధన్వంతరి. ఆ వృద్ధురాలు పిల్లల, పిల్లల తల్లుల, గర్భిణులవ్యాధి నిదానాన్ని, చికిత్సను, పథ్యపానాలను తెలుసుకొన్నది. ఆమె హస్తగుణం మంచిది. ఈదుపు, సలుపు, మూర్ఛ, పిత్తవికారం, వాతవికారం, సన్ని, ధనుర్వాతం మొదలయినవాటికి కల్కాలు, కాపులు మొదలయినవి వేయడం తెలుసుకొన్నది. "రాజవంశానికి సంబంధించిన ఒకరు ఒక మరణవార్త విని మూర్ఛపోయినారు. మేము మాకు తెలిసిన శైత్యోపచారాలను చేసినాము. ఒక జాము పొద్దయినా ఇంకా ప్రజ్ఞరాలేదు. మీరు వచ్చి ఆమెను బ్రతికించవలె." అని ఆ పరిచారిక ఆమెను ప్రార్థించినది. చికిత్సకునికి ఉండవలసిన బంగారువంటి మనస్సు ఆ వృద్ధురాలిది. "ఈ సేవకోసమే దైవం నాకు జన్మమిచ్చినది." అని అనుకొన్న ప్రాణి ఆమె. "నడవండి, దేవుడు నాకేమి బుద్ధి ఇస్తాడో చూదాము." అని చిన్న ఒక చేతి పెట్టెను తీసుకొని, పరిచారికతో పాటు బయలుదేరి వచ్చినది. దారిలో ఆమె అన్నది : "మీరిప్పుడు జరిపిన ఉపచారాలన్నీ విశేష దేహశ్రమతోను, ఎండవడకు కలిగిన మూర్ఛలకు చేయవలసినవి. ఈ లాటి మూర్ఛలకు ఉపచారమే వేరు. జ్ఞానవాహినరాలను మేల్కొల్పితే, జ్ఞానేంద్రియాలు మేల్కొంటాయి; అప్పుడు క్రియా

వాహినరాలూ, బాహ్యేంద్రియాలూ తమంతటనే మేల్కొంటాయి. ఆమె శ్వాసోచ్ఛ్వాసక్రమం ఎలాగు ఉంది? చేతులు కాళ్లు వెచ్చగా ఉన్నవా? వయస్సెమి? మేను కృశమా? స్థూలమా? లేక సాధారణమా? మనస్సు, స్వభావం ఎలాటివి?" అని అనేక విషయాలను ఆ వృద్ధురాలు దారిలో వస్తూ పరిచారికవల్ల తెలుసుకొన్నది.

అంతఃపురం చేరిన తర్వాత వృద్ధురాలు మాచికబ్బె వద్ద కూర్చుని, నాడిని పట్టిచూచి, హృదయగతిక్రమం తెలుసుకొని, కొంచెం సమాశ్వాసపడినది. చేతులు కాళ్ళనుముట్టి చూచినది; అరకాలును గోకి, గిల్లి చూచినది. అనంతరం దీపం దగ్గర తెప్పించి, పట్టుకొని, కంటిరెప్పలను విడిపించి చూచి, తన మనస్సుకు సమాధానమయిన తర్వాత, వెంటతెచ్చిన చేతిపెట్టెను తెరిచి, తన చేతులను శుభ్రంగా కడుక్కొని, దైవాన్ని ప్రార్థించి, ఆ విద్యను అనుగ్రహించిన పతిని స్మరించి, వెండి బరణెను తెరిచి, దానిలోని ఔషధాన్ని చిటికెనవ్రేలితో అద్దుకొని, మాచికబ్బె రెండు కన్నులకు కల్కంవేసినది. దూరాన తలవంచుకొని కూర్చున్న మారసింగమయ్యగారు ఇప్పుడు పత్నిదగ్గరకు వచ్చి కూర్చున్నారు. కల్కపు చురుకుదనం కన్నుల సూక్ష్మజ్ఞానవాహి నరాల మూలంగా మెదడులోని ఆ భాగానికి రక్త సంచారం కలిగించినది. అరనిమిషంలో మాచికబ్బె చేతులు తమంతట తాము కళ్ళను నులుముకొనడానికి వెళ్లినవి. వృద్ధురాలు మాచికబ్బె రెండు చేతులను బలంగా పట్టుకొని, ఆపినది. అప్పుడు మాచికబ్బె కొంచెంగా మూలిగినారు. శరీరం కొంచెం చైతన్యం పొందినది; కదలినది; చేతులు కాళ్ళూ ఆడినవి. మారసింగమయ్యగారికి పోయిన ప్రాణం తిరిగి వచ్చినది. కల్కపు చురుకుదనానికి మాచికబ్బె కన్నులలో నీరు వచ్చినది. రెప్పలు కొట్టుకొన్నవి. కొంచెంసేపయిన తర్వాత మాచికబ్బె కన్నులు తెరచి అటుయిటు చూచి, నీరు కావలెనని సైగచేసినారు. పరిచారిక ఒకతె గుటకగుటకగా నీరు తాపించినది.

మారసింగమయ్యగారు తాము ఎల్లప్పుడూ ధరించే అమూల్యమైన రత్నహారాన్ని తీసి, వృద్ధురాలి పాదాలకడపెట్టి "సంతోషంతో స్వీకరించవలె." అని వృద్ధురాలికి సాష్టాంగప్రణామం చేసినారు. వృద్ధురాలు



ఆ మహాబహుమానానికి భయపడి, "కేశవుడు కృపచూపినాడు. నేను పెట్టిన కల్కం విలువ రెండు గవ్వలు. ఈ మహాభరణం నాకు అక్కరలేదు." అన్నది. "అవ్వగారూ, నేను ఇస్తున్నది మీ కలికం విలువకాదు. మీ ఔదార్యానికి విలువేలేదు. మీరు ఈ ముసలి ముప్పులో ఇంత వేళగాని వేళ వచ్చి, తగిన చికిత్సజరిపి ఆమె ఒక్కతె ప్రాణమేకాదు; నా ప్రాణం కూడ కాపాడినారు. నేర్చిన విద్యకు ఈ నిరభిమానమే కదా శిఖరం! మీరు దీనిని వద్దంటారని నాకు తెలుసు. నేనిప్పుడు మీకు యిస్తున్నది ఒక గవ్వ విలువే. మరొక గవ్వ విలువను ఇచ్చేవాడు పరమేశ్వరుడు. ఏ వృత్తివాడయినాసరే ఈ పరమార్థం అభివృద్ధి చేసుకోవలె. నాకృతజ్ఞత యిది. మా యిద్దరికీ జీవదానంచేసిన మీరు ఇప్పుడు మాకు తల్లి అయినారు." అని నిర్బంధంచేసి రత్నహారాన్ని వృద్ధురాలికి ఒప్పించినారు. వృద్ధురాలు కేశవుని కొండాడుతూ సంతోష చిత్తంతో ఇంటికి వెళ్ళినది.

మాచికబ్బె పూర్తిగా ప్రజ్ఞకలిగి పతిచేతిని పట్టుకొనినారు. మారసింగమయ్యగారు మృదువుగా "మాచి, మాచి" అనినారు. మాచికబ్బెకు రెండు విగడియలలో కుమార్తె జ్ఞాపకం వచ్చినది. పతి ముఖాన్ని దుఃఖంతో చూచి, "అయ్యో! మన బిడ్డపాలికి ధర్మేశుడు కూడా లేకపోయినాడా? తన కుమార్తెను కాపాడుకోలేక పోయినాడా? నా శాంతి నాథుడూ లేకపోయినాడా? తల్లి శారద కూడా తన కుమార్తెను నిర్లక్ష్యం చేసినదా? నాకందుకు, నా కళ్యాణికి ఈ దుర్మరణమా? అయ్యో ధర్మేశ్వర! లోకోత్తరమయిన ఇలాటి రత్నాన్ని యోగ్యతలేని మాకెందు కిచ్చినావు? ఎందుకు లాగుకున్నావు? కేశవా, నారాయణా, నిన్ను చేతులార పూజించి, మనసార ధ్యానించి, నీకీర్తి సిపాడి ఆడినవారికి ఈ దుర్మరణమా? ఎవరిని అడుగను? ఇక ఎవరిని అడగను? ఎవరిని శరణు పొందను? నేను బదికి నాబిడ్డ నాకళ్ల ఎదుటే పోవలెనా? నేనెందుకిక బదికి ఉండవలె? ఎలాగు బతికి ఉండవలె? ఇంకెందుకు?" అని విలపించ సాగినది.

దగ్గరే పూజాగృహంలో లక్ష్మికి సేవచేయడానికి నియమితులైన దాసీలలో ఒక్కతె ఈవిలాపం విని, వెలుపలికివచ్చి మాచికబ్బె ఘోరంగా

దుఃఖిస్తుండడం చూచినది. ఆమె దుఃఖించడం లక్ష్మీదేవికి కలిగిన ఈ విచిత్ర పరిస్థితికోసమేనని భ్రమపడి, మాచికబ్బెకు నమస్కరించి, "దొరసానిగారూ, మీరు ఈవిధంగా రోదించరాదు. ఇక్కడ ఎవ్వరూ రోదించరాదని ప్రభువులు కఠినంగా ఆజ్ఞాపించి పోయినారు. లక్ష్మీదేవిగారు సుఖంగా స్మృతివచ్చి మేల్కొంటారని ప్రభువులు విశ్వాసంతో సెలవిచ్చి వెళ్ళినారు. ఎలాటి భయమూ వద్దు. మీరు ఇంత అధైర్యపడి, రోదించే కారణమేలేదు. మనసును ఊరటపరచుకోండి. లక్ష్మీదేవిగారు ఈ మూర్ఛలో ఉన్నప్పుడు, అకస్మాత్తుగా భయపడితే, పెద్దధ్వని అయితే, ప్రస్తుతం సూక్ష్మరీతిగా జరిగే హృదయ క్రియ అకస్మాత్తుగా ఆగి ప్రమాదం ఏర్పడవచ్చు. ఇది ఇలాగు జరుగరాదు కదా! ఇక్కడ నిశ్శబ్దంగా ఉండవలెనని మళ్ళీ మళ్ళీ సెలవిచ్చినారు ప్రభువులు." అని అన్నది. మాచికబ్బెకు వీపుపైన అకస్మాత్తుగా చరచినట్లయినది. "హాఁ! లక్ష్మియా? ఎక్కడ? ఏమైనది? ఎలాగు ఉన్నది? చెప్పండి." అంటూ భయాందోళనలతో తడబడుతూ ఆ తల్లి హృదయం ప్రశ్న పరంపర కురిపించినది.

జరిగినదంతా దాసీలు ఇప్పుడు మాచికబ్బెకు వివరించవలసి వచ్చినది. "ప్రభువుల ఆజ్ఞప్రకారం ఇప్పుడు ఒకమారు ఔషధం ఇవ్వడమయినది. దేవిగారు గాఢనిద్రలో ఉన్నట్టు ఉన్నారు. ముఖం కళేమీ తప్పలేదు; ఊపిరి చక్కగా ఆడుతున్నది. ప్రజ్ఞ రావాలంటే తెల్లవారి మూడు జాములకని ప్రభువులు సెలవిచ్చినారు. సంపూర్ణ ప్రజ్ఞ కలుగడానికి ఇంక మీద మూడు నాలుగు జాములు కావాలట." అని దాసిఒకతె విన్నవించుకొన్నది.

దీనిని విన్నవెంటనే మాచికబ్బె మనస్సు దుర్భరదుఃఖంనుంచి, భయంవైపు పరిగెత్తినది. "ఎక్కడ? నాలక్ష్మి ఎక్కడ? నా చిన్ని కూన ఎక్కడ? అయ్యో! భగవంతుడా! ఈ బిడ్డనూ లాక్కుపోవద్దు. ఇంతమాత్రం దయదలచు. ఇంత కృప ఉండనీ." అని చేతులుజోడించి ఆకాశాన్ని ప్రార్థించినారు. "లేదు. నేను మాట్లాడను. నేడు ఏడవను, గోళాడను, నా లక్ష్మిని ఒక్కమారు చూపండి." అని విలపిస్తూ, లక్ష్మి



ఉన్నచోటికి వచ్చినారు మాచికబ్బె. మారసింగమయ్యగారూ ఆమె వెంటనే తొందరగా వచ్చినారు.

కళ్ళుమూసుకొని పడుకున్న లక్ష్మినిచూచి, తల్లి మాచికబ్బెకు పిడుగుకొట్టినట్లయినది. కాళ్లు చేతులు వడకసాగినవి. మళ్ళీ ఏమి ఘోర పరిస్థితి ఏర్పడుతుందోనని, మారసింగమయ్యగారూ వడకిపోయినారు. మాచికబ్బె తమ గుండెనుంచి భగ్గున బయలుదేరిన జ్వాలను నోరు భద్రంగా మూసుకొని ఆపినారు. "దొరసానిగారూ,.....ఇక్కడ కూడదు. ఇక్కడ తగదు. దేవిగారికి మంచి కలుగదని ప్రభువులు కట్టాజ్ఞ చేసినారు. మన రొమ్ముపై మనమే రాయి వేసుకోరాదుగదా, దొరసానిగారూ?" అని నారు దాసీజనులు. మాచికబ్బె చాల మృదువుగా లక్ష్మి తల తడివి, "నా చిన్నికూన, నాకడుపును శూన్యం చేయవద్దు. నాలక్ష్మి, నీ అక్కయ్య ఎక్కడికి వెళ్ళినది? లేదు! లేదు! ఆమె ఎక్కడికీ పోలేదు. ఆమె ఎక్కడికీ పోదు. అక్కయ్య చెల్లెలి పొట్టలోనే ఉంటుంది." అన్నారు. ఎదుట భవ్యమైన పీఠంపై ప్రజ్వలిస్తున్న రెండు జ్యోతులమధ్య నిలబడిన నరసింహ విగ్రహాన్ని మాచికబ్బె చూచినారు. లేచివచ్చి, ఆ విగ్రహం ముందు నిలబడి, చేతులు జోడించి, "నారాయణ, నరసింహ, ధర్మేశ, జినేశ, బుద్ధేశ, అంతా నీవే....నీవే...అన్నీ నీ అనంత రూపాలే, నీ అనంత నామధేయాలే. ఈ ఒక్క బిడ్డఅయినా నాకు ఉండనీ. దీనిని దక్కించు... దక్కించు. లేకపోతే, ఇలాగే ఉడికిపోతున్న నా పేగులను నేనే లాగి బయటికితీసి, నీకు దండగా చేస్తాను. ఖలుని పేగులను మాలవేసుకొన్న నీకు నా పేగులు భారంకాదు." అని దుఃఖభరంతో మరల బుద్ధి మారినట్టయి లోగొంతుకతో అన్నారు. మారసింగమయ్య తత్‌క్షణం లేచి పోయి, పత్ని రెండుచేతులూ పట్టుకొని, "మాచీ, మాచీ, నీ వివేచనశక్తి ఎక్కడపోయినది? ఇదేమిటి నీవు అంటున్నమాట? దైవనింద తగదు. ఊరికేఉండు. బిడ్డ లక్ష్మికి ఖండితంగా ఏమీకాదు. నిద్రనుంచి మేల్కొన్నట్టు మేల్కొంటుంది. కొంచెం మనస్సును చిక్కబట్టుకో. నీ అల్లుండ్లవారు యోచనాపరులు కావడంవల్లనే, ఇలాగు చేసినారు. యోచించి చూడు, మాచీ. లక్ష్మికి ఇప్పుడు మెలకువఅయితే, నీ నోటినుంచే దానికి

అక్కయ్యసంగతి తెలిస్తే, నీ ఈబిడ్డను నీవే చంపుకుంటావు. ఈ ఒక్క బిడ్డనైనా మనం దక్కించుకొందాము." అని సమాధానపరిచి, లక్ష్మివద్దకు పిలుచుకొనివచ్చి కూర్చోపెట్టినారు.

లక్ష్మి అకస్మాత్తుగా మేలుకొంటే ఏమి అనర్థం కావచ్చునో మాచికబ్బెకు ఇప్పుడు తెలిసినది. తన అల్లుడిగారిని మనసార ఆశీర్వదించినారు. ఏమయినా, ఆతల్లి పేగు దుఃఖభారం తట్టుకోలేకపోయినది. దాసి ఒకతె లక్ష్మికి మృదువుగా వీవంతో విసరుతుండగా, ఆ వీవనను మాచికబ్బె తను తీసుకొని విసరసాగినారు. ఆమె కన్నులనుంచి అశ్రుధార ఎంతసేపయినా, అడ్డులేక ప్రవహించసాగినది. లక్ష్మికి రెండవమారు ఔషధం ఇవ్వవలసిన సమయం వచ్చినది. దాసీజనం చెప్పినట్టు మాచికబ్బె తామే ఔషధం రాచి లక్ష్మి నాలుకకు పూసి, నాలుగు గుటకలనీరు నెమ్మదిగా మింగించినారు. లక్ష్మిని ఎలాగున అయినా దక్కించుకొందామనే ఆత్రం ఆతల్లికి హెచ్చయినది.

అక్కడ రాజధానిలో సూర్యోదయానికి ఐదుగడియలుండగా పతి కళేబరాన్ని సోవలదేవి తల్లిదండ్రులు, బంధు బాంధవులవద్ద వదలి, స్నానంచేసి, మడిబట్టలు కట్టుకొని, పూజాగృహానికి వెళ్ళి, ప్రార్థనలో నిమగ్నురాలయినది. ఆవేళకు నగరుకు సంబంధించిన వారందరూ, కుమార విష్ణువు గృహం చేరినారు. బొప్పణనాయకుడు తనతండ్రి మరణించినప్పుడు కూడ ఇంత దుఃఖపడలేదు. "హొయిసళ రాజ్యానికి కుమారవిష్ణువు నుంచి మహోన్నతి పొందేయోగం ఉండేది." అని బొప్పణనాయకుడు తన తమ్మునికోసం దుఃఖపడినాడు.

సైన్యంలోని ఆరుగురు నాయకులూ, అరుణోదయానికి ముందే స్నానంచేసి, తమ దేవతలకు అంతిమప్రార్థన చెల్లించి, యుద్ధపు దుస్తులు ధరించి, డాలునుమాని, కొత్తగా సానపట్టిన కత్తులనుమాత్రం తమతో పాటు తీసుకొని, ఇమ్మడి దండనాయక కుమారవిష్ణువు కళేబరం దర్శనానికి బయలుదేరినారు. వారితోపాటు అక్కడున్న సర్వసైన్యం, కళేబర దర్శనానికి బయలుదేరినది. ఆవేళకు కుమారవిష్ణువు భవనంముందు అపారజనుల సందడి ఏర్పడినది.



* * * * * *

సూర్యోదయం సమీపిస్తున్న సమయానికి విష్ణువర్ధనుల రథం శివగంగకు ఇంకా ఒక గవ్యూతి దూరంలో ఉంది. ఆ శివగంగకొండ ఆకాశపు అంచుల్లో శాంతలను ఆహుతిగొన్న మహాభూతంవలె ప్రభువులకు కనిపించినది.. రథవేగం ఇంకా ఎక్కువయినది. శివగంగ ఊరు సమీపమవుతూ వచ్చినది. ఊరు సమీపించినప్పుడు ప్రభువులు రాజమార్గం వదలి, రథాన్ని కొండ అడివారపు ఒకవైపు తిప్పినారు. గుర్రాలు రథాన్ని రాళ్లు రప్పల మీద, గుండ్లమీద, పొదలమీద, రాతిపగుళ్లు సందులలోను బహు ప్రయాసతో లాగుకొని వెళ్ళి అడివారంచేరి ఆగిపోయినవి. అప్పటికి సూర్యోదయమయినది. ప్రభువులు శాంతల కళేబరాన్ని రథపీఠంనుంచి విప్పి, కిందికి దింపినారు. ఆ అడవి నేలపై శాంతల శరీరాన్ని పెడుతున్నప్పుడు ఆవారి పేగే తెగి బయటికి వచ్చినట్టయినది. దుఃఖం ఆగలేదు. "అందరి శాశ్వతశయ్య ఇదే దేవి. నీ విష్ణువర్ధనుడు నేడు నిర్భాగ్యుడు; బిచ్చగాడు." అంటూ, దేవి కళేబరాన్ని నెమ్మదిగా భూమిపైపెట్టి, పిడికిలి మట్టి తీసుకొని, తమ తలపై పోసుకొన్నారు. పూర్వ పశ్చిమ దక్షిణ సముద్రాలు మేరగాగల భూపాలునకు, భగవంతునికోసం లోకోత్తరాలయిన దేవాలయాలు నిర్మించినవారికి, ధర్మం, సత్యం జీవన పరమ ధ్యేయమని నమ్మి నడచినవారికి, లెక్కలేనన్ని దానధర్మాలు చేసినవారికి, భేద రహితులకు, తలపై ఒక పిడికెడుమన్ను! ప్రభువులు గుర్రాల సహాయంతో రథాన్ని ఒక కొండవాగు లోపలికి తోసినారు. రథంముందున్న రెండు స్తంభాలకు కట్టిన దీవిటీల మంటలు తగిలి రథం అంటుకొని కాలిపోయినది. ప్రభువులు గుర్రాల మెడతడుతూ, "మీ సేవ ముగిసింది. మీకు చాల కృతజ్ఞుణ్ని. మీరింక స్వేచ్ఛగా పొండి." అని గుర్రాలను విప్పి తరిమినారు. రాజముద్రగల ఆ గుర్రాలను ఎవరూ కట్టివేయరాదనే శాసనం ఉంది. కనుక గుర్రాలు స్వేచ్ఛగా వెళ్ళిపోయినవి.

శాంతల కళేబరం ఎత్తి భుజంపై వేసుకొని ప్రభువులు కొండ ఎక్కడం ప్రారంభించినారు. కొంచెం దూరం ఎక్కుతూనే అయాసం కలిగినది. దారుణమైన దుఃఖం వారి దేహశక్తినే కుంగదీసినది. నిన్న

ఉపవాసం; రాత్రి ఈ మహా దుఃఖానుభవం; నిద్రలేక రథం నడిపినశ్రమ; భుజంపైన కళేబరం, దారి కాని దారిలో కొంత యెక్కేశ్రమ; ఇది ఎవరికి శక్యం? ప్రభువులు ఆయాసపడుతూ ఒకమారు నిలబడినారు. మెడలిప్పి దేవిని చూచినారు. చూచిన వెంటనే పేగులు పెకలించినట్లయినది. దుఃఖం పెల్లుబికినది. "ఇది నా శాంతలేనా? ఇది నా హృదయరత్నమేనా? ఇది ఆమె సొబగు సౌభాగ్యాల ముఖమా? నా జీవితానికి, జీవనానికి రసపుష్టి కలిగించి, నా హృదయానికి ధైర్యాన్ని, నా బాహువులకు బలాన్ని, మనస్సుకు ఆనందోల్లాసాలను ఇచ్చిన ముఖశ్రీ ఇదేనా? ఎవరి ఒక్క ఉత్సాహపు మాటలతో నా హృదయం పొంగేదో, నా భుజాలలో వీరశ్రీ సంచారమయ్యేదో, ఎవరి చిరునవ్వుతో బ్రహ్మానందం పొందేవాడినో, ఎవరి సంతోషం కోసం, శ్రేయస్సుకోసం నాకు సాధ్యమైనంత దానధర్మాలను నడిపినానో, దేవునికి భవ్యమైన ఆలయాలు నిర్మించినానో, ఎవరి పుణ్యాభివృద్ధికి, ధర్మాభివృద్ధికి రాజ్య సురక్షితం కోసం సంతతం శ్రమపడినానో, ఆ రసాత్మకురాలు ఎండిపోయినదా? నిర్జీవ అయినదా? శాంతలా,......ఓ...శాంతలా, 'ఓ' అను దేవీ... నేనొక్కణ్ణే ఇక ఇక్కడుండడం సాధ్యంకాదు; నాకు సాధ్యంకాదు. నీ ప్రాణాన్ని వెదుక్కుంటూ ఇక్కడికి వచ్చినాను. అది ఇక్కడే ఉంటుందని నాకు తెలుసు. నా ప్రాణం ఇంకా ఉండడాన్ని బట్టి నీ ప్రాణం ఇక్కడే ఉంటుందని నా విశ్వాసం. విను, దేవీ! నా మీద ఆన. నీవు వినగలవు: నన్ను చూడగలవు, నన్ను ఈ విధంగా మోసంచేసి, వెళ్ళిపోదామని నీ ఉద్దేశమయి ఉండదు...నీవు కాలుజారి పడినావని నా మనస్సు ఒప్పడంలేదు....శాంతలా, నీ పేరే ఎంత అమృతమయం! దేవీ, నీ మనస్సు ఏదో కఠిన సమస్యకు చిక్కుకున్నది. నీకు మరొకమార్గమే కనిపించలేదా? ఈ మార్గం నీవు అనుసరించ వచ్చునా?...నీ కండ్లకు నేను మూర్ఖుణ్ణయినా నా? మూర్ఖపు పట్టుదలవాడినా? అలాటి అపరాధం నేనేమి చేసినాను? నా హారం నీకు ఈ విధిని తెచ్చిపెట్టినదా? శాంతలా,... క్షమ అనేది పరాత్పర వస్తువు. నీవు దయార్ద్రి. నీవు నన్ను క్షమించవలె. శాంతలా, ఓ . శాంతలా...'ఓ' అను శాంతలా! నీవు ఎక్కడ ఉంటున్నావో అక్కడికే వస్తాను...."



కొండపై ఇప్పుడు కొంచెం ఎండ ఎక్కుతూ వచ్చినది. ప్రభువులు చాల కష్టంతో సగం కొండ ఎక్కినారు. దారిలేదు; మెట్లులేవు. ఎలాగో, ఏమో శాంతల కళేబరం మోసుకొని, ప్రభువులు కొంచెం కొంచెంగా ముందుకు వెళ్లుతున్నారు; కాళ్లు జారుతున్నాయి. ఎడమచేతితో కళేబరాన్ని గట్టిగా అదిమి పట్టుకొని, కుడిచేతిని ఆసరాగా ఊతగోలగా ఉపయోగిస్తూ, ఎగ ఊపిరితో గుండెపగిలిపోతున్నా, "శాంతల ప్రాణంఉన్న చోటికి పోతున్నాను. ఆ ప్రాణాన్ని ఈ శరీరంలోపలికి పిలుచుకొంటాను." అనే నమ్మకంతో ముందు ముందుకు పోతున్నారు. ప్రభువుల వివేచనశక్తి దుఃఖాతిరేకంలో పదును చెడినది. తాము చేసేపనిని లోకం ఒప్పినా అని కూడా అప్పుడు ఆధీమంతుని మనస్సుకు తోచలేదు. "నా దేవి తిరిగి నా వద్దకు రానే వస్తుంది. నేను ఆమెకు నమ్మకంగా చెబుతున్నాను. ఆమె మనోభీష్టాలన్నిటినీ నడుపుతానని ఆమెకు నమ్మకంగా చెబుతున్నాను. ఆమె శాంతల కదా? ఆమెకోపం ఉపశమిస్తుంది. ఆమె నన్ను తప్పక క్షమించి ఆదరిస్తుంది. నేను మోసుకొని వస్తున్న కళేబరం సజీవమవుతుంది." అనే పూర్ణవిశ్వాసం ప్రభువులకు కలిగినది.

చాల అలసట కలిగినది. ఒక బండనీడలో కొంచెంసేపు నిలబడినారు. వారికి నోరు ఎండిపోతున్నది. ఒంటిలోవున్న ద్రవభాగమంతా చెమటయి పారిపోతున్నది. శరీరంలోని రక్తం ఘనీభవిస్తున్నది. దానివల్ల అలసట మరింత ఎక్కువవుతున్నది. భుజంమీది కళేబరంతో ప్రీతితో మాట్లాడుతారు. "దేవి, ఎండపడుతున్నదా? నీకు అలసట అవుతున్నదా? దప్పిక అవుతున్నదా? ఏమి చేయను? నీవు కష్టానికి పాల్పడినావు, నన్నూ ఈ సహించలేని కష్టానికి పాల్పడ జేసినావు. శాంతలా!... ఓ శాంతలా, ఇలాగు ఎందుకు చేసినావు? నీ తమ్ముడు గరుడి కావడం నాకు ఏమి తెలుసు? నీవున్నప్పుడు లక్ష్మి పట్టమహిషి కాగూడదన్న మాటను అర్థం చేసుకోలేక పోయినావే? దేవీ, నీవు నాతో అబద్ధమాడినావు. శివగంగకు యాత్రకనినావు...నీ వెక్కడికి యాత్రకు బయలు దేరినావు?...వింటున్నావా?... నేను చెబుతున్నది వింటున్నావా? నిన్ను పెండ్లాడినపుడు నిన్ను సఖీ అని సంబోధించినాను. "దేవీ

ఈ సానరాయి మీద నిలబడు; ఈరాయి ఎంత స్థిరంగాను దృఢంగాను బలంగాను ఉందో నీ మనస్సూ, బుద్ధీ అంత దృఢం కానీ. మన జీవితాలలో ఎన్ని కష్టాలు కలిగినా, భద్రే, నీ మనస్సు ఈ రాయివలె అచలం కానీ. ఏ సంకటాలు వచ్చినా, ఒక్కటిగా ఉందాము; ఒక్కటిగా యోచిద్దాము; ఒక్కరిహితం మరొక్కరు సదా రక్షించుకొందాము.'' అని అన్నానుకదా ? నీవు అగ్ని సమక్షంలో, సదస్సు సమక్షంలో అనువర్తిస్తున్నానని చెప్పినది మరచినావా ?... శాంతలా,... శాంతలా... నీ ప్రాణం నన్ను చూస్తున్నది; నీ ఆత్మ నన్ను చూస్తున్నది. నాహంకానికి, మొండితనానికి పశ్చాత్తాప పడుతున్నాను.... క్షమాపణ కోరుతున్నాను. నా అపరాధానికి ఈశిక్ష అనుభవిస్తున్నాను.... నీవు లేక నేను రాజధానికి వెళ్ళను. నాకు ఇక ఎక్కడి రాజ్యం ? శాంతలా, ఎక్కడ ? మన బిడ్డ డెక్కడ ? మన కుమారుడేడీ ? తండ్రికన్నా తల్లి అయిన నీవే వాడికి ఎక్కువయినావు ? వాడు నిన్నే అనుసరించినాడు. మన కుమార్త సోవల కూడా ఇప్పుడు వానిని అనుసరిస్తున్నది. ఇక నీ చెల్లెలు నిన్ను అనుసరిస్తుంది. ఇద్దరు బిడ్డలనూ పోగొట్టుకున్న నీ తల్లి, నీ తండ్రి, సోవల తలిదండ్రులు, తుదకు బొప్పణనాయకుడు— అందరూ నన్ను వదలి పోతారు. అయ్యో ! హొయిసళరాజ్యమా ? ఒక్క దినంలో నీవు నామ రూపాలు లేకుండా పోయినావు; శ్మశానం అయినావు. ఇన్ని అనాహూతాలు తప్పక జరుగుతాయని నీ వెందుకు ఆలోచించలేదు ? శాంతలా, నేనిక తాళలేను... తాళలేను... నీ వెక్కడున్నావు ? ఎక్కడని వెదకను? ఏ గుహలో చేరినావో? ఏ పొదరింటిలో చేరావో?... నేను పిలుస్తున్నాను. నా ప్రాణాలు భయపడి పిలుస్తున్నాను. శాంతలా, ఓ.... శాంతలా ?''

ప్రభువులు మరల ఆ కళేబరాన్ని మోసుకొని బయలుదేరినారు. ఇప్పుడయితే, అడుగడుగుకూ హెచ్చు అలసట. ఒళ్ళంతా చెమటకు ముద్దయినది. కాళ్లు ముళ్లు తొక్కినవి. కట్టుకున్న పీతాంబరం, తక్కిన వస్త్రాలు ముళ్ళపొదలకు చిక్కుకొని చినిగి చిల్లులు పడినవి. కాలు పెడితే బండలు చుర్రుమంటున్నవి. కాళ్ళలో శక్తిఉడిగి; మోకాళ్ళు వంగి పోతున్నవి. శాంతలను మోసుకొన్న ఎడమభుజాన్ని ఎడమభాగాన్ని



చాల జాకరూకతతో కాపాడుకొంటూ పోతున్నారు. కుడిభుజం, కుడిచేయి, కుడిపార్శ్వమంతా పుండ్లయినవి. వారికిప్పుడు ఏనొప్పి లక్ష్యంలేదు. ఏదెబ్బా లక్ష్యంలేదు. మనస్సులో ఒక చేగురి : తమ శాంతల వచ్చి తీరుతుందనే దృఢనిశ్వాసం. వారి వివేచనశక్తి నిన్నరాత్రే సగంచెడినది. కొండ ఎక్కడానికి ప్రారంభించి నప్పుడు మూడుపాళ్లు చెడినది. ఇప్పుడు పూర్తిగా చెడినది. పిచ్చివారివలె గట్టిగా అరుస్తున్నారు : ''శాంతలా, ! ఓ—శాంతలా !'' అని.

తమ శాంతలప్రాణాలు ఆ బండల సందుల్లో ఉన్నవని అక్కడికి వెళ్ళి పిలుస్తున్నారు. ''ఇక్కడలేదు ! ఈ గుహలో ఉండవచ్చు.'' అని అక్కడికిపోయి మరింతగట్టిగా పిలుస్తున్నారు. అక్కడ కనిపించక ''చెట్ల కింద దాగుకొని ఉండవలె'' అని అక్కడికివెళ్ళి పిలుస్తున్నారు : ''శాంతలా—ఓ—శాంతలా !''

## 2

అక్కడ రాజధానిలో కుమారవిష్ణువు కళేబరానికి స్నానం చేయించి, అధికారం, అంతస్థు తెలిపే దుస్తులు తొడిగించి, కాళ్ళకు గండపెండేరం, గరుడి తోడా తొడిగించి, అతని ఆయుధాలతోపాటు అతనిని శుభ్రమైన కుశాసనంపై పడుకోబెట్టి, అందరూ తుదిసారిగా చూడడంకోసం మందిర ప్రాంగణంలో పెట్టినారు. ఆబాలవృద్ధజనులువచ్చి, చూచి, ఆ ధీరునికి వీరునికి అగణితగుణగణునికి పూవులు, కన్నీరు అర్పించినారు. జనులు ''మాతల్లి ఏదీ ? మా మహారాజ్ఞి ఎక్కడ ?'' అని మొరపెట్టుకున్నారు. ఆమె కళేబరం వేలాపురిలోనే ఉందని తెలిసినమీదట, ద్వారవతి వేలాపురికి దుఃఖయాత్రకు బయలుదేరినది.

ఆవేళకు హొయిసళేశ్వర దేవాలయ పశ్చిమభాగంలో ఒకపక్క ఎండిన గంధపుచెక్కలతో ఒకపెద్ద చితి పేర్చినారు. మందిరంనుంచి కుమారవిష్ణువు కళేబరాన్ని సమస్త రాజమర్యాదలతో మోసుకొని వెళ్ళి

నారు. ఆచార్యకులంవారూ, గురుకులజనమూ, సహపాఠులూ వెనుక నడచినారు. వారివెనుక పూవులు, పసుపు కుంకుమ, సుమంగళ సౌభాగ్యాలు తీసుకొని ముత్తైదువులు బయలుదేరినారు. వారిమధ్య సౌమ్యముఖి, శాంతచిత్త, పసుపు వస్త్రాలు ధరించినదీ, హరిద్రా కుంకుమ పుష్పాలంకృత అయిన మహాసతి సోవలదేవిచేత మంగళ ద్రవ్యాలతో బయలుదేరినది. దారిపొడువునా స్త్రీలు ఆ సతిమీద మంగళద్రవ్యాలు కురిపిస్తూ, దారికి పువ్వులు పరుస్తూఉన్నారు. దారిపొడవునా, అక్కడక్కడ ముత్తైదువులు ఆ మహాసతికి గంధపుష్ప తాంబూలాలిచ్చి, పసుపుకుంకుమలు పెట్టి "పోయివస్తావాతల్లీ !" అని శుభంకోరుతు వీడ్కోలిచ్చినారు. తల్లులు తమ చిన్నబిడ్డలను తెచ్చి మహాసతి పాదాలపైపెట్టి, "ఆశీర్వదించు తల్లీ !" అని వేడుకొనేవారు. ఆ సమూహంవెనుక కుమారునివెంట వెళుతామని కంకణం కట్టుకున్న ఆరుమంది నాయకులు రక్తవస్త్రాలు ధరించి, కొత్తగా సానపట్టిన కత్తులను చేతపట్టుకొని, వీరయోధుల పాటలు పాడుతూ, సంతోషచిత్తులై నడిచినారు. వారివెనుక కుమారవిష్ణువు స్వంత సైన్యంలోని సైనికులు తమ సేనాపతి అంతిమ దర్శనంకోసం నడిచినారు.

చితిప్రదేశం చేరినతర్వాత గురుకులంవారు ముందువచ్చి, కుమారుని వస్త్రభూషణాలు విప్పి-కుల సంప్రదాయానుసారం శ్వేతాంబరం కుమారుని కళేబరానికి కప్పి, ఆనాడు కర్మలు ప్రారంభించినారు. కళేబరానికి చితారోహణం చేయించి, కళేబరాన్ని చందన కాష్ఠాలతో కప్పి, ముఖాన్నిమాత్రం మూయక, ఆచ్ఛాదించిన శ్వేతవస్త్రాన్ని తీసివేసినారు. అందరూ వచ్చి అంత్యదర్శనం చేసుకొని వెళ్ళినారు. చితికి ఆనుకునే ఒక పొట్టి శిలాస్తంభాన్ని, దానిపక్కనే ఒక మహాసతి శిలను స్థాపించినారు. శోవలతండ్రి వీరదేవామాత్యులు విధిపూర్వకంగా చితికి అగ్నిస్పర్శ చేయించినారు. సోవలతల్లి కుమార్తెకు పూవులు ముడిచి, పసుపుకుంకుమలు పెట్టి, చేతికి విడెమిచ్చి, "నీ పతితోపాటు శాశ్వత సాధర్మస్వర్గం ఆరోహించు" అని ఆశీర్వదించినారు. ఆ మహాసతి అప్పుడక్కడ చేరిన జనానికి వందనం సమర్పించినది. ఆమెమీద పుష్పవృష్టి కురిసింది. ఆమె కడపటిసారిగా తలిదండ్రులకు నమస్కరించినది. తర్వాత తలిదండ్రులిద్దరూ



పక్కనవున్న సరోవరంలో గొంతువరకు నీటిలో కూర్చుని తీర్థంకరులను ధ్యానిస్తూ కూర్చున్నారు.

మహాసతి సోవలదేవి చేతులు జోడించి జ్వలిస్తున్న చితికి మూడుసార్లు ప్రదక్షిణం చేసినది. సంతోష మనస్సుతో, ప్రఫుల్ల వదనంతో సతీస్తంభంఎక్కి నిలబడినప్పుడు, అగ్ని, స్వాహాదేవి ఇక తమ కుమార్తె అయిన ఆమెను పతివద్దకు పిలుచుకొని వెళ్ళడానికి తమ జ్వాలా భుజాలను చాచి చాచి ముందుకు వచ్చినారు. జనమంతా "మహాసతి, మహాసతి సోవలదేవి" అని ముక్తకంఠంతో ఉద్ఘోషించినారు. నానావిధ ప్రచండనాదాలు, వాద్యాలు భోరున మ్రోగినవి. మహాసతి రెండుచేతులను పైకెత్తి, తాను నమ్మిన దైవాన్ని తుదిసారిగా ప్రార్థించి, అద్భుతాకారంగా ప్రజ్వలిస్తున్న ఆ చితాగ్నికి సువర్ణ లతవంటి తన శరీరాన్ని అర్పించుకొన్నది.

ఆ చితికి కొంచెందూరంలో ఒక పెద్ద గుంతచేసి, దానినిండా ఎండిన కర్రలువేసి నిప్పు పెట్టినారు. అది యిప్పుడు చక్కగా అంటుకొని మండసాగినది. ఈ గుండం ఎదురుగా వీరగల్లుస్తంభం; దాని శిఖరంపై హొయిసళ పతాకం. ఈ వీరగల్లునూ, అగ్నికుండాన్ని చుట్టుముట్టి యాభై అరవై హస్తాల వర్తులంలో విచ్చుకత్తులతో హొయిసళ సైనికుల కాపలా. చెవులు చిల్లులు పడేట్టు చర్మవాద్యాల, కొమ్ముకాహళుల ఆరావం. నడుమ ఆరుగురు కంకణధారులు వీరనృత్యం మొదలుపెట్టినారు. వాద్యాలరభసం హెచ్చినకొద్దీ వారి నృత్యమూ భయంకరం కాసాగినది. నృత్యం చేసిచేసి వారికి వీరావేశం వచ్చినది. "సిద్ధతలను" ను చూడడానికి అందరూ కుతూహలంతో కాచుకున్నారు. చక్కగా పదును పెట్టిన చంద్రాయుధాన్ని బలమైన ఒక వింటినారికి వంచి మరొక దారంతో కట్టినారు. దానిముందుకు ఆ ఆరుమందిలో ఒకరువచ్చి చేతులు జోడించి, కళ్లు మూసుకొని, ఉచ్ఛ్వాస నిశ్వాసాలు స్తంభింపజేసి కూర్చున్నారు. మరొకడు నాట్యంచేస్తూ వచ్చి బిగించికట్టిన చంద్రాయుధం దారాన్ని ఆయమెరిగి తన కత్తితో తెగనరికినాడు. చంద్రాయుధం విసురుగా వచ్చి కూర్చున్న సిద్ధవీరుని గొంతును తుడిచివేసినట్టుగా కత్తరించి వేసింది. తల కింద దొర్లినది. ఇలాగు ఒకరయిన తర్వాత మరొకరుగ్గా ఐదు

మంది తమ తలను సమర్పించినారు. ఆరవవాడు తన సిగను ఎడమచేతిలో పట్టుకొని, కుడిచేతిలోని కత్తితో ఒకేదెబ్బతో తలను నరికివేసుకున్నాడు. అనంతరం వారి తలలను, మొండేలను సైనికులు అగ్నిగుండంలో పడవేసినారు. ఈ ఆరుగురికి వీరస్వర్గ సద్గతి వచ్చినదని సంతోషంతో సైనికులంతా గంతులు వేసినారు. అగ్నికుండలంలో కాలుతున్న మాంసంవాసన నగరమంతటా వ్యాపించి రాజధానిఅంతా శ్మశాన ధూమమయ మయినది.

## 3

ఇటు వేలాపురిలో సూర్యోదయానికి ముందే ఊరివారంతా నగరు ముందు గుమిగూడినారు. మరణవార్తను మూసిపెట్టడం సాధ్యమా? "చెలువకేశవుణ్ని మాకు ఇచ్చిన చెలువాంబ మహారాజ్ఞి శాంతలాదేవిగారు ఎక్కడ? బిడ్డలవలె మమ్ముల్ని సాకిన హొయిసళదేవిగారెక్కడ? మా తల్లిగారెక్కడ? ఆమెకు కుమారుడై, తమ్ముడై ఈ రాజ్యాన్ని మహావిపత్తునుంచి కాపాడిన త్రైలోక్య వీరుడెక్కడ? గుర్రాల గుంపును, ఏనుగుల సమూహాన్ని తెచ్చి తన అస్వాజీవారికిచ్చిన వీరుడెక్కడ? మా ప్రభువుల కుమారుడేడీ! అయ్యో..." అని జనం విలపించినారు.

కుమారుని కళేబరాన్ని సతి సోవలదేవి అర్ధరాత్రే రథంలో ద్వారవతికి తీసుకొని వెళ్ళినారని జనానికి తెలిసినది. ప్రభువులూ శాంతలదేవి కళేబరమూ తర్వాత కనిపించలేదని విని జనానికి దుఃఖ భయాశ్చర్యాలు ఏకకాలంలోనే కలిగినవి. నగరు అధికారులందరూ భయపడిపోయినారు. వారు మారసింగమయ్యగారిని ప్రశ్నించినారు. వారికి నోట మాటరాలేదు. హేమాద్రి ప్రధానులకు, అచ్యుత గోవిందమాత్యులకు దిక్కుతోచనట్టయినది. నగరును, ఊరును, దేవాలయాలను వెదికించినారు. ప్రభువులూ లేరు; శాంతలదేవి కళేబరమూ లేదు. "ఇదేమాశ్చర్యం! ఇదేమి విపత్తు!" అని అందరికీ ధైర్యం సడలినది. మారసింగమయ్యగారు "ఈ విషయాన్ని తమ పత్నికి తెలుపవచ్చునా? తెలుపగూడదా? ఇప్పుడేమి చేయడం?" అని సందిగ్ధావస్థలో పడినారు.



హేమాద్రి ప్రధానులకు ఇప్పుడర్థమయినది, నిన్నరాత్రి "నగరు దాసదాసీజనమూ, అధికారులూ అందరూ మీ మీ స్థానాలకు వెళ్ళి దేవుణ్ని ప్రార్థించండి. శివగంగనుంచి వచ్చిన రథం అక్కడే ఉండనీ. గుర్రాలు కూడా విప్పకండి." అని ప్రభువులు ఆజ్ఞాపించిన దాని అంతర్యం. అచ్యుత గోవిందామాత్యులూ ఆ విధంగానే ఊహించినారు. మారసింగమయ్యగారూ గ్రహించినారు: ప్రభువులు శాంతల కళేబరం రథంలో పెట్టి తీసుకొని వెళ్ళినారని "రాజధానికి వెళ్ళినారా? వారే రథం నడిపించుకొని వెళ్ళినారా? ఈ గోప్యమెందుకు? లేదు. రాజధానికి పోలేదు. మరెక్కడికి? మరెక్కడికి?" అని అందరికీ యోచనకు కారణమయినది.

తుదకు ఒక నిశ్చయానికి వచ్చినారు: "ప్రభువులే రథం నడిపించుకొని వెళ్ళినారు. రథానికి రాత్రులలో ఇరుపక్కలా కట్టి వెలిగించే దీవిటీలను తీసుకొని వెళ్ళినారు. దూర ప్రయాణం కోసం నూనెలో తడిపిపెట్టిన దీవిటీ గుడ్డల చుట్టలను తీసుకొని వెళ్ళినారు. అందువల్ల ఇంకెక్కడికి వెళ్ళివుంటారు? బహుశః శివగంగకు వెళ్ళివుండవలె" అని. శివగంగ మార్గమూ, వేలాపురి మార్గమూ కలిసేచోట ఉండే రాత్రి కావలివారిని పిలిపించి అడిగినారు. వారు "అర్ధరాత్రి సమయంలో రాజరథ మొకటి వేగంతో శివగంగకు అభిముఖంగా వెళ్ళినది. గుర్రాల అలంకారాలను, రథానికి కట్టిన గంటలను బట్టి, అది రాజరథమని తెలుసుకొని, దానిని నిలిపి పరీక్షించలేదు" అని మనవి చేసుకొనినారు.

హేమాద్రి ప్రధానులు తత్క్షణమే "శివగంగకు రెండు వేగంగా వెళ్ళేరథాలు సిద్ధం చేయవలసినది" అని ఉత్తరువు చేసినారు. యాభై ఉత్తమాశ్వాలను ఆ క్షణమే దారిలో గవ్యూతి గవ్యూతికి మార్చడం కోసం పంపినారు. ఆ వేళకు సరిగా, వెనుకటి దినం శాంతలదేవి, కుమార విష్ణువుల కళేబరాలను రథంలో పెట్టి శివగంగనుంచి వేలాపురికి పంపిన శివగంగ ప్రెగ్గడ, నగర రక్షకులూ రథంలో వచ్చి దిగినారు. సచివులు వారినుంచి సమస్త విషయాలూ విచారించి తెలుసుకున్నారు. "దారిలో రాజరథాన్ని చూచినారా?" అని ప్రశ్నించినారు సచివులు. వారు

"దాదాపు రాత్రి మూడుజాములప్పుడు దారిలో మాకు ఎదురుగా, మహా వేగంతో వస్తున్న రాజరథ మొకదానికి దారి విడిచి పక్కన నిలబడినాము. రథం మెరుపు వేగంతో వెళ్ళినది. రథంలో ఉన్నవారు ఎవరయినదీ చూడడం కాలేదు. రెండు పక్కలా దివిటీలు వెలుగుతున్నవి." అని మనవి చేసినారు. అచ్యుత గోవిందులు "ఇప్పుడు మీరు స్నానాదులు ముగించి, ఉపాహారం తీసుకొని, ఇక గడియ గడియన్నరలో మాతోపాటు శివగంగకు బయలుదేరడానికి సిద్ధంగా ఉండండి." అని ఆజ్ఞాపించినారు.

ఆవేళకు లక్ష్మీదేవికి నాల్గుసార్లు ఔషధం ఇవ్వడం జరిగినది. మూడవసారి ఔషధం ఇచ్చిన తర్వాత, లక్ష్మీదేవి కాళ్లు చేతులు కొద్దిగా మెదలినవి. బిగుసుకొని పోయిన కంటిరెప్పలు కొద్దిగా సడలినవి. కంఠంలో కొంచెంగా సవ్వడి వెడలినది. నాల్గవసారి ఔషధం ఇచ్చేవేళకు, చేతులు కాళ్లు పూర్తిగా స్వాధీనానికి వచ్చినవి. లక్ష్మి కన్నులు తెరిచి చుట్టు పట్టు చూచినది. ఎక్కడో ఉన్నట్టు, ఎక్కడికో వచ్చినట్టు తటపటాయించినది. తలిదండ్రులను చూచినది; గుర్తు పట్టలేదు; దాసీలను గుర్తుపట్టలేదు. మాచికబ్బె కుమార్తెకు ఔషధమిచ్చి, రెండు గిన్నెల సుఖోష్ణమైన పాలు గుక్క గుక్కగా నెమ్మదిగా తాగించినారు. కొంచెం పొద్దయిన తర్వాత లక్ష్మీదేవి, నెమ్మదిగా లేచి కూర్చున్నది. మాచికబ్బె కుమార్తెను తమ రొమ్ముకు ఒరిగించుకుని పట్టుకున్నారు.

అప్పుడు అచ్యుతామాత్యులు అక్కడికి వచ్చి, లక్ష్మీదేవిని, మాచికబ్బెను చూచి, కొంచెం మనసు కుదుటబరచుకొని అక్కడే కూర్చున్న మారసింగమయ్యగారిని నెమ్మదిగా సైగచేసి వెలుపలికి పిలిపించి, చెవిలో గుసగుసగా నాలుగైదు నిమిషాలు మాట్లాడి, తాము చెప్పవలసిన సంగతులను అన్నిటినీ తెలిపినారు. మారసింగమయ్యగారు అదంతా విని మరింత భీతిపొందినారు. "ఏమిటి ఉద్దేశం ఉండవచ్చు?" అని ప్రశ్నించినారు. "భగవంతుడే దారి. ప్రభువుల మనస్సులో ఏమి యోచన తోచినదో? ఇంతటి ఘోరసంకటంలో ఎంతటి ప్రాజ్ఞునికైనా సంయమం తప్పవచ్చు; చిత్తం వికల్పం కావచ్చు; ధీమంతుడూ పిచ్చివాడు కావచ్చు. ఈ విపత్తు సామాన్యమా?...అన్నగారి సంయమం శివునికీ సాధ్యంకాదు." అనినారు



అచ్యుతామాత్యులు. ఇది సంయమం కాదు, అచ్యుతులవారూ. ఈ మనస్సును పట్టుకున్న మరొకభీతి—కొడ్డభీతి నా కుమార్తెకోసం నేను పడుతున్న బాధను అతిక్రమించుకొని దానిమీద నిలబడినది. నాపత్ని ఇక ప్రాణాలతో ఉండదు. అక్కయ్య సమాచారం చెల్లెలికి తెలియక ఉంటుందా? తెలిసినక్షణమే లక్ష్మి పోయినట్లే!...ప్రభువులు ఒకవేళ బ్రతికినా లక్ష్మికోసమే, లక్ష్మికూడ పోయిన పిదప!" అనినారు మారసింగమయ్యగారు. ఒకటిరెండు క్షణాలు ఆలోచించిన మీదట మారసింగమయ్య ఇంకా అన్నారు: "అచ్యుతులవారూ, ఇప్పటి సన్నివేశంలో మీ యోచనే ఉచితమని తోస్తుంది. మీతోపాటు శివగంగకు రావలెనని నాకూ ఉబలాటమున్నది. కాని, నాపత్నిని వదలి నేను రాలేను. ఆమె లక్ష్మిని చంపి, తననూ చంపుకొంటుంది. ప్రభువులు తమ కుమార్తె కళేబరంతో శివగంగకు వెళ్ళినారన్న వార్త చెవిని పడినక్షణమే ఆమె దక్కదు. లక్ష్మికి ఇక కొన్నిగడియలలో పూర్తిగా ప్రజ్ఞ కలుగుతుంది. నాపత్నికి ప్రభువుల ఈసంగతి ఖండితంగా తెలియకూడదు. దీనికి ఏమి చేయవలె? లక్ష్మికి ప్రజ్ఞ వస్తున్నప్పుడు, ఇప్పుడు, లక్ష్మివద్దకూడా నాపత్ని ఉండరాదు. అచ్యుతులవారూ, నేనేమి చేయను? ఇప్పుడేమి చేయను?...ఇప్పుడు నాకు తోస్తున్నది ఒక్కటే మార్గం. ఇక్కడినుంచి ఈ నిమిషమే నేను నాపత్నిని ఏదోవిధంగా రాజధానికి పిలుచుకొని పోవలె. తనకుమార్తె కళేబరాన్ని మరొకమారు చూడవలెనని ఆశపడితే నేనే వద్దననా? భగవంతుడా?...చూడకుండా రాలేనని గోడుపోసుకుంటే! లక్ష్మికి అప్పుడు ప్రజ్ఞవస్తే! అయ్యో! శివా! ఇవేమి ఆపదలు! నాపత్నికి నిజం తెలుపనా? అబద్ధం చెప్పనా? ఏమి చెయ్యమంటారు చెప్పండి. ఎవరిదుఃఖం పెద్దది? ఎవరిది చిన్నది?... నేను నాకర్తవ్యం నిర్వర్తిస్తాను...ఎట్లో...ఏమో ... నాపత్నిని ఇక్కడినుంచి పిలుచుకునే వెళ్ళాలి. దైవం నానోట నిజమయినా పలికించనీ, అబద్ధమయినా పలికించనీ. మా యీ బిడ్డ బతికి, ప్రభువులూ బతికితే, అబద్ధం ఆడేను. దానికై శతకోటివర్షాలు నాకు నరకప్రాప్తి అయినా చింతలేదు. అచ్యుతులవారూ, మీ మనస్సుకు తోచిన మార్గమే సరైనదని తోస్తున్నది. సర్వప్రయత్నాలతోను మనం ప్రభువులప్రాణాలు దక్కించుకోవలె.

‘లక్ష్మిని పిలుచుకొని పోవడమా ? ఇక్కడే వదలిపోవడమా ?’ అని మీరు నన్ను ప్రశ్నించినారు. నేను నాపత్నిని పిలుచుకొని పోవలెనని నిర్ధరించిన మీదట, లక్ష్మిని ఒక్కతెనే ఇక్కడ వదలిపోవడం సర్వథా తగదు. తెలివి వచ్చినమీదట ఆమెకు విషయాలు గోచరంకాకుండా ఉంటాయా ? మీరు ఆమెను శివగంగకు పిలుచుకొనివెళ్లితే, అక్కడ ఈవరకే ఏమైనదో? ఏమవుతుందో? పిలుకొచుని వెళ్ళడంలో ఒక ఆశా కనిపిస్తుంది; అపాయమూ కనిపిస్తున్నది. ఇక్కడే వదలిపోవడంలో అర్థమూ ఉన్నది; అనర్థమూ ఉన్నది. ఈ రెండుకష్టాలలో ఏది అనుభోక్తవ్యం ? దైవమొక్కటే మాకు వెలుగు చూపవలె; అచ్యుతులవారూ. రెండునాళ్ళలో పొయిసళ రాజ్యం, పొయిసళవంశం రెండూ నశించిపోయినట్టు తోస్తున్నది. నాకు దారి కనుపించడంలేదు. మనపాలికి ఇప్పుడు దైవమూ కౄరమయినట్టు ఉన్నదికదా! బిడ్డనుకోల్పోయిన నాకు జీవితమే వేసట అయినది. కేశవునికి చేతులుజోడించి మీ మనస్సుకు ఏమి తోస్తుందో ఆవిధంగా చేయండి. ప్రభువులు జీవించి, లక్ష్మి జీవిస్తే మాకు లక్ష్మియే శాంతల. నేను నాపత్నిని ఇక్కడినుంచి పిలుచుకొని వెళ్ళుతాను. ఉత్తరద్వారం వద్ద ఈక్షణమే మాకోసం ఒకరథం సిద్ధంచేయించి పెట్టండి. రాజధానికి వెళ్ళుతాము. ఇక అక్కడ మాకు ఏమేమి కాచుకొని ఉన్నదో !’’ అంటూ మారసింగమయ్య తమ పత్ని ఉన్నచోటికి వెళ్ళినారు.

లక్ష్మీదేవికి మూర్ఛతెలిసినా, ప్రజ్ఞ ఇంకా రాలేదు. ‘‘పూర్ణప్రజ్ఞ రావలెనంటే ఇక అర్ధదినమయినా కావచ్చునని ప్రభువులు సెలవిచ్చినారు. మనం ఆత్రపడితే అయ్యేనా ?’’ అని దాసిఒక్కతె దుఃఖపడుతున్న మాచికబ్బెకు మనవిచేస్తూ ఉండినది. మాచికబ్బె కుమార్తె నుదురు, చెక్కులు సవరిస్తూ, మృదువుగా చెక్కులు పట్టుకొని కదలిస్తూ, ‘‘లక్ష్మి, నా పసికందు, ఇక్కడ చూడవే : నేను వచ్చినాను. ఇక్కడచూడు, నన్నుచూడు. మాట్లాడవే నాతల్లి. నేను ఎవరో చెప్పుకోచూదాం.’’ అని అడుగుతున్నారు.

మారసింగమయ్య పరిగెత్తివచ్చి తమ పత్నినోటిని బలంగా మూసి, ‘‘శివశివ! ఆడవారికి ఎంత వయస్సయితే ఏమిటి? ఎంత విద్యనేర్చితే ఏమి ?



ధైర్యం, బుద్ధి, ఏవేళల్లో అత్యావశ్యకమో అలాటివేళల్లో మూర్ఖత, మొండితనం, లేకపోతే కన్నీరు...మాచీ, మాచీ...నీవు ఏమి చేస్తున్నావు? లక్ష్మికి ఇప్పుడు తెలివివస్తే ? ఇదంతా తెలిస్తే ఏమిటిగతి ?...ఇంకేమి గతి ? ఇప్పుడే ఆమెకు ప్రజ్ఞవస్తే ‘నేనెందుకు ఇలాగు...అమ్మ ఎందుకు వచ్చినారు ?... అయ్య ఎందుకు వచ్చినారు ?...అక్కయ్య ఊరికి వచ్చినదా ? అంతఃపురమంతా ఎందుకిలాగుఉన్నది ? ఎందుకు ఒక్కరూ మాట్లాడరు?’’ అని ప్రశ్నలువేస్తే ఏమి సమాధానం చెబుతావు మాచి?... మాచీ, ఈ బిడ్డనుగూడ పోగొట్టుకోవడమా ? మనమే బిడ్డకు విపత్తు తేవడమా ? నడు, మాచీ, నీవిప్పుడు ఇక్కడినుంచి లే. లక్ష్మికి ప్రజ్ఞ రావడానికి ముందే రాజధానికి వెళ్లుదాము : మనకిక శాంతల ఈమే; ఈమే శాంతల. లక్ష్మి ఇకనూ బతికి ఉండాలనే ఆశ నీకుంటే, మనమిప్పుడే వెళ్ళిపోవలె. ఆమెకు ఇప్పుడో ఇక అరగడియకో, లేక కొంచెం నిదానంగానో, తెలివి రావచ్చు. ఇక ఆమెను దక్కించుకొనే భారం ప్రభువులది. ఇదంతా తెలిసి తెలిసే మనమే ఇక అనర్థాలకు కారణం కారాదు. లే. మాచీ. ఇక్కడనుంచి లే.’’ అనినారు మారసింగమయ్యగారు.

మాచికబ్బె దుఃఖంతో నెమ్మదిగా, ‘‘ఇక మనకు ఇల్లెక్కడ ? ఇల్లెందుకు ? మనకున్నది ఇదొక బిడ్డ. దీనినీ వదలి రమ్మంటారా ?’’ అని ప్రశ్నించినారు.

‘‘నిజమే. మాచీ నిజమే. మనకున్నది ఇదొక్కటే బిడ్డ. ఇదైనా బతకనీ అనే నిన్ను పిలుస్తున్నాను. రా, లే.’’

మారసింగమయ్య బలవంతంగా పత్నిని వెలుపలికి పిలుచుకొని వచ్చినారు. తలుపుదాటి వెలుపలికి రాగానే మాచికబ్బె మళ్ళీ ‘‘అయ్యో, లక్ష్మికి తనతల్లి గురుతూ చిక్కలేదా ? ఇలాటి సందర్భంలో నేను ఎలాగు ఊరికిరాను ? నా బిడ్డ దేహమెక్కడ ? నా పసికందు దేహమెక్కడ ? ఏమిచేసినారు ? కాల్చివేసినారా ? అయ్యో ! బంగారు పుత్తడి బొమ్మవలె ఉన్న నా అందాల తల్లిని కాల్చివేసినారా ? చెప్పండి. మీ పుణ్యముంటుంది. చెప్పండి.’’ అని మాచికబ్బె నిన్నరాత్రి తన కుమార్తె కళేబరం చూచినచోటికి పరిగెత్తడానికి ప్రయత్నించినారు.

మారసింగమయ్యగారు మాచికబ్బెను బలంగా పట్టుకొని లాగి నిలుపుకొని, "లేదు. మాచీ, లేదు. మనబిడ్డ దేహానికి అగ్నిసంస్కారం జరుగవలసినది రాజధానిలో. అక్కడికి తీసుకొని వస్తారు. ఇప్పటికి నీగోడు నిలిపితే, లక్ష్మి బతుకుతుంది. నీ విక్కడుంటే ఇంకా అనేకానర్థాలు ఖండితం. దయచూపు మాచీ. నీబుద్ధి ఎక్కడికి పోయినది ?" అన్నారు.

"అయ్యో ! కన్నకడుపు ఉడుకుతుంది. నేను ఊరికి రావడమంటే, ఒక మాటమీద? ఒక నిర్ధారంమీద, మనమిద్దరం బిడ్డ చితిలో, బిడ్డ చితిలో...సమ్మతమేనా ?"

"నీవు ఇప్పుడే, ఉన్నదున్నట్టు బయలుదేరితే, సమ్మతమే, సమ్మతమే. మనకు దానికంటే సుఖమైన మరణం ఉందా ? మాచీ !" అంటూ మారసింగమయ్యగారు తమ పత్నిని త్వరగా ఉత్తరద్వారం అవలికి పిలుచుకొనివెళ్ళి సిద్ధంగా నిలబడిన రథంలో కూర్చోబెట్టుకొని, ద్వారవలికి వేగంగా బయలుదేరినారు.

హేమాద్రి ప్రధానులు, అచ్యుత. గోవిందామాత్యులూ కొంతసేపు తమలోతామే "లక్ష్మీదేవిగారిని శివగంగకు పిలుచుకొని పోవడమా ? ఇక్కడే వదలి పోవడమా ?" అనే విషయం చర్చించినారు. "ఆమెకు ఇప్పుడే తెలివివస్తే ఏమిగతి ? ఇక్కడుంటే, ఆమెకు విషయాలన్నీ తెలిస్తే దిక్కేమి ? శాంతలదేవి కళేబరాన్ని తీసుకొనివెళ్ళిన ప్రభువులకు చిత్తభ్రమణమయి ఉంటుంది. శివగంగకు వెళ్ళినారో ? అథవా మరెక్కడికైనా వెళ్ళినారో ? ప్రభువులు ఇప్పుడు ఎక్కడ ఉన్నారో ? వెళ్ళినారో ? ఉన్నారో ? లేనే లేరో ! తామూ దుఃఖాతిరేకంలో కళేబరంలోపాటు కుమారుడు మడిసిన విధంగా...? శాంతం పాపం, శాంతం పాపం. లక్ష్మీదేవిగారిని అక్కడికి పిలుచుకొనిపోయి ఏమిచేయడం ? ఆమెను ఇక్కడేవదలి పోవడమా ? ఆమెను చూచుకునే, కాపాడుకొనే శక్తి ఎవరికున్నది? ఇటువంటి సంకట సమయంలో పండితులొక్కరయినా బ్రతికిఉంటే ? గంగరాజులుగారయినా ఉండిఉంటే ? మన దుర్దైవానికి మనకెవరూ లేకపోయినారు కదా ? శివగంగలోనే ప్రభువులు ఉన్నట్టయితే ?...మనం వారిని దర్శించేవరకు ఏ ప్రమాదమూ సంభవించకుండా ఉంటే !...లక్ష్మీదేవిగారు ప్రభువులను సమాధానపరుస్తారా ?...అలాగుకాక ఒకవేళ వారూ అక్కపట్టినదారే పడితే, మనమే ఆమెను ఆమె అంత్యానికి పిలుచుకొని పోయినట్టవుతుంది. రేపు జనమైనా "వీరికి ఇంత వివేచనం లేకపోయినదా ?" అని ఆడిపోసుకొనేటట్టు అవుతుంది. ఈ పెక్కు సంకటాల్లో ఏమిచేయడం ?" అని చాలసేపు ముందువెనుకలు ఆలోచించినారు.



అచ్యుతామాత్యులు "నారాయణుడే దిక్కుతోపించనీ !" అని ప్రార్థనా గృహానికి వెళ్ళి, రెండు తాళపత్రాలలో ఒకదానిమీద "పిలుచుకొనిపొండి", అని, మరొకదానిమీద "పిలుచుకొనిపోవడం వద్దు" అని వ్రాయించి, నారాయణుని పాదారవింద సన్నిధిలో పెట్టి, దైవాన్ని దిక్కుచూపమని వేడుకొని, నమస్కారంచేసి, ఒక శిశువు చేతినుంచి ఒక తాళపత్రం తీయించి చూచినారు. చూడగా, "పిలుచుకొని పొండి" అనే వ్రాత కనిపించింది. అచ్యుతామాత్యులు "స్వామిఆజ్ఞ" అని దానిని కన్నులకు అద్దుకొని, ఇద్దరు దాసీలను పిలిపించి, ప్రయాణానికి కావలసినంత పాలు, పండ్లు తీయించుకొని, లక్ష్మీదేవిగారిని నెమ్మదిగా రథంపై ఎక్కించి కూర్చోబెట్టి, తాము, గోవిందామాత్యులు, శివగంగ ప్రెగ్గడ, నగర రక్షకులు మరొక రథంలో కూర్చొని, శివగంగకు ప్రయాణమయినారు. హేమాద్రి ప్రధానులు ఆక్షణమే రాజధానికి పయనమయినారు.

## 4

ప్రభువులు శాంతల కళేబరాన్ని భుజంపై మోసుకొని, కొండశిఖరం చేరినారు. పది అడుగుల కొకమారు అలసటలో నిలబడుతూ, చుట్టూ చూస్తూ, "శాంతలా, ఓ—శాంతలా" అని నాల్గు దిక్కులా పిలిచి, సమాధానం వస్తుందా అని కాచుకొని చూచి, రాకపోగా, ఖిన్నులై ఇంకా కొంచెం దూరం చాల శ్రమపడుతూ ఎక్కిపోతున్నారు. మధ్యాహ్నం, చైత్రమాసపు ఎండ. తల కాలుతున్నది. కొండ ఎండకు

కాలిపోయినది. గాలి అలికిడేలేదు. ప్రభువుల శరీరంలోని రక్తపు ద్రవభాగంలో సగం చెమటయి ఓడికలుకట్టి పోయినది. ద్రవపదార్థం పోయిన రక్తం ఇప్పుడు ఘనీభవించసాగినది. హృదయం అతికష్టంతో పనిచేస్తున్నది. ప్రభువుల నాలుక, గొంతుక పూర్తిగా ఎండిపోయినవి. నోరు తెరుచుకొనే ఉంది. శరీరపు ఎరుపురంగు చెడి, నలుపు తిరుగుతున్నది. కళేబరాన్ని మోయడానికి శక్తే చాలకపోయినది. అప్పుడు ప్రభువులు కళేబరానికి చుట్టిన కాశేయాన్నే తమ మెడకు చుట్టుకొని, దానిని జోలెవలె చేసుకొని, దానిలో శాంతల కళేబరం పెట్టి, దానిని రొమ్ముమీద వేసుకొని, రెండు చేతులతో మహాప్రీతితో కాగిలించుకొని పట్టుకొని, కొండలో ఒక భాగం వెదుకుతూ, తమ దేవిని పిలుస్తూ నడుస్తూనే ఉన్నారు. ప్రభువుల ముఖంలో ఉన్న తేజస్సునాశనమై, ముఖచర్మం ఎండకు మాడి, వాడి, వివర్ణమయినది. వెంట్రుకలు చెదరి, ధూళితో నిండి ఎర్రబడినవి. ధరించిన వస్త్రాలు చెట్టుకు పుట్టకు చిక్కుకొని ముక్కలు ముక్కలయి, చీలికలు వాలికలయినవి. చేతులు, కాళ్లు, దేహంలో అనేక భాగాలు గీచుకొనిపోయి, గాయమయి, రక్తం పారి కరుడు కట్టినది. చేతులలో ఉన్న కళేబరం వాసనకొట్టడం మొదలయినది. ప్రద్యుమ్నునివలె ఉన్న ప్రభువు ఇప్పుడు వికారంగా కనిపిస్తున్నారు. మూడు మూడు అడుగులకు, నాల్గునాల్గు అడుగులకు "శాంతలా...ఓ...శాంతలా" అని బలంగా అరుస్తున్నారు. అలాగు అరిచి, అరిచి గొంతు సన్నగిల్లిపోయినది. ధ్వని బొంగురు పోయినది. ఒక్కొక్కమారు పొదలలో తొంగిచూచి, "శాంతలా!" అని నెమ్మదిగా పిలుస్తారు. మరొకమారు గుండ్ల సందులలో తలదూర్చి "దేవీ? ఇక్కడున్నావా?" అని పిలుస్తారు. తాము ఇప్పుడున్న స్థలంనుంచి ఇంకా కొంత దూరంలో ఉండవచ్చునని గట్టిగా "శాంతలా...శాంతలా..." అని అరుస్తారు. చాల అలసటయినప్పుడు ఆ మండే ఎండలోనే నిలబడుతారు. ఎండకు బాగా కాలిన బండలు నిప్పులవలె అరకాళ్ళను కాలుస్తున్నవి. ఇంత సహించరానిబాధలు కలుగుతున్నప్పటికీ ఆ ప్రేమికి తమ దేహపు జ్ఞానమేలేదు. "తమ ప్రేమ విశ్వాసాల లోతును తమ సఖి ఎరుగును. ఆమె ఆత్మ ఈ రేడులోకాలలో ఎక్కడున్నా తమ యీ హృదయబాధకు, పిలుపుకు రానేవస్తుంది. తమ



దేహాన్ని అంటిపెట్టుకున్న ప్రియురాలి కళేబరం సజీవమవుతుంది; శాంతల బతుకుతుంది." అని ప్రభువులు దృఢంగా నమ్మినారు.

కొంచెం అలసట తీరిన వెంటనే మళ్ళీ "శాంతలా,...శాంతల...శాంతల" అని పిలుస్తారు. గొంతునుంచి ఇప్పుడిప్పుడు ధ్వనే వెలువడడం లేదు. "దేవీ, ఇంకెక్కడున్నావు? ఇంకెంతని వెదకను? దేవి, జన్మజన్మానికి దగ్గిరికి వచ్చి పునః దూరదూరమై పోయినాము; తెలుసుకోలేదు. మరల ఇట్లు కావద్దు. నీ ఆయుస్సు ముగియలేదు శాంతలా...నాది ముగిసినప్పుడు గదా నీదీ ముగియవలె. ఒకరుపోయి ఒకరు మిగులడం ఎలాగు? ఇది కల్ల. మనమిద్దరం అనంతకాలపు సహపథికులం; అనంతకాలపు స్నేహితులం. సఖి, ఎక్కడినుంచి వచ్చినామో! ఎక్కడికో! ఎందుకో! నేను ఇక ఒక్కడినే ఉండలేను. ప్రేమకు చావులేదని నమ్మినవాడిని నేను; ప్రేమమే దైవమని నమ్మినవాడిని నేను. నేను ఏ దైవాన్ని ఉపేక్షించినాను? ఏ అపరాధం చేసినాను? నారాయణా!...నా శాంతలను నాకు ఈ. నీవు ఇకేమి యిచ్చినా వద్దు....వద్దు....శాంతలా....శాంతలా...శాం...త..." ప్రభువుల కాళ్లు కుసిపడిపోయినవి.

## 5

ఆక్కడ మాచికబ్బె, మారసింగమయ్యగారు కూర్చున్న రథం రాజధాని చేరినప్పుడు చర్మవాద్యాల మహారవం భీకరంగా వినిపిస్తున్నది. ఆరుగురు నాయకుల దేహాలు నిప్పులో కాలుతున్నవి.

రథం ఇల్లుచేరి మాచికబ్బె, మారసింగమయ్యగారు రథంనుంచి దిగుతున్నప్పుడు ఇంటిముందు అపారమయిన జనసమ్మర్దమయినది. రథంలో మహారాజ్ఞి కళేబరం తీసుకొని వచ్చినారని జనం భావించినది. అందరి కనులలోను నీరు ధారగట్టినది. రథంలో మహారాణి కళేబరంలేదని జనానికి తెలిసినది. మాచికబ్బెకు పరిచితులయిన స్త్రీలు కొందరు ముందుకు వచ్చి, "అమ్మా, మా భాగ్యం దీరుపోయినదా? మా భాగ్యలక్ష్మి, మా రాజ్య

లక్ష్మి, హొయిసళలక్ష్మి పోయినదా? మా కామధేనువు...మా కల్పతరువు పోయినదా? మీ ధర్మం, ప్రభువుల ధర్మం, ఎవరి పుణ్యమూ ఆమెను కాపాడలేదా? ఈ వయస్సులో మీకీ దుఃఖం రావచ్చునా? మాకీ దుర్గతి రావచ్చునా?'' అని తమ కడుపులోని బాధను తోడుకొని, ఆమె దుఃఖాన్ని మరికొంత హెచ్చుచేసినారు. సోవల మహాసతి అయిన వివరాలన్నిటినీ ఆ దుఃఖంలోనే మాచికబ్బెకు వర్ణించి చెప్పినారు. మాచికబ్బె దుఃఖం మరల ప్రబలమయినది. ఆమె ''హొయిసళ రాజేశ్వరి పోయినది. నా హృదయమణి పోయినది. కోడలు సోవల మహాసతి అయినది. ఇక నా మహాలక్ష్మి మాత్రం దక్కుతుందా?...లేదు. అక్కను పోగొట్టుకొన్న ఆమె ఉండదు....ఖండితంగా ఉండదు. ప్రభువులూ ఉండరు. కుమారుడు అక్కతోపాటే పోయినాడు...హొయిసళరాజ్యం, రాజవంశం అంతా బూడిద అయినది. నేనిక ఉండలేను...నాకు చావు రానీ. నాకు చావురానీ.'' అంటూ గోడు పోసుకొన్నారు.

ఆ దుఃఖంలోనే ఆమె దైవం ఆమెకొక దారి చూపినది. వెంటనే మాచికబ్బె పతివద్దకు వచ్చి, తమ మనోనిశ్చయాన్ని వారికి తెలిపినారు. రెండు నిమిషాలకాలం ఆ సహృదయునికీ ఉత్తరం చెప్పడం సాధ్యం కాలేదు. తుదకు ''మాచీ, నీ సంకల్పానికి నేను అడ్డువచ్చేవాడిని కాను. కావచ్చు'' అనినారు.

మాచికబ్బె సల్లేఖనానికి మనసివ్వడం ఇతరులకు తెలియకపోలేదు. దుఃఖ పరామర్శ చేయడానికి వచ్చిన కేతమల్లనాయకులవారికి, జక్కియబ్బెగారికి మారసింగమయ్యగారే తెలిపినారు. ఆమె సంకల్పాన్ని అడ్డగించవద్దనీ ఆయనే తెలిపినారు.

అంతలో హేమాద్రి ప్రధానుల రథాన్ని తోలుకొని వచ్చిన సారథి వెనుకటిరాత్రి మాచికబ్బె, మారసింగమయ్యగారలను రథంలో వేలాపురికి తీసుకొని పోయినవాడు మాచికబ్బె వద్దకు వచ్చి తాను చెప్పవచ్చునా, కూడదా అన్న వివేచనలేక ''దండనాయకివారూ, ప్రభువులు శాంతలాదేవి కళేబరాన్ని రథంలో పెట్టుకొని, తామే రథం తోలుకొని, అర్థ



రాత్రికి శివగంగకు వెళ్ళినారట. తెల్లవారే వరకూ ఈ విషయం ఎవరికీ తెలియలేదు. ప్రభువులు శివగంగకు ఎందుకు వెళ్లినారో! మహారాజ్ఞి శరీరాన్ని ఎందుకు తీసుకొని వెళ్లినారో?—అని వేలాపురి భయాశ్చర్యాలతో నిండినది. అచ్యుత గోవిందామాత్యులు లక్ష్మిదేవిగారిని పిలుచుకొని నేడు ఉదయం జాము పొద్దెక్కగా శివగంగకు పోయినారు. ఆ వేళకు శివగంగనుంచి ప్రెగ్గడలు వచ్చినారు. నేను హేమాద్రి ప్రధానులరథాన్ని ఇప్పుడే ఇక్కడికి తోలుకొని వచ్చినాను.'' అని సమాచారాలన్నిటినీ, సమగ్రంగా పూసగుచ్చినట్టు చెప్పినాడు. మాచికబ్బె చెవులు మూసుకొని, ''చాలు చాలు. నాకింకేమీ తెలుపకండి. ప్రభువులు ఆత్మార్పణకోసమే వెళ్ళినారు. నా లక్ష్మికూడా అక్కయ్య మార్గాన్నే అనుసరించడానికి వెళ్లినది. ఇకేమున్నది? హొయిసళేశ్వరులూ, వారి కుమారులూ, దేవేరులూ అందరూ వెళ్లిన పిదప...ముగిసినది.'' అనినది.

బీదలను, బంధుబాంధవులను, విద్యా వినయ సంపన్నులయిన బ్రాహ్మణులను, కులగురు పీఠంవారిని, చైత్యాలయాల ఇంద్రులను, దీనులను అందరిని మధ్యాహ్నం తమయింటికి పిలిపించుకొన్నారు మాచికబ్బె. తాము స్నానంచేసి, శాంతినాథస్వామి దర్శనం చేసుకొని వచ్చి ఒక్కొక్క బ్రాహ్మణునికి ఒకొక్క కపిలగోవు, రెండు రెండు గద్యాణాలు దానమిచ్చినారు. స్థిరాస్తిని—పొలం, చేను మొదలయిన వాటిని శాంతినాథ బసదికి దానమిచ్చి శాసనం వేయించినారు. తమ భవనాన్ని, శారదాలయాన్ని చందలకు ఇచ్చినారు. నగరువారు తమ గౌరవార్థమిచ్చిన రథాన్ని, గుర్రాలను, మేనాను నగరు భాండాగారానికి అప్పగించి వేసినారు. ఇంటిలోని సమస్తమైన నగనట్రు, వస్త్రాలు పాత్రలు, పదార్థాలు పేదసాదలకు పంచిపెట్టిన తర్వాత కూడా నాలుగుబండ్ల సామాను మిగిలినది. ఈ వస్తువులన్నిటినీ బండ్లలో నింపి, బండ్లమీద ''కఃకేనార్థీ'' అని వ్రాయించి, ఏది కావాలన్నవారికి బండినుంచి దానిని తీసి ఇస్తూ, పతితోపాటు దేచయ్య వెంటరాగా ఇంటిని వదలి బయలుదేరినారు. రాజధాని ఎల్లలు దాటి, శ్రవణ చెళుగొళదారిని మాచికబ్బె తొక్కినప్పుడు పిల్లలవలె కన్నీరు కురిపిస్తూ, తమను అనుసరిస్తున్న బంధువు

లను, పరిచితులను, పురజనులను చూచి, అక్కడే నిలబడి, "మీ యిండ్లకు మరలిపొండి. మేము మీతోపాటు ఉన్నకాలం సుఖంగా గడిపినాము. మీ అందరి ప్రేమవిశ్వాసాలు మాకు అతి సంతోష భారమయినవి. మా కిప్పుడు పిలుపు వచ్చినది. ముందుకు వెళ్లుతున్నాము. మీరంతా ఇంత దూరం మమ్ములను పంపడానికి వచ్చినారు. ఇక నిలవండి. మీమీ ఇండ్లకు మరలిపొండి." అనినారు. "అయ్యో! అన్ని భాగ్యాలూ పోయినమీదట, అందరు గుణవంతులూ పోయిన మీదట తల్లిదండ్రుల వంటి ప్రభువులు, మహారాజ్ఞి పోయిన మీదట మాకు ఊరేది ? ఇల్లేది ? ఇక ఈ రాజ్యాన్ని ఎవరేలితే ఏమి ?" అని జనం విలపిస్తూ వెనుదిరిగి పోయినారు.

అప్పుడు కేతమల్ల నాయకులు, జక్కియబ్బె చందలను పిలుచుకొని ముందుకువచ్చి, మాచికబ్బెతో "అమ్మా, దీనిని మీరు మీ కుమార్తెవలె సాకి, విద్యాబుద్ధులు చెప్పించినారు. మీ భవనాన్ని దీనికి ధారపోసి నారు. ఇది మా కింతమాత్రం కుమార్తెయో, దానికన్నా మించి మీకు కుమార్తె. మా ప్రార్థన ఒకటి ఆలకించండి : మీ ప్రాణాలున్నంతవరకు ఇది మీ సేవలోఉండి, అనంతరం మావద్దకురాని. ఇది మామనస్సుకు తృప్తి. వద్దనకండి." అని బలవంతంచేసి, చందలను మాచికబ్బెకు అప్ప గించి, రాజధానికి మరలినారు.

రాత్రి అయినది. దీవిటీల వెలుగులో మాచికబ్బె చందల చేయిపట్టు కుని ముందు బయలుదేరినారు. ఆమెతోపాటే మారసింగమయ్యగారు, దేచయ్య నడచినారు. వీరికి కావలసిన గుడ్డ గుడుసూతో చిన్న ఎడ్లబండి ఒకటి వారివెంట నడచినది.

# 6

శివగంగ మార్గంలో అచ్యుత గోవిందామాత్యులు, ప్రెగ్గడలూ కూర్చున్న రథం, దానివెనుక లక్ష్మీదేవి, దాసీలు కూర్చున్నరథం వేగంగా వెళ్ళుతున్నవి. గవ్యూతి గవ్యూతికీ గుర్రాలను మార్చడంవల్ల రథాలు



వేగంగా వెళ్ళడం సాధ్యమయినది. మధ్యాహ్నం దాటినతర్వాత ఒక జాముకు లక్ష్మీదేవికి పూర్తిగా ప్రజ్ఞ కలిగినది. మార్గంలో దాసీలు ఆమెకు అప్పుడప్పుడు పండ్లు పాలు ఇస్తున్నారు. ఆమె మూగవలె వాటిని పుచ్చు కొనేది; మధ్యమధ్య కొంచెంసేపు నిద్రపోయేది. తాను రథంలో కూర్చు న్నట్టుకాని, రథం వేగంతో వెళ్లుతుండడంగాని ఆమెకు తెలియలేదు.

ప్రజ్ఞ త్వరగా పూర్తిగా వచ్చినది. లక్ష్మీదేవి మాట్లాడినది : దాసీ లతో "ఇది ఏమిటి ? రథంలో మనం ఎక్కడికి వెళ్ళుతున్నాము ?" అని ప్రశ్నించినది. దాసీలు సమాధానం చెప్పలేదు. లక్ష్మి మరల ప్రశ్నించినది: "ఎక్కడికి పోతున్నాము ? నేను ఎంతసేపు పడుకొన్నాను ? ఇప్పుడు ఎంతపొద్దు ?...ఓ...మీరు నాకు ఔషధం ఇచ్చినారుకదూ !...కాదు... కాదు...ప్రభువులే ఇచ్చినారు. నన్ను "నోరుతెరు" అనిచెప్పి, నోటిలో మందు వేసినారు; ఆమీదట పెద్ద నిద్ర వచ్చినది. కలగన్నాను...అమ్మ వచ్చినారు;...పిన్నయ్య వచ్చినారు... నాకు ఒంట్లో అస్వస్థత కలిగినది. ఇంకా తల బరువుగానే ఉన్నది...ఇప్పుడు మనం ఎక్కడికి వెళ్ళుతు న్నాము ?... అక్కయ్య శివగంగనుంచి వచ్చినారా ? తమ్ముడు వచ్చి నాడా ? ఎందుకు నేను మాట్లాడించినా, మీరు మాటలాడడంలేదు ? హాఁ ! ఇది ద్వారవతి మార్గమేనా ? వేలాపురినుంచి ద్వారవతికి వెళ్ళు తున్నామా ?...ఊహుఁ ! లేదు. ఇది ద్వారవతి దారేకాదు. నాకు తెలి యదా ? మనం దారి తప్పినాము. రథం ఆపమని సారథికి తెలుపండి. ఎదుట కనిపించే కొండఏమిటి ?...ఆఁ...మీరిద్దరూ ఎందుకు మాట్లాడరు ? రథం ఆపమనండి. ఈక్షణమే చెప్పండి. ఇదేమి పిల్లాట ? క్షమించరానిది! నాకిక కోపంవస్తుంది." అని ఆశ్చర్యంతో, కోపంతో మాట్లాడినది.

"లక్ష్మీదేవిగారు మేల్కొన్నా వారితో మీరు మాట్లాడకూడదు. వారికి ఏసంగతీ తెలుపరాదు. జాగ్రత !" అని దాసీలను హెచ్చరించి నారు అచ్యుతామాత్యులు. ఇప్పుడు ఇద్దరు దాసీలు తమ ప్రశ్నలకు ఉత్తర మివ్వకపోవడం చూచి లక్ష్మీదేవి కోపంతో "మీరు చెబు తారా,...లేకపోతే నేను రథంనుంచి, దూకేనా ?" అనినారు. దాసీలు వణికిపోయినారు. కంపిస్తున్న ధ్వనితో "కొంచెం తాళండమ్మా దేవేరి

గారూ! ముందు రథంలో అచ్యుతామాత్యులూ, గోవిందామాత్యులూ ఉన్నారు. వారే వచ్చి, మీతో మాట్లాడుతారు.'' అని విన్నవించి, సారథితో, ''రథం త్వరగా నడిపి, ముందున్న రథాన్ని కేకవేసి ఆపు'' అనినారు. సారథ రథాన్ని త్వరగా నడిపి, ధ్వని వినబడేటంత దూరం నుంచే ముందున్న రథసారథనిపిలిచి, రథం ఆపమని కోరినాడు. ముందున్న రథం ఆగినది. అచ్యుత గోవిందామాత్యులు భయపడి వెనుదిరిగి చూచినారు. దాని ఒకతె వెనుకటి రథంనుంచి కిందికి దిగి, అచ్యుతామాత్యుల వద్దకువచ్చి, లక్ష్మీదేవి చెప్పిన మాటలన్నిటినీ అమాత్యులకు అప్పగించినది. అచ్యుతామాత్యులు ధైర్యం చెడక రథంనుంచిదిగి, లక్ష్మీదేవి ఉన్న రథం వద్దకు వచ్చి, వినయంతో నమస్కరించి, ''రాజ్ఞిగారు సావధానంగా అవధరించవలె...శివగంగకు వెళ్ళుతున్నాము...ఊరు దగ్గరకు వచ్చినాము. ప్రభువులు శివగంగలో ఉన్నారు.'' అని విన్నవించినారు.

''లేదే! ప్రభువులు వేలాపురిలోనే ఉన్నారు. అక్కయ్య తమ్ముడూ, ఇద్దరుమాత్రం ఇక్కడికి వచ్చినారు. నన్ను రమ్మన్నారా?'' అని ప్రశ్నించినది లక్ష్మి.

''దేవిగారు అవధరించవలె. ప్రభువులు నిన్నరాత్రి ఇక్కడికి వచ్చినారు.''

''లేదే ? నిన్నరాత్రి నాకు ఔషధమిచ్చినారు.''

''అనంతరం ఇక్కడికి బయలుదేరి వచ్చినారు.''

''అంతరాత్రి ఇక్కడికి ఎందుకు బయలుదేరి వచ్చినారు ? నాకు శరీరంలో స్వాస్థ్యం ఉండలేదు. నన్ను పిలుచుకొని రండని మీతో సెలవిచ్చి వెళ్ళినారా ? వారే ఎందుకు నన్ను పిలుచుకొనిపోలేదు? అక్కయ్య రమ్మని చెప్పించినదా ?''

అచ్యుతామాత్యులు తమనుతామే శపించుకుంటూ, ''దేవిగారు ఇక్కడికి రావడంవల్ల మన సామ్రాజ్యమే ఇప్పుడు జీవించవచ్చు. లేకపోతే, హొయిసళరాజ్యపు అంతిమ దినమిది. ప్రభువులు ఇక బ్రదుకవలసినా తమ పుణ్యబలం ఒక్కదానితోనే. ఈ ఆశతోనే తమను ఇక్కడికి పిలుచుకొని వచ్చినాము. తామిప్పుడు ఈ రాజ్యానికి తల్లి. వయస్సులో మాత్రం నేను తమకంటే పెద్దవాణ్ని; తమ దివ్య చరణాలకు చేతులు జోడించి వేడుకుంటున్నాను. ప్రభువులను మనం దర్శించేవరకు దయచేసి, ఎవరినిగాని ఏ ప్రశ్న ఏ విషయమూ అడగకుండా ఉండండి. ఇప్పుడు మనమందరం ఒక్క మహా సంకట పరిస్థితిలో చిక్కుకొన్నాము. 'భగవంతుడా, మమ్ములను నేడు ఏలాగున అయినా కాపాడు !' అని వేలాపురి నుంచి బయలుదేరిన నిమిషం మొదలు ఇంకా విజయనారాయణుని స్మరణ చేస్తూనే వస్తున్నాము. దేవిగారు అధైర్యపడరాదు. తమ సౌభాగ్యంమీద మాత్రమే మాకు విశ్వాసం ఉన్నది. తమ పుణ్యమొక్కటే మా అందరినీ ఇప్పుడు కాపాడవలె.'' అంటూ లక్ష్మీదేవి పాదాలు తాకి కన్నులకు అద్దుకొనినారు.



లక్ష్మీదేవి తన పాదాలను సత్రున వెనక్కు లాగుకొని, ''ఇది కూడదు. ఇది తగదు. మీరు నాకు అన్నయ్యగారి వంటివారు.'' అంటూ అచ్యుతులవారి కుడిచేతిని తన రెండు చేతులతో పట్టుకొని, కండ్లకు అద్దుకొని, తన తలపై పెట్టుకొన్నది. ''అన్నగారి మాటలతో నాకు చాల భయం కలుగుతున్నది. నా నోటిని కట్టివేసినారు. నేను ఇక ''ఏమి ఎందుకు?'' అని అడుగను. భయనివారకుడయిన శ్రీనరసింహుని ధ్యానిస్తూ మౌనంతో ఉంటాను. అన్నగారి ఎడ నాకు పూర్ణమైన విశ్వాసం ఉన్నది.'' అనినది హొయిసళ మంగళదేవి లక్ష్మి.

అచ్యుతులవారు వెళ్లి తమ రథంలో కూర్చున్నారు. రథాలు రెండూ, రెండుగడియల తర్వాత శివగంగ చేరినవి.

## 7

ఆవేళకు శివగంగలో నానావిధ విచిత్రవార్తలు పుట్టి వ్యాపించినవి. గొర్రెలకాపర్లు పశులకాపర్లే ఈవార్తలను తీసుకొనివచ్చి విత్తినవారు. ఇప్పుడీవార్తలు చుట్టుముట్టు గ్రామాలంతటా వ్యాపించిపోయినవి.

ఆదినం ప్రాతఃకాలం పసులను కొండమీదికి మేపడానికి వెళ్ళిన వారు సగం గుట్ట ఎక్కగానే "ఓ...శాంతలా...శాంతలా" అనే అరుపులు ప్రతి గుండు సందునుంచీ రావడం విన్నారు. శాంతలా మహారాజ్ఞి, వారి తమ్ముడు కుమారవిష్ణువు వెనుకటిదినమే ఆకొండలో దుర్మరణం పొందినసంగతి ఆప్రాంతానికి తెలిసినదే. కొండ అడివారం నాల్గువైపుల గ్రామాలనుంచి మేతకోసం కొండమీదికి పసువులను తోలుకొని వెళ్లిన వారికి "శాంతలా...ఓ...శాంతలా!" అనే కేక, ప్రతిధ్వనులతోపాటు పైపైన వినిపిస్తూనే ఉన్నది. ఈకేక ఒకమారు దగ్గరినుంచి వచ్చినట్టు, ఒకమారు దూరంనుంచి వచ్చినట్టు, ఒక్కొకసారి తీరా పక్కనుంచి వచ్చినట్టు వినిపించినది. గాలి ఎటువీస్తే అటు అక్కడక్కడ బండలసందులలో గుండ్లసందులలో ప్రతిధ్వనులు వినిపించేవి. ఒకరిద్దరు కన్నులకు దూరంలో తెల్లటి గుడ్డలు కట్టుకున్న ఉన్నతపురుషాకృతి ఒకటి దేనినో చేతులతో పట్టుకొని "శాంతలా...ఓ...శాంతలా" అని కూతలు పెడుతూ బండనుంచి బండకు వెళ్లుతుండడం కనిపించినది. దానిని వారు కుమారవిష్ణువు దయ్యమని, అక్కయ్యను వెదుకుతూ ఈవిధంగా కొండంతా తిరుగుతున్నదనీ భావించినారు. తమతమ మనస్సులోని భయాన్ని మరింత పోషించుకొన్నారు. "కొండమీద ఉంటే, దయ్యం తమ కుత్తుకలు పిసికి చంపీని" అనే భయంతో పసువులను తోలుకుని దడదడ కొండదిగి తమగ్రామాలు చేరుకున్నారు. "కుమారవిష్ణువు దయ్యం తన అక్కయ్యను వెదుకుతూ కొండమీదే తిరుగుచున్నది. మేము దీనిని మా కండ్లార చూచినాము. భయపడి పరుగెత్తి వచ్చినాము.' అని ఊరంతా వార్త వ్యాపింపజేసినారు. "శాంతలా...ఓ....శాంతలా" అనే కేక పైపైన తమకూ వినిపించినదని గ్రామాలవారూ అంగీకరించినారు. శివగంగ గ్రామవాసులూ ఈకేక విన్నవారే. దేవదర్శనంకోసం కొండకు వెళ్లిన జనమూ ఈపిలుపు విన్నారు. అందరినీ భయం ఆవరించుకొన్నది.

శివగంగ చేరినప్పుడు ఈవార్త అచ్యుతగోవిందామాత్యులకూ తెలిసినది. ఇది తమ ప్రభువులే కావచ్చునని వారి మనస్సు కొంచెం కుదుటపడినది. ఈ వదంతులు లక్ష్మీదేవిగారికి, దాసీజనానికి చెవిని పడకుండా చూచుకున్నారు అమాత్యులు.



వీరందరూ శివగంగకు రావడం ఊరిలోనివారి ఊహాపోహాలను మరింత ఉత్తేజపరచినది. "ఆ పిలుపును మేము విన్నాము" అని చెప్పిన వారిని అచ్యుతగోవిందామాత్యులు గుట్టుగా పిలిపించుకొని, కూలంకషంగా విచారించినారు. "ఎక్కడ విన్నారు? అప్పుడు మీరు ఎక్కడున్నారు? అప్పుడు పొద్దెంత? పిలుపు స్పష్టంగా వినబడినదా? ఎంత సేపు వినిపించినది? ఆకారం చూచినవారెవరు? ఆ ఆకారమే పిలిచేదా? ఎంత ఎత్తున్నది? ఏరంగు గుడ్డలు? నడిచిపోతూ ఉండినదా? తేలిపోతూ ఉండినదా? ఆ ఆకారం మీవైపు చూచినదా?" ఈవిధంగా ప్రశ్నించి, సమంజసమైన, అసమంజసమైన సమాధానాలు విని, సత్యాసత్యాలు తేల్చుకున్నారు.

అచ్యుతులవారికీ, గోవిందులవారికీ ఈఆకారం ప్రభువులే ఉండవచ్చునని నిర్ధారమయినది. "మధ్యాహ్నం తర్వాత జాముకు ఆ పిలుపులు కేకలు నిలిచిపోయినవి. ఆమీదట వినబడలేదు." అని జనం అనడం విని వారికి భయం కలిగినది. "తర్వాత ఏమయినది? ఏమయి ఉంటుంది?" అనేది వారి ఊహకూ మించిపోయినది. రాజ్యవిషయాలలో ఎంతటి కఠిన సమస్యనయినా ధృతి చెడక, ఓరిమిలో వివేచనలో చిక్కులు విడిపించే ఆ చతురామాత్యులకు ఇప్పుడు బుద్ధి పనిచేయడమే మానింది. "ప్రభువులు ఏమయినారో, బుద్ధి మారిపోయినదో, అలాగయితే ఏమిగతి? లక్ష్మీదేవిని గాని మనలనుగాని గుర్తుపట్టకపోతే ఏమిగతి? ప్రభువులు పగలు మూడు జాములవరకు శాంతలాదేవి పేరుపిలుస్తున్నవారు అనంతరం ఎందుకు ఊరకే అయినారు? ఏమయి ఉంటుంది? ఏమి సంభవించి ఉంటుంది? భగవంతుడా, ఎంతటిబాధ తెచ్చిపెట్టినావు? ఒకదానిమీద ఒకటిగా బాధలు వస్తూనే ఉన్నవిగదా?" అని అమాత్యులిద్దరూ చాల భయపడినారు. "ఇక ఏమయితే ఏమి? ఆ కొసపనికూడా జరిగిపోనీ! అప్పుడు అక్కయ్యను పిలుచుకొని తమ్ముడు వచ్చినాడు. ఇప్పుడు మనం మన చెల్లెలిని పిలుచుకొని వచ్చినాము. గోవిందామాత్యులవారూ, మన రుద్రభూమికూడా ఇక్కడే. పరమేశ్వరా, అంతా నీయిచ్చప్రకారమే జరుగనీ." అని అచ్యుతామాత్యులు తక్షణమే ఒక ఉయ్యాలతొట్టెను తెప్పించి, లక్ష్మీదేవిగారిని ఎంతో బలవంతంమీద దానిలో కూర్చొపెట్టి

నారు. శిబికవాహకులు తొట్టెలను మోసుకొని కొండ ఎక్కడం ప్రారంభించినారు. దానివెంటనే దాసీలిద్దరూ నడిచినారు. వెంట అచ్యుత గోవిందామాత్యులు, ప్రెగ్గడలూ, నగరరక్షకులూ, ఒకరిద్దరు పురప్రముఖులు కొండను ఎక్కినారు.

“కొండను ఎక్కి ఎక్కడ వెదకడం?” అనే ప్రశ్న అప్పుడు అచ్యుతామాత్యులకు కలుగలేదు.” కొండ శిఖరానికి వెళ్లి ప్రభువులను గట్టిగా ఆహ్వానించడం, లక్ష్మీదేవిగారి పుణ్యంలో ఉత్తరం వస్తే, ఆవైపు వెళ్ళి వెదకడం, ఫలకారి అయితే, ఊరినుంచి నూరుమందినైనా పిలిపించి, దివిటీలు తెప్పించి, కొండమీది ఇరుకులు, సందులూ ఒక్కటీ వదలకుండా వెదకడం—దీనిమీద వైవేచ్ఛ.” అని మనస్సు గట్టిపరచుకొన్నారు.

కొండ శిఖరం చేరేవేళకు సాయంకాలం సూర్యాస్తమయ సమయం సమీపించినది. లక్ష్మీదేవి, దాసీలు కొండవేడిమికి, ఎండవడకు వాడిపోయినారు. అప్పుడు ప్రెగ్గడలు “మహారాజ్ఞివారు అపఘాతం పొందినది ఈ చోటనే” అని నెమ్మదిగా అచ్యుతుల చెవిలో చెప్పి, కోడుగల్లు బసవణ్ణ విగ్రహంవైపు చేయెత్తి చూపినారు. అచ్యుతులవారికి మొదట ఆ వైపు చూదామని మనస్సయినది. “నడవండి” అని ప్రెగ్గడలను ముందు పెట్టుకొని అందరూ అనుసరించినారు.

అందరూ కోడుగల్లు బసవణ్ణ ఉన్న స్థలం చేరినారు. లక్ష్మీదేవిగారు పెదవి కదపక, కండ్లు మూసుకొని, స్థిర మనస్సులో నరసింహుని ధ్యానిస్తున్నారు. దాసీలకు మాత్రం మనస్సులో యేమిటేమిటో సంశయం ఏమేమో భయం పొడచూపినా, మౌనంగానే ఉన్నారు. ప్రెగ్గడలు అచ్యుతామాత్యులతో పాటు చుట్టూ పరికించిచూచి, వారికి “అదిగో అదే స్థలం” అని నెమ్మదిగా చెప్పినారు. ప్రెగ్గడలు చేతులు చాచిచూపిన స్థలాన్ని అచ్యుతులవారు శ్రద్ధగా దృష్టిసారించి చూచినారు. ఎవరో నిలబడినట్టు కనబడినది. గోవిందామాత్యులను పిలిచి, “అక్కడ ఎవరో నిలబడినట్టు కనబడడంలేదూ?” అని ప్రశ్నించినారు. గోవిందామాత్యులు “ఔను, ఎవరో నిలబడివున్నట్టే కనబడుతున్నది” అన్నారు. ఒకటి రెండు నిమిషాలు ఆ విధంగానే చూస్తున్నప్పటికీ, ఆ వ్యక్తి తాను నిలబడిన



స్థలంనుంచి కదలలేదు. అచ్యుతామాత్యులకు “హేభగవాన్, ఏమి ప్రభువులే అయివుండవచ్చునా?” అనే దూరపు ఆశ తల ఎత్తినది. అంతసేపు ఆ వ్యక్తి కదలక నిలబడివుండడం చూచి, ప్రెగ్గడలు “ఓహో! ఎవరది? నిలుచున్నది?” అని గట్టిగా కేకవేసినారు. అచ్యుతులవారు వెంటనే ప్రెగ్గడల నోటిని బలంగామూసి పట్టుకొని, “అరవకండి, అరవకండి. ఇప్పటికి మనం వెదుకుతున్న దైవం వారే కావచ్చు! నడవండి. కొంచెం సమీపంనుంచి చూదాము. ఆ వైపు వెళ్ళడానికి దారిఉన్నదా?” అని అత్యాతురతతో ప్రశ్నించినారు.

అక్కడికి వెళ్ళడానికి సరైన మార్గంలేదు. ప్రెగ్గడల అనుభవంలో నెమ్మది నెమ్మదిగా దారి చేసుకుంటూ నడిచినారు. తొట్లెను మోసుకున్న బోయీలకంతా చాల కష్టమయినది. లక్ష్మీదేవి, ఏదో మహాపత్తులో ఉన్నామన గ్రహించి తలవంచి భగవన్నామస్మరణలో నిమగ్నురాలయినది.

# 8

ఉదయంనుంచి పత్ని కళేబరాన్ని రొమ్ముకు కట్టుకుని ‘శాంతలా... ఓ...శాంతలా’ అని అడుగడుగుకూ పిలుస్తూ, కాళ్లుచేతుల నొప్పికంటే హృదయకాతరత నూరింతలయి, ఆ చైత్రమాస మధ్యాహ్నంలో, పైన నిప్పు, కింద నిప్పు, హృదయంలో పెద్ద నిప్పు—ఈ మూడు నిప్పుల నడుమ కాలి బెండయి, కొండ అంతా తిరిగి, కట్టిన బట్టలు పేలికలై, శరీరంలో పెక్కు గాయాలలో, కాలిన పండువంటి ముఖంతో, ముందుకు అడుగు వేయడానికి కూడ శక్తి చాలక ప్రభువులు సర్వచైతన్యమూ ఉడిగి, నిలబడి పోయినారు.

ప్రభువులు ఇప్పుడు గుర్తుపట్టనంత వికారమయినారు. మధ్యాహ్నం తర్వాత తిరుగుతూ, జామున్నరకు ఆ స్థలానికి వచ్చినవారు అక్కడనుంచి ముందుకు కదలలేక నిలబడిపోయినారు. అక్కడికి కాళ్ళు కట్టివేసినట్టు అనుభవమయినది. కళేబరభారం ఇక మోసుకొని నిలబడడానికి వారికి చేతకాలేదు. కత్తుకకు కట్టుకొన్న జోలెనువిప్పి, కళేబరాన్ని నేలమీద

తమముందు పెట్టుకున్నారు. శాంతలాదేవి ఏ చోటపడి ప్రాణం వదలినారో, ఆ చోటికే ఇప్పుడు ఆమె కళేబరం చేరినది. ఏదో అవ్యక్తమయిన శక్తే ప్రభువులను ఆస్థలానికి పిలుచుకొని వచ్చినది. అప్పుడు వారు యోచించినారు : తమ హృదయపు పిలుపు తమదేవికి చేరలేదు. ఇహ జన్మలో ఇక తమకు శాంతల లేదని ఇప్పుడు దృఢపడినది. నిజంగా ఆలోచిస్తే ఈ భూమిపై మానవుని బ్రతుకే ఒక ఘోరం. దీని సమాధానం కోసమే ప్రపంచంలోని నానామతాలు, మార్గాలు, సంప్రదాయాలూ, ఉపదేశకులు, ఆచార్యులు పుట్టి ఉండవలె అనుకున్నారు ప్రభువులు. ఒక సారి గొంతెత్తి పశ్చిమదిక్కులో దిగజారుతున్న సూర్యుని చూచినారు. చేతులు మొగిచి, "భగవన్, నేను మహాపాపి అయిఉండవలె. అందువల్లనే. ఇంత ఘోరదుఃఖం అనుభవిస్తున్నాను. నా శాంతల ప్రాణాలు ఇక్కడే ఎక్కడో ఉండవలె. లేకపోతే విధి నన్ను ఇక్కడికి లాగుకొని వచ్చేదికాదు. హే, ప్రత్యక్షదైవమా ! నీ వెలుగు పశ్చిమాకాశంలో కనిపించకుండా పోవడానికి ముందే, నన్ను నా శాంతలతో చేర్చు. నేటి నీ అంతిమ కిరణాలతోపాటు నా అంతిమ నిశ్శ్వాసం ఉడిగిపోని. నాఅంత్యాన్ని నాకుమారవిష్ణువు అంత్యంవలె నిర్ధరించినాను. ఈభూమ్యాకాశాలకూ, సమస్త భూతాలకూ, సర్వదేవతలకూ, ఇదే నా అంతిమ నమస్కారం." అని జోడించిన చేతులను తలమీద పెట్టుకొని, సూర్యాస్తమయం నిరీక్షిస్తూ, తమ ప్రియురాలిని స్మరిస్తూ, నిలబడినారు.

సూర్యబింబం అస్తమించడానికి ఇక చాలసేపేమీ లేదు. పశ్చిమాకాశం అప్పుడే ఎర్రరంగు దాల్చినది. ఆనాటి సూర్యాస్తమయంతో పాటు హొయిసళ సామ్రాజ్యమూ అస్తమించే పరిస్థితిలో ఉన్నది.

అచ్యుతామాత్యులు ప్రెగ్గడలను, ఇతరులను, దాసీలను దూరాననే నిలిపి, లక్ష్మీదేవిగారిని తొట్లెనుంచి దింపి, నెమ్మదిగా నడిపించుకొని, గోవిందామాత్యులవారితోపాటు ఆ అచలితవ్యక్తి నిలుచున్న ప్రదేశానికి వెళ్ళినారు. అచ్యుతలవారికి ఆవ్యక్తి తమ ప్రభువులే అయివుంటారనే నమ్మిక పుట్టినది. ఆవ్యక్తి ఇంకా కదలక అలాగుననే నిలబడినాడు. అచ్యుతులు, గోవిందులు, లక్ష్మీదేవిగారు ఇప్పుడు ఆవ్యక్తికి దాదాపు యాభై



బారల దూరానికి వచ్చినారు. అచ్యుతులవారు నిలబడి చూచినారు. అదే ఆకారం, అదే నిలువు, మెడలో ధరించిన నవరత్నమాలిక సూర్యుని అంతిమ కిరణాలను ప్రతిఫలించినది. ఆవ్యక్తి ప్రభువులనే అచ్యుతులవారికి అప్పుడు దృఢమయినది. సంతోషంతో వణుకుతున్న లోధ్వనితో "గోవిందా, ఇది మన ప్రభువులే ! జీవించిఉన్నారు. నారాయణా ! నీకు మా అనంత నమస్కారాలు." అనినారు. ప్రభువుల ఎదుట మూటవలె ఉన్న శాంతలాదేవి కళేబరం ఉన్నది. ప్రభువులు తలమీద చేతులు జోడించుకొని, మూడువంతులు మునిగిన సూర్యునికి తమ అంత్యనమస్కారం చేస్తున్నారు. వారిమనస్సు, వారిదృష్టి అప్పుడు సూర్యబింబంలో నాటిపోయినది. ఇతర బాహ్యేంద్రియాలన్నీ సుప్తావస్థలో ఉండినవి.

అచ్యుతామాత్యులన్న మాటలకు లక్ష్మీదేవి తికమక పడినారు. ఆమె ప్రభువులను ఒకటి రెండు క్షణాలకాలం అదే స్థలంలో నిలబడి చక్కగా చూచినారు. ఆమెకు అప్పుడు పూర్తిగా ప్రజ్ఞ కలిగినది. ప్రభువుల పాదాలకడ పడివున్న ఆ మూటమాత్రం లక్ష్మికి అర్థంకాలేదు. "ఏదో అనర్థం సంభవించినది. ప్రభువులు ఎందుకు ఇలాగు ఉన్నారు ? వారికి ఏమిసంభవించినది ? పిచ్చివారివలె ఉన్నారుగదా ? ఇక్కడికెందుకు వచ్చినారు ? కిందపడిన ఈమూట ఏమిటి ? ఇలాగు ఎవరికి చేతులు జోడించుకొని, దిక్కు ఎందుకు చూస్తున్నారు ? అచ్యుతులు, గోవిందులు నన్ను ఇక్కడికి ఎందుకు పిలుచుకొని వచ్చినారు ?" అనే నానావిధ యోచనలు, భయమూ, సంశయమూ లక్ష్మీదేవి మనస్సులో ఆక్షణమే పుట్టినవి. ఈ విచిత్ర పరిస్థితి లక్ష్మీదేవి హృదయంలో భయదుఃఖాలను ఒక్కటిగా ఒడ్డినది. వెంటనే ఆమె కన్నులు చెమర్చినవి. ఒక్కమారు గట్టిగా కేకవేయదలచినది. భయసంశయాలు ఆమె గొంతును ఒత్తిపట్టుకున్నవి. వెలువడిన ధ్వని చాల బాధాకరమయి ఉండినది. ఇప్పుడు ఏమి చేయవలెనో ఆమెకు తోచలేదు. వింటినుంచి వదలిన బాణంవలె ఆమె నలభై బారలదూరం ఒకే ఉపిరిలో పరుగెత్తివచ్చి, ప్రభువులకు పది బారల దూరంలో వచ్చి నిలబడినది. ఆమె అలాగు చేస్తుందని అచ్యుతులవారు భావించలేదు. ఆమెను అడ్డుపెడదామని చేతులు చాచేవేళకు ఆమె ప్రభువుల దగ్గిరికి పోయినది. మెరుపుతీగను పట్టుకొని ఆ పేటంత నిప్పుల

మయినది అచ్యుతుల ప్రయత్నం. అప్పుడు తామూ వెంట పరుగెత్తడానికి ప్రయత్నించినారు, కాని ఏదో అవ్యక్తశక్తి అప్పుడు వారిని పట్టుకుని ఆపినట్టయినది; పట్టుకొని వెనక్కు లాగినట్టు అయినది. గోవిందామాత్యులను పట్టుకొని వణుకుతూ నిలబడినారు అచ్యుతులవారు.

ఇదంతా తమఎదుట నడుస్తున్నప్పటికీ అస్తమిస్తున్న సూర్యబింబంపై దృష్టినిలిపిన ప్రభువులు ముందున్నట్టే నిశ్చలంగా ఉన్నారు. చిత్తవృత్తులన్నీ దృష్టిలోనే కేంద్రీకరించినవి. లక్ష్మి అశ్రుపూరిత నయనాలతో ప్రభువులను ఆపాదమస్తకం తదేక దృష్టిలో చూచినది. కింద మూటవలె పడివున్న కళేబరం కనిపించినది. కళేబరం తల, ముఖం ఆమెకు కనిపించినవి. అక్కయ్య కేశపాశం! అక్కయ్య కర్ణ కుండలం! సంశయమే లేదు. ఇవి అక్కయ్యవే. ఎదుట వికారరూపంలో నిలబడినవారు తనస్వామి అని లక్ష్మికి స్పష్టమయినది. "ఏమయినది? ఏమయి ఉంటుంది? ఇలాగు ఎందుకు?" ఈ విషయాలు ఆమె మనస్సుకు తటాలున తోచినవి. అంతే. వెంటనే విషయమంతా పరిష్కారమయినది ... "అయ్యో! ఈ మహాపురుషులూ ఇలాగు అయినారుకదా! వీరి మనస్సులో ఇంత అగాధప్రేమను నాటి పెంచి వెళ్ళిపోయినదా, నా అక్కయ్య... నా అక్కయ్య! అక్కయ్యా...నీవెంత దొడ్డదానివే! నీ ప్రేమ విశ్వాసాలు ఎంత దొడ్డవే! అక్కయ్యా. ఎంత మహానుభావురాలివే నీవు! ప్రభువుల ఈ దుఃఖాన్ని, ఈ స్థితిని నేను చూడలేను ... చూడలేను ... నేనిప్పుడు ఏమిచేయను? చెప్పు... అక్కయ్యా...నీవిప్పుడే వచ్చి వీరిని బదికించు అక్కయ్యా... నిన్ను వేడుకుంటున్నాను...రా అక్కయ్యా. వేగ రా అక్కయ్యా... నామీద ఆన...కేశవునిపై ఆన...నీవు రాకపోతే నేనిప్పుడే మరణిస్తాను."

ఆ క్షణంలో లక్ష్మిని ఎవరో కౌగిలించుకొని పట్టుకున్నట్టయినది. సుఖమూకాని, వికారమూకాని అవర్ణనీయమైన స్పర్శానుభవం లక్ష్మీదేవికి అప్పుడు కలిగినది. ఆపాదమస్తకం శరీరమంతా తరతర వణకినది. ఒక నిమిషం స్మృతి తప్పినట్లయినది. మేను నిండినట్లయినది. అక్కయ్యవచ్చి చెల్లెలిని కౌగిలించుకొన్నది!



లక్ష్మీదేవి "అక్కయ్యా!...అక్కయ్యా." అని పిలిచిన దానిని దయ్యం కొట్టినట్టు దూరంలో నిలబడిన అచ్యుతులూ, గోవిందులూ విన్నారు; ఆమె శరీరం ఆద్యంతమూ వడవడవణకడమూ కన్నారు; అయినా, ఆమె సహాయానికి ఒక్క అడుగు ముందు పెట్టడానికి కూడా వారికి సాధ్యంకాలేదు. కాళ్లు కట్టివేసినట్టయినది.

లక్ష్మీదేవికి కలిగిన ఆ శరీరకంపనం ఒకటి రెండు నిమిషాల తర్వాత తటాలున నిలిచినది. అప్పుడామె కెవ్వుమని కేక వేస్తూ, పరుగునపోయి, నిలబడిన ప్రభువులను తన రెండుచేతులతోను బలంగాచుట్టి కౌగిలించుకొని, పెద్ద ధ్వనిలో "దేవ, ఇదిగో! నేను వచ్చినాను...వచ్చి ఉన్నాను.... మీ శాంతల.... నేను....వచ్చినాను....ఇక్కడ చూడండి." అంటూ, తన స్వామి ముఖం చూస్తూ నిలబడినది.

# 9

సూర్యమండలం అంచులు కనిపించకపోవడాన్నే ప్రతీక్షిస్తున్న ప్రభువులకు బాహ్యస్మరణ లేకపోయినా, ఈ విధంగా అకస్మాత్తుగా, బలంగా కౌగిలించుకున్న సుఖస్పర్శానుభవం వారి బాహ్యేంద్రియాలను మేల్కొల్పినది. తలమీద జోడించుకొని పెట్టుకొన్న చేతులను వెంటనే ప్రభువులు కిందికిదింపి, తమను ఇలాగు కౌగిలించుకొని నిలబడినది ఎవరని చూచినారు. తమ ఒడలిని అంత ప్రేమతో కౌగిలించుకొని నిలబడినది— శాంతల! నిజంగానే శాంతల! అనుమానమేలేదు. "శాంతలా...శాంతలా" అని ఉన్మాదంతో శాంతలను, హృదయేశ్వరిని తమ గుండె పగిలి హృదయం వెలుపల పడేలాగు తమ గుండెకు అనించుకొని పట్టుకొన్నారు. కన్నీరు ధారలు ధారలుకాగా, ఆమె ముఖం, తల పుణుకుతూ, "వచ్చినావు కదా!...నీవు వచ్చినావు కదా!...కొసకు వచ్చినావు కదా! ఎంతసేపు! ఎంత ఆలస్యం చేసినావు శాంతలా!...నన్ను ఎంత బాధ పెట్టినావు? దేవీ, ఇది మోసం కాదుకదా?....భ్రమ కాదుకదా? నీవు నా.... నా శాంతల! హే భగవన్, నారాయణా....నీవు కరుణాళువు....నీవు

కృప చూపినావు...నాకు సమాధానం వచ్చినది; సమాధానం వచ్చినది.... నిజం....విషంలోను అమృతముంది....శాంతలా...చెప్ప...చెప్పు నా దేవీ, నీవు బ్రతికి వచ్చినావా? నాకోసం వచ్చినావా? ఇక పోవుగదా?... నన్ను వదలిపోవుగదా? వెళ్లవద్దు శాంతలా, నన్ను వదలిపోవుగదా?... వెళ్లవద్దు శాంతలా, నన్నువదలి వెళ్లవద్దు.... నేను ఉండలేను...ఉండను.''

''నేనెక్కడికీ వెళ్ళను...ఖండితంగా వెళ్ళను. ప్రభూ, మీకోసమే వచ్చినాను. మీకోసమే ఉంటాను. మీతోనే ఉంటాను. నమ్మండి.''

''నీవు ఇంతకాలం ఎక్కడున్నావు? ...ఎలాగున్నావు? నన్ను ఎందుకు ఇలాగు వదలిపోయినావు? మరల వదలిపోతావా? ఎలాగు నమ్మను? ఎలాగు నమ్మకుండా ఉండను?''

''నమ్మవలె దేవ. ఖండితంగా నమ్మవలె. ఇక మన మిద్దరం ఒకరి నొకరం వదలి ఉండం. ఇది ప్రమాణం.''

''ఇలాగు అవుతుందా? అయినదా? మరణించినవారు మరలి వచ్చినారా? నీవు శాంతలవేషం ధరించినదానివి కాదుగదా? వంచన కాదు గదా?''

ప్రభువులు శాంతల ముఖం, తల, మేను, చేతులు తాకి తాకి చూచినారు. మరల మరల ముఖం చూచినారు. ''నారాయణ నారాయణ!... నా శాంతల!...ఇది నా శాంతల! నీవు నాకు ఇచ్చిన శాంతల, నేనెందుకు అపనమ్మక పడుతున్నాను?...సర్వాపరాధం!...నాది సర్వాపరాధం!'' అంటూ, పొంగివచ్చే దుఃఖంతో, ప్రీతితో దేవిని మరొకమారు హృదయం తనిసేటట్టు కౌగిలించుకున్నారు. ఆమెకు కన్నీటి అభిషేకం చేసినారు.

శాంతల తన అమృతహస్తాలతో పతి వక్షఃస్థలం, ముఖం, భుజాలు మృదువుగా తడవినది. ప్రభువులు అప్పుడు తెలుసుకొన్నారు. ఇది తమ శాంతల స్పర్శమని; ఆమె తన హృదయేశ్వరి అని. కంది, కుంగిన ప్రభువుల ముఖంలో కళ ఉదయించినది. కన్నులలో పొలుపు చేకూరినది. మేను తేలిక అయినది. నొప్పి మాయమయినది. అలసట తీరినది. దుఃఖం పోయినది. ప్రభువులు శాంతల అమృతహస్తం పట్టుకుని తమ నోటికి అదుముకొని



తనిసినారు. చాల దైన్యంతో అన్నారు: ''దేవీ, నేను నీకు శతాపరాధాలు చేసినాను. నా మూర్ఖత నాకిపుడు తెలిసినది. కుమారవిష్ణువు మనకు తెలుపకనే గరుడికావడం దీనికంతా కారణం. నీ శరీరం మోసుకొని, అన్నం నిద్ర వదలి, తుదకు నీరూ వదలి, మాడ్చే ఎండలో కాలిన బండలపై నీకోసం, గొంతు ఎండిపోయే వరకూ, కాళ్ళు కుసిపడిపోయేవరకు నీకోసం తిరిగి, తుదకు నేను మరణిస్తే నిన్ను చేరవచ్చుననే ఆశతో సూర్యాస్తమయంతో పాటు నీ తమ్ముణ్ణి అనుకరిస్తామని నిర్ధరించినాను. ఇక రెండు నిమిషాలలో నేనే నీ వద్దకు వచ్చేవాడిని. ఆలోగా నీవే వచ్చినావు. భగవంతుడు వచ్చినాడు. నా హృదయాధీశుడు వచ్చినాడు. నా దేవికి నా బాధ తెలిసినది. ఈ పుణ్యం ఎవరికి లభిస్తుంది?''

''ప్రభూ నేను మరణించినాను. మీరు నా కళేబరాన్ని మోసుకొని ఇక్కడికి తెచ్చినప్పుడు, తిరిగితిరిగి గట్టిగా అరచి అరచి పిలిచినప్పుడు, నాకోసం కన్నీరు కురిపించినప్పుడు మీతోనే ఉన్నాను. వేలాపురిలోను మీతోనే ఉన్నాను. మీరు రథంలో కూర్చుని ఇక్కడికి వచ్చినప్పుడు మీతోపాటే వచ్చినాను. మీదుఃఖంకంటే నూరింతలు దుఃఖాన్ని, బాధనూ నేనూ అనుభవించినాను. ప్రభూ! నేను మరణించినది వాస్తవం. అయితే, మిమ్మల్ని వదలి ఉండలేక పోయినాను. ముక్కలు ముక్కలయిన ఆ కళేబరంలో నా జీవం చేరడం సాధ్యంకాలేదు. మీకు కనిపించడానికి శరీరంలేక, మాట్లాడడానికి నాలుకలేక మీకంటె హెచ్చుబాధ అనుభవించినాను. విజయనారాయణుడు నాచెల్లెలిని ఇప్పుడిక్కడికి పిలుచుకొని రాకపోయిఉంటే, మనమిద్దరం ఈవేళకు ఈ భూమిపై ఉండేవారం కాము...ఆమీదట లక్ష్మికూడ ఉండేదికాదు.''

''ఎవరు? లక్ష్మి? లక్ష్మి ఇక్కడికి వచ్చినదా?...ఎలాగు వచ్చినది? ఎవరు పిలుచుకొని వచ్చినారు? ఎక్కడ? నాలక్ష్మి ఎక్కడ?''

''లక్ష్మి ఇక నాలో, నేను ఇక లక్ష్మిలో మా శరీరాలూ ఇప్పుడు ఒక్కటే అయినవి. అన్నయ్య అచ్యుతలూ, గోవిందులవారూ నన్ను పిలుచుకొని వచ్చినారు. విజయనారాయణుడు నన్ను ఇక్కడికి పంపినాడు. నిన్న మీరు నాకు ఔషధం ఇచ్చినపిదప నేడు మధ్యాహ్నం జాము గడి

చిన తర్వాత నాకు పూర్తిగా ప్రజ్ఞ వచ్చినది. నిన్న నాకు స్వప్నమయినది. ద్వారవతినుంచి అమ్మ, అయ్యగారు-ఇద్దరూ వచ్చినారు. నాతో మాట్లాడినారు. మీకు అర్థంకాలేదా ? ఇక లక్ష్మి నేనే. శాంతలా నేనే. అన్నయ్యా అచ్యుతులవారూ, గోవిందులూ అదిగో అక్కడ !’’

దూరంలో నిలబడిన అచ్యుత గోవిందామాత్యులవైపు శాంతల చేయిఎత్తి చూపించినది. స్తంభించిపోయిన వారికాళ్ళు అప్పుడు కొంచెం సడలినవి. ఆ ఇద్దరు సచివులూ తమ కన్నులముందు నడుస్తున్న ఈ అద్భుతాన్ని ఆశ్చర్యంతో, ఆనందంతో చూస్తున్నారు. వారిప్పుడు నెమ్మదినెమ్మదిగా ప్రభువులున్నవైపు నడిచివచ్చి కొంచెం దూరంలో నిలబడి, భక్తి మర్యాదలతో నమస్కరించినారు. ప్రభువులు తగ్గు ధ్వనితో “మిమ్మల్ని అందరినీ నారాయణుడే పిలిపించినాడు. నా ఉద్ధారం కోసమే మీరు రావడం.’’ అనినారు. గోవిందామాత్యులు “ప్రభూ ! నిజంగానే నారాయణుడే మమ్మల్ని ఇక్కడికి పిలుచుకొని వచ్చినాడు. సందేహమేలేదు. మేమిద్దరమూ ఇక్కడికి రావలెనని ఉద్దేశించి “లక్ష్మీదేవిగారిని పిలుచుకొని పోవడమా ? అక్కడే వదలిరావడమా ?’’ అనే సంకట పరిస్థితిలో ఉన్నప్పుడు “పిలుచుకొని పోండి అని భగవానుని ఆజ్ఞ అయినది.’’ అనినారు.

అచ్యుత గోవిందామాత్యులు లక్ష్మీదేవిని ఆపాదమస్తకం తిలకించినారు. సాయంకాలపు మసకచీకటిలో ఆమె ముఖ భావాలను చూడడం కాలేదు; అయితే చేతులు కాళ్ళ కదలిక, హావభావాలు-అన్నీ శాంతలాదేవివే. ప్రభువుల కన్నులకు రూపూ శాంతలాదేవిదే.

ప్రభువులు శాంతలాదేవి చేతులు పట్టుకొని “చెప్పుదేవీ, మొట్టమొదట చెప్పు. కుమారుడెక్కడ ? నీతోపాటు ఎందుకులేడు ? ఏమయినాడు ? నీశరీరం వేరయిన తర్వాత ఏమైనది ? నీవు ఎలాగు ఉన్నావు ? ఎక్కడున్నావు ? ఇది ఎలాగు సాధ్యమయినది ?’’ అని ప్రశ్నించినారు.

“ప్రభూ, ఈ విషయాలు చాల ఉన్నవి. నా అభువం చెబుతున్నాను. మీతోకాక మరెవరితో చెప్పను ? మీకిప్పుడు చాల శ్రమ అయినది. మీకు శరీరంపై తగిలిన గాయాలు నాకు చాలకష్టం కలిగి



స్తున్నాయి. చీకటి అవుతూ వచ్చినది. కొండదిగి ఊరికి వెళ్ళదాము. నాచేతులతో మీకు మజ్జనం చేయిస్తాను. ఒంటిపై కలిగిన గాయాలకు ఔషధం లేపనచేస్తాను. మీరు ఆహారం తీసుకుంటే, నేనూ తీసుకుంటాను.’’ అంటూ లక్ష్మీదేవి అచ్యుత గోవిందామాత్యులవైపు తిరిగి, అన్నయ్యగార్లూ మీరు నాకోసం కొంచెం శ్రమపడినారా ? మీ మనస్సుకు కలిగిన కష్టమెంత ? దారిలోను నేను మీకు శ్రమ కలిగించినాను కదా ? మీ కెంత భయంకలిగి ఉండేని ? మీ యిద్దరి దైర్యం, ప్రేమ, దైవభక్తి, మమ్ములను అందరినీ నేడు బ్రతికించినది. రాజ్యాన్ని రక్షించినది. దైవం తాను చేయవలసినపనిని జ్ఞానులతో, ధర్మాత్ములతో, భక్తులతో చేయిస్తుంది. మీరుమాత్రమే దైవాన్ని సాక్షాత్కరింపజేసుకోగలరు. తక్కినవారికి అది దూరమేమో సరే; కనిపించనైనా కనిపించదు. అన్నగారు నాకోసం ఇంక కొంత శ్రమపడవలసి ఉంది. పైన, పర్వత శిఖరం మీద తీర్థకుండం ఉంది. ఆకుండంలో నాతమ్ముడు నాకోసం తెచ్చిన తామ్రకలశంలో మంచి నీరున్నది. కలశానికి మూత ఉన్నది. దానిని సురక్షితంగా తెప్పించండి. నా తమ్ముని శ్రమ సార్థకమవుతుంది.’’ అన్నది. అచ్యుతామాత్యులకు నోట మాటరాలేదు. చేతులు కాళ్ళు వణకసాగినవి. ప్రెగ్గడలూ, పౌరులూ నిలబడినచోటికి వెంటనే వెళ్ళి, ప్రెగ్గడలకు ఆపని అప్పగించినారు. ప్రెగ్గడలు ఆశ్చర్యపడుతూ, ఒక సేవకుని వెంటపెట్టుకుని, మసక చీకటిలో తీర్థకుండం వద్దకు ఎక్కిపోయినారు. పోయి చూడగా, కుండంలో మూతతోసహా ఒక రాగిచెంబు కనిపించినది. దానిలో నీరు కనిపించినది. మధ్యాహ్నపు ఎండలో కాగికాగి పాత్ర వెచ్చగా అయినది. ప్రెగ్గడలు దానిని తీసుకొని, నెమ్మదిగా జాగరూకతతో దిగి వచ్చినారు. వారిమనస్సు చాల ఆలోచనలో పడినది. “ఇక్కడ తీర్థం ఉండడం అచ్యుతులవారికి తెలియదుకదా ! ఇది వీరికి తెలిసిన తీరేమిటి ? బహుశ, ప్రభువులే ఈదినం తాము కొండంతా తిరిగి రావడంలో చూచి ఉండవచ్చు.’’ అని తమకుతామే సమాధానం చెప్పుకొని, అచ్యుతామాత్యులున్నచోటికివచ్చి, తామ్రకలశం వారిచేతికిచ్చినారు, అచ్యుతులవారిని నూరుప్రశ్నలు అడుగుదామనే ఆతురతఉన్నా, ఇది సమయం కాదని ఊరుకున్నారు.

అంతలో అచ్యుతలవారు శివగంగకు జనంపంపి, ఒక పెద్ద తొట్టెలను, దృఢగాత్రులయిన బోయీలను, ఇరవై ముప్ఫైమంది దివిటీలవారిని, అంటించిన దివిటీలతోసహా పిలుచుకొని త్వరగారమ్మని చెప్పినారు. ప్రెగ్గడ చేతినుంచి ఉదకపాత్ర తీసుకుంటూ, "ప్రెగ్గడగారూ, ఇంత మాత్రం చెబుతాను: భగవంతుడు నేడు మాతోనే ఉన్నాడు; లక్ష్మీదేవిగారితోపాటు వచ్చినాడు. లక్ష్మీదేవిగారిని మనం పిలుచుకొనిరాకుండా వచ్చిఉంటే, అంతా మునిగిపోయేదే. ప్రభువులూ ఈవేళకు ఉండేవారు కారు. అంతా లక్ష్మీదేవిగారి భాగ్యమనే చెప్పవలె." అనిచెప్పి, త్వరగా ప్రభువులున్న చోటికివచ్చి, జలకలశాన్ని లక్ష్మీదేవిగారి చేతులలో ఉంచినారు. ఆమె దానిని తీసుకొని, ప్రభువుల నుదురు, ముఖం నీటితో తుడిచి, నీరు గుక్కగుక్కగా నెమ్మదిగా తాగించి, వారి నాలుక, గొంతుక, రొమ్ము కొంచెం చల్లబడినతర్వాత, మిగిలిన కొంచెంనీటిని తాను తాగి, తమ్ముణ్ని స్మరిస్తూ, "కుమారా, నీ శ్రమను నేనువృథా చేయలేదు." అంటూ ఉండగా, ఆమె కన్నులనుంచి నీరునిండి స్రవించినది.

అనంతరం, ఆమె అచ్యుతులవారిని చూచి, "ఈపాత్ర ఈ కొండలోని విఘ్నేశ్వర దేవాలయం అర్చకులది. దీనిని వారికి చేర్చండి. ఇంత నిదానమయినందుకు మన్నన అడిగి, వారి ఉపకారానికి పురస్కారం ఇవ్వండి. ఈ నా కళేబరానికి – మీరు నా అన్నగారు—రేపు ఉదయం అగ్నిసంస్కారం చేయండి. నేను బదికి ఉన్నాను. ఇంకే క్రియావద్దు." అన్నది.

అచ్యుతులవారు "దేవిగారి ఆజ్ఞ. ఈ పాత్రను నేనే రేపు వారికి నా ధన్యవాదాలతో చేరుస్తాను." అని మనవిచేసి, లక్ష్మీదేవిగారు కూర్చుని వచ్చిన తొట్టెల బోయీలను, దాసీలను పిలువడానికి వెళ్ళినారు. అప్పుడు చుట్టూ చీకట్లు ముసిరినవి. నక్షత్రాల వెలుగు మాత్రమే మార్గదర్శకంగా ఉన్నది.

ప్రభువులూ, శాంతలా దగ్గరలోని ఒక బండమీద కూర్చున్నారు. ఊరినుంచి దివిటీలు, జనమూ వచ్చేవరకూ వేచి ఉండవలసి వచ్చినది. ప్రభువులు శాంతలను చూచి, "దేవీ, ఇంత దుఃఖం అనుభవించిన నాకు



ఈ సంతోషం తట్టుకోలేనంతగా అయినది. ఎంతబాధ, ఎంతదుఃఖం అనుభవించినానో. ఇప్పుడు దాని లక్షరెట్లు సంతోషం, సంతృప్తికలిగినవి. వీరనారాయణుడే నిన్నుపిలిపించి నాకు అప్పగించినాడు. నీ చెలువకేశవుడే నిన్ను తీసుకొని వచ్చినాడు, కదూ?" అనినారు.

"నూరుమార్లు అలాగు అనండి ప్రభూ. మీ ధర్మమే, మీ పుణ్యమే, మీ ప్రేమే నన్ను రప్పించుకొన్నవి. ప్రేమ శక్తికంటే దొడ్డశక్తి మరొకటి లేదు."

"అమృతం ఆరగించినాను, దేవీ. దప్పి, అలసట, ఆకలి — ఇప్పుడొక్కటీలేదు. నీవు నన్నుతాకిన తక్షణం అవన్నీ మాయమయినవి. నీ అమృతహృదయం నన్ను తాకినప్పుడు, శాంతలా, నా దేహంలోని సకల బాధలూ మాయమయినవి. నిన్ను ఇప్పుడు ఒక్కమాట అడుగుతున్నాను, తెలిస్తే చెప్పు. మన పిల్లలేరీ? కుమారుడేడీ? సోవల ఏదీ?"

"సోవల మహాసతి అయినది. ఇద్దరి ఆత్మలూ ఇప్పుడు ఒక్కటే అయినవి. నేను వచ్చినట్టు వారు ఇకరారు దేవ! అది సాధ్యంకాదు. అయితే, నా మనస్సు చెబుతున్నది: వారికోసం పరమపదం కాచుకొని ఉన్నా, కుమారునికి ఇంకా జన్మం ఉంటే, ప్రభువులకు కుమారుడయ్యే వచ్చేడు. సోవల కూతురయిగాని, కోడలయిగాని వచ్చీని. ఈ ఆశ మనిద్దరిదీ. చెన్నకేశవుడు దీనిని ఖండితంగా నడిపిస్తాడు."

"దేవీ! బా హృదయంలో ఆశ పుట్టిస్తున్నావు. మనస్సుకు హర్షం కలిగిస్తున్నాము. ఇది ఏ జన్మకు? ఇంకా ఏ జన్మకు?"

"ఈ జన్మలోనే ఎందుకు కారాదు ప్రభూ? మీరు నాకోసం అంగలార్చినప్పుడు నేను రాలేదా? అదృష్టమైన దైవనియమాన్ని తెలిసినవారెవరు? దుఃఖం సుఖమవుతుంది. సుఖం దుఃఖమవుతుంది. ఇది ఎందుకని భగవంతుడొక్కడే తెలిసినవాడు. ఈ ఘోరమైన దుఃఖం ఏలాగు పరిణమించినదో చూడరా?"

"దేవీ, నీవు స్వర్గాన్నే ఇక్కడికి తెచ్చినావు. ఇహానికీ, పరానికీ సంబంధం కల్పించినావు. ఈ మహాసుఖం కోసం నేను పడిన కష్టం తీరా

అల్పమని ఇప్పుడు నాకు అనిపిస్తున్నది. నిన్ను అడగవలెననుకొన్న విషయాలు ఎన్నో ఉన్నవి."

లక్ష్మి మృదువుగా నవ్వినది. అయితే అది లక్ష్మి నవ్వే తీరుకాదు. నవ్వినది శాంతల. ప్రభువులకు ఆసంగతి బాగా తెలుసు. లక్ష్మి మాటలు కొనసాగిస్తూ, "ఇప్పుడు వద్దు. చీకటి చాల హెచ్చినది. మీరు అడగడానికి ఇంకా కావలసినంత సమయం ఉంది. నేను చెప్పడానికీ కావలసినంత సమయం ఉంది. ఇప్పుడు రాజధానికిపోదాము."

ఆవేళకు అచ్యుతగోవిందామాత్యులు దీవిటీలను అంటించి పట్టుకుని, ప్రభువుల వద్దకువచ్చి నమస్కరించి, "ప్రభూ, చీకటి చాల వ్యాపించినది. దీవిటీలవారు, బోయీలు వచ్చినారు." అని మనవి చేసినారు. ప్రభువులు "మంచిది. వెళ్లుదాము." అన్నారు. గోవిందామాత్యులు వెళ్ళి, అందరినీ ప్రభువులున్న చోటికి పిలుచుకొని వచ్చినారు. వారంతా ప్రభువులకు, దేవేరిగారికీ ఆనందంతో, భక్తితో నమస్కరించినారు. ఒక తొట్లెలో ప్రభువులూ, మరొక తొట్లెలో లక్ష్మిదేవిగారూ కూర్చున్నారు. దాసీలు లక్ష్మిదేవిగారి తొట్టెలతోపాటు నడిచినారు. ప్రెగ్గడలు శాంతలాదేవి కళేబరానికి బలంగా కావలి ఏర్పాటుచేసి, వారికి దీవిటీలను, దీవిటీలకు తరిలించే నూనెలో తడిపిన గుడ్డలచుట్లనూ...ఇచ్చినారు. అందరూ దీవిటీల వెలుతురులో కొండ దిగసాగినారు.

కొండ దిగుతున్నప్పుడు లక్ష్మిదేవి, పక్కన నడిచివస్తున్న దాసీలలో ఒకదానిని "హొన్నీ...ద్వారవతిలో మేము శివగంగకు బయలుదేరడానికి ముందు 'మీ అమ్మకు ఇచ్చిరా' అని నీ చేతికిచ్చిన పూజా పరికరాలను ఇచ్చినావా ? నీవు వచ్చి మాకు తెలుపనే లేదే ? మీ అమ్మకు సంతోషమయినదా ?" అని అడిగినది.

ఆ దాని గుండెలు గుభేలుమన్నవి. కాళ్లుచేతులు వడకసాగినవి. ప్రభువులూ, లక్ష్మిదేవిగారూ ద్వారవతినుంచి వేలాపురికి పోయినరాత్రి, శాంతలాదేవి తాను శివగంగకు రేపు ప్రాతఃకాలం బయలుదేరుదామనుకొనినప్పుడు ఈ దాసి హొన్నినిపిలిచి, బహుకాలంగా శ్రద్ధాభక్తులతో, ప్రేమతో తనసేవ చేసిన హొన్ని ముసలితల్లికి నిండు ఔదార్యంతో



అప్పటుమైన వెండితో చేసిన పూజాపరికరాలు ఇచ్చి, "వీటిని మా సంతోషంకోసం ఇచ్చి పంపినామని, వీటిని తీసుకోవలెనని మీ అమ్మకు చెప్పు." అని చెప్పినారు. అనంతరం తాను శివగంగకు వెళ్ళడానికిముందు ఈదాసిని చూడలేదు; అందువల్ల ఇప్పుడు దాసిని అడిగినారు.

దాసికి గొంతుక, నాలుక ఎండిపోయినవి. "ఇది ఎవరు ? వీరు లక్ష్మిదేవిగారు కదా ? పూజా పరికరాలు 'నీ అమ్మకు ఇచ్చిరా' అని ఇచ్చినవారు శాంతలా మహారాజ్ఞిగారు. లక్ష్మిదేవిగారికి ఈ విషయమే తెలియదుకదా? వారు అంతకుముందే, ప్రభువులతోపాటు వేలాపురికి బయలుదేరి వెళ్ళినారు. వారికి ఈ సంగతే తెలియదుకదా ! 'మేము ఇచ్చిరమ్మన్న పూజా పరికరాలు' అన్నారు. ఏ మాశ్చర్యం ? మాట్లాడే తీరూ లక్ష్మిదేవిగారిది కాదు. శాంతలా మహారాజ్ఞి గారిది ! నన్నిప్పుడు అడుగుతున్నవారు లక్ష్మిదేవిగారు." అని దాసి భీత్యాశ్చర్యాలలో వణికిపోయినది. వణకుతున్న ధ్వనితో "దేవిగారు ఇచ్చినదానిని మా అమ్మకు ఇచ్చాను. రత్నహారాలిచ్చినా నాకింత తృప్తి కలిగేదికాదని మహారాజ్ఞిగారికి విన్నవించుకొన్నానని చెప్పుమని ఆమె చాల తృప్తితో, సంతోషంలో అన్నది." అని మనవిచేసినది.

లక్ష్మిదేవి ! "ఇప్పుడు మాకూ సంతోషమయినది."

దాసికి గుండె కొట్టుకొనడంమాత్రం ఆగలేదు. ఆమె ఇంకా ఆలోచిస్తూనే ఉన్నది: "ఇచ్చిపంపిన శాంతలా మహారాజ్ఞిగారు ఇంకెక్కడ ? మేము ఇచ్చిపంపిన అని లక్ష్మిదేవిగారు అంటున్నారు. చెన్నకేశవా ! చెన్నకేశవ !" అని ఆమె దిగ్భ్రాంతురాలయినది.

కొండదిగి అందరూ శివగంగ చేరినారు. శాంతలాదేవి, కుమార విష్ణువులకోసం ఏర్పాటుచేసిన విడిదినే సిద్ధం చేసినారు. ప్రెగ్గడలూ, పురప్రముఖులూ తమ చేతనయిన సకల సౌకర్యాలూ క్షణమాత్రంలో చేయించినారు. వేడినీరు సిద్ధంగా ఉన్నది. సుఖోష్ణమైన నీటిలో శాంతల్ల ప్రభువులకు మజ్జనం చేయించినది. గాయాలకు వ్రణరోపణ తైలాలను తేలికగా పూసి, సులభంగా జీర్ణమయ్యే పాయసం, పండ్లు పలికి అర్పించి ఆరగింపజేసినది. తానూ భుజించి, మృదుతల్పం ప్రభువులకు ఏర్పరచి

అచ్యుత గోవిందామాత్యుల, ఇతరుల భోజనమయిన తర్వాత, ప్రభువుల సన్నిధికివచ్చి కూర్చొని, మధుర సల్లాపాలతో వారిని సంతోషపెట్టి, చెన్నకేశవునికి, తన అనంత ధన్యవాదాలు అర్పించినది. తన మృదు బాహులతలను పలికి తలదిండుగాచేసి, మాట్లాడడానికి పైపైన ప్రయత్నించిన ప్రభువుల పెదవులమీద పూల రేకులవలె మృదువయిన తన వ్రేళ్ళనుపెట్టి "వద్దు. ఈపొద్దు దయఉంచి నిద్రపోండి. రేపు కావలసినంత మాట్లాడవచ్చుగాని." అని చెప్పి సమాధానపెట్టి తానూ, పూర్ణ సంతోష చిత్తఅయి, చెన్నకేశవులకు స్మరిస్తూ పతితోసహా పవ్వళించినది.

"ఈరాత్రి ఒక యుగమంత దీర్ఘం కానీ, శాంతలా." అని అంటూ ప్రభువులు దేవి కన్నులలో కన్నులుపెట్టి అలాగునే నిద్రపోయినారు.

హొయిసళ విష్ణువర్ధన ప్రభువుల జీవితంలో ఒక పగలూ, ఒక రాత్రీ ఇంత విచిత్రంగా గడచినవి.

## 10

మరునాడు తెల్లవారిన తర్వాత కొంతసేపటికి ప్రభువులు అచ్యుత గోవిందామాత్యులను రప్పించుకొని "మీకు తెలిసిన ఈ ఆశ్చర్యకరమైన సంగతి మీలోనే ఉండవలెనని, ఇంకెవరికీ తెలియరాదని, దేవిగారు అపేక్షపడుతున్నారు; మాకూ అలాగునే అనిపిస్తున్నది. మేమూ బహిరంగంగా ఆమెను లక్ష్మి అనే సంబోధిస్తాము." అనినారు. అచ్యుతులు, గోవిందులు "ఇది దేవిగారి ఆజ్ఞ అనే శిరసావహిస్తాము ప్రభూ! ఈ రహస్యం మానుంచి ఎన్నడూ వెలుపలికి రాదు. ప్రభువుల మనస్సుకు కలిగిన ఈతృప్తి మాకు ఎంత సంతోషం కలిగించినదో చెప్పలేము. ఒక మహా విచిత్రమైన దైవలీలే మా కన్నులముందు జరిగినది. ఇది ప్రభువుల పుణ్యమనే మేము భావించినాము." అనినారు. "ఇది మీ కెంత ఆశ్చర్యమో మాకూ అంతే ఆశ్చర్యకరమైన అనుభవం. ఘోరదుఃఖంలో చిక్కుకొని, మరొకదారి కనిపించక ప్రాణ త్యాగానికి పాల్పడుతున్న మాకు ఇంత



ఆనంద స్వర్గం లభించవలెనంటే, ఇది గంగాధరేశ్వరుని కృపకాక మరేమి?" అన్నారు ప్రభువులు.

కొంతసేపయిన తర్వాత అచ్యుత గోవిందామాత్యులూ, ప్రెగ్గడలూ, ఇతర సహాయకులు,, గుట్టయెక్కి, శాంతలాదేవి కళేబరం ఉన్నచోటికి వచ్చినారు. అక్కడినుంచి అచ్యుతులూ, గోవిందులూ విఘ్నేశ్వరాలయం అర్చకుల ఇంటికివెళ్ళి, ఉదకపాత్రం అప్పగించి, మన్నించవలసినదనికోరి, ప్రభువులు పంపిన బహుమాన ద్రవ్యాన్నిఇచ్చి, సంతోషపెట్టి, మరల శాంతలాదేవి కళేబరం ఉన్నచోటికి వచ్చినారు. ఆవేళకు కింది ఊరినుంచి ఎండిన కర్రలువచ్చి చేరినవి. వాటిని కళేబరంచుట్టూ, పైన, కింద, ఎవరూ కళేబరం కాగనట్టు జోడించినారు. అచ్యుతులవారే భగవంతుని క్షమాపణకోరి, చితికి అగ్నిస్పర్శ చేయించినారు. కళేబరం పూర్తిగా భస్మమయ్యేవరకు అక్కడే ఉండి, అనంతరం అందరూ దొనలో స్నానం చేసి, మధ్యాహ్నానికి ఊరికి తిరిగి వచ్చినారు.

ప్రభువులు తమ హృదయేశ్వరి సంపూర్ణాదర సేవలతో రెండు నాళ్ళలో శ్రమ, బాధ తొలగి సంపూర్ణారోగ్యం పొందినారు. తమ ప్రాణంకన్నా ప్రియమయినవారు బదికి వచ్చిన సంతోషంలో చాల ఆనంద హృదయులు, ఉత్సాహితులు, అనుపమ దైవభక్తులు కావడం మాత్రమే కాక, తమ హృదయేశ్వరిపైన అసమానానురాగం గలవారయినారు. ఈ రెండునాళ్ళూ ప్రభువులు, దేవిగారు, అమాత్యులు శివగంగలోనే గడిపినారు. రెండవనాడు ప్రభువులు, దేవిగారు, అమాత్యులు, ప్రెగ్గడలూ కొండ కొంతదూరం ఎక్కి, మహాదేవుడయిన గంగాధరేశ్వరునికి అతిశయ పూజలతో తమ ధన్యవాదాలు అర్పించినారు.

ప్రభువులూ, లక్ష్మీదేవిగారూ ఆరోగ్యంతో ఉన్నారన్న సంగతిని అచ్యుతామాత్యులు వేలాపురంలోని నగరు సర్వాధికారికీ, రాజధానిలో ఉన్న హేమాద్రి మహాప్రధానులకూ శివగంగకు వచ్చిన మరుసటిదినమే అవసర లేఖవాహకులతో పంపినారు. ఆవార్త ఆరాత్రే, వేలాపురికీ, ద్వారవతికీ చేరినది. ప్రభువులు సుఖంగా ఉన్నారని, లక్ష్మీదేవిగారే ప్రభువులను సమాశ్వాస పరచినారని రెండు పట్టణాలలోను వార్త

వ్యాపించి, తపించిపోయిన జనానికి చాలమట్టుకు సమాధానం కలిగినా, శాంతలాదేవి, కుమారవిష్ణువు మరణించినతీరు, ఆ దుఃఖం జన్మజన్మకూ మరిచేట్టు కనిపించలేదు. హేమాద్రి ప్రధానులు తమకు వార్తఅందిన మర్నాడే, ప్రభువులకు కమ్మవ్రాసి, ఆవసరదనితో శివగంగకు పంపినారు: "ప్రభూ, దేశమంతా దుఃఖంలో తపిస్తున్నది. మీ అపార సంకటానికి ఎలాటి ప్రతిక్రియాలేదు. ప్రజలంతా దుఃఖంలో, భయంలో దిక్కు తెలియని వారయినారు. ప్రభువులు సాధ్యమయినంత త్వరలో రాజధానికి దయచేయవలె; ప్రజలకు దర్శనమీవలె. బిడ్డలవలె ఉన్న మన ప్రజలకు అప్పుడు కొంచెం ధైర్యం కలిగీని; కొంచెం నెమ్మది ఏర్పడీని." అని ఆకమ్మ వక్కాణం. ప్రభువులు రాజధానికి ప్రయాణం నిశ్చయించిన వెనుకటిదినం ఆకమ్మ ప్రభువులకు అందినది. మరుసటిదినం ప్రాతఃకాలం రాజధానికి ప్రయాణమని నిశ్చయమయినది. శివగంగలోని దేవాలయాలన్నిటా, ధర్మాలయాలన్నిటా, పూజా భోజనాదులు జరిగినవి. ఊరిలోని బీద సాదలకు వస్త్రదానం ప్రభువుల ఆజ్ఞప్రకారం జరిగినది. మంచి ముహూర్తంలో ప్రభువులు లక్ష్మీదేవితోకూడ రథంలో రాజధానికి ప్రయాణమయినారు. మరి రెండు రథాలలో అమాత్యులు, దాసీలు వెంట బయలు దేరినారు. వెళ్ళడానికిముందు ప్రభువులు ప్రెగ్గడలను పుర ప్రముఖులను పిలిపించి, సంతోషంతో సంభాషించి, ఉడుగరలు, వీడెం స్వహస్తంతోనే ఇచ్చి బహూకరించి, వారి మనస్సును సంతోషపరచినారు.

## 11

అక్కడ కాలినడకన శ్రవణ బెళుగొళకు బయలుదేరిన మాచికబ్బె, చందల, మారసింగమయ్యగారు దేచయ్య ప్రభువులు ద్వారవతిని చేరే వేళకు శ్రవణబెళుగొళ చేరినారు. ప్రపంచ వస్తువులన్నిటిని ప్రపంచానికే ఇచ్చివేసి, పృథివికి సంబంధించిన అన్ని వాసనలను వదలి నిర్లిప్తులయినారు ఆదంపతులు. శ్రవణబెళుగొళ చంద్రగిరిలో తనకుమార్తె శాంతలాదేవి నాలుగైదు సంవత్సరాలక్రితం శాంతీశ్వర జనునికి కట్టించిన బసదిలోనే అందరూ దిగినారు.



మర్నాడు ప్రాతఃకాలం సూర్యోదయానికి మునుపే మాచికబ్బె నిత్యకృత్యాలు ముగించి, స్నానంచేసి, మడివస్త్రాలు ధరించి, పతికి నమస్కరించి. వారి అనుజ్ఞ పొంది, అనంతరం ఆ స్థానంలోని గురుపీఠం మునులనుంచి జిన ధర్మానుసారంగా సన్యాసం స్వీకరించి, ఆ క్షణంనుంచే సల్లేఖనవ్రతం ఆరంభించినారు. చంద్రగిరి కొండపై ఒకబండమీద ఒకచోట కుడిపక్కగా పండుకొని, పంచపదాలు స్మరిస్తూ, అనవరత ధ్యాన నిరతలయినారు.

మాచికబ్బె సల్లేఖనవ్రతం ప్రారంభించిన వెంటనే, మారసింగమయ్యగారు శివదీక్ష స్వీకరించి, కావిబట్టలు కట్టి ధర్మోద్ధారకులయి, జంగముడై దండం, జోలె ధరించి, దేచయ్యను శిష్యునిగా చేసుకుని, విశ్వేశ్వరుని సన్నిధిఅయిన వారణాసికి పాదచారులయి ప్రయాణం సాగించినారు. చందల మాచికబ్బె సేవకు పూనుకొన్నది.

సల్లేఖనం ప్రారంభించిన మొదటి నాల్గునాళ్ళు మాచికబ్బె శాంతీశ్వరుని అభిషేకంచేసిన జలం పగలు ఒక గిన్నెడు, సాయంకాలం ఒక గిన్నెడు పుచ్చుకొన్నారు. తర్వాత రెండునాళు మధ్యాహ్నం ఒకవేళ ఒకగిన్నెడు పుచ్చుకొన్నారు. తర్వాత దానినికూడా మానివేసినారు. పండుకొన్న స్థలంనుంచి లేవలేదు; కుడిప్రైపునుంచి ఎడమప్రైపు తిరుగలేదు; మూసిన కన్నులు తెరువలేదు. అరనిమిషకాలంగూడ జినస్మరణం నిలుపలేదు. మక్షికాది కీటకబాధా నివారణార్థం చందల మాచికబ్బెదగ్గర కూర్చున్నది. మాచికబ్బెదేహం వ్రతం స్వీకరించిన నాటినుంచి దినదినం క్షీణిస్తూవచ్చినది; శక్తి హీనమయినది. దేహం కాగితానికి వాడుతూ వచ్చినది. ఆరునాళ్ళలో మాచికబ్బె సగమయినారు.

## 12

ప్రభువులు రాజధానికి వచ్చినారన్నవార్త భయదుఃఖావృతులయిన ప్రజలకు తొలకరివలె ఆనందదాయకమయినది. అంత దుఃఖంలోను ప్రభువులు క్షోభపడక ఉండడంచూచి ప్రజలు, రాజోద్యోగులు ఆశ్చర్య పడినారు.

ప్రభువులు రాజధానికి వచ్చిన మరుసటి దినమే అక్కడి అధికార వర్గంవారి నందరినీ పిలిపించుకొన్నారు. మంత్రులతోను, అధికారులతోను ఆలోచించి, రాజ్యానికి అభ్యుదయ కరమైన కొత్తకొత్త సూచనలు చేసి, ఉత్తరువులు ప్రకటించినారు. రాజ్యపు ఎల్లలను కాపాడుకొని వస్తున్న అధికారులకు, దండనాయకులకు అధికార మర్యాదలను హెచ్చించినారు. పండిన పంటలో ఆరవభాగం రాజస్వంగాను, సుంకంపన్ను, తెరవు మొదలయిన రాజమర్యాదలను క్రమపరచి, అవి సకాలానికి రాజ్యపు బొక్కసానికి వచ్చేట్టు చేసినారు. రాజమార్గం, ఘంటాపథం, చెరువు, కుంట, బావి, వంతెన, గోభూమి (పచ్చికబీడు)—వీటి విషయాలలో శ్రద్ధ వహించినారు. శిథిలమయిన వాటిని చక్కబరిచినారు. అవసరమైన స్థలాలలో క్రొత్తవి నిర్మించినారు. జనులను ఇబ్బందిపెట్టే ప్రభుత్వాధికారులను తీవ్రమైన శాసనానికి లొంగేట్టు చేసినారు. సముద్రాల ఆవలి దేశాలనుంచి గుర్రాలను, ఒంటెలను, కాశ్మీరంనుంచి పట్టు, రత్నకంబళాలను తెప్పించి వ్యాపారం చేయించే బ్రాహ్మణులద్వారా సైన్యానికి హెచ్చుగా గుర్రాలను తెప్పించినారు. అడవి గుర్రాలను మచ్చికచేసి, యుద్ధానికి ఉపయోగపడేట్టు చేయడానికి ఉత్తరదేశంనుంచి అనంత సాహిణి అనే అశ్వశిక్షకుని పిలిపించి నియమించినారు. దేవేరుల చిన్నవారు, అశ్వ హృదయం ఎరిగినవారూ, గుర్రపుస్వారీలో నిపుణలూ అయిన బమ్మలదేవి గారి నాయకత్వంలో ఈ అశ్వశాల నడిచినది. (అరసీకెరె తాలూకాలోని గ్రామము) కోళిగుండ అనే గ్రామంలో ఏనుగులను మప్పే గజశాలనూ ప్రభువులు స్థాపించినారు. కేతయ మావటి అనే ప్రఖ్యాతుడయిన మావటి దీనికి అధినేత అయినాడు. ఆ గ్రామంలో ఉన్నవారంతా మావటివారే. పడమటి కనుమల అడవులనుంచి, మలయాళరాజ్యపు అడవులనుంచి, పట్టి తెచ్చిన అడవి ఏనుగులను ఇక్కడ మచ్చిక చేసేవారు. విష్ణువర్ధనులవద్ద మచ్చిక చేసిన ఏనుగులు మున్నూరుకు మించి ఉండేవి.

ప్రభువులు అన్నింటికన్నా హెచ్చుగా జనుల విద్యాభివృద్ధికి, ధర్మాసక్తి, దైవభక్తి అభివృద్ధికావడానికి శ్రద్ధ తీసుకొన్నారు. ధర్మశాస్త్రం, మీమాంస చక్కగా చదివిన విద్యావినయ సంపన్నులయిన బ్రాహ్మణులను పిలిపించి, వారికి అగ్రహారాలను ధారపోసి, వారి జీవనానికి



భూములు దానమిచ్చి, వారితో గురుకులాలు, విద్యాపీఠాలను స్థాపించినారు. ఇలాటి గురుకులాలలో నూరారుమంది విద్యార్థులువచ్చి శిష్యవృత్తి అవలంబించేవారు. ఆ యా ఊళ్ళవారూ, పల్లెలవారూ విద్యార్థుల దీపానికి అవసరమైన నూనె, ఆహారానికి పాలు, పెరుగు, మొదలయినవాటిని ఒదిగించేవారు. ఈవిధంగానే శైవగురుకులాలు, జైన విద్యా పీఠాలు స్థాపితమయినవి. శ్రీపాల త్రైవిద్యదేవుల పైవిచారణలో జైన విద్యాపీఠాలు స్థాపించబడినవి. వేలాపురి చెన్నకేశవ దేవాలయంలో శ్రీ వైష్ణవ గురుపీఠం స్థాపితమయినది. వేలాపురంలో ప్రభువులు పెద్ద అగ్రహారం కట్టించి ఈ బ్రాహ్మణులకు ధారపోసినారు. సర్వమత ధర్మాల అభివృద్ధికీ, ప్రజలలో ధర్మశ్రద్ధ, విద్యాశ్రద్ధ, దైవభక్తి పెరగడానికీ ప్రభువులు ఉదార మనస్సుతో సకలసౌలభ్యాలు కల్పించి, ఆచంద్రార్కమైన యశస్సు సంపాదించినారు.

# 13

శివగంగనుంచి రాజధానికి వచ్చిన తర్వాత సోవలదేవి సహగమన వృత్తాంతం, అత్తమాటలు ప్రపంచంనుంచి పొందిన సర్వస్వం ప్రపంచానికే యిచ్చి శ్రవణ బెళుగొళకు వెళ్ళడం, తక్కిన విషయాలూ ప్రభువులకు తెలిసినవి. అత్తగారు శ్రవణ బెళుగొళకు వెళ్ళినమీదట సల్లేఖనవ్రతం ఆరంభించినదీ, మామయ్యగారు కావిబట్టలుకట్టి కాశికి కాలినడకన వెళ్ళినదీ రెండునాళ్ళ తర్వాత తెలిసినది. ఇదంతా ప్రభువులు లక్ష్మీదేవికి తెలిపినారు. ఆమె "అయ్యో! అయ్యగారిని చూచే భాగ్యం ఇక నాకు లేకపోయెనే!" అని దుఃఖపడినది. అమ్మ శరీరం త్యజించడానికి ముందే ఆమెను చూడవలెనని ప్రభువులకు విన్నవించుకొన్నది. ప్రభువులు "ఆ ఆశ నాకూ లేదా దేవీ?" అనినారు.

చైత్రశుద్ధ ద్వాదశి పారణ అయిన పిదప ప్రభువులు, లక్ష్మి శ్రవణ బెళుగొళకు బయలుదేరి, ఆరాత్రి అక్కడికి చేరినారు. కుమార్తెకు వెంటనే

తల్లిని చూడవలెననే ఆశ ఉన్నా, ధ్యానంలో ఉన్నవారిని ఆసమయంలో బాధపెట్టరాదని ఆరాత్రి గడిపినది.

మరుసటిదినం ప్రాతఃకాలం రాజదంపతులు నిత్యకృత్యాలు తీర్చుకొని, స్నానంచేసి, మడిబట్టలు కట్టుకొని, మాచికబ్బెను చూడడానికి చంద్రగిరి ఎక్కివచ్చినారు. ఎండనక, గాలి అనక నిరాహారంగా రెండు నాళ్ళుగా జల సేవనంకూడా లేక, ఎండలో ఎండి బెండుబారి, కుడివైపు పండుకుని, అహర్నిశం పంచపదాలు స్మరిస్తూ, ధ్యానాసక్తులయిన మాచికబ్బెను దర్శించినారు. చందల ఒక్కతే తల్లివద్ద కూర్చుని, మక్షికాది బాధను నివారిస్తూ కూర్చున్నది. వీరురాగానే లేచి నిలబడినది. ప్రభువులు చందలను చూచినారు. అలంకార రహితురాలై, మలిన వస్త్రాలు ధరించి, పూటకు సరిగా అన్నమూ నీరూ లేక ఎండలో బెండుబారినా, ఆమెలో ప్రభువులకు శాంతలను పోలిన రూపురేఖలు కనిపించినవి.

వచ్చినవారు ఎవరని చందలకు తెలిసినది; భక్తితో, లజ్జతో లేచి వచ్చి ఇద్దరికీ నమస్కరించినది. లక్ష్మీదేవి చందలను దగ్గరికి పిలిచి, తల నిమురుతూ, "చెల్లీ, నీవు చాల చిక్కిపోయినావు. అమ్మ ఎలాగు ఉన్నారు?" అని ప్రశ్నించినది. "అమ్మ నీరుకూడా వదలి నేటికి రెండవ దినం. ఎండవడ చాల హెచ్చు. కింద బండకూడా కాలుతూ ఉంటుంది. అమ్మ మొన్న సాయంకాలంనుంచి మూసిన కండ్లను తెరువలేదు. దినమంతా నేను పక్కన ఉంటున్నాను. రాత్రిళ్లు చైత్యాలయ సేవికలు జాగ్రతగా చూచుకొంటున్నారు." అనినది చందల.

రాజదంపతులు మాచికబ్బె పాదాలకు నమస్కరించినారు. లక్ష్మి శుద్ధోదకంతో చేతులు కడుక్కొని, వ్రేళ్ళను నీటిలో అద్దుకొని, తల్లి కన్నుల పైభాగాన్ని తడుపుతూ చల్లబరిచి, తన మరొక తప్పును మన్నించవలసిందని శాంతీశ్వరుణ్ని ప్రార్థించి, అమ్మ చెవిలో నెమ్మదిగా మృదుమధురంగా "అమ్మా, నేను వచ్చినాను. కళ్లు తెరిచి ఒక్కమారుచూడమ్మా. నేను వచ్చినాను." అని ఒకటి రెండుసార్లు అన్నమీదట, మాచికబ్బె నెమ్మదిగా కళ్ళు తెరచినారు. శరీరం కృశించిపోయి ద్రవమంతా ఎండి



పోయినప్పటికీ, మాచికబ్బె నెమ్మదిగా కళ్ళు తెరచి, తమ బిడ్డను గుర్తించి మందహాసం చేసినారు. మెల్లగా బిడ్డచేతిని తమ చేతిలో పట్టుకొనినారు. తర్వాత ప్రభువులను చూచినారు. ఆమె మనస్సు కుదుట బడినది. సైగ చేసి చందలను దగ్గరికి పిలిచినారు. కుమార్తె అల్లుడుగారు పక్కనే కూర్చున్నారు. మాచికబ్బె వణుకుతున్న తమ చేతితో చందల కుడిచేయి తీసుకొని, ప్రభువులు కూర్చున్నవైపు దానిని చాచి, పట్టుకున్నారు. ప్రభువులు తమ అత్తగారి మనోభిప్రాయం గ్రహించి, గౌరవించి ముందుకు జరిగివచ్చి తమ కుడిచేయి ముందుకు చాచినారు. మాచికబ్బె అతికష్టంతో చందల చేతిని ప్రభువుల చేతిలో పెట్టి మాట్లాడడానికి యత్నించినారు. నాలుకలో ద్రవంలేదు. గొంతుకలో ద్రవంలేదు. ధ్వని పెగలలేదు. ప్రభువుల ముఖం చూస్తూ, అస్పష్టధ్వనితో "శాం...త..." అని పలికి, ముందుమాట పెగలక ఒకమారు ప్రభువుల ముఖాన్ని, ఒకమారు కూతురు లక్ష్మి ముఖాన్ని చూచినారు. ఆమె ఇంగితం తెలిసిన ప్రభువులు "సమ్మతమే, అమ్మా, శాంతల అనే భావిస్తాను." అనినారు. మాచికబ్బె తృప్తి కలిగిన ముఖముద్ర వ్యక్తపరుస్తూ, మరొకమారు కూతురు లక్ష్మి ముఖం చూచినారు. అమ్మ మనస్సు గ్రహించినజాణ లక్ష్మి చందల చేతిని తన చేత పట్టుకొని, తన వక్షస్స్థలంపై పెట్టుకొన్నది. "నా చెల్లెలనే ఈమెను చూస్తాను." అనే భావంతో. తల్లి చివరి ఆశా అదే. అదిప్పుడు పూర్ణమయినది. మాచికబ్బె తమ అన్నిపనులూ ముగిసినవని కండ్లను తుదిసారి మూసుకున్నారు. బిడ్డలిద్దరూ తల్లి పాదాలుతాకి కళ్ళకు అద్దుకున్నారు. రెండుమూడు నిమిషాల కాలం మాచికబ్బె పెదవులు కదలుతుండడం చూచి, అమ్మ జినస్మరణ చేస్తున్నారని వారంతా అనుకున్నారు. వారు చూస్తుండగానే, మాచికబ్బె దేహం కొంచెం కదలినట్లయి, తల ఒకవైపు ఒరిగిపోయినది. ఆక్షణమే మాచికబ్బె ఆత్మ దేహముక్తమయినది. కుమార్తెల కళ్ళు ధారలు కురిపించినవి. ప్రభువుల కనుకొలకులలోను నీరు కనిపించగా దానిని వారు ఉత్తరీయంతో తుడుచుకొన్నారు. బహుశః అత్తగారు తమ యిద్దరిరాకనే నిరీక్షిస్తూ జీవం బిగబట్టుకొని ఉన్నారా? అనిపించినది ప్రభువులకు. ఆక్షణంలో లక్ష్మీదేవిగారు ప్రభువులతో ఆమాటనే అనినారు.

అనంతరం ప్రభువులు స్థలాధికారులను పిలిపించి తర్వాతి కార్యక్రమాలకు ఉత్తరువు చేసినారు.

త్వరలో చితి సిద్ధమయినది. మాచికబ్బె కళేబరం చితారోహణం చేయించినారు. కుమార్తెలిద్దరూ మాచికబ్బె దేహానికి మంగళద్రవ్యాలు పెట్టినారు. చితికి ప్రదక్షిణ నమస్కారాలు చేసినారు. ప్రభువులుస్నానం చేసి, ఏకవస్త్రధారులై, "దైవం తనపాలికి ఈతల్లి అంత్యసేవనైనా దయచేసినదికదా!" అని భావించి, అగ్నిని గ్రహించి చితికి ప్రదక్షిణం చేసి, చితికి అగ్నిస్పర్శ చేసినారు. మాచికబ్బె భౌతికకాయం కాలి భస్మమయినది.

ప్రభువులు ఆరాత్రి ఆఊరిలో ఉండి, మరుసటిదినం ప్రాతఃకాలం స్నానం ముగించి, చితాగ్నిని శాంతంచేసి, ఉత్తర కైంకర్యాలు జరిపి, అనంతరం శాంతీశ్వరబసదికివచ్చి అత్తగారిపేర విశేష దానధర్మాలను నడిపి, అత్తగారిపేర శాంతీశ్వరునికి అఖండదీపం ఏర్పాటు చేసినారు. అంతా అయినతర్వాత దేవేరితోపాటు, చందలతోపాటు రథమెక్కి ద్వారవతికి పయనమై రాత్రి పొద్దుపోయినమీదట ద్వారవతి చేరినారు. అందరి మనస్సులలోను దుఃఖం ఆవరించి ఉన్నందున దారిలో ఎవరూ ఎవరితోనూ హెచ్చుగా మాట్లాడడంకాలేదు. ప్రభువులుమాత్రం దీర్ఘాలోచనలో కూర్చున్నారు. చందల హృదయంలో, లక్ష్మీదేవి హృదయంలో దుఃఖం నిండినది. ప్రభువులు ఈ ఎనిమిది పదినాళ్ళలో జరిగిన మరణాలను చిక్కులనూ, ఇతర సంగతులనూ దారిపొడవునా స్మరిస్తూ, ప్రయాణం చేసినారు.

# 14

రాజధానికి వచ్చినమీదట అందరూ శుద్ధస్నానంచేసి. నారాయణునికి నమస్కరించి, అల్పాహారం స్వీకరించినారు. ప్రభువులు నిద్రవచ్చే వరకు చంద్రశాలలో వచ్చి కూర్చున్నారు. కొంతసేపయిన తర్వాత



ప్రతీహారినిపిలిచి "మేము పిలిచినామని దేవిగారికి తెలుపు." అని చెప్పి పంపినారు.

చందలతో మాటలాడుతూ కూర్చున్న లక్ష్మీదేవి ప్రభువుల పిలుపు విని, చందలకు "పడుకొని నిద్రపో చెల్లీ!" అని చెప్పి ప్రభువులవద్దకు వచ్చి నమస్కరించి కూర్చున్నది. ప్రభువులు చాల యోచనలో ఉండడం ముఖభావంతో తెలుసుకొన్నది. మాటలకు తానే ప్రారంభించి, "ప్రభూ, చందలతో మాట్లాడుతున్నాను. అమ్మమరణించడం దానికి మహాదుఃఖం." అన్నది.

"నీకు దుఃఖం లేదా శాంతలా ? నీ దుఃఖంకన్నా హెచ్చుదానిది?"

"దుఃఖంలేదా ప్రభూ? ప్రపంచంలో తల్లికంటే బంధువులున్నారా? నాతల్లికి అందరిమీద సమానప్రీతి విశ్వాసాలుండేవి. నామీద ఉన్నంతే లక్ష్మిమీద ఉండేది. ఇప్పుడు చందలనుకూడా అంతే ప్రీతితో చూచే వారు. నేనూ, లక్ష్మీనగరుకు వచ్చినతర్వాత అమ్మకు ఇల్లు శూన్యమయినది. మనస్సుకూడా శూన్యమయినది. అప్పుడు దైవమే అమ్మకు చందలను తెచ్చి ఇచ్చినది. అది ఏ గతజన్మల వాసనో, ఏమో! చందలకు నావస్తువులమీద ప్రీత్యాదరాలు పెరిగినవి. నా ఉపాస్యదేవత శారదపై ఆమెకు భక్తికలిగి, దినదిన ప్రవర్ధమాన మయినది. అమ్మ అనేవారు : నీవు కట్టే, తొడిగే వస్త్రాలను అత్యాదరంతో కట్టి తొడుగుతున్నది." అని నేను వాడే వస్తువులన్నీ ఆమెకు ప్రియమయినవి. అమ్మ, అయ్య అన్నీ దానధర్మం చేసినప్పుడు నా వస్త్రాలను తాను అడిగి తీసుకొన్నదట. ఇప్పుడు శారదారాధనలో ఆమెచిత్తం మగ్నమయినది దేవిని పూజించకుండా, ధ్యానించకుండా, భోజనంచేయదు; నిద్రపోదు. ప్రభూ, అమ్మ ఆమెను మీ చేతుల్లో పెట్టడమూ, మీరు ఆమెను పరిగ్రహించడమూ నాకు చాలతృప్తి."

"దేవీ, నీమనస్సు చాల విశాలం. బహు గంభీరం. మీఅమ్మ ఆమెను నాచేతుల్లో పెట్టడానికే ప్రాణాలు నిలుపుకొని ఉన్నారు. దానికోసమే దైవం అయినంతవరకు మీఅమ్మను ఉండనిచ్చినది అందాము. చెప్పుదేవీ, నీవు మరణించి బ్రదికినదానివి. పెక్కు రహస్యాలు నీకు అనుభవం అయి ఉండవలె. నేను వాటిని అడుగవచ్చునో, అడుగరాదో! తెలుసుకోవాలని

మనస్సు ఉబలాట పడుతున్నది. నేను తెలుసుకోదగినట్టయితే చెప్పు, దేవీ. ప్రపంచంలో చావు బ్రతుకులే ఒక మహారహస్యం. మహా విచిత్రం. ఒక్కొక్క మతమూ ఒక్కొక్క విధంగా చెబుతున్నది. ఒక్కొక్క మతాచార్యుడూ ఒక్కొక్క రీతిగా అభిప్రాయపడుతున్నారు. అందరూ మహాత్ములే. ఎవరని నమ్మడం? దేనిని నమ్మడం ? నా మనస్సుకూ ఏమేమో భాసిస్తుంది. దేవీ, నీవు ఏమి చూచినావు ? నీ అనుభవమేమి ? చచ్చిన తర్వాత ఏమైనది ?"

"దేవా, నా ఆత్మకు ఏనొప్పీ, ఏబాధా కలుగలేదు. దేహం మాత్రం పాడిపాడి అయినది. అప్పుడది ఆత్మనివాసానికి అనర్హమయినది."

"శాంతలా, శరీరం, చెడిపోయిన మీదట నీవు ఏ రూపంలో ఉన్నావు ?"

"నా శరీరం చెడినతర్వాత నాఆత్మ కన్నులులేక చూడగలిగినదీ, చెవులులేక వినగలిగినదీ. గాలిలో గాలిఅయి, మనోవేగంతో పోగలిగినదీ అయినది. సూక్ష్మంకన్నా సూక్ష్మమయినది. శీతోష్ణాతిబాధ దానికి కలుగ లేదు. ఆకలిదప్పులు దానికి ఉండలేదు. నిద్రనుంచి మేల్కొన్నట్టు సుఖంగా మరొక లోకంలో లేచినాను. నేను అక్కడున్నాను. ఆత్మల లోకమది."

"కాలపరిమితికూడా లేదా ? గాలిలో కలిసిపోగలదా ?"

"ఔను ప్రభూ. అయితే ముందు ఏమవుతుందన్నది నా ఆత్మానుభవానికి రాలేదు. ఇహజీవితపు ఆయుఃపరిమాణం పూర్ణం కానందున అలాగు అయినదేమో ! మీసామీప్యానికే అంగలార్చిపోయినది నాఆత్మ. మీప్రేమ వినా మరొకటి ఏదీ నాకు అక్కరలేకపోయినది. నా చెల్లెలు మాత్రం ఆ సమయానికి రాకపోయి ఉంటే, ముందు ఏమయేదో ! అదృష్టమైన దైవశక్తే లక్ష్మిని ఆసమయానికి పిలుచుకొని వచ్చినది. దేవ ! ప్రేమ విశ్వాసాలే ఆత్మకు అన్నం. దానినుంచే అది వృద్ధిపొందవలె."

"దేవీ, నీనుంచి నేను చాల ఉపకారం పొందుతున్నాను. నాఉద్ధారం కోసమే నీఆత్మ లక్ష్మి దేహంలో ప్రవేశించినది. దీనివల్ల లక్ష్మికి ఏమీ బాధ కలుగలేదు కదా ? కలుగుతుండడం లేదుకదా ?"



"లేదుప్రభూ. నా చెల్లెలికి నేను బాధ కలిగిస్తానా ? మా యిద్దరి ఆత్మలూ గాలిలోగాలి, నీటిలో నీరు చేరినట్టు చేరి పోయినవి."

"ఇది విచిత్రమైన మాట. ఆత్మలు ఒకదానినొకటి తెలుసుకొని నడుచుకుంటే, సమాన ప్రీత్యాదరాలను పెంచుకుంటే, ఒకేఆత్మ కాగలవా ?"

"నాకు అలాగు అనిపిస్తున్నది. ఈ అనంతానంతమైన ఆత్మలన్నీ, ఒకే పరమాత్మ బహురూపాలని నా నమ్మిక. పరస్పర ప్రేమ విశ్వాసాలే దీనికి ఆధారం. విషయ వాసనతో, అవిద్యతో, రుచి వైచిత్ర్యంలో అరిషడ్వర్గం ప్రేరణ పోషణలతో కామనతో, వస్తు విషయాలకు మనస్సు ఇచ్చినకొద్దీ మూలం మరచి, స్వేచ్ఛా కల్పితజాలంలో చిక్కుకొని, భిన్న భిన్న రూపాలయినవి. నేనూ, లక్ష్మి మీఆత్మ భిన్నరూపాలే. ఇకమీద మనందరిఆత్మ ఒక్కటే కావాలి. మనోవికారాలు, భ్రమలు సమసి పోవాలి. ప్రేమ విశ్వాసాల పోషణమొక్కటే దీనికి సాధనమార్గం. ఆత్మైక్యతే ధ్రువం. దీనికి ఏ అడ్డూ, ఆటంకం రాకుండా పోషించుకోవలె."

"దేవీ, నాకు ఇంకా ఒక్క సందేహం మిగిలినది. నీవు నాబాధ తెలుసుకొని నా దగ్గరికి వచ్చినట్టు, ఇతర ఆత్మలూ వాటికోసం పరితపించే వారివద్దకు ఎందుకురావు ? వచ్చి ఆనందింపజేయవెందుకు ?"

"అక్కడికి పుట్టుక, చావు ముగిసినట్టేకదా ! చావు ఆత్మ ఉన్నతికి గాని, అవనతికిగాని ఒక ద్వారం. చావు లేకపోతే ఎలాగు ? ఎట్లు ? నాకింకా ఆయుశ్శేషం ఉన్నట్టు కనిపిస్తుంది. నేను ఈలాగు మీదగ్గరికి రాకఉంటే, అది ఇంకేరీతిగా గడిపేదో ఏమో ! ఇంతలో మీ హృదయపు పిలుపు తట్టుకోలేనంతగా వినిపించినది. మీ అంతిమ నిర్ధారానికి నా ఆత్మ వణికిపోయినది. అప్పుడు లక్ష్మి రావడం చూచినాను. లక్ష్మి కూడా నన్ను పిలిచినది. ఒట్టు పెట్టుకొన్నది. మీ అంతిమ నిశ్చయాన్నే ఆమే చేసినది. అప్పుడు నేను వచ్చినాను. లక్ష్మి మనయిద్దరికోసమే వచ్చినది."

"దేవీ, నీవు కోపగించుకొని, తొందరపడేదానివికావు...అయినా.. నా మనస్సుకు చాల బాధ కలిగించినావు."

"పెక్కు సమయాలలో కోప సుఖదుఃఖాల ఆవేశంలో మనస్సు గతి తప్పుతుంది. ఆత్రం అనేక దోషాలకూ, పాపకర్మలకూ మూలం. చేసినతర్వాత అవివేకం చక్కగా తెలియవస్తుంది."

"నీవే చెప్పేదానివి తొందరపాటువల్ల సంయమం తప్పుతుందని. నీవే తొందరపాటుతో ప్రవర్తించినావే! ఇదంతా తెలిసిన నీవే ఇలాగు చేసినావే?"

"నా ఆత్మనుంచి నాకు అప్పుడు మరేఉపదేశమూ అప్పుడు లభించలేదు. ఈకృత్యం నేనై-చేసినానో, అగోచర మరేశక్తే చేయించినదో నాకు తెలియదు. కొన్నిసందర్భాలలో ఏదో అదృష్టశక్తే మనను పట్టుకొని పనిచేయిస్తుంది. దాని ఉద్దేశ్యం పరమాత్మ కొక్కనికే తెలివిడి. దైవజ్ఞులు మాత్రం దీనిని గ్రహించగలరు."

"ఔను. దేవీ, పరమాత్మనొక్కనికే ప్రకాశం. ఇదంతా చెప్పి, నీవు ఒక్కవిషయం మాత్రం చెప్పలేదు."

"అది ఏదిప్రభూ? మీనుంచి ఏ విషయం మూసిపెట్టినా అది ఆత్మవంచనే అవుతుంది. నేను ఆ ఆత్మవంచన చేయను."

"అయితేచెప్పు. నీవెందుకు మరణించినావు?"

"ప్రభూ, నాకు సంతానభాగ్యం లేదు. నేను పట్టమహిషిగా ఉన్నప్పుడు లక్ష్మిని పట్టమహిషిగా చేసుకొనడం సాధ్యం కాదనినారు. నా మనస్సు అప్పుడు చాలసంకటం పాలయినది. అయినా కుమారుని యువరాజపదవికి తీసుకొని వద్దామని మీరు సెలవిచ్చినమీదట, నా బాధ నిశ్శేషమయినది. నాతమ్ముని గుణగణాలను నేను మెచ్చుకున్నాను. నా కడుపులోనే మగబిడ్డడు పుట్టినా, కుమారుని ఉదాత్తగుణాలు వానికి వస్తాయా? ఒకవేళ రాకపోతే?—అనే సందేహం కలిగి, కుమారుణ్నే యువరాజ పదవికి తేవడమని నామనస్సు సంపూర్ణంగా ఒప్పింది. అయితే, మనమెవరూ రాజధానిలో లేనప్పుడు కుమారుడు, మనలోఎవరినీ అడుగక తనకుతానై గరుడి అయినాడు. ఆనాడే తను సహగమనం చేస్తానని సోవల కంకణం కట్టుకొనినది. కుమారుని ఆరుమంది స్నేహితులయిన నాయకులూ కుమారునితో పాటు తామూ వెళ్లుతామని కృతనిశ్చయు లయినారట. కుమారుడు గరుడి కావడంవల్ల నామనస్సుకు వాడు తప్పిదం చేసినవాడేమీ కాలేదు. అమృతంవంటి వాని మనస్సును సర్వథా అభినందించ వలసినదే. అయితే మీవలె దేశహిత చింతనలోనే మగ్నురాలయిన నాకు కుమారుని ఎడమకాలిలోని గరుడితోడా చూచినవెంటనే గుండె పగిలినట్టయినది. చాల సంకటపడినాను; చాల సంకటపడినాను. 'దేశానికి ముందేమిగతి?' అనే భయమొకటి అప్పుడు నా ఎదలో పుట్టినది. నా చెల్లెలికి పుత్రయోగం ఉందని నాకు మొదటినుంచి నమ్మిక. దత్తు తీసుకొందామంటే అలాటి బిడ్డలెవరూ నా మనస్సుకు తెలియలేదు. కుమారుణ్ని వదలితే బొప్పణ ఒక్కడే నా మనస్సుకు నచ్చినవాడు. అప్పుడు నాకు మరొక భయం పొడసూపినది. లక్ష్మికి ఒకవేళ మగబిడ్డడు పుడితే, అది మీ రక్తమే అయినా ఆ సంతతికి స్థానమానాలు లేకపోతవి గదా, ముందు ముందు రాజ్యలోభంతో వీరిద్దరికీ పోట్లాటలు కలిగితే! అందువల్ల ఈ యోచనకూ, నా మనస్సు ఒప్పలేదు. ఎందుకంటే, ముందుముందు పుట్టగల ఈ చిక్కులను పరిష్కరించడానికి మీరయినా, నేనైనా అంతవరకూ ఉండగలమనే నమ్మకమేమి? నేనయితే 'మీతో ఉండేదానినే, మీతో వచ్చేదానినే' అని ఏనాడో నిర్ధరించినాను. అందువల్ల ఈ అన్నిసమస్యలు పరిష్కరించడానికి నాకు మిగిలినది ఒకేమార్గం. నా చెల్లెలు పట్టమహిషి కానీ అని నేను నా దేహం త్యజించడానికి నిశ్చయించినాను. మా వంశాభివృద్ధి కోసం, దేశహితం కోసం, ఆత్మార్పణ చేసుకొన్నాను. ఇది మీ మనస్సుకు తప్పని తోస్తున్నదా?"



"ఇది తప్పని ఎలాగు అనను? అనకుండా ఎలాగు ఉండగలను? నీవు పోయిన తర్వాత ఎవరు ఉంటారు? నిన్ను కళ్ళకు అద్దుకుందామనే ఆశ కలుగుతున్నది. నీ హృదయం ఎంత దొడ్డది, శాంతలా?"

"మీరు నాకు అన్నివిధాల పెద్దలు. మిమ్మల్ని చేపట్టి నేను పెద్దదాన్నయినాను."

"అయ్యో! ఎవరూ ఎవరిని చేపట్టీ పెద్దవారు కారు. పెరిగే పైరు నారులోనే కనిపిస్తుంది. పెద్దతనం చిన్ననాడే స్పష్టంగా కనిపిస్తుంది. అధికారంలో, అంతస్తులలో హెచ్చుగా కనిపించేది పెద్దతనం కాదు; చిన్నతనం, పొగరు. ప్రభుత ఉన్నచోట పెద్దతనం ఉండడం సౌందర్యానికి సౌశీల్యమూ ఉన్నట్టు; చాల విరళం."

"నా ఆత్మార్పణ ఫలం నేను అనుకున్నట్టుకాలేదు. పిడుగుపై పిడుగు పడినట్టు మీరే దేహం త్యజించే పరిస్థితిని తెచ్చినది. అప్పుడు నా ఆత్మ కళవళపడినది. 'అయ్యో! నేను చేసిన దేమిటి? ఏమి చేసినాను?' అని తపించిపోయినాను. అప్పుడు లక్ష్మి రావడం చూచినాను. నా చెల్లెలు రావడం చూచినాను; దైవమే నా రక్షణకు వస్తుండడం చూచినాను. లక్ష్మి రావడం కొంచెం ఆలస్యమయి ఉంటే, కొన్ని నిమిషాలు తడవయి ఉంటే ఏమేమి జరిగిపోయేదో! మీ పూజనూ, భక్తినీ ఒప్పిన ఆ విజయ నారాయణుని వల్ల.. ఇంకా పదిసార్లు కాదు, నూరుసార్లు చెబుతాను... ఆ నారాయణుడే మహాసంకటాన్ని గాలికి చిక్కిన గడ్డిపోచవలె ఎగురగొట్టినాడు; అగ్నివర్షాన్ని అమృత వర్షంగా చేసిన కరుణ వానిది! వానిది కాక మరెవరిది?"

"చక్కగా చెప్పినావు దేవీ? చాల చక్కగా చెప్పినావు. ఈ సంతోషమంతా నిస్సందేహంగా విజయనారాయణునిదే. నీ చెల్లెలి కోసం ఇంతి కష్టపడినావా? నీ దేశంకోసం జీవనం ధారపోసినావా? శాంతలా, నీ హృదయం ఇంకా ఆనందంతో పొంగేట్టు ఈ విష్ణువర్ధనుడు చేస్తాడు. నారాయణుడే దీనికి సాక్షి. లక్ష్మిని పట్టమహిషిగా చేసుకొంటాను; అత్యానందంతో చేసుకొంటాను; మహోత్సవంతో చేసుకొంటాను. నాకు, నా రాజ్యానికి, నా శాంతలకు....నా మహాలక్ష్మికి కుమారుడు పుడుతాడు."

"ఇప్పుడు నాకు మహానందమయినది. ఈ ఉత్సవంలోనే నా చెల్లెలు చందలను పాణిగ్రహణం చేసుకొని, మీ చిన్నరాజ్ఞిని చేసుకోండి."

"ఆనందంతో, చందలను మీ తల్లి సంబోధిస్తున్నట్టు నీ పేరుతోనే పిలిచి పెండ్లాడుతాను."



శాంతలకు పట్టరానంత సంతోషమయినది. కూర్చున్న స్థలంనుంచి లేచివచ్చి, ఆనందపరవశురాలయి, పతిని గాఢంగా ఆలింగనం చేసుకొన్నది. ప్రభువులూ అంతటి ఆనందంతోనే దేవిని స్వీకరించినారు.

# 15

మరుసటిదినం ప్రాతఃకాలం లక్ష్మీదేవి కేతమల్లనాయకులను, జక్కియబ్బెను నగరుకు పిలిపించుకొని, తన తల్లి సల్లేఖనం స్వీకరించి, కైవల్యం పొందిన సంగతిని తెలిపినది. మాచికబ్బె అంత్యాన్ని కేతమల్లదంపతులు తెలిసినా, ఇంత త్వరగా కైవల్యప్రాప్తి కలుగుతుందని భావించలేను. దంపతులిద్దరూ అప్పుడు చేతులు జోడించి, మాచికబ్బెగారి మహాత్మను స్మరించి నమస్కరించినారు. లక్ష్మీదేవి తన సంభాషణ కొనసాగించి, మాచికబ్బె తమ అంతిమ నిశ్శ్వాసానికి ముందు చందలచేతిని ప్రభువుల చేతిలోపెట్టి 'ఈమెనూ శాంతల అనే పరిగ్రహించవలె' అని చెప్పిన సంగతిని తెలిపినది. కేతమల్లదంపతులకు అత్యాశ్చర్యమూ, అత్యానందమూ ఏకకాలంలోనే కలిగినవి. తమ కుమార్తె విష్ణువర్ధనులను చేపట్టగలదని వారు భావించలేదు. అది వారి ఊహకూ మీరిన ఆశ. జక్కియబ్బె, కన్నులలో ఆనందబాష్పాలతో "వెనుకటి జన్మలో మాచికబ్బె దానికి తల్లి అయి ఉంటారు. చందల కూడా ఈ జన్మలో ఆమెకు కుమార్తెవలెనే నడచుకొన్నది." అనినారు. కేతమల్లనాయకులవారు "మూడునిమిషాలు సేవచేసినవారినీ ముక్కంటి మరచేవాడు కాడు జక్కీ. ఇది నీ కుమార్తె సౌభాగ్యం. శివుని కరుణ." అనినారు.

వచ్చే వైశాఖ శుద్ధాష్టమి వివాహ ముహూర్తమని, ఆదినమే లక్ష్మీదేవిగారు పట్టమహిషి అవుతారని నిశ్చయమయినది. ముహూర్తానికి ఒక్క నెలకూడ వ్యవధి లేదు. పనులేమో బ్రహ్మాండమంత. దాసదాసీజనానికి, పౌరులకు, అధికారులకు ఒక నెలపాటు భోజనంలేదు, నిద్ర లేదు అన్నట్టు అయినది. శాంతలా మహారాజ్ఞి కళ్యాణ దినమంత విజృంభణ కిది సమయం

కాకపోయినా, ప్రజల దుఃఖం ఆరిపోనీ అని, ప్రభువులు అన్ని పనులకూ లొక్కసంనుంచి యథేచ్ఛగా ధన మిచ్చినారు.

నిశ్చిత దినాన, నిశ్చిత శుభముహూర్తంలో కల్యాణోత్సవం వర పూజలో మొదలయినది. ప్రభువులు కన్య పేరు 'శాంతల' అని ఘోషించినారు. చందల 'శాంతల' అయినది. కేతమల్లనాయకులవారూ, జక్కియబ్బె ప్రభువుల కాళ్లుకడిగి మధుపర్కమిచ్చి ఉపచరించి, సర్వాలంకార భూషితురాలయి శాంతలా మహారాజ్ఞివలె ఒప్పుతున్న తమ కుమార్తెను ఆనందంతో ప్రభువులకు ధారపోసినారు. ప్రజలంతా ఆనంద కోలాహలం చేసినారు.

ఈ సుముహూర్తంలోనే ప్రభువులు లక్ష్మీదేవిని చేయిపట్టుకొని సింహాసనం మీద కూర్చో పెట్టుకొన్నారు. కళ్యాణమంటపంలోవున్న సమస్త జనులూ అత్యానందంతో, ఏకకంఠంతో "లక్ష్మీదేవిగారికి, మహారాజ్ఞి లక్ష్మీదేవిగారికి జయం కలుగుగాక! విజయం కలుగుగాక!" అని నినాదంచేసినారు. ప్రభువులు ఆనందంతో తమ భాగ్యేశ్వరికి, తమ మహాలక్ష్మికి పట్టంకట్టినారు. తపోధనులయిన మహర్షులు శాంత్యుదకాలతో అభిషేకం చేసినారు.

ప్రభువులూ, మహారాణీ, అనంతరం దివ్యదుకూలాలు ధరించివచ్చి సింహాసనం అధిష్ఠించినారు. రాజ్యాధికారులూ, మంత్రులు, సేనాపతులూ, సామంతులు, ప్రెగ్గడలూ, శ్రేష్ఠులూ, అంతఃపుర సంబంధులూ, సింహాసనం ముందుకు వచ్చి మహారాజ్ఞికి, ప్రభువులకూ నమస్కరించి, తమ గౌరవ విశ్వాసాలు వ్యక్తపరచినారు.

ఇది సమాప్తమయిన తర్వాత, నవవధువు మాంగల్యధారణ మయినది; సప్తపది అయినది; హవనశాంతి స్వస్తి వచనాలతో వివాహం పూర్ణమయినది. వివాహానికి ఆహూతులయినవారికి ఉడుగర మర్యాదలు, ఇతరులకు సంభావనలు, అందరికీ భోజనాలూ ఎప్పటివలె చక్కగా జరిగినవి. నాలుగునాళ్ళు అంతఃపురంలోను, రాజధానిలోను వైభవంగా ఉత్సవాదులు జరిగినవి.



మహారాజ్ఞి లక్ష్మీదేవే వెనుకటి శాంతలాదేవి అన్నవిషయం అచ్యుత గోవిందులకు, ప్రభువులద్వారా హేమాద్రి ప్రధానులకు మాత్రమే తెలిసి ఉండినది. నగరులోని అధికారులకు తక్కిన దేవేరులకు, దాసదాసీ జనానికి లక్ష్మీదేవి వెనుకటి లక్ష్మీదేవివలె కనిపించలేదు. మాటలలో, నవ్వులో, నడకలో, చూపులో, తెలివితేటలలో, పనుల విచక్షణలో వెనుకటి శాంతలాదేవి రీతి ఉండడమే వీరంతా చూచినవారయినా, "పట్టానికి వచ్చిన ఈమె తమ అక్కను అనువర్తించడం ఏమాశ్చర్యం?" అనుకొని ఊరుకున్నారు.

ప్రభువులూ ఇప్పుడు మహారాజ్ఞి లక్ష్మీదేవిని ఒక గడియకూడా వదలి వుండలేనివారయినారు. ఏకాంతంలో ఆమెతో జాములతరబడి రాజ్యానికి సంబంధించిన విషయాలను, ఇతర విషయాలను చర్చించేవారు. విరామ సమయాలలో దేవిగారు వీణవాయించడం, పాడడం వింటూ, చాలసేపు ఆనందంలో గడిపేవారు. లక్ష్మి వీణ వాయించడం ముందు ప్రభువులు పెక్కుసార్లు విన్నప్పటికీ "ఇప్పటి వీణావాదనరీతి లక్ష్మిది కాదు; శాంతలది. పాడేతీరూ శాంతలదే." అని గ్రహించినారు. ఘోరమైన అంధకారం గడచిన పిదప, అంతటి వెలుగుగల నాళ్ళూ చూడవచ్చు. ప్రభువుల జీవితమూ అంత సుఖమయమయినది. లక్ష్మి ఉన్నది; శాంతలా ఉన్నది. కొత్త శాంతలా వచ్చినది. ప్రభువులు వర్షాకాలమంతా రాజధానిలోనే గడిపినారు. మరొక వర్షాకాలమూ పూర్తికావచ్చినది. కొత్త శాంతలకు-చందలకు-ఒక ఆడబిడ్డ కలిగినది. ఆపాపకూ "చిన్న శాంతల" అనే ప్రభువులు పేరుపెట్టినారు. ఎంత సంతోషోత్సాహాలతో ఉన్నా కుమారవిష్ణువును, సోవలను పోగొట్టుకొన్న బాధ వారి హృదయంలో ఒక భాగంలో ఉండనే ఉండినది.

# 1

ప్రభువులు ఈ విధంగా చాలనాళ్ళు రాజధానిలో ఉన్నప్పుడు హానగల్లు పాలకుడు మల్లికార్జునుడు వెనుక యుద్ధంలో శరణాగతుడయి సామంతుడయినవాడు, ఇప్పుడు మూడవసారి స్వతంత్రుడు కావడానికి ఉబలాట పడినాడు. గోవాపాలకుడయిన కదంబరాజు జయకేశి ఇప్పుడు చాళుక్య షష్ఠవిక్రమాదిత్యుని అల్లుడు అయినందున చాళుక్యుల సకల సైన్య సహాయమూ మల్లికార్జునునికి ఒదిగిస్తానని మాట యిచ్చినాడు. ఈ ధైర్యమే మల్లికార్జునునికి స్వాతంత్ర్యం సంపాదించుకొందామనే ఆశ కలిగించినది. ఇప్పుడు చాళుక్య షష్ఠవిక్రమాదిత్యుని కాలమూ గడచి, మూడవ సోమేశ్వరుని కాలమూ అయి, రెండవ జగదేకమల్లుడు చాళుక్య భూపతి అయినాడు. మల్లికార్జునునికి ఈ చాళుక్యభూపతి సహాయమూ లోలోపల ఒనగూడినది.

హానుగల్లులో విష్ణువర్ధనులు నెలకొల్పిన హొయిసళ సేనను మల్లికార్జునుడు బెదరించి తరిమివేసినాడు. ఆసేన అప్పుడు బంకాపురంలో ఉన్న పునీసనాయకుని వద్దకు పరిగెత్తివచ్చి హానుగల్లులో అయిన, అవుతున్న విషయాలను మనవిచేసినది. అంతలో మల్లికార్జునుని సైన్యం బంకాపుర విషయం ఎల్లలలోను కనిపించినదనే వార్త పునీసనాయకునికి చేరినది. ఆవార్తను అతడు తత్‌క్షణమే ద్వారవతిలో ఉన్న ప్రభువులకు అవసరికులతో పంపి, వెంటనే బొప్పణనాయకునితో ఐదువేలమంది సైనికులను– సుశిక్షితులయినవారిని – పంపవలసినదని ప్రార్థించినాడు. కమ్మ చేరిన వెంటనే ప్రభువులు ఐదువేల మంది సైనికులను బొప్పణ నాయకునితో పునీసనాయకుని సహాయానికి పంపి, తాముగూడ పెద్దసైన్యంతో వెంటనే

వస్తున్నామని చెప్పి పంపినారు. ప్రభువులు ఆసమయంలో కుమారుణ్ని తలుచుకొన్నారు: "నీవు ఒక్కడివి ఉండి ఉంటే, ఈ చాళుక్యుల వేరును పీకిపారవేసేవారం. నిన్ను పోగొట్టుకొంటిమి గదా!" అని మనసులోనే దుఃఖపడినారు.

ప్రభువులవెంట పదిహేనువేలమంది సైనికులు, రెండువేల గుర్రాలు, నూరు ఏనుగులు బయలువెడలవలెనని నిశ్చయమయినది. దీనికోసం సకల సన్నాహాలూ తొందరగా జరిగినవి. చాళుక్యులతో ఇది అంతిమయుద్ధమనే ప్రభువులు నిశ్చయించి, ఎల్లలలో ఉన్న అనుభవజ్ఞులయిన సైనికులందరినీ సమీకరించుకొన్నారు. ఈ సైన్యంతోపాటు రెండువేలమంది రాహుత్తులు, రథికులూ సిద్ధమయినారు. శస్త్రాస్త్రాలను, ఆహార వస్తువులను సంగ్రహించుకొనడానికి రెండు నెలలు పట్టినది.

సముద్రంవలె ఉన్న ఈ అపార సైన్యం సుముహూర్తంలో ద్వారవతి నుంచి బయలుదేరడానికి సిద్ధమయినది. వెనుకటి యుద్ధంలో పాల్గొన్న మహాదంతి ఒక్కటి సేనాముఖంలో సర్వాలంకార భూషితమై ప్రభువుల వాహనంగా నిలబడినది. వరుసకు మూడుమూడు ఏనుగులు, నాలుగు వేలమంది అశ్వారోహి రథారోహులు, పదిహేనువేలమంది పదాతులూ, ఈ మహాసైన్యానికి అవసరమైన సకలసామగ్రీ, ఆహార పదార్థాలతో సేవకులూ, వైద్యులూ-బయలుదేరినారు. నలుగురు సేనాపతులూ ప్రభువుల ఇరుప్రక్కలా అంగరక్షకులై బయలు వెడలినారు. వీరితోపాటు గరుడి బాగిప్పయ్య, గరుడి బోకిమయ్య-ఇద్దరూ ఉన్నారు.

ప్రభువులు ప్రాతఃకాలమే వాసంతికాదేవిని పూజించి, విజయ నారాయణుని సేవించి, దివ్యాయుధ భూషితులై నగరునుంచి బయలుదేరడానికి ముందు తమ దేవేరులను చూడడానికి వెళ్ళినారు. మహారాజ్ఞి, శాంతల, ఇతర దేవేరులు ప్రభువులకు విజయం కోరుతూ విజయమాలను వారి కంఠసీమలో వేసినారు. ప్రభువులు లక్ష్మిని ఏకాంతంలో కలుసుకొని "నామీద విజయనారాయణుని కృప ఉన్నది. నీవు అధీరురాలు కావద్దు. నీ నరసింహపూజ ఎప్పటిప్రకారం జరుగనీ. నీ ఆరోగ్యం చక్కగా కాపాడుకో. నీ మనస్సు శాంతిలో ఉంటే. మేము విజయోత్సాహులుగా



ఉంటాము; త్వరగా విజయం సాధించుకొనే వస్తాము. ఎనుమిది పదినాళ్ళకొకమారు నీ ఆరోగ్యం మాకు వ్రాయించు. మేము ఆ విధంగానే వ్రాయిస్తాము. ఇక మమ్మల్ను సంతోషంతో పంపు." అనినారు.

లక్ష్మిదేవి అలాగుననే నడచుకొంటానని మాట యిచ్చినది. అనంతరం : "దేవా, లక్ష్మి ఋతుస్నానంచేసి రెండు నెల లయినది. గర్భం తల్లి శరీరంలో వృద్ధిపొందుతున్నది." అని విన్నవించినది.

ప్రభువులకు భరించలేనంత ఆనందమయినది. సంతోషంతో దేవిని ఆలింగనం చేసుకొని, "లక్ష్మి తన ఆరోగ్యం చక్కగా కాపాడుకొననీ. 'దేవీ, నీవు మాకు ఈ ఉత్సాహసమయంలో మహానందవార్త తెలిపినావు. నీవు మాతో ఉన్నంతకాలం మేమూ ఉంటాము. నీ ఆయుఃపరిమితి పూర్తయినదినమే మాదీ పూర్తవుతుంది. నీ లక్ష్మిని జాగ్రతగా కాపాడుకొని రా. మన కుమారవిష్ణువే పుడుతాడనే నమ్మకం మాకు కలిగినది."అని ఆనందహృదయులై, తర్వాత కుమార్తెలోపాటు దగ్గరికి వచ్చిన శాంతలను-చందలను-దగ్గర కూర్చొబెట్టుకొని సల్లాపించి, చిన్ని శాంతలను ఎత్తుకొని మమతతీర ముద్దాడి, ఏనుగెక్కి, విజయనారాయణుని స్మరిస్తూ విజయకాంక్షులై బయలుదేరినారు. హొయిసళ మహాసైన్యం సాగర తరంగాలవలె ద్వారవతినుంచి బయలుదేరినది.

## 2

పెక్కునాళ్ల ప్రయాణం తర్వాత విష్ణువర్ధనులు రెండవసారి హానుగల్లు దుర్గాన్ని బలంగా ముట్టడించినారు. కుంజుశెట్టి ఇప్పుడు మల్లికార్జునుని సైన్యంలో ఉండలేదు. దుర్గరక్షణకు కదంబుల, చాళుక్యుల, పాండ్యుల సంయుక్తసైన్యం సిద్ధంగా ఉంది. యుద్ధం మొదలయిన ఒక నెలలోపలే విష్ణువర్ధనుల సైన్యశిబిరంలో సాంక్రామికమైన వ్యాధి ఒకటి తగిలినది. శత్రువుల మోసంవల్లనే ఈ విధంగా అయినది. హొయిసళ సైనికులు అశుద్ధజలం తెలియక ఉపయోగించినారు. దీనివల్ల హొయిసళులకు కొంచెం

సైన్య నష్టమయినది. అప్పుడు హొయిసళ సైన్యం తమ ఉపయోగంకోసం వాపీకూపతటాకాలు నిర్మించుకోవలసి వచ్చినది. సైన్యమంతా ఆరోగ్యం పొందడానికి కొన్ని నెలలు పట్టినది. ప్రభువులు గుండెదిటవు కోల్పోలేదు. దుర్గం వశపరచుకొనక వెనుదిరగనని ప్రతిన పూనినారు. హొయిసళ సైన్యం తీవ్రతతో దుర్గంమీద దాడి ప్రారంభించినది. శత్రువుల సైన్యమూ వెనుదగ్గలేదు. రెండు వైపులా నష్టం తీవ్రంగానే కలిగినది. శత్రువులు ఈమారు దుర్గాన్ని చాల బలపరచుకొన్నారు. చలికాలం గడిచిన వెంటనే హొయిసళ సైన్యం ప్రబలమైన దాడి ఆరంభించినది; జీవితాశను కూడా వదలి యుద్ధం చేయడానికి ఉపక్రమించినది. మల్లికార్జుని సైన్యం నానాటికీ క్షీణిస్తూ వచ్చినది. దానిని చూచి మల్లికార్జునుడు మునుపటివలె మిగిలిన సైన్యమంతా దుర్గం లోపలికి రప్పించుకొని, దుర్గంపైనుంచి హొయిసళ సైన్యాన్ని తాకడం ప్రారంభించినాడు. దుర్గద్వారం శిథిలమయినందున మల్లికార్జునుడు చాల బలమైన తలుపులు చేయించినాడు. తన దుర్గకవాటాలు అభేద్యమయినవనే నమ్మినాడు.

దుర్గద్వారం భగ్నంచేసి లోపలికి జొరబడకపోతే యుద్ధం ముగియదని విష్ణువర్ధనులు గ్రహించినారు. ఏనుగుల తొండాలకు మానుదిమ్మలను ఇచ్చి దుర్గకవాటాలను పగుల గొట్టడానికి ప్రయత్నించినారు. ఈ కొత్త తలుపులకు లోహ పరిఘలు వేసి బిగించినందున, ఏనుగుల తాకిడికికూడా అవి తట్టుకున్నవి. అప్పుడు ప్రభువులకు ఒక యోచన తోచినది. "పొడుగాటి దంతాలున్న ఏనుగులతో తలుపులను పట్టినిలిపే ద్వారబంధపు పాదశిలలనే—పీఠశిలలనే—తవ్వి పెకలించి వేయండి." అని ఆజ్ఞాపించినారు. ఏనుగలు తమ దంతాలతో అడుగురాళ్ళనే పెకలించడానికి ఆరంభించినవి. అట్టడుగు శిలాఘట్టాన్ని అందుకోడానికే చాల శ్రమమయినది. దుర్గద్వారం ముందు భాగమంతా పెద్ద కాలువవలె అయినది. ఏనుగులు ద్వారబంధపు అడుగు బండలను ఇనుపసంకెలలు కట్టి లాగిలాగి తుదకు పీకివేసినవి. పెద్ద తలుపొకటి కిందికి కుసిపడి పెద్ద సవ్వడితో నేలమీద పడినది. దానితో మల్లికార్జునుని సైన్యం ధైర్యమూ నేలబడినది. మదించిన మాతంగాల దండు దుర్గంలోపలి మల్లికార్జునుని సైనికులను తొక్కి తొక్కి చంపినది. శత్రుసైనికుల వేయూరు బాణాలు ఏనుగుల శరీరాలను క్షత



విక్షతం చేసినవి. ఈ యుద్ధంలో విష్ణువర్ధనుల పెక్కు ఏనుగులు మరణించినవి. ఈ యుద్ధంలో ప్రభువుల కరవాలమే మాసణుని మసానం పొందించినది. మల్లికార్జునుడు ఈసారికూడ విష్ణువర్ధనులకు శరణుజొచ్చి, "ఇక జన్మేపి ఇలాగు చేయను" అని శివప్రసాదం తాకి ప్రమాణం చేసినాడు. దయార్ద్రహృదయులయిన విష్ణువర్ధనులు ఈసారికూడ వానికి ప్రాణభిక్ష పెట్టినారు. కాని, రాజ్యం ఇవ్వలేదు. మల్లికార్జునుడు పదభ్రష్టుడయినాడు.

ఆనాడు సూర్యాస్తమయ సమయంలో ప్రభువులు విజయోత్సవంతో తమ శిబిరానికి మరలినారు. అదే వేళకు సరిగా బొప్పణనాయకుడు తన తండ్రి గంగరాజులుగారి జ్ఞాపకార్థం ద్వారవతిలో కట్టించిన బహుసుందరమైన పార్శ్వనాథ బసదిలో పార్శ్వనాథస్వామి స్థాపన జరిగి, స్వామి శేషప్రసాదాన్ని ఇంద్రులు ద్వారవతినుంచి తీసుకొనివచ్చి పళ్ళెరంలో పెట్టి ప్రభువులకు అర్పించినారు. ఆ సమయాననే మహారాజ్ఞీ లక్ష్మీదేవిగారికి సుఖ ప్రసవమయినదని, సుపుత్రుడూ, మాతృదేవి సుఖంగా ఉన్నారన్న వార్తతో ద్వాగవతినుంచి బ్రాహ్మణులు వచ్చినారు. ప్రభువుల ఆనందానికి మేర లేక పోయినది. ఇంద్రులు తీసుకొని వచ్చిన పార్శ్వనాథ స్వామి శేషప్రసాదాన్ని భక్త్యానందాలతో స్వీకరించి, కన్నులకు అద్దుకొని, పార్శ్వనాథస్వామిని "విజయపార్శ్వనాథుడు" అని సంబోధించి, ఆ పేరుతోనే ఆబసదికి నగరునుంచి పెక్కు దానాలు చేసి, దివంగతులయిన గంగరాజులుగారి ఆత్మను తృప్తిపరచినారు. జన్మించిన కుమారుణ్ని చూచే ఆశతో ఆరాత్రే కొందరు ఇష్టులతో కూడి ద్వారవతికి పయనమయినారు.

## 3

ప్రభువులు మహావైభవోత్సవంతో రాజధాని ప్రవేశించినారు. పురజనులు తమ ప్రభువులపై అడుగడుగునా పుష్పవర్షం కురిపించినారు; విజయఘోష చేసినారు. విజయశాలులై పుత్రోత్సవంతో సంతోషభరితులైన ప్రభువులను చూచి రాజధాని జనమంతా ఆనందంలో ఓలలాడినది.

విష్ణువర్ధన ప్రభువులు నగరుచేరిన వెంటనె లక్ష్మీదేవిగారిని చూచి, పొంగివచ్చే ప్రేమతో పలుకరించి, సుందరుడూ, చంద్రునివలె మనోమోహకుడూ అయిన కుమారుణ్ని తమ చేతులలో ఎత్తుకొని ముద్దాడి ఆనందించి, విజయనరసింహుడు అని ఆక్షణమే పేరుపెట్టి యువరాజపట్టం ఆ పాపనికి అప్పుడే కట్టినారు. గురుపీఠమువారినీ, విద్వాంసులు వేదాధ్యయన సంపన్నులు అయిన బ్రాహ్మణులనూ పిలిపించి, పాపడికి ఆశీర్వాదాలు చేయించినారు.

దేశమంతటా సకలమత దేవాలయాలలోను విశేష పూజోత్సవాలు, అన్నదాన వస్త్రదానాలూ జరిగినవి. బిడ్డడు జన్మించగానే బ్రాహ్మణులు ఆశీర్వదించి, తాత్కాలిక గ్రహసంపత్తిని తెలిసి, ఈతడే ముందటి హొయిసళ ప్రభువని నుడివినారు. హొయిసళ వంశోద్ధారం అయినది. రాజమాత అభీష్టం నెరవేరినది. శాంతలాదేవి మానవాగ్దానం చెల్లినది.

# లఘుటిప్పణి

ఆగమికులు = ఆగమాలను-దేవతా ప్రతిష్ఠా పూజాదులను - శాస్త్రోక్తంగా తెలుసుకొన్నవారు.

ఆత్మార్పణం = దీనిని గురించి ఈ లఘుటిప్పణి ఆఖరులో చూడండి.

ఇంద్రులు = జైనబసదులలో (దేవాలయాలలో) అర్చకులు.

ఒజ్జ = ఉపాధ్యాయుడు - ఇక్కడ శిల్పాచార్యుడు.

కటకాచార్యులు = సైన్యం విజయ ప్రయాణానికి బయలుదేరడానికి ముందు విజయం కలుగుగాక అని దేవతా ప్రార్థనలు జరిపేవారు.

కుక్కుట సర్పవాహనం = పాముపడగ తల, కోడిశరీరం ఉన్నజంతువు. వాసంతికాదేవి వాహనం.

గణాచారులు = రాచనగరు ఉత్సవాలలో పాల్గొనే శివాచారంవారు.

గద్యాణం = సామాన్యంగా బంగారునాణెం; హెచ్చు వెలగలనాణ్యం.

గరుడి, గరుడ = 'రాజుకోసం జీవిస్తాను, రాజుతోనే మరణిస్తాను' అని తన జీవితాన్ని రాజుకు ముడుపుకట్టి అర్పించిన వీరుడు. పత్ని పతి మరణిస్తే సహగమనం చేసినట్లు, తన దొరకు హానికలిగితే తానూ ఆత్మార్పణం చేసుకొంటానని ప్రతిజ్ఞచేసిన ఉత్తమజీవి. (ఆత్మార్పణం అనేచోట చూడండి.)

చైత్యాలయం = జైనుల పూజాగృహం, దేవాలయం.

తీర్థంకరులు = జైనులకు దేవతాస్వరూపులయిన ముక్తజీవులు.

దేవమూల = పూజాగృహం నిర్మించే నైఋతి దిక్కు.

పంచపదం = అర్హంతులు, సిద్ధులు, ఆచార్యులు, ఉపాధ్యాయులు, లోకంలోని సర్వసాధువులు - అనే ఐదు విధాల ఉత్తమజీవులను స్మరించి "ణమో అరిహంతాణం, ణమో సిద్ధాణం, ణమో ఆయరియాణం, ణమో ఉవజ్ఝాయాణం, ణమో లోఏ సర్వసాహూణం" అని శరణాలుచెప్పే ఐదు వాక్యాలు.

పంచమహావాద్యాలు = కొమ్ము, తప్పెట, శంఖం, భేరి, జేగంట.

పంచాంగ ప్రణామం = రెండుమోకాళ్లు, రెండు చేతులు, తల మాత్రం భూమికి తగిలేట్టు స్త్రీలు చేసే నమస్కారం.

భైరవుడు = గరుడి వలెనే ఆత్మార్పణం చేసుకొన్న వీరుడు. యుద్ధ సందర్భాలలో మాత్రం ప్రాణాలు అర్పించేవాడు. (ఆత్మార్పణం చూడండి.)

మధుపర్కం = తేనె, పాలు, (ఒకొక్కప్పుడు అరటిపండు) వీటి సమ్మిశ్రణం.

రణబలి = యుద్ధానికి మొదలు విఘ్నోపశాంతి కోసం తనను తాను బలిగా అర్పించుకొనడం. (ఆత్మార్పణం చూడండి.)

వాసోదకం = దేహం వదలిన జీవం పితృలోకం పొందడానికి ప్రేతావస్థలో ఉన్నప్పుడు 'వాస' మనే వస్త్రవిశేషం పిండి ప్రేతానికి ఇచ్చేనీరు.

విభూతిపట్టం = పరాక్రమవంతుడైన యోధునికి రాజునుంచి జరిగే ఒక పెద్ద బహుమానం. నొసట ధరించదగిన బంగారు త్రిపుండ్రాలు.

వీరగల్లు = 'గరుడి' అయికాని, 'భైరవు' డయిగాని ఈ విధంగా ఏదో ఒక వీరరీతిగా ఆత్మార్పణం చేసుకొన్న వీరుని జ్ఞాపకార్థం నాటేరాయి. (ఆత్మార్పణం చూడండి.)

వైఖానసులు = వైఖానసాగమం తెలిసిన వైష్ణవులు.

శేషం = పూజకో, శుభకార్యానికో ఉపయోగించగా మిగిలిన పూవులు, అక్షతలు, నైవేద్యం, మొదలయిన ప్రసాదం.

సతి = పతితో 'సహగమనం' అథవా 'సహానుభూతి' చేసిన మహిళ. వీరుల 'వీరగల్లు'లవలె సతి స్మారక శిలలను 'మాస్తిగల్లు' (మహాసతి కల్లు) అంటారు.

సల్లేఖనం = జినధర్మానికి అవిరోధమైన దేహవిసర్జన పద్ధతి. జైనాగమాలలో చెప్పిన ప్రకారం నిరాహార వ్రతం నెరవేర్చి, జీవునికీ దేహానికీ గల బంధాన్ని విడిపించే వ్రతం. సల్లేలఖనాన్ని గురించి శమంతభద్రాచార్యులవారు తమ 'రత్నకరండకం'లో ఈ విధంగా నిర్వచించినారు.



"ఉపసర్గే దుర్భిక్షే
  జరసి రుజాయాం చ నిష్ప్రతీకారే,
ధర్మాయ తను విమోచనం
  ఆహుః సల్లేఖనా మార్యాః."

ఇది గృహస్థ ధర్మాలలో ఒక అంగమని ఆశాధరాచార్యుల 'ధర్మామృతం' తెలుపుతున్నది.

"సమ్యక్త్వ మమల మమలా
  న్యనుగుణ శిక్షావ్రతాని మరణాంతే,
సల్లేఖనా చ విధినా
  పూర్ణః సాగార ధర్మోయం"

సౌధర్మం = జైనుల స్వర్గాలలో ఒకటి.

సిద్ధతల = కొంత సేపటికి తనంతట తాను విసురుగా వచ్చి నరికివేసే చంద్రాయుధ సహితమైన యంత్రసాధనం ముందు, ఆయమెరిగి, సిద్ధాసనంలో యోగారూఢుడై కూర్చున్న వీరుడు (భైరవుడు, రణబలి వలె) తన తలను అప్పగించే విశేషవిధి.

హిరణ్య గోగర్భం = తులాభారం వంటి ఒక అతిశయమైన క్రతువు.

హోర = ఒక కాలప్రమాణం. $2\frac{1}{2}$ గడియలు = ఒక హోర. (ఒకగంట) 3 హోరలు = 1 జాము.

## కర్నాటక దేశంలో వీరుల ఆత్మార్పణం.

ప్రాణానికన్నా అమూల్యమైనదీ పవిత్రమైనదీ మరొకటి లేదన్నది సామాన్య భావన అయినా-లేక ఈ సామాన్య భావన ఉన్నందునే-తాము పరమ శ్రేష్ఠమని నమ్మిన కొన్ని భావాలకోసం తమ ప్రాణాలను నిశ్చింతగా, స్వేచ్ఛతో తమ చేతులార తామే అర్పించుకొని, ఇహలోకం నుంచి ఇతర లోకాలను పొందిన వీరుల ఉదాహరణాలు అన్ని దేశాల్లో, అన్నికాలాల్లో ఉన్నవి. కడచిన ప్రపంచయుద్ధంలో తమదేశహితంకోసం ప్రాణాలను తృణీకరించి ముందుకువచ్చిన "సుయిసైడల్ స్క్వాడ్స్" ఈ రకం వీరులచందు. ఇతర దేశాలలో ఇలాటి మరణం లౌకిక వీరంగా పరిగణితమయితే, మనదేశంలో ఇది ఒక పరమార్థ వీరంగా ఎన్నికయినది.

సముద్రుడు లంకకు దారి యివ్వనప్పుడు రాముడు ప్రాయోపవేశానికి ఉద్యుక్తుడయినాడు; పద్నాలుగు సంవత్సరాల తర్వాత రాముడు వనవాసంనుంచి వెనుదిరిగి రాకపోతే, తాను అగ్నిప్రవేశం చేసి ప్రాణత్యాగం చేస్తానని భరతుడు నిశ్చయించినదీ, తన తమ్ములలో ఎవడు మరణించినా, తను వానితో అగ్నిప్రవేశం చేస్తానని ధర్మరాజు ప్రతిజ్ఞ చేయడమూ, బదుకు దుర్భరమయినప్పుడు కొండశిఖరంనుంచి పడి ప్రాణాలు పోగొట్టుకొనే భృగుపతనమూ పురాణేతిహాస కాలాల వీరుల ఆత్మార్పణకు ఉదాహరణాలు.

చరిత్ర కాలానికివస్తే, రాజపుత్రుల "జౌహర్" పద్ధతిని తెలియనివారెవరు ? దక్షిణదేశపు-ముఖ్యంగా కర్నాటకాంధ్ర ప్రాంతాల-"వీరగల్లు" లను, "మాస్తిగల్లు" లనూ చూడనివారెవరు ? విననివారెవరు ?

తన పతిని కోల్పోయినతర్వాత ఉండలేక, అతని కళేబరంతో పాటు నిప్పులో పడికాలి బూడిదైన కుల వధువుల కథలు ఎవరికి తెలియవు? ఇలాటి మహాసతులవలెనే అనేక వీర పురుషులుకూడ అత్యంత స్వామి భక్తితో, అత్యంత దేశ ప్రేమతో అన్యాయాలను, క్రౌర్యాలను, జీవహింసలను ఎదిరించి, న్యాయ దయా జీవకారుణ్యాలను ఉద్ధరించడంకోసం తమ ప్రాణాలను అర్పించిన అనేక తార్కాణా లున్నాయి.



దొంగలు గోవులను అపహరించడానికి వచ్చినప్పుడు, ఏనుగో పులో జనానికి ఉపద్రవం కలిగించినప్పుడు, మహిళల మానాపహారానికి ప్రయత్నం జరిగినప్పుడు, స్వామికి హాని సంభవించినప్పుడు, దేవాదాయ ధర్మాదాయాలకు ఇబ్బంది కలిగినప్పుడు, ధర్మప్రతిష్ఠాపనకు నిలబడి పోరాడి, మడిసినవారు ఎంతోమంది. వారి స్మారకంకోసం దేశం నిలిపిన శిలలే "వీరగల్లు"లు ఆ విధంగానే మహాసతుల జ్ఞాపకార్థమయినవి "మాస్తిగల్లులు." (మహాసతికల్లు = మాస్తిగల్లు)

ప్రస్తుతం, ఈ శాంతల నవల కాలానికి ఇలాటి ఆత్మార్పణాలు సమాజంలో సామాన్యంగా ఆచారంలో ఉండేవి. ఈ నవలలో వచ్చే గరుడి (గరుడ), భైరవ, రణబలి, సతి, సల్లేలఖన, సిద్ధతలాదులు అన్నిటికీ శాసనాల నిశ్చితాధారం ఉన్నది. ఇలాగు ప్రాణార్పణం చేసుకొన్న వీరులను, వీర వనితలనూ ఊరికే "చచ్చినారు" అనేవారు కారు. "చచ్చి సురలోకం చేరినాడు, సురలోక ప్రాప్తుడయినాడు, సతి సహానుభూతి పొంది సురలోకానికి చనినది, మహాసేనులు స్వర్గాగ్రం అధిరోహించినారు" అని వారికి సద్గతినే చెప్పేవారు. (ఈ ఉదాహరణలు కన్నడ సాహిత్యంలోవి.) పూర్వకాలపు ఈ వీరయుగంలో ఈరీతి ప్రాణార్పణం ఒక యోగమనే పరిగణిత మయినది.

---